

మవిహా కళాఖండం · సంప్రదాయ పద్ధతిని చెక్కిన కర్రబొమ్మ.

[పుట 209

# కాంతిసీమ

[ఆఫ్రికా, ఆఫ్రికన్ల పూర్వాపరాలు]

మూలం :

యు. ఆర్. ఎహ్రెన్‌ఫెల్స్.

అనువాదం :

శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర.



యం. శేషాచలం అండ్ కో.

మద్రాసు—మచిలీపట్టణము—సికిందరాబాదు

**KAANTI SEEMA** - By Smt. Ramalakshmi Arudra : Telugu Translation of **LIGHT CONTINENT** by U. R. Ehrenfels.
*Price* : Ordinary **Rs. 4**; Library Edn. **Rs. 5**

*First Edition, 1963*



Publishers :

**M. SESHACHALAM & CO ,**

Madras Machilipatnam . Secunderabad

ప్రథమ ముద్రణ 1963

ప్రకాశకులు :

యం. శేషాచలం అండ్ కో.

మద్రాసు - మచిలీపట్నం - సికింద్రాబాదు

ముద్రణ :

లిబర్టీ ప్రెస్,

10, లింగిచెట్టివీథి, మద్రాసు-1.

వెల : సాదా రూ. 4; మేలు ప్రతి రూ. 5




NO. 212864

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సువారి
'ఇంటింటా స్వంత గ్రంథాలయం
ప్రణాళిక చందాదారుల కొరకు ప్రత్యేక
ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు
రాష్ట్రపతిరోడ్డు సికింద్రాబాదు.

# ముందుమాట

## ఆఫ్రికా

ఆకాశంలో వుండే మేఘాల బొమ్మలకన్నా త్వరితగతిని ఆఫ్రికా ఖండంలోని పరిస్థితులు మారిపోతున్నాయి. వాటిపైన ఇవాళ వ్రాసిన విషయాలు రేపటికి పాక్షిక సత్యాలక్రింద పరిణమించవచ్చు. చీమల పుట్టలోకన్నా ఎక్కువ కలకలం, సందడి ఆఫ్రికా రాజ్యాలలో నేడు కనిపిస్తుంది. ఢిల్లీ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ శ్రీ వి. కె. ఆర్. వి. రావుగారు చెప్పినట్లు ఇరవయ్యో శతాబ్దపు ఉత్తరార్థంలో ఆసియా ఖండంతో పాటు సరిసమానమైన గౌరవాలను ఆఫ్రికా ప్రపంచదృష్ట్యా అనుభవిస్తుంది. వారు చెప్పినట్లే ఇరవైఒకటో శతాబ్దపు ప్రపంచ రాజకీయాలలో ఆఫ్రికా ప్రప్రముఖ పాత్ర వహిస్తుందని జోస్యం చెప్పడానికి ఆస్కారా లున్నాయి. ఇటువంటి మహత్తరమైన స్థానాన్ని ఆక్రమించుకొంటున్న ఆఫ్రికా గురించి ఎన్నెన్నో విషయాలను తెలుసుకోవలసిన అవసరం మన కున్నది.

నిన్న మొన్నటిదాకా—బహుశా క్రిందటి క్షణందాకా, ఆఫ్రికా ఖండాన్ని అంధకారబంధురం అని పేర్కొనడం పరిపాటే. కాకులు దూరని కారడవులూ, చీమలు దూరని చిట్టడవులూ ఆ భూభాగంలో అసంఖ్యాకంగా వుండడ మొక్కటే కాదు దానికి కారణం. పాశ్చాత్యు

మానవుడు చాలా లేటుగా ఆ ఖండం గురించి తెలుసుకోనడంవల్ల అది చరిత్రలో చాలా కాలం అజ్ఞాత ఖండంగానే వుండిపోయింది.

అయితే, వాస్తవానికి ప్రపంచంలో మానవ చరిత్ర ప్రారంభమైన అత్యంత ప్రాచీనకాలంనుండే ఆ భూభాగంలో జనులు నివసిస్తూనే వున్నారు. ఆమాట కొస్తే అక్కడే ఆది మానవుడి అవశేషాలు దొరుకుతాయన్న ఆశకొద్దీ నేటి పరిశోధకులు పురాతన కపాలాలకోసం గాలిస్తున్నారు.

నేటికి ముప్ఫయివేల సంవత్సరాలక్రిందట ఆఫ్రికా ఖండంలోనికి, తూర్పు తీరంలోంచి మొదట నీగ్రో తెగలవారు ప్రవేశించారని చరిత్ర రచయితలు భావిస్తున్నారు. అయితే ఈ ఖండపు ఉత్తర భాగంలో ఉన్న ఈజిప్టు దేశంలో ఇప్పటికి 6,000 సంవత్సరాల క్రిందట నైలు నదీ లోయలో ప్రాథమిక నాగరికతా వికాసం మొదలైంది. కొన్ని వేల సంవత్సరాలు అది అఖండంగా వెలిగింది. గతంలోని మతాల చరిత్రలో అది గణనకెక్కింది. పుష్కలంగా, పరిపూర్ణంగా ఆనాటి జనులు జీవించా రనడానికి నిదర్శనాలు నేటికీ నిలిచిపోయాయి. బ్రహ్మాండమైన రాతికట్టడాలు, శిల్పాలు, చిత్రాలు, చిత్రలిపులూ ఆనాటి రహస్యాలను మనకు వినిపిస్తున్నాయి.

క్రీస్తు పుట్టడానికి 3,000 సంవత్సరాలకు పూర్వం మొదలైన ఈ నాగరికతనూ, సామ్రాజ్యాన్నీ క్రమేణా గ్రీకులూ, ఫినిషియన్లూ హస్తగతం చేసుకొన్నారు. ఇంక మూడువందల సంవత్సరాలకు క్రీస్తు పుట్టబోతా డనగా ఈ సామ్రాజ్యం రోమనుల చేతిలో సుస్థిరంగా చిక్కుకొంది. క్రైస్తవ మతంలో చిరస్థాయిగా వుండే పది ఆదేశాలను ప్రసాదించిన మోసస్ ఈజిప్టు దేశంనుండే తన అనుచరులను తీసుకొని నిర్గమించి మహాప్రస్థానం చేశాడు.

మధ్యధరా సముద్రప్రాంతంలో వుండే కార్తేజి ప్రాచీన చరిత్రలో ప్రముఖమైనది. ఈజిప్టు దేశంలో ఉన్న అలెగ్జాండ్రియా

నగరం పురాతన విద్యాకేంద్రంగా ప్రసిద్ధిచెందింది. రోమనుల ప్రభ అంతరించాక ఆఫ్రికా ఖండపు ఉత్తర భూభాగం కూడా చరిత్రలో తన ప్రాముఖ్యాన్ని కోల్పోయింది. క్రీస్తు పుట్టిన ఆరేడు వందల సంవత్సరాలకి అరబ్బుల దండయాత్రతో ఉత్తర భూభాగం సాంస్కృతికమైన మార్పులకు లోనైంది. ఆటోమన్ తురుష్కులకు ఆ రాజ్యం వశమైనాక ఆ రాజ్యపు చరిత్రలో చెప్పుకోదగ్గ విశేషాలు లోపించసాగాయి.

ఈజిప్టును ఆనుకొనివున్న సూడాను, ఇతియోపియాలుకూడా అంత ప్రాచీన చరిత్ర గలవే. ఇతియోపియా చక్రవర్తి ఆ దేశంలో 255 వ సార్వభౌముడు. నేటికి ఏడువేల సంవత్సరాల క్రిందటినుంచీ అక్కడ సర్వతంత్ర స్వతంత్ర ప్రభుత్వ మున్నట్టు ఆధునిక ఇతియోపియా చరిత్ర చెప్తుంది. సూడానులో క్రీస్తు పూర్వంనుండి వెలసిన రాజరికాల చరిత్రను తెలుసుకోడం కష్టసాధ్యమైనది. అక్కడ దొరికిన చిత్రలిపులను ఇప్పటికీ పండితులు చదవలేక పోతున్నారు. ఆ లిపిని బోధపరుచుకొంటే గత చరిత్ర మరి కొంత స్పష్టమవుతుంది.

ఉత్తర దిశలో ఉన్న ఈ ప్రాంతాలు చరిత్రలో యింత ప్రసిద్ధమైనా, సహారా ఎడారికి దక్షిణాన వున్న భూభాగం గురించి చాలా కాలందాకా ఎవరికీ ఏమీ తెలియదు. మధ్యయుగంలో యిక్కడ నీగ్రో సామ్రాజ్యాలు వుండేవట. పిమ్మట తూర్పు తీరంలో అరబ్బులు కొన్ని వలసలు నిర్మించుకొన్నారు.

చరిత్ర గల ఈజిప్టునీ, చరిత్ర తెలియని ఎడారి దక్షిణభాగాలనూ పాశ్చాత్యులు గడుసుగా విడతీశారు. ఆఫ్రికా రాజ్యాలలో ఈజిప్టును పరదేశం క్రింద పరిగణించే వ్రాతలు వ్రాశారు. వాస్తవానికి ఎడారి దక్షిణ భాగాలలో ఉన్న రాజ్యాలకుకూడా గత చరిత్ర లేకపోలేదు. వెయ్యి సంవత్సరాల క్రిందటే అరబ్బులు ఈ భాగాల గురించి కొద్ది కొద్దిగా తమ గ్రంథాలలో వ్రాశారు.

అరబ్బు సైనికులు ఈజిప్టుదేశంలోనూ, ఉత్తరాఫ్రికాలోనూ స్థిరపడ్డాక అరబ్బు వర్తకులూ, బేహారులూ దక్షిణానికి చొచ్చుకొని వెళ్ళారు. 'నూబా', 'బూజా', 'జాంజ్' మొదలైన తెగలు నివసించే ప్రదేశాలలోని అడవులలోనికి అరబ్బులు అడుగు పెట్టారు. అక్కడ విస్తారంగా దొరికే దంతాలు, బంగారం, తోళ్ళు, చర్మాలు, కలప మొదలైనవి హిందూదేశానికి, చైనాకు అరబ్బులు భూసముద్రమార్గాలు రెండింటా ఎగుమతి చేసేవారు.

తొమ్మిదవ శతాబ్దపు అరబ్బు భూగోళ శాస్త్రజ్ఞుడొకడు ఆఫ్రికా ఖండపు వెడల్పుని పేర్కొంటూ దానిలో ప్రయాణం చేయడానికి ఏడు సంవత్సరాలు పడుతుందని వ్రాశాడు. నాటి అరబ్బులకు ఆఫ్రికా ఖండంలో వివిధ ప్రదేశాల గురించి బాగా తెలుసు; స్థానికుల ఆచార వ్యవహారాల గురించి, రాచరికాల గురించి తెలిసిన వాటిని గ్రంథస్థం చేశారు.

యూరోపు ఖండానికీ, ఆసియా దేశాలకీ మధ్య సౌకర్యకరమైన సముద్రమార్గాన్ని కనిపెట్టడంకోసం వాస్కోడిగామా అనే పోర్చుగీసు నావికుడు గుడ్ హోపు అగ్రం చుట్టి ప్రయాణించాడు. ఇతడికి ఒక అరబ్బు నావికుడు దారి చూపించిన సంగతి మాత్రం మరుగున పడింది. వాస్కోడిగామా యాత్ర విజయవంతమైన తరువాత ఆఫ్రికా తూర్పు తీరంలో కొన్ని పోర్చుగీసు పట్టణాల స్థాపన జరిగింది. మిగతా పాశ్చాత్య దేశాలవాళ్లుకూడా ఇండియాకు వెళ్ళేదారిలో కొన్ని మజిలీలు వుండడం ముఖ్యమనుకొన్నారు; ఆఫ్రికా తీరాలలో కొన్ని పట్టణాలు నిర్మించుకున్నారు. ఇంతలో నూతన జగత్తు అనే అమెరికా ఖండాన్ని కనుక్కోడం జరిగింది. అక్కడ చాకిగా పనిచేయడానికి కూలివాళ్లు అవసరమయ్యారు. ఆఫ్రికాలోని నీగ్రోలను పట్టుకొని బానిసలుగా తెల్లవాళ్లు అమెరికాకు పంపడం మొదలుపెట్టారు. ఈ బానిస వర్తకం వాస్తవానికి తెల్లవాళ్ళతోనే మొదలవలేదు. ఆదిలో

అరబ్బులుకూడ ఆఫ్రికన్లను బానిసలుగా అమ్ముతూ వుండేవారు. అయినా తెల్లవాళ్ళ వ్యాపారం అపారంగా జరిగింది. 1807 లో ఈ అమానుష వర్తకాన్ని నిషేధించే నాటికి సుమారు రెండుకోట్ల మంది నీగ్రోలను బానిసలుగా ఎగుమతి చేయడం జరిగింది.

వివిధ పాశ్చాత్య దేశాలవారు సముద్ర తీరాలలో పట్టణాలు కట్టుకున్నాక వాళ్ళ దృష్టిలో ఆఫ్రికా ఒక కోస్తా రూపంలోనే కనబడేది గాని, మహత్తర ఖండంగా దాన్ని వాళ్లు గుర్తించలేదు. 16 వ శతాబ్దిలో బంగారపు గనులు బయట పడడంతో వివిధ దేశాల వాళ్లు ఈ ఖండంమీదికి ఎగబడ్డారు. ఎవరి చేతికి చిక్కిన భాగాన్ని వాళ్లు ఆబగా ఆక్రమించుకున్నారు. ఒకరితో ఒకరు పోటీ పడ్డారు. చివరకు క్రీ. శ. 1885 లో బెర్లిన్ నగరంలో అంతర్జాతీయ సమావేశం ఒకటి జరిగింది. అందులో బ్రిటను, జర్మనీ, పోర్చుగల్, ఇటలీ, ఫ్రాన్సు, బెల్జియం మొదలైన రాజ్యాల వాళ్లు పాల్గొన్నారు. దొంగలూ దొంగలూ కలిసి ఊళ్ళను పంచుకొన్నట్టు ఆఫ్రికా ఖండాన్ని పాశ్చాత్యులు తమలో తాము పంచుకొన్నారు.

ఆ విభజన ఫలితంగా, విస్తీర్ణంలో యూరోపు ఖండానికి మూడింతలు వుండే ఈ భూభాగం ముక్కలు ముక్కలుగా పరాధీన మైంది. వివిధ యుద్ధాలవల్ల మళ్ళా కొన్ని కొన్ని ప్రాంతాలు చేతులు మారాయి. ఎట్టకేలకు 1,10,00,000 చదరపు మైళ్ళ విస్తీర్ణం గల ఈ ఖండాన్ని ఈక్రింది విధంగా ఇతరులు పంచుకున్నారు:

| | |
|---|---|
| ఫ్రాన్సు | 42,00,000 చ॥ మై॥ |
| బ్రిటను | 40,00,000 చ॥ మై॥ |
| ఇటలీ | 10,00,000 చ॥ మై॥ |
| బెల్జియం | 9,00,000 చ॥ మై॥ |
| పోర్చుగీసు | 8,00,000 చ॥ మై॥ |
| స్పెయిన్ | 1,50,000 చ॥ మై॥ |

తమ తాత ముత్తాతల కాలంనుంచీ ఆ భూభాగాలకు హక్కుదారులైన ఈజిప్షియన్లూ, లైబీరియన్లూ కలసి అనుభవించే భూభాగం నాలుగు లక్షల చదరపు మైళ్ళకన్నా తక్కువే!

తెల్లవాళ్లు తమలో తాము ఈ ఖండాన్ని పంచుకొనడంలో ఏవిధమైన భౌగోళిక చారిత్రక జ్ఞానాన్నీ ప్రదర్శించలేదు. వాళ్ళ చిత్తమొచ్చిన రీతిగా దేశాల సరిహద్దులను ఏర్పరిచారు. దానివల్ల పరస్పర విరోధాలున్న వివిధ తెగలు ఒక దేశంలో సహజీవనం చేయవలసివచ్చింది. కొన్ని తెగలలో కొంత జనాభా ఒక దేశంలోనూ, మరికొంత యింకొక భాగంలోనూ ఈ విభజనవల్ల నివసించుచున్నట్టు తేలింది. తొలి రోజుల్లో మన భారతదేశాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ఎంత తెలివితక్కువగా విభజించిందో దానికి కొన్ని వందల రెట్లు అస్వాభావికమైన విభజన ఆఫ్రికాలో జరిగింది. ఈనాడు ఆఫ్రికాలో వివిధ దేశాలకు స్వాతంత్ర్య మొచ్చినా పరిస్థితులు శాంతించకపోవడానికి ఈ తెల్లవాళ్ళ విభజనే మూలకారణం.

విదేశీయుల పాలనలోనికి రాకముందూ ఆఫ్రికాలోని వివిధ ప్రాంతాలలో రకరకాల రాజ్యా లుండేవి. నాలుగైదు పల్లెలు కలసి కొన్నిచోట్ల చిన్న రాజ్యంగా వుంటే, మరి కొన్నిచోట్ల విశాలమైన ప్రభుత్వా లుండేవి. ఉగండాలో కబాకా పాలించే రాజ్యం ప్రబలమైనది. నేటి ఘనాలో అంతర్లీనమైన అషాంటీ రాజ్యానికి కూడా నాయకరాజు వుండేవాడు. పాత ఆఫ్రికన్ జీవితం నాయకరాజు చుట్టూ పరిభ్రమించేది.

పరదేశీయులు ఈ నాయకరాజుల ద్వారా ఆఫ్రికాను పాలించసాగారు. బ్రిటిష్‌వాళ్ళు ఒక అడుగు ముందుకువేసి నాయకరాజులులేని ప్రాంతాలలో కొత్త వాళ్ళని సృష్టించారు. కాంగోలో బెల్జియన్లు ఈ నాయకరాజుల సంఖ్యను రెండువేలకు పెంచి వాళ్ళను పన్నులు వసూలు

చేసే పనికి వాడుకొంటున్నారు; జీతం డబ్బులకు పనిచేసే ప్రభుత్వోద్యోగుల క్రింద వాళ్ళను మార్చివేశారు. దక్షిణాఫ్రికాలో ఈ నాయక రాజులు అవిధేయత చూపితే తెల్లప్రభువులు వాళ్ళను వెంటనే డిస్మిస్ చేస్తారు.

ఆదిలో ఈ ఖండంనుండి కూలిపనుల కోసం నల్లవాళ్ళను ఎగుమతిచేసిన తెల్లవాళ్ళే తమ ఆఫ్రికన్ రాజ్యాలలో పనిచేయడానికి ఆసియా వాసులను తీసుకువచ్చారు. తూర్పు ఆఫ్రికాలో రైలు దారులు నిర్మించడానికీ, నేటాలు రాష్ట్రంలో చెరుకు తోటలలో పనిచేయడానికీ తెల్లవాళ్ళకు భారతీయులు చౌకగా కనిపించారు. అలాగ కూలికి వెళ్లిన భారతీయుల సంతతి నేడు ఆఫ్రికాలోనే స్థిరపడిపోయారు. తూర్పాఫ్రికాలో 3,00,000 మందీ, దక్షిణాఫ్రికాలో 4,00,000 మందీ భారతీయు లున్నారు. వీళ్ళలో చిల్లర దుకాణదారులూ, వృత్తి వుద్యోగాలు చేసుకొనేవాళ్ళేకాక లక్షాధికారులు సైతం వున్నారు.

ఆఫ్రికాలో పుట్టి పెరిగిన నల్లవాళ్ళనీ, చామనచాయ వాళ్ళనీ తెల్లదొరలు తమ ఇనుపగుప్పిటిలో పెట్టుకొని రానిరంపాన పెట్టడానికి తమ సంఖ్యాబల మెంతమాత్రం కారణం కాదు. ఆఫ్రికాలో ఉన్న ఇరవైకోట్ల జనాభాలో తెల్లవాళ్ళు ఏభైలక్షల మంది మాత్రమే. ఈ తెల్లవాళ్ళకి మాతృభూమి అని చెప్పుకొందికి ఆఫ్రికా తప్పించి మరేదీ లేదు. తెల్లవాళ్ళలో ధనవంతులూ వున్నారు; సాధారణ వుద్యోగులూ వున్నారు. అయితే ఒళ్లు వొంచి చేయవలసిన బరువు పనులు తెల్లవాడు చేయడు. దక్షిణాఫ్రికాలో ఉత్తరాలు బట్వాడాచేసే తెల్లపోస్టుమేన్ జాబులూ, పార్సిళ్లూ, స్వయంగా మోయడు. ఒక నల్లవాడు అతని వెనుక వాటిని మోసుకురావాలి!

జీవనోపాధికి ముఖ్యమైన భూమి తెల్లవాళ్లు తమ హస్తగతం చేసుకొన్నారు. దక్షిణాఫ్రికాలో నూటికి ఎనభైతొమ్మిది వంతుల

భూమి తెల్లవాళ్ళ స్వంతం. నల్లవాళ్ళు భూస్వాము లయే అవకాశాలు లేకుండా తెల్లవాళ్ళు చట్టాలుకూడా తయారు చేశారు. గనులలో పని చేసే నల్లకూలీలు శాశ్వతంగా ఆపని చేయకుండా కాంట్రాక్టు పద్ధతిని ఏడాదో, ఏణర్ధమో పనిచేశాక వాళ్ళని నల్లపేటలకు పంపించేసి అష్టదిగ్బంధం చేస్తారు.

పట్టణాలలో పుట్టిపెరిగిన ఆఫ్రికన్లలో జీతం రాళ్ళకు ఆశించే వాళ్ళు తప్పించి మిగతా వాళ్ళందరూ తెల్లవాళ్ళ హాజాన్ని ఎదిరిస్తూనే వున్నారు. విద్యావంతులైన ఆఫ్రికన్ నాయకుల కృషి ఫలితంగా ఆఫ్రికాలో ఈనాడు పెక్కు దేశాలకు స్వపరిపాలన గాని, సంపూర్ణ స్వరాజ్యం గాని లభించాయి. ఆనాడు తెల్లవాళ్ళు బెర్లిన్‌లో సమావేశమై ఆఫ్రికాను విభజించితే ఈనాడు ఇథియోపియా రాజధానిలో ఆఫ్రికా దేశాల ప్రభుత్వ ప్రతినిధులు సమావేశమై సమైక్య ఆఫ్రికాకోసం కృషి ప్రారంభించారు. ఆ మహత్తర ఆశయసాధనకి ఎన్నెన్నో అవాంతరాలున్నమాట వాస్తవమే. అయినా, వాటిని మేలుకొన్న ఆఫ్రికన్లు నేడు కాకపోతే రేపైనా అధిగమించగలరు.

ఆఫ్రికా సమైక్యతకు ముఖ్యమైన అడ్డంకులు కొన్నింటిని పరిశీలించడం ఆవశ్యకం. ఈ విశాల భూభాగంలో ఏడు వందల పైచిలుకు భాష లున్నాయి. (కొన్ని భాషలకు లిపికూడా లేదు) కొన్ని వేల తెగ లున్నాయి. (కొన్నికొన్ని తెగల మధ్య గర్భశత్రుత్వాలు తరతరాలుగా వస్తూన్నాయి). కొన్ని దేశాలలో రహదారుల మాట అటుంచి, నాటుదారులు కూడా లేవు. వార్తాసౌకర్యాలు మృగ్యం. (జోహాన్సుబర్గునుండి వెలువడే 'డ్రమ్' అనే పత్రికను ఘనాకు పంపించాలంటే కేపుటౌన్‌నుండి పదివారాలకు ఒకసారి స్టీమరు వెళ్ళుతుంది. ఆ ప్రయాణం దారిలో మజిలీలు చేయకపోతే పదిహేను రోజులు పడుతుంది.) సమైక్య ఆఫ్రికాకు ఎవరు నాయకత్వం వహించా లన్నది

విభేదాలకే దారితీసేటట్టు వుంది. ఘనా నాయకుడు ఎన్ క్రుమా, ఈజిప్టు అధినేత నాసర్, ఇతియోపియా చక్రవర్తి హెయిలీ సెలాసీ ఈ నాయకత్వంకోసం ప్రచ్ఛన్నంగా పోటీలు పడుతున్నారు.

ఆఫ్రికా ఖండానికి స్వాతంత్ర్య మిచ్చినా, తెల్లవాళ్ళు దానిపైనే చాలాకాలం ఆధారపడక తప్పదు. తమ తమ దేశాల ఆర్థిక వ్యవస్థలు స్థిరంగా వుండాలంటే తెల్లవాళ్ళు ఆఫ్రికాతో వ్యాపార సంబంధాలను పెట్టుకోక తప్పదు. ఏమంటే, ఆఫ్రికా ఖండంలో వున్నంత సహజ సంపద మరి ఏ ఇతర ఖండంలోనూ లేదు. ప్రపంచం మొత్తంమీద ఉత్పత్తిఅయ్యే వాటిలో ఆఫ్రికా ఎన్ని వంతులు సరఫరా చేస్తుందో పదేళ్ల క్రిందటి లెక్కల ప్రకారం చూసినా ఎక్కువే. ఈ క్రింది పట్టిక గమనించండి.

## ప్రపంచ ఉత్పత్తిలో ఆఫ్రికా భాగం

| వ్యావసాయికం | | ఖనిజాలు | |
|---|---|---|---|
| ఈతనూనె, పప్పు | 80 % | వజ్రాలు | 99 % |
| కలబంద | 56 ,, | కొలంబైట్ | 99 ,, |
| కోకో | 64 ,, | కోబాల్టు | 80 ,, |
| వేరుసెనగ | 26 ,, | బంగారం | 57 ,, |
| చోళ్లు, జొన్నలు | 23 ,, | అంటిమొనీ | 23 ,, |
| కాఫీ | 15 ,, | క్రోము | 39 ,, |
| తోలు | 8 ,, | మాంగనీసు | 38 ,, |
| ఖర్జూరం | 32 ,, | భాస్వరపురాయి | 23 ,, |

పూర్వం పాశ్చాత్య వ్యాపారసంస్థలే ఆఫ్రికాను దోచుకొనేవి. నేడు ప్రభుత్వాలే ఆఫ్రికా సంపదకోసం అర్రులు చాస్తున్నాయి. తమతమ దేశాలలోని ముడిపదార్థాలు ఇంక కొన్ని దశాబ్దాలలో

తమకే సరిపోవు కనుక ఆఫ్రికానుండి తెచ్చుకోకతప్పదు. అందుచేత విభజించి పాలించడమే ప్రథమ సూత్రంగా గల పశ్చిమరాజ్యాలు ఆఫ్రికా ప్రభుత్వాలను ఏదో ఒకవిధంగా తమ ప్రభావంలో వుంచుకొంటూయి. పశ్చిమ రాజ్యాలతో పోటీచేసే రష్యాచైనాలు కూడా తమ హస్తాలను ఆఫ్రికా వైపు పూర్తిగా చాచాయి. ప్రచ్ఛన్న యుద్ధం ఆఫ్రికాను కూడా పూర్తిగా ఆవరించే సూచన లున్నాయి.

విజాతీయమైన పరిపాలనా పద్ధతులను అర్థంచేసుకొనడానికి విద్యాసంస్కారాలు చాలా అవసరం. ప్రజాస్వామిక ప్రభుత్వా లన్నవి ఆఫ్రికా జనులకు వింతగా కనబడ్డాయి. సర్వాధికారాలూ హస్తగతం చేసుకొన్న నాయకరాజుకు లోబడి జీవించడమే తరతరాలుగా వస్తున్న ఆచారం. క్రమబద్ధమైన పాశ్చాత్య పరిపాలనా పద్ధతులు ఒక్క వందేళ్ళపాటే ఆ ఖండంలో కొనసాగాయి. అవి సుస్థిరంగా వేళ్ళు తన్నుకొనేలోగా పాశ్చాత్యులు మూటా ముల్లె సర్దుకొని వెళ్ళిపోయారు. నూటికొకడో, కోటికొకడో అభిలషించే ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ప్రస్తుతం ఆఫ్రికన్లు విజయవంతం చేయలేని స్థితిలో వున్నారు.

క్రొత్త సంఘజీవితంలో తాము నిర్వర్తించవలసిన బాధ్యతలను ఆఫ్రికన్లు గుర్తించలేని అవస్థలో వుండడం దురదృష్టమే. స్వతంత్రం అంటే పనిచేయవలసిన అవసరం లేదనీ, పన్నులు కట్టక్కర్లేదనీ, పాత పద్ధతులలో జీవించవచ్చుననీ వాళ్ళలో చాలామంది భావిస్తారు. వాస్తవానికి ఆఫ్రికన్ జీవితంలో నేడు కొత్తపాతల మధ్య సంఘర్షణ జరుగుతోంది.

శతాబ్దాల తరబడి 'అనాగరిక' జీవితానికి అలవాటుపడిన నల్లవాళ్లు తెల్లవారేసరికి తెల్లదొరల జీవిత విధానాలను అలవరుచుకోలేరు. పొదుపు చేయడం, వెనకవేయడం మొదలైనవి వాళ్ళ రక్తంలోనే లేవు.

కుటుంబంలో ఒకడు వేటాడి తెచ్చినదాన్ని అందరూ పంచుకొంటారు. అలాగే నేడు ఉన్నతవిద్య చదివి ఒకడు వుద్యోగం చేస్తూవుంటే అతడిపై ఆధారపడేవాళ్ళు ఎందరో వుంటారు. ఉదాహరణకు: బ్రిటనులో చదువుకొనివచ్చిన ఒక నీగ్రోకి పధ్నాలుగుమంది అన్నదమ్ములు, అక్క-చెల్లెళ్లూ వున్నారు. తల్లిదండ్రులతో పాటు వాళ్ళనుకూడా ఆదుకో వలసిన బాధ్యత ఆ ఒక్కడిమీద నే వుంది. కొత్త ఆర్థిక వ్యవస్థ పాత సాంఘిక సాంప్రదాయాలను ఎలా పోషించగలదు?

సాంప్రదాయాలూ, ఆచార వ్యవహారాలూ ఒక్కనాటితో మారి పోయేవి కావు. మన భారతీయులకన్నా ఆఫ్రికన్లు పూర్వాచారాలకు ఎక్కువగా కట్టుబడివున్నారు. ఇప్పటికీ ఆఫ్రికన్లు 'ఓలి' ఇచ్చి పెళ్ళాలను కొనుక్కొంటారు. చదువుకున్న అమ్మాయిలకు ఎక్కువ 'ఓలి' ఇవ్వాలి. అలా ఇచ్చే నాథులూ ఇష్టపడే యువకులూ తక్కువ. కొన్ని తెగలలో యుక్తవయస్సు వచ్చిన యువకుడు తన మగతనాన్ని బుజువు చేసుకొనడానికి ఇంకొకడిని పట్టి చంపాలి. మగవాడు ఏమాత్రం పని చేయకూడదు. అన్ని పనులూ ఆడవాళ్ళే చేయాలి. బలమైన గుర్రాల నడ్డి విరిగేటంత బరువులు ఆఫ్రికను స్త్రీలు అవలీలగా మోస్తారు.

వాస్తవానికి ఆఫ్రికాఖండపు వెన్నెముక ఆడవాళ్ళే. అక్కడ ఏమాత్రం వ్యవసాయం జరిగినా అది స్త్రీలు పాటుపడిన ఫలితమే. పాశ్చాత్య విధానాలపై తిరుగుబాటు చేయడమంటే వ్యవసాయాన్ని పాడుచేయడమే అని భావించే ఆఫ్రికన్లు కూడా వున్నారు. ఎరువుల నిలువను ధ్వంసంచేస్తూ టాంగన్యికాలో స్వాతంత్ర్యోత్సవాన్ని జరుపు కున్నారు. వ్యవసాయశాఖలో పనిచేస్తున్న ఆఫ్రికన్ వుద్యోగులే, తాము ఎంత చదువుకున్నవారైనా, ఎరువులు వాడడానికి సుముఖులుకారు. ఆఫ్రికన్లు పుష్టికరమైన ఆహారాన్ని తినడం లేదు. కొన్ని ప్రాంతాలు అనారోగ్యకరమైనవి. కాంగోలో ఉన్న జబ్బులకు లెక్కలేదు. ఆఫ్రికన్లలో చాలామంది ఈసురోమంటూ వుంటారు.

ప్రకృతితో, రుగ్మతలతో, మూఢాచారాలతో ఆధునిక ఆఫ్రికన్ పోరాటం సాగిస్తున్నాడు. ప్రపంచంలో తన సముచిత స్థానాన్ని చేరుకొంటున్నాడు. ఆఫ్రికన్ వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవాలంటే పూర్వాపరాలను కూలంకషంగా తెలుసుకోవాలి. ఆ భూభాగంలో పర్యటించి ఆ గడ్డమీద కొన్నాళ్లు జీవించి, వాళ్ళ జీవిత విధానాలను పరిశీలించి సహృదయతతో విమర్శించే ప్రామాణికుల పుస్తకాలను చదవాలి. శ్రీ ఎ. హెన్ ఫెల్ప్సు రచించిన గ్రంథం అటువంటిది. డాక్టర్ ఎ. హెన్ ఫెల్ప్సు ఆఫ్రికాలో కొన్ని ప్రదేశాలను, ప్రత్యేకం మాతృస్వామిక తెగల ఆచార వ్యవహారాలను పరిశీలించడాని కని పర్యటించి యీ 'లైట్ కాంటినెంట్' గ్రంథాన్ని రచించారు. సహజంగా స్నేహశీలి అయిన డాక్టర్ ఎ. హెన్ ఫెల్ప్సుకు ఆఫ్రికను ప్రకృతిపట్లా, ఆఫ్రికను మహిళలపట్లా అవ్యాజమైన అభిమానం వుంది. దాన్ని కప్పిపుచ్చలేనంత నిజాయితీ వుంది. ప్రాచీన సాంప్రదాయాలలోకూడ సకారణమైన కుతూహలం కల్గి వాటి బాగోగులను పరిశీలించడంలో మానవత్వమే తప్పించి, యితర అభిరుచి కనుపరచని మానవ పరిణామ శాస్త్రవేత్త డాక్టర్ ఎ. హెన్ ఫెల్ప్సు. మానవపరిణామ శాస్త్రంలోగల కుతూహలమూ, డాక్టర్ ఎ. హెన్ ఫెల్ప్సుగారి స్నేహమూ, ప్రచురణకర్త శ్రీ యం. యస్. రావుగారి ఓర్పూ నన్నీ గ్రంథానువాదానికి ప్రోత్సహించాయి. పలకడానికి దుర్లభమైన మాటలు, తెగల పేర్లు మొదలైనవన్నీ నా లోటు లేకుండా, అశాస్త్రీయం అనిపించుకోని వాడుక భాషలోకి అనువదించాను. తప్పొప్పులు విజ్ఞులైన పెద్దలు సరిదిద్ది క్షమిస్తారని ఆశిస్తున్నాను. ఆఫ్రికాపట్ల 'కాంతిసీమ' మన అవగాహనను పెంపొందిస్తుం దనడంలో సందేహం లేదని భావిస్తున్నాను.

రామలక్ష్మి ఆరుద్ర

# విషయానుక్రమణిక



గిరియామా తెగల సాంప్రదాయికమైన వస్త్రధారణ

[పుట. 10

# గ్రంథాన్ని గురించి

క్రనుచూపు మేరగా విస్తరించిన బయళ్ళమీద మినుకు మినుకు మని మెరిసే దీపాలు, వినీలాకాశంలోంచి ఉల్లిపొర తెరలోంచి వలె చూచాయగా కనిపించే నీలికొండలు - అక్కడక్కడ వెండిమేఘాలు - ఇదీ చీకటి ఖండంతో నా తొలి పరిచయం. ఆ రోజు మొదలుకొని నా యీ ఊహా చిత్రం మారలేదు. కాని, మాటల్లోని వ్యంగ్యాన్నీ, శ్లేషనీ గురించి తలపోసేలా చేసింది యీ 'చీకటి ఖండం' అన్న మాట. యూరపు ఖండంలో అతివిచారింపతగ్గ శీతోష్ణపరిస్థితులు కలిగిన భాగంనుండి వచ్చిన బ్రిటిష్‌వారు కాంతితో వెలిగిపోయే యీ ఖండానికి 'చీకటి' అన్న పదం ముందు తగల్చడమూ, అది చిరస్థాయిగా నిలిచిపోవడమూ రెండూ ముదావహమే!

జాంజిబార్‌కీ విక్టోరియా సరస్సుకీ, కాంగోకీ నైగర్‌కీ మధ్యలో కనిపెట్టబడ్డ విషయాలలో యితోధికంగా ఆసక్తికలిగిన ప్రతి యూరోపియనూ, పత్రికా రచయితా యీ 'చీకటి' అన్న పదాన్ని వదలకుండా బలపరిచారు. విక్టోరియా మహారాణి కాలంలో యీ ప్రాంతాలలో కనిపెట్టబడ్డ విషయాలు ప్రాముఖ్యమైనవి.

వెలిగే దీపాలు! - చీకటి ఖండం!

ఇది కాకతాళీయమా? కాక కారణార్థమా?

మన కళ్ళకు కనిపించేదానికి బదులు మనం చూడాలని తలపోసే దానిపై మన దృష్టిని మళ్ళిస్తూ, మాటలకూ పేర్లకూ తావిచ్చే కనుపడని దిక్సూచి ఏమైనా వుందా?

నిజానికి ఆఫ్రికాలో విపరీత వర్షాలకి గురి అయ్యే అడవులు వున్నాయి. కాంగో బేసిన్, నైగర్, జాంబజి పొడుగునా, ఉగండా కిలిమంజారో ప్రాంతాలలోనూ, ఇతోపియా ప్రాంతాలలో కూడా ఇవి వున్నాయి. సంవత్సరంలో సగం భాగంపాటు ఈ దక్షిణ ఆఫ్రికా అడవుల్లో, కొండల్లో, ఆకాశంలో కారుమేఘాలు కమ్ముకొని వుంటాయి. స్తబ్ధత, అతిశీతలం, చీకటి తో నిండి వుంటుంది శీతోష్ణపరిస్థితి. కాని యీ పరిస్థితిని బట్టి యీ ఖండాన్ని 'చీకటి ఖండం' అనలేదు. పందొమ్మిదో శతాబ్దంలోని యూరోపియనులకి యీ ప్రాంతీయుల శరీరాలు అతి నల్లగా కనిపించాయి. అందుకే మిరుమిట్లు కొలిపే యీ ఖండాన్ని వారు చీకటి ఖండం అన్నారు. ఇంతకుమించి ప్రత్యేకించిన కారణం లేదు. కాని నిజానికి ఆఫ్రికాలో కొన్ని ప్రాంతాలవారి శరీరం రంగు మన దాక్షిణాత్యుల రంగు కంటె మెరుగుగా కూడ వుంటుంది. యీ నల్లని చర్మానికి తోడుగా ఎవరికీ తెలియని పూజాపునస్కారాలు, వింత దుస్తులు, వింత ఆచారాలు.... యివన్నీ వీరికి నల్లగా, చీకటిగా తోచాయి. ఇవి అందరికీ తెలిసినవి కాకపోవడమే వింతకి కారణం।

తరతరాలుగా యీజిప్టు, పర్షియా, అరేబియా మొదలైన దేశాలతో సంబంధం, రాకపోకలూ వున్నా - రాయడం, చదవడం నేర్చుకోలేదు ఆఫ్రికనులు. చక్రాల బళ్ళు అలవాటు చేసుకోలేదు. అందుకే వీరి జీవితం బొత్తిగా నాగరికతాశూన్యంగా తోస్తూ వచ్చింది సామాన్యులకి. ఇప్పటికీ వీరి బట్టలు బెరడుతోటీ, చర్మంతోటీ తయారుచేసుకుంటారు. రంగు రంగుల పూసలదండలు ధరిస్తారు. లోహపు నగలు ధరిస్తారు. అందుకే అడవి మనుషులు, మూర్ఖులు, నాగరికత తెలియనివారుగా చలామణీ అయ్యారు.

వూళ్ళే తక్కువ. దేశపటాలు అసలే లేవు. అయినా డోళ్ళతో చప్పుళ్ళద్వారా టెలిగ్రాముల్లాంటివి పంపించేవారు. రకరకాల సాంఘిక రాజకీయ పద్ధతులను అమలులోకి తెచ్చారు। వీరి ప్లానులూ, చట్టాలూ ప్రత్యేక పద్ధతిని అనుసరించి పోకపోవడం మూలాన వారు 'నల్లని

వారు', చీకటి బ్రతుకులో వున్న వారుగా లెక్కకి వచ్చారు. వారిని యీ చీకటిలోంచి 'ఉద్ధరించాలి' అన్న ఆపోహ చాలా మందికి బయలుదేరింది.

తొలినుంచి బయలుదేరిన యీ తప్పుడు వూహలూ అర్థాలూ శాశ్వతంగా నిలిచి, ఆఫ్రికాకు సంబంధించిన అన్ని విషయాలపట్లా చీకటి ఆవరించేలా చేసింది. యీ విషయం ఆఫ్రికా ప్రజలపట్ల మరీ నిజం. ఈ తప్పుడు నమ్మకం యూరపులో మరీ స్వైరంవిహారం చేసింది. ఎందుకంటే, దేశదిమ్మరి రచయితకి ఎంత ఉత్సాహం యిచ్చిందో, ఇంటి దగ్గిర చదువరికీ అంతటి ఉత్సాహాన్ని కలిగించింది యీ నమ్మిక. ఎవరికైనా సరే, తనూ, తన జాతీ ఇతరులకి 'వెల్గుదాట చూపించాం' అంటే గర్వకారణంగా తోస్తుంది యీ దిక్కులేని అడవి మనుషులకి 'మేం వెలుగు, నాగరికత, మంచి వస్తువులు అందించాం' అని చెప్పుకోవడంలో ఘనత వుంది: చీకటి మనుషులు ? చీకట్లో అల్లాడుతున్నారు ! పాపం ! కాని ప్రతి విషయానికీ బొమ్మా బొరుసూ వుంటాయి.

పై దృశ్యానికి రెండో పక్కకూడా వుంది.

ఆఫ్రికా దేశానికి వెళ్లిన వారిలో యూరోపు సంఘంలోని మేధావులూ, నాగరికతా నిర్ణేతలూ ఎక్కువగా వెళ్ళలేదు ; పాశ్చాత్య మేధా సంపదకి, మతానికి నాయకులుగా పేరుకాంచినవారు అసలు వెళ్ళలేదు. వింత ప్రదేశాలకి వెళ్ళినవారి ఉద్దేశాలు, ఆదర్శాలు, అర్హతలు ఏమైనా - యిక్కడికి వచ్చిన తరువాత యింటికి ఏదైనా ఒక బొమ్మైనా పంపాలన్న ఆశ కలగడం అర్థంచేసుకోవచ్చు. ఈ బొమ్మను చిత్రించి పంపించిన వ్యక్తి మహా నాయకుడుగా, ఘనుడుగా కన్పించాడు - ఇంటిదగ్గిర వాళ్ళకి. విక్టోరియను మధ్య తరగతి గౌరవ శిఖరాగ్రంమీద నిలబడిన వీరు మంచి దుస్తులు ధరించి, ధైర్య సాహసాలతో నాగరికతకు నివాళి పట్టేవారుగా కన్పిస్తారు. దిగంబరులై మనుష్యమాంస భక్షణచేసే అడవి మనుషులంటే భయంలేదు వారికి. ద్రోహులూ, మూర్ఖులూ అయిన 'పాగన్స్' అంటే పిరికితనం లేదు. వారు నాగరికతకు నిర్వాహకులు ! - ఒంటినిండా బట్ట, తెల్లని చర్మం, చేతిలో తుపాకులు, డబ్బు, మతగ్రంథం బైబిలూ వారికి యీ హక్కును ప్రసాదించాయి !

ఇలా అనంతంగా పత్రికలలో, యాత్రాసాహిత్యంలో, నవలల్లో యీ చీకటివాసుల చిత్రం పెరిగింది. వారు రక్త పిపాసులుగా, భయంకర మైన వారుగా తయారయారు. శ్వేతదేవత ప్రార్థనను వదలలేనివారు; నాగరికత సాధించిన ఏ చిన్ని జయానికైనా పూర్తిగా లొంగిపోయేవారు; వెలిగించే అగ్గిపుల్లల దగ్గరనించి - ఓ బట్టకోసం బానిసల నిచ్చేవారు వీరు; యీ వర్తమానంలో కెలివిజన్లకీ, లౌడ్‌స్పీకర్లకీ దాసోహం అనేవారు. ఆఖరుకు ఏటమ్ ప్రేలుళ్ళకి సహితం అబ్బురపడి పోయేవారుగా రూపం దిద్దుకున్నారు ఆఫ్రికనులు.

ఇలాంటి సగం సత్యాలమీదా, వికృతపు కొలబద్దలమీదా ఆధారపడి యీ చీకటి ఖండం వివిధ వర్ణనలతో పెంపొందింది. ఉదాహరణకి - కిస్వాహిలి పదం 'బ్వన' అన్నదాన్ని అతి చాకచక్యంతో 'తెల్లదొర' అని అనువదించారు. నిజానికి ఆ మాటకు సామాన్యంగా ఆఫ్రికను లందరూ యిచ్చే అర్థం - మనిషి అని. తమలో తమని పిలుచుకుందుకు సహితం యీ పదాన్ని వాడుతారు; విదేశీయుల పట్ల వ్యవహరిస్తూ యీ పదాన్ని ఉపయోగిస్తే, మనం సామాన్యంగా వినే 'సార్' అన్నదాన్ని మించిన ఘనత దాల్లోలేదు. కాని యూరపులో యింటిదగ్గర ప్రతి పుల్లాయికీ 'తెల్లదొర' అని పిలిపించుకోవడం గర్వంగా తోస్తుంది. తను శ్వేతవర్ణపు జాతికిచెందడమే యీ ఘనతకు కారణంగా భావించుకుంటాడు. ఈ 'బ్వన' అన్న పదంలాగే భారతదేశంలో 'సాహెబ్' కూడ తయారైంది. మొగలు రోజులలో ముస్లిములు తమలో తాముకూడ సాహెబ్ పదాన్ని ఉపయోగించుకునేవారు. కాని తరువాత తరువాత పాశ్చాత్య ప్రయాణీకుల చెవులకు 'సాహెబ్'కి కూడ 'తెల్లదొర' అర్థమే స్ఫురింపసాగింది.

ఆఫ్రికాకు సంబంధించిన సాహిత్యం యీ విధంగా తమ ఘనతని, ఆధిక్యతని పెంపొందింప జేసుకుంటూ, ఎదుటివాటి భయంకర పరిస్థితులని, చేతకానితనాన్ని సమయానుకూలంగా యినుమడింపచేస్తూ పెంపొందింది. ఈ పద్ధతి సామాన్యం అయినదే అయినా దాని ఫలితం మటుకు బలవత్తరం అయినదే!

ఈ పద్ధతులమీద తయారైన ఆఫ్రికా చిత్రం, దిగంబరులైన అడవి మనుషులకీ, నాగరికులైన శ్వేతవర్ణులకీ మధ్యనున్న సంబంధం—నిజమైన పరిస్థితులకు అసలు సంబంధమేలేనివి. ఆఫ్రికా ప్రకృతి చిత్రానికి 'చీకటి' అన్న పదం ఎంతదూరమో, యీపై పుక్కిటి పురాణాలకీ, అసలు విషయాలకూ మధ్య అంత దూరం వుంది. అయినా యీ 'చీకటి' అన్న విశేషణం మటుకు ప్రతి పత్రికలవారూ వుపయోగిస్తూనే వున్నారు. ఈ సంగతులన్నీ గతకాలానివి అని తోసి పారవేయలేం. ఈలోగా రెండు ప్రపంచయుద్ధాలు, యూరపు ఆసియాల్లో రెండు విప్లవాలు, ప్రయాణ సౌకర్యాలు, యంత్ర పరికరాలు-ఇంకా ఎన్నో యితర విషయాలు ఉద్దేశాలకీ, జాతులకీ మధ్య సంబంధబాంధవ్యాలని మార్చివేశాయి. రాజకీయంగా ఆసియా స్వతంత్రంగా నిలుస్తుంది. ఆఫ్రికా త్వరలోనే అదేదారి పట్టింది. కాని ఆఫ్రికాను గురించి రాసేవారూ, దానితో ఎంతో కొంత సంబంధం వున్నవారుకూడ 'చీకటి ఖండం' అన్న మాటను మటుకు వదలడంలేదు.

ఇంత పొగ రాడానికి కొంచెం అయినా నిప్పులేదంటారా? పాంగాస్, పిస్తోలుగుళ్లూ ఎంత నిజమో మాటలూ, ఊహలూ కూడా కొన్ని సమయాల్లో అంత నిజమూను. పొంచివుండి మాంసభక్షణచేసే అడవి మనిషి, శ్వేత జీవులను తినే రాక్షసుడు, శ్వేత జీవులను భయభక్తులతో ఆరాధించేవాడూ—వీని వర్ణనఅంతా అతిశయోక్తి అవొచ్చు. కాని ఈ వర్ణనను తలక్రిందులుగా అతి పొగడ్తచేస్తే అదీ నిజంకాదు. సామాన్యుడైన ఆఫ్రికను వ్యక్తి అటు ఉత్తమోత్తముడైన యోగి కాదు, మేధావి కాడు; అతి శీలవంతుడూ కాడు; అతి సున్నిత భావాలు కలవాడూ కాడు. నిత్య జీవితంలో మనం చూస్తూన్న ప్రతి ఒక్కనిలాగా యితడూ గౌరవంకోసం పాకులాడుతాడు. ధనాశ మెండు. గర్విష్ఠి.

మనం మరువరాని ఒక సంగతి వుంది. వర్తమాన తరం ఆఫ్రికనులందరూ యూరోపియను స్కూలు పుస్తకాలూ, పేపర్లు చదివీ, రేడియో ఉపన్యాసాలు వినీ తెలివితేటలు తెచ్చుకున్నవాళ్ళు. ఎప్పుడో ఎక్కడో ఏదో పుస్తకంలో చీకటి ఖండాన్ని గురించి చదివే యూరోపియను కంటె

కూడ యీ తరం ఆఫ్రికనులకు 'చీకటి ఖండపు' చరిత్ర పూర్తిగా తెలుసు. అయితే నేం? యీ యువతరం రాజకీయపు రంగంలో స్వతంత్ర భావాలను పెంచుకోవాలి. ఈ తరంవారు ఆఫ్రికాలో నివసించే యూరోపియనుల కంటెకూడ శుభ్రంగా వస్త్రధారణ చేస్తారు. సిగరెట్లు, బీరు సీసాలు, రేడియోలు లేకుంటే ఒక్క క్షణంకూడా కాలక్షేపం కాదు వీరికి.

ఇది విషమ (చీకటి!) పరిస్థితే మరి!

అయినా, ఎంత నల్లని మేఘానికైనా వెండి అంచు వుంటుంది అన్న సామెతలాగా - యీ పరిస్థితిని తులతూచేటప్పుడు జాగ్రత్తపడవలసిన విషయాలు చాలా వున్నాయి. అప్పుడే నిజంగా, ఆఫ్రికాను యీ పేర్లనుంచి గాని, ఆధునికపు నినాదాలనుంచిగాని విముక్తి చేయగలం.

ఆఫ్రికా వెలుగునీడల కలయిక మిరుమిట్లుగొల్పే వెలుగులాగా తేటతెల్లంగా వుంటుంది. కారుచీకట్లలాగా అసలే అర్థంగానట్లు వుంటుంది. ఈ రెండింటినీ కలిపి చూడగలిగితేనే అర్థం స్ఫురిస్తుంది. ఈ పుస్తకం అలా అర్థంవైపు తీసుకువెళ్ళే ప్రయత్నమే. ఈ పెద్ద ఖండంలో అతి చిన్న భాగంలో నిశితంగా చూడ్డం జరిగింది. యీ చూడ్డంకూడ మానవ పరిణామ శాస్త్ర దృక్పథంతో చూడ్డం జరిగింది. ఈ ఖండంలో అసంఖ్యాకమైన విభాగాలున్నాయి. వాటిని పరిశీలించి చూడ్డానికి కూడా అనేక పద్ధతులు వున్నాయి. మానసిక శాస్త్ర దృష్ట్యా, కళా దృష్ట్యా, మత దృష్ట్యా ఎలాగైనా పరిశీలింపవచ్చు. ఇందులో ఏ దృష్టితో చూచినాకూడా మానవ చేష్టితాలకు అర్థాలు స్ఫురింపవచ్చు. తిన్నగా మానవుని అంతరాంతరపు నిజాలలోకి చొచ్చుకునిపోయి మానవ ప్రవర్తనకి అర్థం కనుక్కోవచ్చు. మానవ పరిణామశాస్త్రం యీ అన్ని తరహాల పరిశీలనలనీ తనలో యిముడ్చుకుని ముందుకు సాగుతుంది. సమ్యగ్ దృష్టితో మానవ నాగరికతకు మూలం కనిపెడుతుంది. మానవ పరిణామ శాస్త్రజ్ఞుని శాస్త్ర గ్రంథంలా కాకుండా యీ గ్రంథంవల్ల ఆ సరదా వున్న వ్యక్తి యీస్టాఫ్రికా ప్రయాణం గురించి, అటువంటి చోటికి వెళ్ళినప్పుడు ఇటువంటి సరదాలు ఎలా తీవ్రతరంగా పెరిగి ఒక్కుమ్మడిగా గుమిగూడుతాయో, అటుపిమ్మట వాటంతట అవే మనలను ముందు కెలా నడిపిస్తాయో అర్థం అవుతుంది.

ఇదే చివరికి పరిశోధించే విషయంలో నిర్దుష్టమైన అభిప్రాయ ప్రకటనకి ఆధారభూతం అవుతుంది. పరిశోధించే విషయాలు కూడా విస్తృతం అవుతాయి.

మానవ పరిణామ శాస్త్రం చదువుకోని కొందరికి కొన్ని అభిప్రాయాలు వున్నాయి. యీ శాస్త్రం చేసేపని అల్లా పుర్రెల కొలతలు తీయడమే। రక్తం ఏ వర్గానికి చెందినదో పరీక్షించడమే అంటారు వారు. లేకుంటే త్వరితగతిని రూపుమాసిపోతున్న ఏ తెగవారివో అర్థంలేని అలవాట్లని, ఆనవాయితీలని పరిశీలించడం అంటారు. మానవ పరిణామశాస్త్రపు అర్థం అంత సంకుచితం కాదు. సరి కదా - యీ ఆధునిక యుగంలో సంస్కృతి పరిణామాలన్నీ కూడా యీ శాస్త్రపు లెక్కల క్రిందకు వచ్చాయి. యీ శాస్త్రం మానవుడన్నవాడు యీ భూభాగంమీద ఎక్కడ వున్నా అతన్ని పరిశోధించడం, పరిశీలించడం చేస్తుంది. దానికి తోడుగా వర్తమానాన్నిబట్టి కాలపరిస్థితులను, మారిపోతున్న జీవనపద్ధతులను పరిశీలించడం కూడా యీ శాస్త్రంలో ఒక భాగంగా అయింది. యీ విభాగం అసలు చెట్టుకు కొత్తగా మొలచిన కొమ్మ.

అందుకే, ప్రతి మానవ పరిణామ శాస్త్రపు ప్రశ్నకూడ అతి ముఖ్యమైన రెండు ప్రశ్నలవైపు దారితీస్తుంది.

ఒకటోది : యీ మారిపోతున్న ప్రపంచంలో మనం ఎలా నిలబడగలగడం?

రెండోది : ఇంకెవరో రూపొందించిన మార్పులకి తగినట్లు మనం ఎలా ప్రతికూలించడం?

ప్రతి రచయితా వ్యక్తిత్వం కలిగి వుంటాడు. అతని యిష్టాయిష్టాలు అతనివి. ఇటువంటి వాటికి అతీతంగా నేను రాయలేదు. కాని నిష్పక్ష

'ఉలుగురు' పర్వతశ్రేణిలోని వాసులకి వారి డిప్యూటీ సుల్తానైన శ్రీ సి. పి. కునంబి నన్ను పరిచయంచేసి సహాయం చేశారు.

ఇంకా అనేక మంది స్నేహితులకి నేను ఋణపడి వున్నాను. వారిలో ఆఫ్రికనులు, భారతీయులు, పాకిస్తానీయులు, అరబ్బులు, బ్రిటిషు వారు, యూరపులోవారు, అమెరికాలోవారుకూడా ఎంతో సహృదయంతో కొత్త విషయాలు అందించారు. తమ స్వానుభవాలను తెలిపి సలహా లిచ్చారు. దారి చూపెట్టారు. అంతేకాదు. కొన్ని సందర్భాలలో నా పేరేనా తెలుసుకోకుండా, నా ప్రయాణానికి కారణాలైనా అడక్కుండా ఎంతో ఆదరణ కనుపరచారు. వీరందరికీ పేరు పేరునా నా కృతజ్ఞతని మాటలలో చెప్పడం సాధ్యం కానిపని. కాని నా పనిలో ప్రతిక్షణం పాలు పంచుకొని నాతో పాటు పరిశ్రమించిన కొందరిని మాత్రం యిక్కడ ఉదాహరణగా చూపకపోవడం క్షమింపరానిది. వీరిని గురించి చెప్పిన మాటలు కొంచెం అయినా నా కృతజ్ఞతకి మటుకు అవధులు లేవు.

మిస్టర్ బ్రూస్ రోనాల్డుసన్-యీయన అక్కడ వ్యవహార కర్తలలో ఒకరు. వీరి సహాయ సలహాలు లేకుంటే నాపని ఎన్నటికీ సాగేది కాదు. ఇలాగే మిస్టర్ మాల్‌కోమ్ నోరిస్, మిస్టర్ ఫరజీ ఆలి కిలు మంగ వీరందరూకూడా దక్షిణ టాంగన్యికాలోని మకొండె పీఠభూమిలో నెవలాలో వుండేవారు. టాంగన్యికా తూర్పు భాగంలోని ఉలుగురు కనుమలలో నాకెంతో సహాయం చేసినారు శ్రీ ఆంథొనీమూర్, డంస్టన్ ఒమారి. మిస్టర్ ఆర్. హెచ్. గొవర్, మిస్టర్ హాన్స్‌కోరి-వీరి అనుభవాలు నాకెంతగానో ధైర్యాన్నిచ్చాయి. ముఖ్యంగా ఉలుగురు కొండలలో నివాసులైన 'లుగురు' లను గురించి వీరు నాకెంతో సహాయంచేశారు. యూస్టాఫ్రికా రేవులకు వస్తూన్న ఆఫ్రికను యువతుల సమస్యలను విపులీకరించి చెప్పారు శ్రీ J. A. H. Wolff. ఈ యువతులు తెగలనుండి వేరుపడి వచ్చినవారు.

ప్రొటెస్టెంటు, రోమను కేతలికు మిషనరీలు నాకు చేసిన సహాయం ఎనలేనిది. ముఖ్యంగా డాండా (Ndanda) బిషప్పు అయిన గౌరవనీయులు విక్టర్‌హెల్గ్, బుకొబ ప్రొటెస్టెంటు మిషను డైరెక్టరు గౌరవనీయులు హోల్గర్ బెనెట్‌సన్ ఎంతో సహాయం చేశారు. ఇలాగే-డాండాలో

ప్రాకె ఆల్కుయన్, నెవలాలో బార్నబస్, కిటంగాలిలో లాంజినస్-కోవె. (Mkowe)లో కొలంబస్ ఫరర్, ఫిలిప్ మ్రోపె ఎంతో శ్రమపడ్డారు నాకోసం. ఫ్లోరియన్, పాటర్ వాన్ డి ఐడెన్, ఫాదర్ రివొకటస్, మిస్ అన్నబూచ్ వీరందరికీ కూడ ఎంతో రుణపడి వున్నాను నేను.

గౌరవనీయులు అమిర్ కరిమ్‌జీ (డారెస్ సలామ్‌లో ఉపమంత్రి), మకొండె నీటి సరఫరా కార్పొరేషను మేనేజరు మిస్టర్ మిఛెల్ - వీ రిరువురూకూడా అమూల్యమైన విషయాలకు దారితీసే సంగతులు చెప్పారు: అటువంటి చోట్లకు నన్ను పరిచయం చేశారు.

ఎందరో కమ్యూనిటీ డెవలప్‌మెంటు ఆఫీసర్లు నా పరిశోధనలకి పనికివచ్చే విషయాలకు నన్ను పరిచయంచేశారు. వీరిలో ముఖ్యంగా టాంగన్యికాలో నెవాలాలోని మిసెస్ ధెక్లామధరో, బుకొబలోని మిస్ బెట్టీ అర్జ్‌హెడ్-వీరికి ఎంతేనా రుణపడివున్నాను నేను.

నాకు ఆతిధ్యం యిచ్చిన యూరోపియన్, ఆఫ్రికన్, ముఖ్యంగా స్కాండినేవియన్ పెద్దలు నాకు ముఖ్యమైన సహాయం చేశారు. నాకెంతో కాలంనుంచి ప్రాణమిత్రులుగా వుంటూన్న ఎరిక్ హోమన్ దంపతులు, మికిందానిలో నట్‌బొకెన్ దంపతులు, బ్వాకిరచినిలో పిట్జ్ దంపతులు, లిండిలో కాఫ్మన్ దంపతులు; బుకొయొలోని ముస్లిమ్ సెకండరీ స్కూలు అధిపతులు బలున్‌యవ దంపతులు, బుసొగా పెద్ద సలిమ్ కె. ముచబె, వారి విస్తృత కుటుంబమూ అందరికీ నేనెంతో రుణపడి వున్నాను. వీరంతా తూర్పు ఉగండావాసులే.

చిన్నచిన్న పల్లెలలో పల్లె ప్రాంతంలో నా కాంప్‌లోకి నాతోపాటు వచ్చి, అనువాదకులుగా అపారమయిన సహాయం చేశారు నా ఆఫ్రికను స్నేహితులు. ఫీల్డుపనిలో ఎన్నో చికాకులు, యిబ్బందులు వుంటాయి. ఎంతో విసుగు జనించేలాంటి సంభాషణలు, ప్రశ్నోత్తరాలు-ఎన్నో చిక్కులు. అయినా విసుక్కోకుండా సమాధానాలు చెప్పారు. ముఖ్యంగా వచ్చీరాని కిస్వహిలి భాషలో నా అంతులేని ప్రశ్నలకి కూడా బదులుచెప్పారు. నా చుట్టూ వారు మాట్లాడుకొనే విషయాలు కొంచెం కొంచెంగా అర్థం అయేలాగా, వాటికి తగిన ప్రశ్నలు వేయకలిగేలాగా నాకు భాషాజ్ఞానం అల

# 1. దంతము - దాస్యము

అక్టోబరు 1957 లో కెన్యా సముద్రతీరంలో ఉన్న మొంబసాలో నేను దిగాను. అలా దిగేనాటికి నాకు తెలిసినదల్లా 'గిరియామా' తెగను గురించీ, వారు ధరించే అందమైన జాతీయ దుస్తులను గురించీను. గిరియామా స్త్రీలు ధరించేది గడ్డితో తయారుచేసిన పరికిణీ. ఇది మోకాళ్ళ మీద వరకే వుంటుంది. బాలీ నృత్యకత్తెలు ధరించే పరికిణీలా వుంటుంది. శరీరం పైభాగంలో ఏమీ ధరించరు వీరు. ఎరుపు, పసుపు, ముదురు నీలం రంగుపూసలు చక్కగా వరుసలు వరుసలుగా గుచ్చి, బిగువుగా జబ్బలకీ, చేతులకీ, మణికట్లులకీ అలంకరించుకుంటారు. తూర్పు ఆఫ్రికాను తెగలలో చాలా భాగం అరబ్బు, యూరోపియను దుస్తుల మిశ్రమ పద్ధతిలో వస్త్ర ధారణ చేస్తుంటారు. ఎక్కడోగాని ఆటవిక రకపు దుస్తులు నిలచి లేవు. అలాంటిది ఈ గిరియామా వస్త్రపద్ధతి మటుకు గత కొద్ది సంవత్సరాల క్రితం వరకూ నిలచి వుండడం ఆశ్చర్యకరమే! మరీ పల్లె ప్రాంతంలో యీ రోజుల వరకూ కూడా యీ బట్టలు నిలిచి వున్నాయి. టాంగన్యికా లోపలి భాగాలలోనూ, ఇథోపియా చుట్టుప్రక్కలా, సూడాన్ ప్రాంతంలోనూ యీ అరుదైనవారు నివసిస్తూ వుంటారు. అరేబియా కోస్తాలో మొంబసా రేవు సమీపంలో గిరియామా తెగవారే కనిపిస్తారు. విదేశీయులతో సంపర్కం పెట్టుకోవడంలో మొదటివారు వీరే. కెన్యా కోస్తా విదేశీయుల కెప్పుడూ లాభిస్తూనే వుంది. దరిదాపు వేయి సంవత్సరాల క్రితం నుంచీ అరబ్బులు అక్కడ స్థావరాలు ఏర్పాటు చేసుకుంటూనే వున్నారు. మనకు

నాలుగు శతాబ్దాలకుముందే పోర్చుగీసులు అక్కడికి వలసపోవడం ప్రారంభించారు; తరువాతనే కెన్యాలో బ్రిటిషువారు, టాంగన్యీకాలో జర్మనులు చేరారు. ఇదంతా జరుగుతున్నది 1880 లో. ఇటువంటి వివిధమైన సంబంధాలు ఏర్పడ్డా కూడా, గిరియామా తెగవారు నాగరికులు కావడానికి బదులు విదేశ నాగరికత నుండి జాగ్రత్తపడ్డానికి కట్టుదిట్టాలు చేసుకున్నట్టు తోస్తుంది. కొద్ది సంవత్సరాల క్రిందటిదాకా పరిస్థితులు అలా వున్నా, గత కొద్ది సంవత్సరాలలో వారి సాంస్కృతిక పటిష్టతకూడా బలం కోల్పోయి కూలిపోయింది.

ఈ కోస్తా తెగలు మటుకు సమైక్యత విషయంలో యితర తెగల కంటె పటిష్ఠంగా వుండడానికి కారణం బానిసలకోసం పోరాట్టం పూర్తిగా దేశంలోపలి భాగాలమీద కేంద్రీకృతం కావడమే. అక్కడి భాగాలు వస్తు సంపద విషయంలోకూడా కోస్తా ప్రాంతాలకంటె ఉత్తమమైనవి కావడమే. ఇందువల్లే గిరియామా తెగలుగాని, కోస్తా ప్రాంతపు 'తొమ్మిది తెగలు' కాని శుష్కించి పోలేదు.

వీరిని గురించి వినగానే నాకు కుతూహలం కలిగింది. వీరిని గురించి వాఙ్మయంలో చదివాను. యీస్టాఫ్రికాలో మాతృవర్గ పద్ధతిలో కట్టుబడివున్న గుంపులు చాలా తక్కువ. వారిలో యీ గిరియామా తెగ ఒకటి కావడమే నా కుతూహలానికి కారణం.

కోస్తాకు సమాంతరంగా దేశంలోపలికి ఇరవై మైళ్ళదాకా పోతే, మరీ ఎత్తుగాని కొండల వరుసలు వున్నాయి. ఇవి మొంబాసానుంచి ఉత్తరంగా వున్న పూర్వపు అరబు రేవు మలిండి దాకా వున్నాయి. భూమధ్యరేఖకు మూడు డిగ్రీలు మాత్రమే పైగా వున్న యీ ప్రదేశం ప్రస్తుతం విశ్రాంతి స్థలంగా, స్నానపు కేంద్రంగా పేరు గడించింది. ఈ కొండల అంచులవెంట రేవు రేవులుగా వ్యవసాయం సాగిస్తూ కష్టతరం అయిన జీవితాన్ని సాగిస్తూ వుంటారు వ-గిరియామా. వీరు పూర్వం 'నైకా' అని పిలువబడుతూ వుండే తొమ్మిది తెగలలో ఒకరు. 'నైకా' అన్న మాటకు కిస్వహిలిలో సరిగా ఎడారి వాసులు అని చెప్పుకోలేం.

నిజానికి, అరబ్బు భాషలో "బెను" అంటే లాగా, 'నైకా' అంటే నాటు మనిషి - అడవి మనిషి అని చెప్పుకోవచ్చు. ఇప్పట్లో అసలు యీ తెగల వారే ఆ మాటను పిలుచుకుందుకు ఉపయోగించరు; ఇతరులు అలా పిలిస్తే కూడా యిష్టపడరు. 'మిజి చెంప' అనీ, 'మిజి కెంద' అనీ పిలుచుకుంటారు. దానికి మక్కీకి మక్కీ అర్థం చెప్పకుంటే—తొమ్మిది స్థలాలు లేక తొమ్మిది తెగలు అని చెప్పుకోవచ్చు. ప్రస్తుతం బంటూ మాట్లాడే గుంపులందరికీ యీ పదం ఉపయోగించడం అధికారయుతం అయింది.

సంప్రదాయక పద్ధతిపై వీరి చరిత్రను కనుక పరిశీలిస్తే వీరి ఆదిమ నివాసస్థలం కెన్యా సరిహద్దులకు ఆవలి పక్కగా భూమధ్య రేఖ దాటిన తరువాత అనీ, వీరి పూర్వీకులు నిలో హెమిటిక్ గుంపులచేత తరుమబడి యిక్కడికి చేరుకున్నారనీ తోస్తుంది. యీస్టాఫ్రికను చరిత్రలో బంటూ కాని నిగ్రోయిడ్ గుంపులు చాలా ప్రముఖమైన పాత్రనే నిర్వహించాయి. ఉదాహరణకు చూస్తే, 'మిజిచెంద' గుంపులు కెన్యా కోస్తాకు వలసపోవ డానికి కారకులు నైరుతి ఇతోపియా, సొమలియానుండి వచ్చిన 'గాల్లా' జాతులేనని చెప్పుకోవచ్చు.

ఈ 'తొమ్మిది జాతులు'లో రెండైన ద-దురుమ, ద-డిగో తెగల వారు ఇప్పటికీ తమ పాతకాలపు సాంఘిక పద్ధతులను వదులుకోలేదు. వీరి తెగలో ఆస్తి హక్కు తల్లిపక్కనుంచి వస్తుంది. మాతృవర్గ సంఘ పద్ధతి. పల్లెలో నివాసంకూడా తల్లిమీదే ఆధారపడి వుంటుంది. (ఆస్తి హక్కు, సంప్రదాయాలూ అన్నీ యీ సంఘంలో తల్లి తరపుగా సాగుతాయి. తల్లినుండి కూతురికి-పిల్లలకి అలా వస్తాయి హక్కులు.) తెగపేరుకూడా పాశ్చాత్యుల యింటిపేరులాంటిది తల్లినుండి పిల్లలకు వస్తుంది. అలానే భర్తలుకూడా భార్యల వసతుల దగ్గిరా, భూముల దగ్గిర గానే మకాం ఏర్పరచుకుంటారు. ఆస్తులు లావాదేవీలుకూడా అలాగా ఆడ వారి తరపుననే సాగుతాయి. కాని ప్రస్తుతంలో యీ సంప్రదాయం - తండ్రికి బదులు పిల్ల మేనమామకి ధనంయిచ్చి పిల్లకి వివాహం జరిపించడం మటుకే ఉంటూంది. కొత్తదంపతులు భార్య తరపువారినే సహాయంకోసం

ర్థించుతారుకూడా. ఆస్తి ఎవరికి చెందాలన్నది అంతగా పట్టించుకోవలసినం తది కాకపోవడంచేతే ప్రత్యేకించి వారసత్వపుచట్టాలులేవు వారికి. కాని 1957 లో జరిగిన ఆఫ్రికన్ కౌన్సిల్ కవలెలో డురుమ, డిగొ తెగలకు చెందిన పెద్దలు కొందరు వారసత్వ పద్ధతి మాతృవర్గంకాక పితృవర్గంగా జరగాలని, అటువంటి చట్టాలు కావాలని కోరారు. ఓ సంవత్సరం జరిగినా యీ కేసు తేలలేదు. ఎవరూ దీన్ని అంతగా లెక్కచేయలేదుకూడా.

ప్రస్తుతంలో వ-డురుమ, వ-డిగోవారిది తల్లిహక్కు, తండ్రిహక్కు అన్నదీ, అందమైన గిరియామా దుస్తుల తీరు అన్నదీ అంత ప్రాముఖ్యం వహించడంలేదు. మొంబాసావాసులజీవితనృత్యంలో యింకేదో కదలుతోంది. ఇది నా పరిశీలనద్వారా నేను గ్రహించిన విషయం. యీ సంప్రదాయం కాక వేరు సంప్రదాయాన్ని కోరుతున్న లక్షణాలు కానవస్తున్నాయి.

నా హోటలుకు వెళ్ళేదారి-రద్దీఅయిన రహదారి-'కిలిందినీరోడ్డు.' చక్కటి తోరణాలు కట్టివున్నాయి—రాకుమారి మార్గరెటుకు స్వాగతం పల్కడానికి. ఏనుగుదంతాలవలె లోహంతో చేసిన రెండు దంతాలు యిలా తోరణంలా అమర్చబడ్డాయి. ఆఫ్రికాలో ఎక్కడా యింతపెద్ద దంతాలున్న నిజం ఏనుగులు వుండవు. (ప్రపంచంలోకంతా పెద్దదైన దంతం బ్రిటిషు మ్యూజియంలోవుంది. దీన్ని అర్ధ శతాబ్దిక్రిందట కొన్నారు. దీని విలువ మూడువందల ఏభైపౌన్లు. దీని పొడుగు పది అడుగుల రెండున్నర అంగుళాలు. దీని పరిధి ఇరవై నాలుగున్నర అంగుళాలు. దీని బరువు రెండువందల ఇరవై ఆరున్నర పౌనులు.) ఈ తోరణంక్రిందుగా బస్సులు, లారీలు, ఎండలో తళతళ మెరుస్తున్న బ్రిటిషు అమెరికను కారుల బారులు. ఇదంతా దంతపు వర్తకమే! నిస్సందేహంగా ఆఫ్రికాలో యూరోపియను ఆసక్తికి చిహ్నాలే యీ దంతాలు.

అప్పట్లో 'ఫోర్టుజిసస్' అని పోర్చుగీసులు పిలిచే అరబు ఓడరేవు ప్రాంతానికి నడిచాను నేను. నా హోటలునుండి తొలిసారి నడిచిన దారి యిదే. నియాలి వంతెన దాటి ఫ్రీటౌను చేరాను నేను. యీ వూరు స్వేచ్ఛ పొందిన బానిసల నివాసస్థలం. అప్పటికి యింకా పల్లెప్రాంతంగావున్న

యీ ప్రాంతం మొంబాసా కేంద్రానికి దగ్గిరలోనే వుంది. దీన్ని సుమారు డెబ్బయి సంవత్సరాల క్రిందట మిషనరీలు నెలకొల్పారు. వ-యవో, వ - మకొండె, వ - మకువ, వ - మవెర మొదలైన దక్షిణ టాంగన్యికా దూరపు ప్రాంతాలనుండే బానిసలను సేకరించేవారు. పోర్చుగీసుల హయాం క్రిందనున్న యీస్టాఫ్రికా, న్యాసాలాండ్, రువాండ-ఉరుండి, బెల్జియన్ కాంగో ప్రాంతాలనుండికూడ వీరు వస్తూండేవా౹౹. స్వేచ్ఛను పొందిన బానిసల సంతతివారు యిప్పటికీ యీ ఫ్రీటౌనులో నివసిస్తున్నా వీరు పైవారుగానే గణుతికెక్కారు మొంబాసాలో. వీరు కోస్తాప్రాంతపు ప్రభుత్వ సహాయంపొందే మిషనుస్కూళ్లలో నేర్పే కిస్వహిలి మాట్లాడినా, క్రిష్టి యను మిషనులో శక్తివంతులైనాకూడా వీరు విదేశీయులుగానే చూడబడు తున్నారు. న్యూయార్కులో, లండన్‌లో పోర్టొరికన్, జామికన్ నిర్వా సులు ఎలా చూడబడుతున్నారో అలాంటిదే జ్ఞప్తికి తెచ్చే జీవితాన్ని ఆఫ్రికను గడ్డమీదనే వీరు సాగిస్తున్నారనడం సత్యదూరంకాదు. చట్టం చేసినంత మాత్రాన వానిసలు స్వేచ్ఛాజీవులుగా మారిపోలేరని అందరికీ చాటుతున్నారు వీరు. కలం బలం ఎంతదైనా అంతకంటె శక్తిమంత మైనది కావాలి వీరి జీవితం మామూలుగా మారటానికి.

త్వరితగతిని అంతరించి పోతున్న మిజిచెంద మాతృవర్గ సంప్ర దాయం, గిరియామా సంప్రదాయ సిద్ధమైన దుస్తులు - వీటికంటే క్షీణంగా బానిసగుర్తులు మొంబాసాలో కన్పిస్తున్నాయి.

దంతమూ - బానిసవర్తకమూ మానవ జీవితానుభవంలో ఎంతటి చిత్రమైనవి-రెండూ కవలలవలె .. ఈస్టాఫ్రికాలో ఈ కవలల విషయంలో పాపిష్టిదృష్టీ, ఆసక్తితోకూడిన స్తుత్రాకూడా కన్పిస్తూ వుంటాయి. తెగల వారి సాంప్రదాయం యిలాంటి కవలలను హతమార్చేది కదా ? ఎక్కడి నుండి వచ్చారు వీరు ? ఈ దేశాన్ని ఏం చేశారు వీరు ? పైకి తెలియని కారణాల ఆధారంగా వ్యాపించే అంటు వ్యాధిలాగా యీ బానిసత్వం అన్నది యీస్టాఫ్రికా కోస్తాప్రాంతంలో ఆలస్యంగానే తలయెత్తింది. ఉపద్రవంగా శీఘ్రగతిని యిది వ్యాప్తిచెందింది. పద్దెనిమిది, పందొమ్మిది శతాబ్దాల చివరి భాగంలో యీ తీవ్రతకి కారణం ఏమైవుంటుంది?

ఆఫ్రికా పశ్చిమ తీరంలో అట్లాంటిక్ కోస్తా ప్రాంతంలో పరిస్థితులు పైదానికి విభిన్నంగా వున్నాయి. అమెరికాకు ఎదురుగా వున్న యీ ప్రాంతంలో క్షమింపరానిదే అయినా, యీ బానిసత్వం అన్నది సులభంగా ఎందుకు పాదుకుందో అర్థం చేసుకోవచ్చు. ఉష్ణప్రదేశాలలో శీఘ్రగతిలో పెరిగిపోతున్న తోటలలో చవుకలో కూలీలు దొరకడానికి యిదొక మార్గం. అమెరికాలోనే వున్న యిండియనులు అంతగా పనికిరారు. ఇలాంటి కూలి పని వారికి హీనంగా తోస్తుంది. లేదా శారీరకంగా వారీ తోటల మోటు పనులలో నిలదొక్కుకోలేరు. అందుకే పశ్చిమ ఆఫ్రికా కోస్తాల నుండి ఓడల కొద్దీ బానిసలు అమెరికాలకు ఎగుమతి కాజొచ్చారు. అంగోలానుంచి పోర్చుగీసు బిషప్పుల దీవనలతోటో, లేకుంటే ఆఫ్రికా పశ్చిమ తీరంలో యూరోపియన్ పునాదులు గట్టిగా ఏర్పడ్డ ప్రాంతంనుంచో వీరు వెళ్ళేవారు. ఇలా వెళ్లినవారి సంఖ్య ఎంత ఎక్కువ అంటే యీ నాడు వారి సంఖ్య దరిదాపు పదుల మిలియన్లు దాటిపోతూంది. అమెరికను సముద్ర తీరపు దీవులను మినహాయించి ఆఫ్రికను తెగల సంతతివారు యింత పెద్ద సంఖ్యలో ఏ యితర ప్రాంతాలలోనూ లేరు. పద్దెనిమిది, పందొమ్మిది శతాబ్దులలో బానిసలు సరఫరా అయిన ఆసియను దేశాలలోకెల్ల పైచేయి అమెరికాదే మరి. నీగ్రో శారీరకమైన పోలికలు కలిగిన జాతులకి ఒక్క అరేబియాలోనే ఎక్కువ కన్పిస్తుంది, ఇక్కడైనా, యింట్లో పనులకని పైనుంచి బానిసలను కొనుక్కోగల స్తోమత కల వారిలోనే యీపోలికలు కన్పిస్తాయి.

ఆఫ్రికా పశ్చిమ కోస్తా పక్కల బానిస వర్తకం సులభంగా యిలా ఆర్థిక కారణాల దృష్ట్యా అర్థం చేసుకోవచ్చు. కాని, తూర్పు ప్రాంతంలో పెరిగిన బానిస సమస్యకి అర్థం చెప్పుకోవడం అంత సులభం కాదు. అమెరికాలో నివాసాలు ఏర్పరచుకొన్న శ్వేతజాతులవారికి వలె చౌకలో కూలీనాలీ యీ ప్రాంతపు దేశీయులైన అరబ్బులకి, టర్కులకి, బ్రిటిషు వారికి అంతగా అవసరం లేదు. నిజానికి బానిసలను పట్టడం, అమ్మడం అన్న వ్యాపారం ముఖ్యంగా తూర్పున సాగించినవారు అరబ్బులు కాని యూరోపియనులు కారు. కాని మళ్ళీ దీన్లోను ఇంకో విపరీతం అడ్డొ

స్తుంది. అరబ్బులలోకూడా బానిసల వ్యాపారం పాత సంప్రదాయం కానే కాదు; వేయి సంవత్సరాలనుంచి ఇక్కడే వుంటూన్న అరబ్బులు బానిస వ్యాపారంలో ఏమీ కుతూహలం కనుపరచనే లేదు; కాని, హఠాత్తుగా పందొమ్మిదో శతాబ్ది ప్రారంభంలో ప్రారంభించారు. దీని ఉధృతం ఎంతగా వుండేదంటే లివింగ్‌స్టన్ ప్రభృతులు బానిస వ్యాపార నిర్మూలనకు పాటు పడి, దండయాత్రలు చేయవలసి వచ్చింది. పూర్వంలో కొద్ది కొద్దిగా లభ్యం అయే తుపాకులూ మొదలైన మందు గుండు సామానుల సరఫరా పై యీ బానిసలను పట్టుకోవడం ఆధారపడి వుండేది. రాత్రి వేళలలో పల్లెలను చుట్టుముట్టి యిళ్ళకు నిప్పు పెట్టి పల్లెవాసులను భయ విభ్రాంతు లను చేసేవారు. ధైర్యసాహసాలు కలవారిని కాల్చేసేవారు. మిగిలిన వారిని మార దూరంగా, సముద్రం ఒడ్డుకి తీసుకు వచ్చేసేవారు అక్కడ తగు జాగ్రత్తలు తీసుకుని బజార్లలో బానిసలను అమ్మేవారు. అక్కడి నుంచి ఈ బానిసలు పారిపోవడానికి కూడా అవకాశం వుండేది కాదు. టాంగన్యికాలో జర్మను ప్రభుత్వం క్రింద, తరువాత బ్రిటిషు పాలనక్రింద కూడా బానిస బజారులు ఎలా వుండేవో చూసిన ఒక బెలూచీ కార్పొరల్‌గారు నాకు చెప్పారు. ఈ కార్పొరల్ మొదటి ప్రపంచయుద్ధంలో పాల్గొన్న వ్యక్తి. స్త్రీలకి అరబ్బులు యిచ్చే ధర వారి వక్షోజాల పరిమాణాన్ని, ఆకా రాన్నీ పట్టి వుండేదట. అరబ్బులు పద్దెనిమిదో శతాబ్దానికి పూర్వమే బాని సలని యింటిపనికి అని కొనుక్కునేవారు. కాని, తరువాత యీ వర్తక పరిమాణం విపరీతంగా పెరిగింది.

హఠాత్తుగా యింత విపరీతంగా అరబ్ బానిస వ్యాపారం ఎందుకు పెరిగిందో తెలుసుకోగలిగిన నాడు యీ వ్యాపారం ఆఫ్రికాలోనే ఎందుకు ప్రారంభం అయి నిలిచిందో కూడా తెలిసిపోతుంది.

సిలోన్, దక్షిణ భారత పశ్చిమ తీరాలలో పూర్వంలోనే అరబ్బులు వ్యాపారంచేసి, స్థావరాలు ఏర్పరచుకున్నారు. మహమద్‌కు కూడా పూర్వం అంటే ఆరేడు శతాబ్దులలోనే అరబ్బు వ్యాపారస్థులు కేరళని, లంకని చేరుకున్నారు. స్థానిక వనితలూ, యీ కొత్తవారూ వైవాహిక బంధాలు ఏర్పాటు చేసుకోవడంతో ఎన్నో ముస్లిమ్ కులాలు తలెత్తాయి. కేరళలో

మాతృవర్గ సంప్రదాయాన్ని కొంతగా పాటించే మళయాళపు 'మాపిల్లాస్', సిలోన్‌లో సింగళీలు, తమిళం మాట్లాడే మూర్స్, లక్కాదీవులు - మాల్ దీవులలోని ద్వీపవాసులూ మాతృభాషల కలయిక కలిగిన ఒక తెగను నెలకొల్పారు. ద్రవిడియన్, మళయాళం, తమిళం, ఇండో - యూరోపియన్, సింగళీస్ మరియు సెమెటిక్ అరబ్బు కలిపినవివి. ఓమాన్, మస్కట్, హద్రమత్ అరబ్బులు యీస్టాఫ్రికాలో పదకొండు వందల సంవత్సరాలుగా ప్రాముఖ్యం వహించి వుండేవారు. యీరోజువరకూ వీరు తమ సంప్రదాయ సిద్ధమైన పడవలు (ధౌస్) వేసుకొని దక్షిణ భారత పశ్చిమ తీరంలో వ్యాపారం సాగిస్తూనే వున్నారు.

ఇంత సన్నిహిత సంబంధాలు వుండి, ఎంతో అవకాశం వుండి కూడ అరబ్బులు తమ బానిసలని అరేబియా సముద్రానికి ఆసియా పక్కనుండి, ఇండియానుంచి, సిలోన్‌నుండి కొనుక్కోనేలేదు. ఇక్కడ కుల మతతత్వాలు, అంటరానితనం, వ్యవసాయ పద్ధతిలో వెట్టి చాకిరీపద్ధతి యివన్నీ ఉండబట్టి కూడ బానిసలని పట్టుకోవడం అన్నది-కనీసం బ్రిటిషు పరిపాలనకిముందు రోజులలోనైనా-సులభతరం అయేది. కాని ఆఫ్రికాలో లోనికి చొచ్చుకుపోయి, కష్టతరమైన పద్ధతిలో బానిసలని పట్టుకోవడానికే అలవాటు పడ్డారు అరబ్బులు. ఎందుకో మరి?

బహుశా దీనికి కారణం ఆఫ్రికా ప్రజల మనస్తత్వంమీదా, శారీరక తత్వంమీదా ఆధారపడి వుందా? ఇతరులు వీరిని బానిసలుగా చేయడానికి యిదేదైనా కారణమా?

మొంబాసాలో ఏక్షణాన కొత్త ఆఫ్రికను ముఖం కనపడ్డా నాలో యీ ప్రశ్న పెరుగుతూ వచ్చింది. ఈ వీధులలో ఆఫ్రికను ముఖాలుతప్పించి యింకేం కనిపించడానికీ అవకాశంలేదు. మొత్తం యీస్టాఫ్రికాలో ఉన్న పెద్ద హార్బర్లు రెంటిలో మొంబాసా ఒకటి. రెండోది టాంగన్యికాలోని 'డారెసలామ్'. కాని అలా కాలేదు. వ్యాపార కేంద్రం అయిన కిలిందిరోడ్డు ప్రాంతంలో ఉదయం, మధ్యాహ్నం అంతా కలిపి అక్కడక్కడ ఆఫ్రికను ముఖం కన్పించిందేగాని, యూరోపియన్ ఆసియన్ ముఖాలే ఎక్కువ. సూర్యాస్తమయం అయాక ఈ రెండు కులాల

వారూ క్లబ్బులకీ, యిళ్ళకీ వెళ్ళిపోయాకనే ఆఫ్రికనుల సంఖ్య అధికం అవుతూ వస్తుంది. అప్పుడుకూడా దూర ప్రాంతాలనుంచి వచ్చినవారే అధికంగాని కెన్యా ప్రాంతీయులు మాత్రం తక్కువే. నా హోటలు రూం బోయ్ న్యాసాలాండు వాసి ము-బెంబ తెగవాడు; భోజనశాలలో వాడు ఉత్తర కెన్యావాసి 'లువో' తెగవాడు; జోళ్ళకొట్టులో అమ్మాయి కిస్వహిలి కంటె ఇంగ్లీషే బాగా మాట్లాడింది. ఆమె ఉగాండవాసి. విక్టోరియా సరస్సు, ఉత్తర దేశంలో ప్రాంతీయ భాషగా కిస్వహిలి అంత ఎక్కువగా అమలులో లేదు. దీనికి కారణం—అరబ్బుతో పరిచయం ఎక్కువగా లేదు. అరబ్బులు యింతకు ముందీ ప్రాంతాలకు రానేలేదు. బానిసలను పట్టుకుందుకు రావడమే వీరి రాకలకు ప్రారంభం నేను అతిథిగా వున్న ఒక కుటుంబంలో పిల్లలను చూసుకునే దాది బురుండినుంచి వచ్చింది-దరిదాపు బెల్జియను ఆధ్వర్యంక్రింద నున్న 'రువాండా-ఉరుండి' నుంచి వచ్చింది. ఓ ఆఫీసులో గుమస్తా సొమాలి ఇంకోడు జాంజిబారునుండి వచ్చిన అరబ్బు. ఇతను ఆఫ్రికనులా కన్పించాడు. యూదోవ్యక్తి కాంగో నుంచి వచ్చాడు. ఇంగ్లీషుకంటె ఫ్రెంచిభాష బాగా సులభంగా మాట్లాడినాడు. మొంబాసాలోని ఆఫ్రికనులు అరబ్బు బానిస వ్యాపారం ఎంతదూరం విస్తరించుకుని వుందో అన్ని ప్రదేశాలనుంచీ వచ్చిన జాతులవారి మిశ్రమంగా తోస్తారు. ఇంతమందిలోనూ ఏ ఒక్కటైనా లక్షణంగాని, పైకి తెలియని నడవడి రీతిగాని వుందా.—వీరిలా బానిసలుగా లొంగిపోదానికి ?

శారీరకంగా యీ ఆఫ్రికను లందరూ ఒక్కటిగా తెలిపేది వుంది. అదే వారి శరీరాలతీరు. దక్షిణ ఆసియావాసుల కంటె వీరు వూలువంటి జుట్టు, నల్లని చర్మం రంగు, శారీరకంగా దృఢత్వం, వెడల్పాటి భుజాలు, దీర్ఘాలైన కాళ్లు, కండపుష్టి కలిగివుంటారు. ఎక్కువగా లావెక్కిపోయే లక్షణంకూడాలేదు వీరిలో. ఇదంతా మన ప్రశ్నకి సమాధానం యివ్వలేదు. శరీర సౌష్ఠవం, కండపుష్టి బానిస వ్యాపారుల దృష్టిని ఆకర్షించినా వీరిని బానిసలుగా పట్టుకోవడం అనేది కష్టతరం చేసేదికదా! ఇండియాలో, సింహళంలో బానిసలని కొనుక్కోవడం సులభతరం అయినప్పుడు అరబ్బు లింత కష్టపడి యిక్కడెందుకు నాపత్రియ పడుతారు ?

శరీర సౌష్ఠవం ఒక కారణంగా చూసుకోవచ్చు. అందమైన ఆడ దాన్ని పట్టుకుంటే ఎంతో ఖరీదు ముట్టేది. ఇలా రానురాను పెళ్ళి వయస్సులో పిల్లలు దొరకడమే అరుదయిపోతూ వచ్చిందనీ, దీనితో స్వేచ్ఛగా వున్న వారిలో వధువు సుంకం-ఓలి అనేది విపరీతంగా పెరిగిపోయిందనీ అంటారు. సహారా దక్షిణ ప్రాంతంలోని ఆఫ్రికాలో యీ వధువు ధర విపరీతంగా హెచ్చిపోయింది.

అయితే - ఆఫ్రికను స్త్రీలనే బానిసలుగా ఎందుకు పట్టుకోవలసి వచ్చింది? దక్షిణాసియాలో ఎంతో సులభంగా వారికే అవకాశం వుంది కదా!

ఈ ప్రశ్న నాతోపాటు తెల్లజాతుల నివాస స్థలాలన్నీ ప్రయాణించింది. (మొన్నమొన్న మావ్‌మావ్ తిరుగుబాటు అణచివేసిన కెన్యాలో యూరోపియన్ నివాసుల స్థలంయిది.) మకరెరె యూనివర్శిటీ కాలేజీ చేరేదాకా నాలో యీ ప్రశ్న కదలుతూనే వుంది. ఈ కాలేజీ కంపాలాలో రైల్వేలైను చివరగావుంది. ఈ రైలుదారిని బ్రిటిషువారు 1901 లో మొంబాసా ఉగండాలను కలుపుతూ కట్టారు. పూర్వంలో అయితే కాలి ప్రయాణం. సామానులు మోస్తూ కూలివాళ్ళతోసహా నడవవలసి వచ్చేది. ఎన్నో వారాలు పట్టేది. ఇప్పట్లో యీ ప్రయాణం రెండు రాత్రులూ, ఒక పగలూ పడుతుంది రైలుమీద అయితే. ఏరోప్లేనుమీద అయితే కొద్ది గంటలు మాత్రమే పడుతుంది.

మకరెరె కాలేజి యీస్టాఫ్రికాకు అక్కపట్టు వంటిది. దీనిలో చాలా భాగం ఆఫ్రికను,అరబు విద్యార్థులే. ఆసియనులు చాలా తక్కువ, యూరోపియన్ విద్యార్థులు మరీ తక్కువ. ఈ కాలేజీలో సాంఘిక పరిశోధనాశాఖ డైరెక్టరు మిస్టర్ అయిడన్‌సదాల్. నేను అక్కడకు చేరిన రోజునే ఉగండా క్లబ్బుకి భోజనానికి తీసుకువెళ్లారు. ప్రశాంతమైన స్థలంలో విశాలమైన భవనంలోవుంది ఈ క్లబ్బు. చుట్టూ చెట్లు వెంగిలా మెరుస్తున్న గచ్చు నేల మీదా, చక్కనిపూల మళ్లమీదా వింత వింత నీడలు పరుస్తున్నాయి. అడ్డదిడ్డంగా పెరిగిపోతున్న టౌనంతా ఈ చోటునుంచి చక్కగా కన్పిస్తుంది. ఏమాత్రం ఎబ్బెట్టుగా అనిపించని యీ ప్రశాంతమైన వాతావరణంలో

ముఖ్యమైన మూడు కులాలవారు - ఆఫ్రికనులు, ఆసియనులు, యూరోపి యనులు-యిక్కడ కలుసుకుంటారు. యీ స్టాఫ్రికాలో ఆసియన్ అనగానే భారతీయ, లేక పాకిస్తానీ అని అర్ధం చెప్పుకోవచ్చు. ఆలాగే యూరోపియన్ అనగానే సాధారణంగా బ్రిటిష్ అని అర్థం చెప్పుకున్నా అప్పుడప్పుడు అమెరికనులనుకూడా కలుపుకొనవచ్చు. ఆఫ్రికనులు యింకా 'కబక' దర్బారు తత్వానికే సన్నిహితులుగా వుంటున్నట్లు తోస్తుంది. బ్రిటిషు కాలంలో యిండియాలోని చిన్నిచిన్ని రాజదర్బారులు జ్ఞప్తికి వచ్చాయి నాకు. హెచ్చుతగ్గులు చూపెట్టుకోకుండా అందరూ అందర్నీ గౌరవంగానే చూసు కొంటారు క్లబ్బుల్లో. ఈ పరిస్థితి స్వాతంత్ర్యం రాకపూర్వం భారతదేశంలో పరిస్థితికంటే మెరుగే అనిపించింది నాకు. చక్కని ఆంగ్లేయ పద్ధతి గౌను లలో అతి మర్యాదగా ప్రవర్తించే ఆఫ్రికను మహిళలూ, ముదురు నీలం, ముదురు గోధుమవర్ణపు సూట్లుధరించి అతి ఖాతంగా కన్పించే ఆఫ్రికను పురుషులూ——ఏదో, బానిసలుగా చేయబడ్డానికే అన్ని లక్షణాలు కలిగి వున్నారా వీరు అనిపిస్తుంది. ఈ ఆలోచన చాలు అందరూ నవ్వుకోడానికి. అయినాకూడా నేను బానిసలను గురించీ, దంతాలను గురించీ, మొంబాసా లోని యీ కవలలను గురించీ ఆలోచిస్తూనే వున్నాను.

"బానిస వ్యాపారమూ, దంతాల వ్యాపారమూ రెండూ కలిసే విస్త రించాయి యీస్టాఫ్రికాలో" అన్నారు మా యింటాయిన. మా ఆలోచనలన్నీ పైకి వచ్చిన ఫలితమే యీ పై మాటలు. ఆయన యీ రెండూ ఎలాగ పెరిగాయో వివరించి చెప్తూవుంటే ఎంతో ఆసక్తితో విన్నాను.

దంతం బరువుగానూ, స్థూలంగా కూడా వుంటుంది. ఉత్తరంగా దేశంలోపలికి చొచ్చుకుని పోయి ఎంతో దూరాలనుంచి దంతాన్ని తేవాలి. అక్కడే మంచి వేటకు తావుంది. అంత దూరంనుంచి దీన్ని సముద్ర తీరపు రేవులకు తెచ్చి ఎగుమతి చేస్తేకాని డబ్బురాదు. అందుకు యూరో పునకు యీ దంతం ఎగుమతి చేయాలి. మనుషులే యీ పని అంతా చేయ వలసి వుండేది. జంతువులచేత యీ పని చేయించడానికి విషపుటీగ- సెట్సె యీగ (Tse-tse fly) వీలు లేకుండా చేసింది. అదీ కాకుండా ఎడారులూ, బురదనేలలూ పనిని కష్టతరం చేసేవి. వీటిమూలాన్ని చక్రాల

బండ్లు కాని, రోడ్డు నిర్మాణం కాని ఆఫ్రికాలో కొనసాగడానికి వీలు పడ లేదు. అందుకే చుట్టుపక్కల దేశాలలో యివన్నీ చాలా కాలంగా ఉపయోగంలో వున్నా, యీ దేశాలతో సంబంధ బాంధవ్యాలున్నా కూడా ఆఫ్రికాలో వాటికి స్థానం చిక్కలేదు.

విక్టోరియా రాణి రోజులనాటి యూరపులో బిలియర్డ్సు ఆట ప్రాముఖ్యం వహించింది. దీనితో దంతానికి గిరాకీ హెచ్చింది. దాంతో దంతం ఎక్కువగా తెచ్చేవాళ్ళకి కూడా కోస్తా పొడుగునా గిరాకీ హెచ్చింది. మారు మూలలకు పోయి ఏనుగులు గుంపులుగా వుండే స్థలాలు వెదకి, ఎక్కువ దంతాన్ని తెచ్చేటందుకు కూలివాళ్ళకి కూడా గిరాకీ హెచ్చింది. న్యాయంగా ముక్కూ ముఖం తెలియని చోట్లకి పోయి దంతాలు మోసుకుని దూరప్రాంతాల రేవులకి పోవడానికి ఏ ఆఫ్రికనువ్యక్తీ ఒప్పుకోడు. అక్కడ తన భాష మాట్లాడే వాళ్ళుండరు. అనవసరంగా తన తెగకు దూరం కావాలి. కాని, ఏది ఎలా వున్నా కూలివాళ్ళు కావాలి. దానికి బానిసలని పట్టుకోవడం ఒక్కటే దారి. బలవంతాన్న తీసుక పోయాక తీరంనుంచి యీ బానిసలని తిరిగి తీసుకువచ్చే కంటె అక్కడ అమ్మేయడమే సులభంగా తోచింది వ్యాపారస్థులకి. తిరిగి వాళ్ళనే దంతాలు తేడానికని తీసుకువస్తే తమ వాళ్ళంతా దగ్గరలోనే వున్న యీ చోటులో తప్పించుకు పోవడానికి ప్రయత్నించవచ్చు; అంత అవస్థ పడేకంటే తీసుకుపోయినవారిని అమ్మేసి కావలిస్తే కొత్తవాళ్ళని పట్టుకోవచ్చు;

అవకాశం, లేకపోతే భూతాలు అన్నవి వ్యాపారస్థుల పాలిట త్రోసేవి ఈ ఆఫ్రికనులని. అదే కాలంలో రీయూనియన్, మారిషస్, సెచెలీ ద్వీపాలలో ఫ్రెంచివారు వలసపోయి స్థావరాలు ఏర్పరచుకున్నారు. అక్కడ అవసరాలకని నౌకలో కూలీలు కావలసివచ్చారు. అమెరికాలోకంటే యీ వలసవారి అవసరా లంత అధికం కాకపోయినా వ్యాపార సరళిలో బానిసలకి విలువ పెరిగింది యీ పరిస్థితివల్ల. అరబ్బు స్వంత అవసరాలకై సాగించిన బానిస వ్యాపారానికి దీనికీ అట్టే సంబంధము లేదు.

అరబ్బులు వాస్తవిక దృష్టి కలవారు. సూక్ష్మమైన వ్యాపారదృష్టి కల కొందరు, బానిసల వ్యాపారం పెంచవచ్చునన్న వూహ కల్గి, తమ

స్వంత వ్యాపారానికి తోడు దాన్నికూడ చేర్చుకున్నారు. ఇస్లాము చట్టం ప్రకారం బానిస స్త్రీ అయితే, తన యజమానికి ఒక బిడ్డను కనుక కన్నట్టయితే స్వేచ్ఛ లభించాలి ఆమెకి. దీన్ని సర్వ సాధారణంగా అందరు అరబ్బులూ పాటిస్తారు – ఎక్కడో కఠినులైన వారు తప్పించి. అందరూ కాకపోయినా చాలామంది ఈస్టాఫ్రికాలోని బానిస వ్యాపారస్థులు అరబ్బులే. అంత మాత్రం చేత యిక్కడి అరబ్బులందరూ యిదే వ్యాపారం చేస్తారని కాదు అర్థం. ఇండో-ఆఫ్రికన్ సంబంధ గ్రంథవ్య రికార్డులలో యీ విషయం ఎందుచేత వదిలిపెట్టబడింది? జాంజిబార్‌లోని అరబ్బులు, కోస్తా పొడుగునా వున్నవారూ చక్కని వ్యాపారదృష్టి కలవారు; కొబ్బరి తోపులూ అవీ పెంచి వ్యాపారం చేసేవారు. నిజానికి అరబ్బులకు, ఆఫ్రికనులకు నేడున్న మంచి పలుకుబడికి కారకులు వీరే. ఇటువంటి సహృదయత పెంపొందడానికి ఎక్కువగా, తరుచుగా, అంతర్వివాహాలు జరుగుతూ వుండాలి. ఇలా జరగడానికి చక్కని అవకాశాన్ని యిచ్చేదే – దక్షిణ టాంగన్యికాలోని మికిందాని అఖాతం. ఇక్కడ అంతా బంటూ మాట్లాడే వారిలో యావో తెగవారే. వీరిలో చాలామటుకు మాతృవర్గ సంప్రదాయాన్ని అనుసరించేవారే. కాకుంటే, వివాహరీత్యా గాని, యితరత్రా గాని ఆ ప్రాంతానికి చెందినవారే. వ-యావో కాకుండా వ-మకొండె, వ-మవిహ, వ-మపెర తెగలవారు కూడా లిండి జిల్లాలో నున్నారు. వ-మకొండె మహిళలు పెదవులకు బిరడాలు పెట్టుకుంటారు. (చెవులు మనం చెవులు కుట్టించుకున్నట్టే కుట్టించుకుని బిరడాలు పెడతారు – ఆ కన్నాలు పెద్దవి కావడానికి) ఈ సంప్రదాయం యీనాడు కానరావడంలేదు. వ-మవిహ తెగలవారు నుదురుమీదా, గడ్డంమీదా అడ్డదిడ్డంగా పచ్చబొట్లు పొడిపించు కుంటారు.

మికిందానిలో నాకవసరం అయినదంతా అరబ్బులకీ, మాతృవర్గ సంప్రదాయాన్ని అనుసరించే ఆఫ్రికను తెగలకీ సమన్వయం కుదిరే పరిస్థితే. బ్రిటిషు యీస్టాఫ్రికాలో మాతృవర్గ సంప్రదాయాన్ని అనుసరించే తెగలను గురించి పరిశీలించడానికి మంచి స్థావరం ఏదని నిర్ణయించుకొని పని ప్రారంభించాలి నేను.

మకొండె పీఠభూమిమీది తెగలను పరిశోధించడం బాగుంటుందని మిస్టర్ అయిడన్ సదాల్ అభిప్రాయపడ్డారు. అలాగే కొద్ది సంవత్సరాల క్రితం యీ పీఠభూమిమీది తెగలలో మాతృవర్గ సంప్రదాయపు టలవాట్లని పరిశోధించిన డాక్టర్ ఏటీలే కూడా అలాగే అభిప్రాయపడ్డారు. 'మకొండె వాటర్ కార్పొరేషన్' అప్పట్లో విప్లవాత్మకమైన మార్పును తీసుకు వస్తూంది. యీ పీఠభూమిలోని నివాసులలో ప్రభుత్వం తలపెట్టిన యీ కార్పొరేషను త్రాగడానికి పనికివచ్చే నీటిని క్రిందనుంచి పీఠభూమిమీదికి సరఫరా చేస్తుంది. ఈ పై భాగం పొడారిపోయి యిసుక పర్రగా వుంటుంది. ఏప్రెలు నుండి అక్టోబరువరకు సాగే దీర్ఘమైన ఎండాకాలంలో నీటికని ఆధారపడ్డానికి ఊటలుగాని, కనీసం చిన్న చెలువులుగాని యీ పీఠభూమిమీద లేవు. వర్షాలు లేని పక్షంలో త్రాగే నీరు మూరాన్నుంచి సమభూములలోంచి భుజాలమీదా, కావిళ్ళలోనూ మోసుకురావలసి వచ్చేది. ఇది చాలా ప్రయాసతో కూడుకొన్న పని. వదునైన రాతి గుట్టలు ఎక్కుతూ దిగుతూ తేవలసి వచ్చేది. కాని వర్షాకాలంలో మటుకు పీఠభూమి మీది ఫలవంతమైన నేల జనాభా పోషణకి తగినంత పండేది. ఈ జనాభా క్రిందటి లెక్కలకీ, యీ నాటికీ మధ్య మూడురెట్లవరకూ పెరిగింది.

మకొండె నీటి సరఫరా కార్పొరేషను ప్రస్తుతం విస్తృతం అయిన తన పనిని ప్రారంభించింది. దీనివల్ల ప్రారంభం అయ్యే సాంఘికమైన మార్పులు పరిశీలించడానికి యిదే సరియైన సమయంగా తోస్తుంది. ఇది కూడా కుతూహలాన్ని రేకెత్తించే విషయమే మరి.

అందుకే యిక్కడే నా పనికి నాంది పలికాను. యీ సంస్థ లైబ్రరీ నివాస స్థలాలకి అభిముఖంగా, ఆకుపచ్చని బయళ్లు, అక్కడక్కడ చెట్లతో ఆఫ్రికను పార్కు భూమిపద్ధతిలో వుండి చూడడానికి ఆహ్లాదకరంగా వుంటుంది. క్రిందకు జారిపోతున్నట్టుండే విశాలమైన భూభాగం నుండి రక రకాల పిట్టలు వచ్చి వాలుతాయి. యీ సంస్థలోనే మకాంగా వుండిపోతే పరిశోధక యాత్రకై సిద్ధంగా వున్న కారవాన్‌లో వున్నట్టు వుంటుం దనిపించింది నాకు. ఆఫ్రికను ప్రకృతిని తిలకిస్తూ, వింటూ, అనుభవిస్తూ, చిన్న వంటగదిలో సులభమైన పద్ధతిని భోజనం

తయారుచేసుకుని, ఎలెక్ట్రిక్ బొయిల్సగ వేణ్ణీళ్ళు కాచుకోవచ్చు. ప్రతి యింటి భాగంలోనూ స్నానాల గదిలో యీ సౌకర్యం అమర్చబడి వుంటుంది. మొదటి అంతస్తు సిమెంటు కాంక్రీటు స్తంభాలమీద కట్టడం వల్ల కారులు పెట్టుకుందుకు నీడగా వుంటుంది క్రింద. కట్టడాల పద్ధతి కూడా చుట్టూ వున్న పరిస్థితులకి, పరిసరాలకి అనుగుణంగా, ఆలోచించి కట్టబడింది. అందుకే ప్రతీదీ అందంగానూ, ఉపయోగకరంగానూ కూడా వుంటుంది. నిజంగా దీన్ని కట్టిన డాక్టర్ ఆడ్రీ ఐ. రిచర్డ్సుకి యిది జ్ఞాపక చిహ్నం అనదగిన కట్టడం. ఇది సృష్టించడానికి పూర్వమే - యీమె 1934 లో 'బంటూ తెగలలో తల్లి హక్కు' అన్న విషయంపై పుస్తకం ప్రచురించింది. అంతే కాకుండా, 'మాతృవంశ సంప్రదాయపు విభాగం - బెల్టు' అన్న విషయంపై ఎన్నో వ్యాసాలు రచించింది. వాటిలో ముఖ్యంగా పేర్కొనదగినది ఉత్తర రొడీషియాలోని బెంబాలను గురించినది. యీ తెగలు మాతృవంశ సంప్రదాయాన్ని అనుసరించే దక్షిణ టాంగన్యీకాలోని వారికి అతి దగ్గిర అయిన వారు. నా బస కెదురు గోడ మీద అందంగా బోగంమల్లి పాకింది. సైప్రెస్ చెట్టు ముచ్చటగా నా బాల్కనీదాకా పెరిగింది. ఇవన్నీ కూడా పీటి కర్త కున్న నేర్పుకీ, ఓర్పుకీ చిహ్నాలుగా చూపారు నాకు. అందమూ అవసరమూ ఎంత నేర్పుతో కలిపిందీమె అనిపించక మానదు.

"తోటపని అంటే ఎంతో యిష్టం. యివి పాతడం అంతా స్వంతంగా ఆమే చేసి వుంటుంది" అనుకున్నాను. నా పనికి యింతకంటే చక్కటి వాతావరణం యింకెక్కడ వుంటుంది?

బాల్కనీమీదికి వున్న అద్దాల కిటికీ రెక్కలలోంచి పక్షుల సంగీతం అరుణోదయం కాకుండానే నా గదిలో ప్రవేశించేది. విక్టోరియా సరస్సు మీద తెరలా పరచుకుని వున్న గోధుమరంగు మంచు తెరలను చీల్చు కుంటూ ఉదారంగు సూర్యకిరణాలు ప్రసరించేవి. ఇదంతా చూస్తూంటే ఆఫ్రికను గుబురులలో ప్రాణం తొణికిసలాడుతూంది అనిపించేది. కొంచెం సేపు యీ పక్షులు యిచ్చే సందేశాన్ని వింటూ వుండేవాణ్ణి. క్షణంగా యీ అరుపులు తిరిగి తిరిగి వినబడుతూనే వుండేవి. ఇది వింటూంటే జైలోఫోన్

సంగీత కచ్చేరీలూ, 'నగోమా' (ngoma) అనబడే డోళ్ళ రొదలాగా వినిపించేది. యీ డోళ్ళని ఉత్తేజకరమైన నాట్యాలు చేసేటప్పుడూ, యౌవనులైన కన్యలనీ, బ్రహ్మచారులనీ సంఘంలోకి ఆహ్వానించే పూజా సమయాల్లోనూ వాయిస్తూ వుంటారు. ఆఖరుకి ఆఫ్రికను కాకి సహితం ఈ వరస తిప్పదు. ఇక్కడ కాకి శరీరం కొంచెం పెద్దది. వెన్నూ, గుండెలూ తెల్లగా వుంటాయి. యూరోపియన్ మాగ్‌పీలా వున్నా తోక పొట్టి ఒళ్ళు కొంచెం స్థూలం దీనికి. దీని అరుపుకి మటుకు యూరోపియను దాని శక్తి లేదు. యిండియను కాకులలాగా అస్తమానూ 'కావాలి, ఏదో కావాలి' అన్న గోలకూడా కనపడదు. దూరదూరంగా వున్నట్టు వినపడే ఆఫ్రికను కాకి లాంటి దేదీ యిదివరలో నన్ను పలకరించలేదు. ఈ కాకి అరుపుకూడా అన్ని పక్షుల అన్ని రకాల ఈలలూ గోలలో ఒక భాగంగా కనిపించింది. ఇక్కడి పక్షులు రంగు రంగులవి. వాటి ముక్కులు, తోకలు, తలమీది కుచ్చులూ రకరకాలవి.

ఈ సంగీతపు కోలాహలం క్షణ క్షణం మారుతున్న ఆకాశపు రంగులతో కలిసి, పరికి అన్నీ వెలుగులో ముంచెత్తినట్లుగా కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతివంతమైన ఆఫ్రికను వెలుగు అలుముకొంటుంది సర్వత్రా. ఈ వెలుగుతో పాటే నాలో ప్రశ్నలు తలెత్తాయి—ఈ ఆఫ్రికను వాతావరణం నాకేం చూపుతుందో? కాలానుగతంగా వస్తూన్న 'చీకటి ఖండాన్నే' నా? ఏదో తెలిసీ తెలియని భయాన్నా? కొత్త అనుభవాలేం ఎదురవుతాయి? నేవిప్పు కొత్త పరిధులు - నే నిదివరలో చూడనివి - కనిపిస్తాయా? ఈ ఉదయం ఆఫ్రికాకే కాక లోకానికే వస్తూన్న కొత్త రోజును సూచించబోతున్న దూలా? కాక, ఇదీ అన్ని ఉదయాలలాంటి సామాన్యమైన సూర్యోదయమేనా? విడివడని చిక్కులాగా యిదీ నిరాశాపూరితమే అవుతుందా?

దంతమూ - దాస్యమూ, పక్షుల సంగీతం, నగోమా డోళ్ళ రొదలు ..ఎన్నో చిక్కుపడ్డ దారాలున్నాయి నా చేతి. వీటిని సవరించాలి; లేకుంటే ఏకంగా చేయాలి.

# 2. వధువూ - ఓలి

మానవ పరిణామ శాస్త్రజ్ఞులను గురించిన పరిశోధన ఇంకా ఎవరూ తలపెట్టలేదు. నిజంగా ఈ పనే కనుక ప్రారంభించితే చాలా ఉత్సాహంగా వుంటుం దనుకుంటాను. మానవమాత్రుల వూహలకు సహితం అందని మానవమేధ లోతులని చవిచూసే అవకాశం లభిస్తుంది.

ప్రపంచంలో మానవుని పట్ల యింత ఆసక్తి కలిగించే ఆ ఆకర్షణ ఏమిటో? అసలు వస్తువైన మనిషేనా? జంతు శాస్త్రజ్ఞుడో, వైజ్ఞానికుడో, వేదాంతో కావలసిన వ్యక్తి మెదడులోని ఏ వికృతపు వంపువల్ల యిలా ఈ మానవ పరిణామ శాస్త్రంవైపు మొగ్గుతాడు? తరువాయిగా ఆ ఒక్క అడుగూ ముందుకు వేసి ఈ శాస్త్రాన్ని చేపట్టాక - ఏ దుష్టగ్రహకూటం ఇత న్నిలా వింతగా ప్రవర్తించేలా చేస్తుందో - ప్రపంచం మొత్తంమీద ఎక్కడ వున్నా క్షణ క్షణానికీ అర్థం లేకుండానూ, మార్గాలు మార్చుకుంటూనూ ఆ అనంతమైన అన్వేషణలో చిక్కుపడి పోతారని గత అర్ధ శతాబ్దిగానూ ప్రఖ్యాతి గాంచారు ఈ మానవ పరిణామ శాస్త్రజ్ఞులు. పైకి కనుపిస్తున్నట్లే వుంటూ అసలు వ్యాఖ్యానానికి లొంగని సాంఘిక వ్యవస్థల లోని తేడాలు ఏమిటి? ఆదర్శా లేమిటి? వాటికి కారకుడైన మానవుని లక్ష్య లక్షణా లేమిటి?

ఎవరేనా ప్రశ్నించవచ్చు: మానవ ప్రవర్తన అన్నది మానవునితో సంబంధం లేని ఏదో పై విషయం అన్నట్లెందుకు ఈ శాస్త్రజ్ఞులు పరిశోధిస్తారు? దీనికి సమాధానం ఒకటే - నిష్పక్షపాతమైన ఒక ముగింపు

కోసం; ఇదే నిజం అయితే, పరిశోధనా పద్ధతీ, విచారణా అస్త్రమానూ ఎందుకు మారుస్తారు? ఈ ధోరణి చూస్తే వంట పనివారూ, కుట్టుపని వారూ జ్ఞాపకం రాక తప్పదు. వీరిది శాస్త్రీయ పరిశోధనా సరళి అనిపించదు.

పూర్వంలో ఎదుటివారి జీవితపద్ధతిలో కుతూహలం కనబరచడం జరిగేది. దానికి కూడా కారణం తమ జీవిత పద్ధతులకు ఎదుటివారిది విభిన్నంగా వుండడమే. తరువాత కొంత కాలానికి - విభిన్న సంస్కృతులని ఒక గతి నుంచి (సనాతనం నుంచి) యింకొక గతికి (అభ్యుదయ పథానికి) పయనించిన విధానం పరిశీలించడం అందరి దృష్టినీ ఆకర్షించింది. ఆ క్షణంలో ప్రతి ఒక్కరికీ 'మూలం' గోచరించినట్టే తోచింది. కాని కొద్ది కాలం గడిచేసరికి ఈ పద్ధతి మారి, కలగలుపు వైవిధ్యం అన్నవి సంస్కృతి పట్ల విస్తృతం అయి, సంస్కృతికి, సంస్కారానికి మూలం ఆర్థిక, సాంఘిక, మతైక విషయాల కట్టుదిట్టమైన కదలికే అన్నదానిమీద నమ్మకం కలగ నారంభించింది.

కాని, సంస్కృతులు, పురాతన సంప్రదాయాలు పుట్టి పెరిగి పెద్దవై నశించి పోవడానికి ఉత్తేజితం అయిన మానవ ఉద్రేకాలేనా కారణం అనిపిస్తుంది. ఏది ఎలా ఉంటేనేం, మానవ కుతూహలం కాని,మానవ భేషజం కాని మానవ పరిణామ శాస్త్రాన్ని ఒక ఫాషనుకు మించిన దాని కంటే గొప్పదిగా చేయలేక పోయింది. వ్యాపారస్థు లేం చేస్తారు? కొత్త రకాలను మార్కెట్టులోకి ప్రవేశపెట్టాలంటే, పాత బట్టలను మార్కెట్టు లోంచి తీసేయాలి. అప్పుడే కదా, తప్పనిసరిగా ప్రజలు కొత్తవాటికై డబ్బు వినియోగం చేస్తారు. అంతమాత్రంచేత అమలులోంచి పోయిన ఫాషను చెడ్డది అనుకో నక్కర లేదు; వచ్చినది పోయిన దానికంటె గొప్పదనీ కాదు. వ్యక్తిగతమైన చావు కంటె బ్రతుకు ముఖ్యమైనదని 'బి' రాజ్యం గుర్తిస్తుంది కనుక 'ఏ' రాజ్యం కంటె 'బి' అభ్యుదయ పథంలో నడుస్తూంది అని నిర్ణయించడం లాంటిదే పై వాదన కూడా. దాన్నంతా చూస్తూంటే వ్యాపారదృష్టి, తగు జాగ్రత్త లేకుండా, తీసుకోకుండా ఎవరూ వ్యాపారంలో గుడ్డిగా దిగరన్నది విశదం అవుతూందిగా?

అలాగే ఒక మానవ పరిణామ శాస్త్రపు భాషను పెండ్లి పెట్టుబడులను పరిశీలించడం. ఆఫ్రికనులలో పశువుల కాపరులలో సనాతనంగా వస్తూన్న ఆచారమే ఇది. దీన్నే తల్లి హక్కు సంప్రదాయపు తెగలవారు కూడా కొత్తగా అమలులోకి తెచ్చారు.

యూరోపియను సంస్కృతి సముద్రాంతరాలలో విస్తరించి మూడు పూవులూ ఆరు కాయలుగా వున్న రోజులలో ఈ శాస్త్రం తప్పటడుగుల నడక ప్రారంభించి, ఆ నాడు యూరోపియను సంస్కృతికి విభిన్నంగా వున్న ప్రతి సంస్కృతినీ, సంఘాలనూ ఆటవికం అనీ, అనాగరికం అనీ తోసి పారేయడం అలవాటైంది. ఓలి పెట్టుబడులు కూడా ఆ రోజుల్లో యిలాగే అపార్థానికి గురి అయి, గుహ మనిషికి ఆడదాన్ని యిష్టం వచ్చినట్టు ఆడించగల హక్కుగా అర్థం చెప్పుకోబడ్డాయి. తన తృష్ణ తీర్చుకోడానికి ఆడదాన్ని ఎలాగా ఈడ్చుకు పోగలడో, తన పొలం మీద పనిపాటలకీ ఆడదాన్ని అలాగే - ఆమె తండ్రికి గాని, యజమానికి గాని డబ్బిచ్చి కొనుక్కున్నాడని చెప్పబడేది. తరువాత ఈ శాస్త్రీయమైన సంజాయిషీకి పునాదులు లేవని తేలింది. ఒక తెగలోనుంచి పెళ్ళికూతుళ్ళు ఎలాగ యింకో తెగకి తరలి వెళ్ళాకో - అలాగే ఆ తెగనుంచి ఈ తెగలోకి పశువులు గాని, యితర వస్తువులు గాని తరలిరావడం అన్నది క్రమబద్ధంగా జరుగుతున్న దని పరిశోధనలవల్ల తేలింది. దానితో ఈ శాస్త్రం యింకో అర్థం కోసం వెతకసాగింది. వధువుయొక్క సాంఘిక ప్రతిపత్తికి నిదర్శనమే ఈ పెండ్లి పెట్టుబడులని. వధువు అదే తెగలోకి వెళ్ళినా, అక్కడ నిజానికీ వధువు బానిసగా లెక్క చేయబడినా ఈ ఖర్చుకి అర్థం లేదు. ఈ పరిశీలనలు ఒప్పుకుంటే - బానిసలను కొనుక్కోవడం, డబ్బిచ్చి పెళ్ళికూతుళ్ళని తెచ్చుకోవడం అన్నవాటి మధ్య పోలికలు లేవని ఒప్పుకోవాలి. ఈ ఓలి అన్నది వివాహ బంధాన్ని పటిష్ఠం చేయడానికే కాని వేరు కాదని చెప్పుకోవాలి. ఇదేనా వధువుకే ముఖ్యం గాని వరులకు కాదు. కాని అసలు లెక్కలోనికి తీసుకోని సత్యం ఒకటి వుంది. తల్లి హక్కు తెగలలో పెళ్ళికూతురుని పెళ్ళికుమారుని కుటుంబానికి ఇచ్చి

వేయరు. ఇది దృష్టిలో పెట్టుకొని చూస్తే - ఈ పెండ్లి పెట్టుబడుల అవసరానికే అర్థం వేరు వస్తుంది.

ఈ చిక్కు సమస్యలకి ఆలవాలంగా ఉండేది పశువులు పెంచుకునే మనుష్యులతో నిండి వుండే ఈస్టాఫ్రికా. వీరిలో అగ్రతాంబూలం నిలో-హెమైట్స్‌ది. యింకా దక్షిణాదిగా పోతే బంటూ మాట్లాడే తెగల వారిలో కూడా కొంచెంగా వుం దీ సమస్య.

ఇంగ్లాండునుంచి కొత్తగా యిక్కడికి వచ్చిన పరిశోధకుల జట్టులో నన్నూ చేరమని అడగటంతో పై ప్రజలను గురించి తెలుసుకొందుకూ, చూడడానికీ నాకు కూడా చక్కని అవకాశం కలిగింది. తూర్పు ఉగండాలో ఉన్న మబలే దగ్గరలోనే వున్న బగ్‌వరెకు వెళ్ళాలని ఈ జట్టు నిర్ణయించారు. వారికి గైడుగా అయిడన్ సదాల్ వస్తున్నారు - భాష తెలియజేయడానికని. ఆఫ్రికను కిస్వహిలి ప్రబోధకుడైన ఫ్రెడ్ కూడా వచ్చాడు. ఆఫ్రికను పల్లె జీవితాన్ని దగ్గిరనుండి చూడడానికి యిదే చక్కని అవకాశం నాకు. దూరపు టాంగన్యికాకు ప్రయాణం అయిపోయే లోపుగా ఉగండా చూడడానికి కూడా యిది చక్కని అవకాశం నాకు.

కంపలానుండి మబలేకు పోయే రోడ్డుదారి ఎగుడుదిగుడుగా పోతూ విక్టోరియాసరస్సుకూ, నైలునదివూబినేలలకూ మధ్యనున్న దేశాన్నంతా దాటుతూ పోతుంది. రోడ్డు పైకెక్కినప్పుడు కొండకొమ్ములనుండి కిందికి చూస్తే అల్లుకుపోయినట్లున్న చెట్లకొమ్మలూ, రాక్షసుల్లాంటి పెద్ద పెద్ద చెట్లూ కనిపిస్తాయి. కొత్తగా బయలుదేరిన పారిశ్రామికప్రదేశం జింజాను సమీపించి, దానికి సంబంధించిన పొగగొట్టాలనూ ఆఫ్రికను కార్మికులకై కట్టిన గృహాలనూ దాటి వెడల్పుఅయిన తారురోడ్డు నైలు నది వూబిప్రాంతాలవైపు సాగింది. నాచుతీగెలూ లతలూ మొనలుసాచి లేతపసుపుతీగలను కలలోని చిత్తరువులా కనిపించే యీ నైలునది ముఖభాగంమీదికి పరిచాయి. ఈ నీళ్ళ మట్టిలోనుంచి వూరి తామరకొలనుల లోకి కళ్ళు తెరుస్తున్నాయా అన్నట్టు వుంటాయి. పైకి చూడ్డానికి కదలిక లేకున్నా క్షణం విశ్రాంతి లేక ప్రవహిస్తూనే వుంటాయి. జీవం తొణికిసలాడే ఈ నీరే కదా ఆఫ్రికను సీమను సారంతో నింపుతున్న నైలునది!

టోరోరోకు ఉత్తరంగా వున్న పచ్చని స్థలాలలోని ఒక విశ్రాంతి గృహాన్ని తీసుకున్నారు అయిడన్‌సదాల్. ఎలగాన్ శిఖరపు నీలినీడలు వెనకపడ్డాయి. అరటితోటలు పెంచే పనివారి గుండ్రని యిళ్ళు పూబి నేలలో అక్కడక్కడ చుక్కల్లా కనిపిస్తున్నాయి. అరటితోటలు సాయంత్రపు చిరుచీకట్లలో నల్లని నీడలలా కనిపిస్తున్నాయి. అస్తమానూ టూరు చేసే ఆఫీసర్ల సౌకర్యార్థం వుండే వసతిగృహాలతో నాకు బాగా పరిచయం వుంది. అందులోనూ స్వాతంత్ర్యానికి పూర్వం భారతదేశంలో వీటికి ఎక్కువ రద్దీ వుండేది కాదు. ఆరోజుల్లో వాటిపరిచయం వుంది నాకు. ఈ ఆఫ్రికను విశ్రాంతిగృహం చాలా ముందడుగు వేసినదే అనాలి. దీనిని పోలిన భారతీయ వసతిగృహాలకన్న యిది కొంచెం తారుమారవుతున్న పరిస్థితిలో వుంది. గాలేనా చొరలేని యినుపకమ్మీల కిటికీలకి అద్దాలు. ఇవి ఏ కొన్నో తప్పించి తెరవబడవు. ఇక మిగిలిన వాటిని యినుప చట్రానికి బిగించేవేశారు. పన్నెండు గోడల మధ్య చిక్కుకున్న మూడు గదులలోనూ ఏదైనా వస్తువుగాని, కనీసం సామానుపెట్టుకుందుకు బెంచీ గాని లేదు. ఇక టైపురైటరూ, కాగితాలూ అనుకోనే అక్కరలేదు. ఫైళ్లూ కాగితాలూ అవీ పెట్టుకుందుకు కాంప్‌కాటూ, కుర్చీలూ, బల్లలూ వాడుకోవాలి. ఇవి డేరాసామానులతోపాటు, మనమే, మరిచిపోకుండా, పట్టుకువెళ్లాలి. ఇండియాలో పాతకాలపు విశ్రాంతిగృహానికి చుట్టూ వరండావుండేది. ఇది లేక నాకెంతో చిన్నబోయినట్టు అనిపించింది.

ఎందుకూ పనికిరాని ఈ ఏర్పాట్లు ఆఫ్రికను ఆచారానికి ప్రతీగా తోచాయి. ప్రతిరోజూ సాయంత్రం అయేసరికి ఆవరణలోని ఓ పెద్ద చెట్టు క్రింద దుంగలు పేర్చి మంటవేసేవాడు వాచ్‌మేన్. నాలుగువేల అడుగుల ఎత్తున వున్నా అక్కడి గాలి కలుషరహితమై ఉత్తేజాన్నిస్తుంది. భూమధ్యరేఖమీదే వున్నట్టు వున్నా-యిక్కడి నవంబరు - డిసెంబరులు ఎంత చలికాలం కావో - మే జూనులు అంతే వేసవి అనవచ్చు! ఈ మంటచుట్టూ కూర్చుని ఆ రోజు విశేషాలను గురించి కబుర్లు చెప్పుకొనేవాళ్లం. ఇలా ఆరుబయట హాయిగా నిద్రపోయేవాళ్ళం. కాంప్‌కాటులు పరుచుకుని ముఖాలు మటుకు మంటవైపు తిప్పుకొని పడుకునేవాళ్ళం. అప్పుడే

దోమలు దగ్గిరకి రావు. ఈ రకంగానైనా గాలి రాని ఆ ఇనుపచట్రాల అద్దాల కిటికీలు తప్పాయి!

రాత్రించరులైన పక్షులూ, నక్కల నిశ్శబ్దమైన కదలికలు, చెట్ల చిటారుకొమ్మల సందులనుంచీ, క్రింది కొమ్మల ఆకుల సందులనుంచీ యింకా నిశ్శబ్దంగా సాగే యింకొక కదలికను గమనించవచ్చు. కలత నిదురగాని నిద్రలోంచి అప్పుడప్పుడు కన్నులు తెరచి చూస్తే దూరంలో తిరిగే గ్రహాల కదలికనూ, అసలు కొలత కందని దూర దూరాల పయనించే నక్షత్రాల కదలికనూ చక్కగా గమనించవచ్చు.

యూరోపియను పద్ధతుల కనుగుణంగా రూపొందింపబడ్డా, కాకుంటే శుద్ధ జాతీయం అయినా కూడా ఆఫ్రికను రాజకీయ తంత్రాంగం మూడు మెట్లుగా వుంటుంది. ఉగండాలో కూడా అదేపద్ధతిని అనుసరిస్తూ వుంటారు. సర్వాధికారులు, స్థానికాధికారులు, చిన్న అధికారులు కబక కంపాలలో వుంటారు. జిల్లాలలో సాజా, గంబలోలా అధికారులు స్థానికంగా ప్రాధాన్యం వహిస్తారు. రోజూ మేం వారియిళ్ళకి తిరుగుతూ వుండేవాళ్లం. మా మొదటి ఉద్దేశ్యం - మానవ పరిణామ శాస్త్రపు పని మాత్రం యాంత్రికంగా గిడుగిళ్ళ తిరిగినట్టు అయింది. ఇది కూడా మంటలచుట్టూ పడుకొని ఇనుప చట్రాల కిటికీల జైలునుండి తప్పించుకొన్న రాత్రులనే జ్ఞప్తికి తెచ్చింది నాకు. లాండ్‌రోవరు ఎక్కి అడ్డదిడ్డాలుగా పరచుకొని వున్న కాలిబాటలను దాటుకుని సమతలమైన దారిమీంచి గుండ్రగుండ్రంగా వుండే వారి నివాసస్థలాలకి వెడుతూ వుండేవాళ్ళం ప్రతి ఉదయమూ. ఈ గుండ్రని యిళ్ళ చక్కని అరటిచెట్ల గుంపు మధ్యగా పొదిగినట్లు వుంటాయి.

కారు ప్రయాణం నిజంగానే చాలా టైము కలిసి వచ్చేలా చేస్తుంది. పూర్వంలో అయితే కాలినడకను సాగించే కూలీ సముదాయానికే అయ్యేది బోలెడు ఖర్చు. కాని యిలా ప్రయాణం చేస్తే స్థానిక నివాసులతో సన్నిహిత పరిచయం ఏర్పడే అవకాశం కలిగేది; ఆఫ్రికను ప్రజతో, ఆఫ్రికను నేలతో సాన్నిహిత్యం ఏర్పడేది. ఏదెలా గుంటేనేం - ఒకసారి ఒక పల్లెను సమీపిస్తే వాహనాలు దూరంగా వదిలి కాలినడకను ఆ సన్నని

సందులలోంచి నడిచిపోయేవారం. చక్కగా గుండ్రంగా వుండే మామూలు వాళ్ళ యిళ్ళూ, లేకుంటే చదరంగా ఆధునిక పద్ధతులలో కట్టిన దంబలోలా అధికారుల యిళ్ళూ సమీపించేవాళ్ళం. అధునాతనం అనుకునే కుర్చీలను తప్పించి అంతటా చక్కని ఆఫ్రికను వాతావరణమే ఎదురయ్యేది. కర్రదిమ్మలు చెక్కిన పీటలు పాతకాలపువి అనీ, అభ్యుదయ చిహ్నాలు గావనీ వాటిని వదిలి ఈ మడత కుర్చీలు అమర్చుకుంటున్నారు ఆఫ్రికను రైతులందరూ. ఈ పీటలు ఎంతో అందంగానూ, కూర్చుందుకెంతో సౌఖ్యంగానూ వుంటాయి. కాని యివి ఫాషన్ కాదు !

అర్ధ గజం మందం కలిగిన చెట్టు మొదళ్ళు నరికి ఈ పీటలు చెక్కుతారు. దుంగలాటి చెట్టు మొదలు తీసుకొని పై పక్క పల్లంగా చెక్కుతారు. యిది కూర్చుందుకు వాటంగా వుంటుంది. కింది పక్క మటుకు సాఫుగా వదిలేస్తారు, ఇది నేలమీద చక్కగా ఆనుతుంది. ఇలా చెక్కిన దాని మధ్యభాగం అంతా జాగ్రత్తగా చెక్కి తీసేసి, మూడు కర్రల్లా వుంచుతారు. ఈ కర్రలే పై భాగాన్నీ, కింది భాగాన్నీ కలుపుతాయి. ఇది చూడ్డానికి ఇసుక గడియారంలాగా, లేకుంటే డోలులాగా నడుం సన్నంగావుండి అందంగా వుంటుంది. సంప్రదాయమైన వస్తువులు మంచి కర్రతో చేస్తారు. ఈ కర్ర పొడుం రంగునుంచి ముదురు - నలుపు దాకా వుంటాయి. అప్పుడప్పుడు కర్పూర తైలంతోటో, వేరే ఏదైనా నూనె తోటో తుడిస్తే బాగా మెరుస్తాయి. ఈస్టాఫ్రికాలో వున్న యూరోపియనుల యిళ్ళలో రంగుల చాపలమీద అందంగా అమర్చిన ఈ పీటలు చూడవచ్చు. ఎత్తుగా మంటపొయ్యి సమీపంలో అమర్చుతారు. వాటిమీద హాయిగా పొందికగా కూర్చోవచ్చు. ఏమైతే నేం, సామాన్యంగా అందరు ఆఫ్రికనుల యిళ్ళలోనూ కిర్రు కుర్చీలనే వాంఛిస్తారు. అవి కి-జుంగు-యూరోపియన్ సరుగు. అందుకే ఆధునికంగా - అభ్యుదయ చిహ్నంగా వారు భావిస్తారు.

మా కాతిధ్యం యిచ్చిన ఆఫ్రికను అధికారులలో ప్రముఖులు కొందరు అయిడన్ సదాల్‌తో లుగండలో మాట్లాడారు. ఉగండాలోని ఈ ప్రాంతాలలో యిది ప్రముఖమైన భాష. అంతే కాకుండా కబకలో యిది అధికార

భాష. కాని, మామూలుగా అందరికీ ఒక్క లున్‌యోల్, లుజిస్సు భాషలే మాట్లాడ్డం వస్తుంది. కిస్వహిలి గురువైన ఫ్రెడ్ మా కీ భాషలని అనువదించేవాడు. ఈ భాష బంటూ, అరబిక్ పదాల మిశ్రమంగా వుంటుంది. తీరపు ప్రాంతంలో విస్తారంగా వుపయోగంలో ఉన్న ఈ భాషని ఎంతో అందంగా బోధించే వాడు. అయినాకూడా వ-గండా తెగ వారిలో దీనికి ఆదరణ లేదు; ఒక శతాబ్దం క్రితం బానిస వ్యాపారంతో సంబంధం కలిగి వుందన్న నమ్మకమే దీనికి కారణం.

ఈ పల్లె కుటుంబాల మగవారు మా కిచ్చిన ఆతిధ్యం చూస్తే ఏమాత్రం లోబడి వున్నట్టుగాని, కనీసం చేసి తీరాలని చేస్తున్న ధోరణి గాని కనిపించలేదు. కాని యింటి ఆడంగులు మటుకు, కప్పులతో పళ్ళ రసం తెచ్చినప్పుడు గాని, స్థానికంగా తయారుచేసే పాంబే (Pombe) పానీయం తెచ్చినప్పుడు కాని, అక్కడ గుమిగూడి కూర్చున్న మగవారి ముందు, విదేశీయుల ముందు వంగి, మోకాళ్ళమీద వంగి మర్యాద చేయడం మటుకు మానలేదు. బానిసలని పట్టుకునే రోజులలో యిదే పద్ధతి యూరోపియనుల ముందూ, అరబ్బుల ముందూ మగవారుకూడా అవలంబించేవారు.

మగవారు ఎంతో ప్రోత్సహించిన మీదట కాని, స్త్రీలు అసలు మా ముందు మాటలాడనే లేదు. మా సంభాషణ సాధారణంగా రాజకీయపు ప్రశ్నలపైపే మొగ్గేది. బ్రిటిషువారికి పూర్వానికీ యిప్పటికీ ఈ స్థానికాధికారుల ప్రతిపత్తిలోని తేడాలనుగురించి చర్చించేవాళ్ళం. చివరిగా ఎవరూ పగులకొట్టని గుల్ల ఈ మానవపరిణామ శాస్త్రపు శాస్త్రదృష్టిలో-ఓలి సమస్యను గురించి చర్చకి దిగేవాళ్ళం.

చరిత్ర కందని కాలంనుంచీ కూడా గోవులు పెళ్ళికూతురికి ఓలిగా ఒప్పుకోవడం జరిగేది. సీట్సీ విషపుయీగ (tse tse fly) బాధ ఈ ప్రాంతంలో లేకపోవడంమూలాన్ని పశుసంపద బాగా వుండేది ఈ ప్రాంతాలలో. పశువుల సాంఘిక ప్రతిపత్తి ఉగండా ప్రాంతంలో యింకా ఎక్కువ విలువ కలిగివుండేది. నిలోహెమైట్స్‌కి ఆవులు, ఎద్దులు, దూడలు అంటే

విపరీతమయిన అభిమానం. సాధుజంతువులకి ఈ రీత్యా విలువ ఎక్కువ వచ్చేది - బంటూ మాట్లాడే రైతుకుటుంబాలలో. ఈ విషయంలో పీరి శృక్పధం యథార్థమైనదిగా వుండి, ఉత్తరాదివారికంటె నయంగా తోస్తుంది. ఐదు లేక పది గోవులు ఒక వధువుకి యివ్వడం సబవుగా వుండేది అంటూ చెప్పారు మా రైతుస్నేహితులు. కాని ఈ రోజుల్లో ఆడపిల్లలు వేరు. ఇంటిలో పాతుకుపోయి వుండరు. సాటిమగవారితో బస్సులు ఎక్కుతారు. సైకిళ్ళమీద ప్రయాణం చేస్తారు. మబలేలొ వున్న ఆఫీసులకి వెడతారు. సినిమాలు చూస్తారు. టౌనులో వివిధమైన వాటిని చూస్తారు అని చెప్పాడు.

స్థానికంగా ఓలిధర తగ్గిపోవడానికి యిదంతా కారణభూతం అయింది. ఆఫ్రికాలోని చాలాభాగాలలో ఈ ఓలి విపరీతంగా హెచ్చిపోవడం మనం గమనించేవున్నాం. ఎంతగా పెరిగిందంటే-దాన్నిగురించి స్థానిక అధికారులూ, కమ్యూనిటీ డెవలప్‌మెంటు అధికారులూ చింతపడటం దాకా వచ్చింది. ఆఫ్రికా మొత్తంమీద ఈ ఓలి పెట్టుబడులు విపరీతంగా ప్రాముఖ్యానికి వచ్చాయి. పశ్చిమతీరానికీ, మధ్యాఫ్రికాకీ కూడా ఈ అచారం విస్తరించుకుంది. సంప్రదాయమైన వివాహ పద్ధతికి విభిన్నంగా పోయేదాన్ని మరుమక్కతాయం (మాతృహక్కు) తెగలలోవారు కూడా స్వీకరించడం మొదలుపెట్టారు. మరుమక్కతాయ సంఘాలలో వివాహమైన దంపతులు వుండడం తల్లిచెంత, లేదా అదే ప్రాంతంలో. అంటే వధువు పుట్టినింటిని గాని, తెగభూములనుగాని వివాహానంతరం సహితం వదలనవసరంలేదు. పెళ్ళిలో వధువుని 'ఇచ్చివేయడం' జరగదు; అత్తవారింటికి వెళ్ళిపోవడం జరగదు. నిజానికి వధువు తన భర్తని తన కుటుంబంలోకి తెస్తుంది; కొత్త సభ్యుడు ఈ ప్రాంతంలో ఎప్పుడూ ఆహ్వానితుడే అవుతాడు. జనాభా అతిగా పెరగని ఆఫ్రికా ప్రాంతాలలో కుటుంబంలోకి కొత్తమనిషి రావడం లాభంగా తోచేది కాని దండుగగా ఎప్పుడూ పరిగణింపబడలేదు. అలాంటప్పుడు ఓలి అన్నది తండ్రిహక్కుతెగలలో అర్థవంతం అవుతుంది (పనిచేసే ఒక కన్య దూరం అవుతుంది కనుక). కాని తల్లిహక్కుతెగలలో అసందర్భంగా తోస్తుంది. టాంగన్యికాలోని తల్లిహక్కు సంఘాలు ఎలా యీ ఓలి పద్ధతిని అవలంబించడం ప్రారంభించాయో-దాని పర్యవసానంగా

మెల్లి మెల్లిగా తల్లిహక్కు సన్నగిలి తండ్రి హక్కు సంఘాలెలా ప్రబల సాగాయో తరువాత పరిశీలిద్దాం.

పంధొమ్మిదో శతాబ్దంలో బానిస వ్యాపారం ఉవ్వెత్తుగా సాగుతున్న సమయంలోనే యీ ఓలి అన్నది కూడా ఆఫ్రికా మొత్తంమీద వ్యాపించి వుండడం శోచనీయమైన విషయం. ఈ రెండూ కూడా దేని కదిగానే బయలుదేరి బలపడ్డాయి అన్నది మటుకు నిశ్చయం. పంధొమ్మిదో శతాబ్దపు ఉత్తరార్ధంలో ఓలి విపరీతంగా పెరగడానికీ, శారీరకంగా ఆకర్షణీయమైన స్త్రీ బానిసలు ఎక్కువ వెల తేవడానికీ సన్నిహితమైన సంబంధం లేక పోలేదు. ఈ విధంగా యీ రెండు ఆచారాలకీ సంబంధం ఏర్పడింది.

కాని, ఉగండాలో యీ ఓలి ధర తగ్గుముఖంలో వుందని విన్నప్పుడు స్త్రీలకై నెలకొల్పబడిన అనేక చైతన్యవంతమైన ప్రక్రియలు యీ తగ్గుముఖం పట్టిన ఓలి ధరకు ఏ మాత్రంగా దోహదం యిచ్చాయి అన్న విషయం నాకు మొదట్లో అంతగా అర్థం కాలేదు. సంప్రదాయమైన ఓలి ధర ఐదు పశువులదాకా తగ్గిపోయింది; దానికి పైగా బక్షీస్‌గా ఏవో కొన్ని గొర్రెలుకూడా యివ్వడం కద్దు. "యిప్పుడు టౌనుకి పోయివస్తున్న యీ అమ్మాయిల్లో చాలా మంది కన్యలే కాదు కదా!" అన్నారు.

ఈ పిల్లల్లో కొందరు వ-జుంగు, - యూరోపియను బంగళాలలో పని పిల్లలుగా పనిచేస్తారు; కొందరు డుకవాలాస్ దగ్గిర, యింకా కొందరు భారతీయ దుకాణదారుల దగ్గిర, ఇంకా కొందరు మొంబాసా, డారె - సలామ్, టాంగాలదాకా కూడా వెళ్ళి, దాయీలుగా, ఆయాలుగా, వేశ్యలుగా, వ్యాపార సంస్థలలో అమ్మకానికి కుదిరి డబ్బు జాగ్రత్త చేసుకుందుకు తాపత్రయ పడుతున్నారు. తనకై తాను డబ్బు సంపాదించుకుని జాగ్రత్త చేసుకున్న ఆడది ఓలి విషయం అంతగా పట్టించుకోదు. కారణం యిది కాస్తా తనకి కాక, తండ్రికో చుట్టాలకో కదా పోతుంది!

తగ్గుముఖంలో వున్న ఓలి ధరలూ, ఎక్కువ అవుతున్న విడాకులూ కూడా దీని కారణమే అని అర్థం చెప్పుకోవచ్చు. కాని మేం యీ విషయం వయస్సులో పెద్దలైన కొందరితో చర్చించినప్పుడు యీ ఓలి ధరలు తగ్గ

డానికి కారణం స్వేచ్ఛ సంపాదించుకున్న ఆడపిల్లలే అంటూ, తమ కొడుకులకి వారిని భార్యలుగా స్వీకరించడంలో తటపటాయించి, పూర్వపు ఓలి ధరలు యివ్వడానికి సుముఖులుగా లేకపోవడమే అన్నారు.

కనీసపు విద్యనైనా సంపాదించి తీరాలన్న పట్టుదల యీ స్టాఫ్రికాలో సర్వే సర్వత్రా వ్యాపించింది. ముఖ్యంగా ఆఫ్రికను ప్రజలలో యీపట్టుదల కనిపిస్తుంది. ఈ మానసికం అయిన సాంఘిక చైతన్యం కమ్యూనిటీ డెవలప్‌మెంటు కేంద్రాలలో నన్ను మాట్లాడమని కోరినప్పుడు బాగా తెలిసింది నాకు. అక్కడ ఇండియాలో స్త్రీల ప్రతిపత్తిని గురించి మాట్లాడమనీ, యువతరపు కన్యల సమస్యలను గురించి చెప్పమనీ అడిగారు.

మిషినుల దాడి, పారిశ్రామిక విప్లవము, పట్నవాసపు పోకడల పెరుగుదల–వీటన్నిటినీ వరసగా యథావిధిని చర్చించి, స్త్రీల కూలి విషయం కూడా చర్చించాము. సంప్రదాయకమైన సమిష్టి కుటుంబాల ఎచ్చిత్తికి యీ విషయం దోహదం యిస్తుందని నా నమ్మకం; యిదే సందర్భంలో సంఘ సంస్కర్తలు తల బాదుకుంటున్న కట్నసమస్య కూడా చర్చకు వచ్చింది. ఈ రోజులలో యౌవ్వనులు కట్నాన్ని చాలా చిన్నచూపు చూస్తున్నారనీ, ధనవంతురాలైన కన్య లంచం యిచ్చి వరుణ్ణి కొనుక్కోవడం అంశనీచంగా దాన్ని చూస్తున్నారనీ నేను అన్నప్పుడు, స్త్రీ స్వేచ్ఛావాదులను సహితం ఆలోచనలో ముంచే ఒక సామాన్యమైన ప్రశ్న వేశారు నన్ను. "సాంఘికమైన కట్టడి ఎలాంటిదైనా అది ఆడవారికే అనర్థాన్ని తెచ్చేదిగా తయారవుతుంది – ఎందుచేత?". దానికి సమాధానంగా యీ రెండూ పైకి విభిన్నంగా కన్పించినా నిజానికింత తల్లక్రిందులవి కావనీ, ఓలి వధువు తండ్రికో, మేనమామకో, చుట్టాలకో వెడుతుంది కాని ఇండియాలో కట్నం – 'వరుని ధర' అన్నది తిన్నగా వరుని చేతికే అందుతుందనీ, తద్వారా అతని స్థితి పటిష్ఠం అవుతుందనీ చెప్పాను. ఇస్లాములో మెహర్ అనే బహుమానం వివాహానంతరం పెళ్ళికుమార్తెకు యిచ్చేయాలి. దాని వల్ల వివాహంలో వధువు స్థానం బలపడేది. దగ్గిర దారిగా తయారై, అసలు స్థితి అర్థాన్నంలో పడి – మెహర్ అన్నది వింత అర్థానికి దిగింది. వధువు కుటుంబానికి యిచ్చే ధరగా తయారైంది. కష్టకాలంలో వధువుకి

సహాయార్థం అన్న అర్థం మాయమైంది. ఓలి, మెహర్ అనేవి ఒకటే అన్న అర్థం తప్పు అవుతోంది.

ఈ పై చర్చకి ముగింపుగా రెండో రోజున కమ్యూనిటీ డెవలప్‌మెంటు కేంద్రంలో పనిచేస్తూన్న ఆఫ్రికను ఆఫీసరు ఒకామె ఆఫ్రికను కన్యలతో, భార్యలతో తన స్వానుభవాలని గురించి చెప్పడానికి వచ్చింది. మకరెరె పట్టభద్రురాలైన యీమె తొలుదొల్త యీ పల్లె స్త్రీలని సమీపించడానికే ఎంతో కష్టపడిందట. వీరి మొగవాళ్ళది అంత అనుమానస్వభావం. తరువాత వీరిని కమ్యూనిటీ కేంద్రాలలో చేర్పించడం అన్నది. కేంద్రాల్లో జరిగే వికాస కార్యక్రమాలలో పాల్గొనటానికి, అప్పుడప్పుడు ఏర్పరచే ఆరోగ్య విషయాలపై ఉపన్యాసాలు, యితర విషయాలు వినడానికి వీరిని తేవడం కష్టం అయ్యేది. ముఖ్యంగా, కుట్టుపనిమీద శ్రద్ధ వహించడం జరిగింది – అలాగైనా మగవారి అనుమతి సంపాదించడం సులభం అవుతుందని. చివరికి పెళ్ళి, చట్టాలూ చర్చకి వచ్చినప్పుడు ఆమె యిలా అంది: "యిప్పుడున్న ఓలి ధరని సగానికి సగం చేయాలని మా ఊహ. ఇది జరిగితే స్త్రీల ప్రస్తుతస్థితి చాలా మెరుగు అవుతుంది. ఇప్పుడు భర్త యింట్లో పూర్తిగా బానిసగా బ్రతుకు సాగిస్తూంది. అందరూ అంటూనే వుంటారు – 'నీ కోసం ఎన్నో మంచి పశువులని యిచ్చాం. అందుకే చెప్పిన మాట విని పనిచేయాలి. బానిసలా పనిచేయాలి – తప్పదు!' అని."

ఈ చివరిమాట నాకు కొట్టినట్టు గుర్తుకి తెచ్చింది – ఓలి, బానిసత్వం! ఈమె కనుపరుస్తున్న ఉత్సాహంలో యీమె స్వంతం ఎంత? కమ్యూనిటీ కేంద్రంనుంచి ఎంత అరువు తెచ్చుకుంది! ఆరేడు వారాల క్రితం ఇంగ్లండునుంచి వచ్చిన యీమెకి యిల్లంటే అర్థం ఏమిటి? అక్కడేం చదువుకొంది? బ్రిటిష్ సాంఘిక శాస్త్రమా? ఆఫ్రికన్ మానవ పరిణామ శాస్త్రమా? లేకుంటే బానిస నిర్మూలన ఆదర్శాలా?

ముదురు నీలం పావడా, చక్కగా గంజిపెట్టి యిస్త్రీపెట్టిన జాకెట్టు – యీమె బ్రిటిష్ వనితగానే కనిపిస్తూంది. అందంగా మలచిన ముఖం – శిరస్త్రాణంలాగా ఒంపు తిరిగిన పొట్టి వుంగరాల జుట్టు – యివి మటుకు

యీజిప్టు పూర్వీకుల సంగతి - ముఖ్యంగా ఆఫ్రికాను జ్ఞప్తికి తెచ్చింది. పశ్చిమ ఆఫ్రికాలో పూర్వపు రాజ్యాల సంప్రదాయంగా వచ్చే కంచుపోత విషయం జ్ఞప్తికి వచ్చి ,“యీ ఓలి అన్నది మాతృహక్కు తెగలలో ఎటువంటి సమస్యగా నిలిచింది?” అని అడిగాను.

ఆమె పెద్దకళ్ళు కొంచెం వర్ణం మార్చి అంతు దొరకని దేదో ఆలోచించాయి ఓ క్షణం. ఓ క్షణం వూరుకుని ఆమె అంది- ఇప్పటివరకూ త నీ మాతృహక్కు తెగల విషయం తెలుసుకోలేదనీ, అలాంటివి వున్నాయనే తెలియదనీ, అందుకు త నీ విషయంలో ఏమీ చెప్పలేననీ సమాధానం చెప్పింది :

# 3. మావ్, మావ్ - ఎందుకు? ఎందుచేత?

కంపాలా నుంచి తీరానికి బయలుదేరే మొంబాసా మెయిల్‌ని మధ్యాహ్నం ఎక్కాలి మనం. అది మెల్లిగా ప్రాకుతూ ప్రయాణం సాగిస్తుంది. ఉష్ణ ప్రదేశపు వాతావరణంలో హాయిగా నిద్రపోతాం. అందమైన ఆకారం కల బొబ్బాయిచెట్ల ఆకులు నాట్యం చేసే వేళ్ళలాగా నైలునది వూబి ప్రాంతాల మీద విస్తరించి వుంటాయి. అతి పల్చని చొక్కా తొడుక్కున్నా కూడా చెమటతో అంటుకుపోయేలా చేస్తుంది అక్కడి ఉష్ణోగ్రత. కాని ఉదయం నిద్ర లేచేసరికి 'ఎల్‌డొరేట్' లేక 'యీక్వేటరు' అనే స్టేషను సమీపిస్తాం, అప్పుడే కెన్యాలో ప్రవేశించాం; తెల్లవారి పర్వత ప్రదేశం అయిన పీఠభూమిలోకి ప్రవేశించాము. ఒక రాత్రికి మూడు షిల్లింగులు (అంటే రెండు రూపాయలకు సమం అనుకోవచ్చు) పుచ్చుకొని రైల్వే వారు తెల్లని యిస్త్రీ దుప్పట్లకి జతగా దళసరి నూలు కంబళి యిస్తారు. ఈ ప్రాంతపు మంచులాంటిచలికి యీ శాలువ ఎంతో హాయి అనిపిస్తుంది. మనం భూమట్టానికి ఆరువేల అడుగుల ఎత్తున ప్రయాణం సాగిస్తూ దక్షిణ భూమ్యర్ధ గోళానికి వెనుకతట్టుకు పోతున్నాం.

కళ్ళకు కనిపించే దృశ్యం కొట్టవచ్చినట్టుగా వుంటుంది. ఇది ఎత్తైన పీఠభూమి కదా! విశాల ప్రదేశాలూ, పల్లెటి జీవితాలూ నచ్చిన ప్రతివారినీ యీ భాగం పిలిచి పలకరించుతుంది. యూరపులో కూడ ఒకా

ఖాకప్పుడు కానవచ్చిన ఒక రకం స్వాతంత్ర్యాన్ని జ్ఞప్తికి తెస్తుంది. దూర దూరాల ఎగుడు దిగుళ్ళుగా సాగిపోయే అంచులు పచ్చని చెట్లలోనో, ఎండిపోయిన పచ్చిక బయళ్ళలోనో కలిసి పోతూంటాయి. ఈ గ్రీష్మంలో యిక్కడి కొండ ప్రాంతాలు, ఉత్తర యూరపులో జూన్ మాసాన్ని జ్ఞప్తికి తెస్తాయి. అయితే క్రిస్టమస్ పండుగ తరువాత అన్నీ ఎండిపోయి, అన్ని రంగులూ కలిసిపోయి, కళ్ళు చెదిరించే శ్వేతవర్ణంగానే గోచరిస్తాయి. మెల్లిగా రైలు ముందుకి సాగిపోతూ వుంటే రక రకాల పల్లె దృశ్యాలు కళ్ళకు కడతాయి. మొనలుదేరి వుండే ఆస్ట్రేలియను జాతి చెట్లు అక్కడక్కడ కనిపిస్తాయి ...నలుపు తెలుపు మచ్చల 'ఐర్‌షైర్' ఆవుల మందలు, గోధుమరంగు గొఱ్ఱెలు, మచ్చల మేకలు, లేతగులాబీ రంగులో వుండే యూరోపియను పందుల గుంపులు - అన్నీ పల్లెదృశ్యాలే ద్విగుణీకృతం అవుతూ కనిపిస్తాయి. దూరంలో చదరంగా వున్న చిన్న యిల్లూ, చుట్టూ తోటా దొడ్డీ చూడ ముచ్చటగా వుంటాయి. సువిశాలమైన భూప్రదేశాన్ని చీల్చుకుంటూ రైలు సాగుతుంది. అక్కడ కూడా యిటూ అటూ గాలికి దుమ్ముకొట్టుకుపోయిన ఆకులచెట్లు తప్పించి ఏం కనిపించవు. ఇరవై సంవత్సరాల క్రితం ఎక్కడ పడితే అక్కడ గుంపులుగా కనిపించే జీబ్రాలు, జిరాఫీలు, నిప్పుకోళ్ళు యీ నాడు మాయమై పోయాయి. సైనికులు కాల్చేశారు. దూరంగా కానవచ్చే మైదానాల్లో యీ నాటికీ మెరపుల్లా మాయమయిపోయే లేళ్ళ గుంపులూ, కుందేళ్ళ గుంపులూ కనిపిస్తూనే వుంటాయి.

త్వరితగతిని మన కళ్ళెదుటే సూర్యుడు ఉదయించేసరికి స్ఫటికం వలె స్వచ్ఛమైన వింత వెల్గులతో కళ్ళకు కనుపట్టే భూభాగం యావత్తూ నిండిపోతుంది. అగాధం వంటి నీలి ఆకాశంలో చిన్నచిన్న మంచు బంతుల్లా లక్షలాది చిరుమేఘాలు కమ్ముకుంటాయి. అలా గాలిలో తేలి తేలి మన ప్రపంచంలోకి ఎక్కడినుంచో అడుగు పెడతాయి. అదే ఒక ఆనందం.

ఈస్టాఫ్రికను రైల్వేవారి రైళ్ళ ప్రయాణం సుఖప్రదంగా వుంటుంది. వీటి ద్వారా దేశప్రాంతాలలో శుచి శుభ్రతలు, మంచి అభిరుచి, ఉపయోగం అన్నీ అలవాటు చేయడం జరుగుతూంది. ఈ చక్కని రైలు

పెట్టెలు మొదటి ప్రపంచయుద్ధం తరువాత యూరోపియను ప్రయాణీకులకై ప్రత్యేకింపబడ్డట్టే వుండేవి. కాని యీ రోజుల్లో అలా కాదు. ఎప్పుడేనా, యువకుడైన లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యుణ్ని చూడవచ్చు. పెద్దలైన ఆఫ్రికను చీఫ్‌ను చూడవచ్చు. ఒక్కొక్కప్పుడు యిండియను కుటుంబాలు కూడా కనిపిస్తాయి. వీరిని అధికారరీత్యా 'ఆసియనులు' అంటారు. అయితే నేం, మొదటి తరగతి ప్రయాణీకులలో యిండియనులు నూటికొకరే; నిజానికి ఆఫ్రికాలోని యిండియన్సులో పిసరలైన ఐశ్వర్యవంతులు విమానం లోనో, దగ్గిర దూరాలైతే పెద్దవైన స్వంత కార్లలోనో ప్రయాణం చేస్తారు. యూరోపియనులకి వున్న వ్యవధీ, విశ్రాంతీ వీరికి లేవు. ఆధునిక కాలంలో టైము అంటేనే డబ్బు. ఆధునిక వ్యాపారం టైమునిట్టే మింగే స్తుంది.

నా సహ ప్రయాణీకుడు ఆంగ్లేయుడు. మురిచిన్సన్ ఫాల్సు దగ్గిరకి వెళ్ళి, మొంబాసాలోని తన కంపెనీకి తిరిగి వస్తున్నాడు. పక్కకు ఒక వైపుగా, టేబులు కింద, ముఖం కడుక్కొందుకు అవసరం అయిన బేసినూ, అవీ వున్నాయి. కాని తోటి మనిషికి యిబ్బందికల్గించడం యిష్టం లేక, అందరూ వుపయోగించడానికని వున్న స్నానాల గదుల దగ్గిరకి వెళ్ళాను. 'యూరోపియన్', 'ఇండియన్' అని వున్నా 'ఆఫ్రికను' పద్ధతివి లేవు వాటిలో. కాని రెండింటిలోను కూడా పూర్వకాలంలోకూడా భారతీయ రైలు పెట్టెల్లో వుండే 'షవర్' మటుకు లేదు. హఠాత్ పరిణామాలకి అలవాటు పడ్డ నేను నెమ్మదిగా కూర్చుని ఒళ్ళు తోముకోడం ప్రారంభిం చాను. చక్కని సబ్బు. ఎంతో నురుగ. కాని, యీ నురు గంత ధారాళం గానూ నీటి సరఫరా వుంటుందని అనుకోడం నా పొరపాటైంది. కుళాయి కున్న దిమ్మని నొక్కి పెట్టినంతసేపూ సన్నని ధారగా నీరు వచ్చింది. కాని చేతిలోకి నీరు తీసుకుందామని చేతిపట్టు సడలించగానే నీరు రావడం కాస్తా ఆగిపోయింది. చేతులు రెండూ శుభ్రంగా కడుక్కోవడమే అతి కష్టమై పోయింది. దోసిళ్ళతో నీళ్ళు జల్లుకోడం జరిగింది. చివరికి నేల మీద చిన్న సరస్సు ఏర్పడింది. ఈ నురగ కాళ్ళకి అంటుకొని తంటాలు పెట్టింది. క్రింద యీ బాధతో క్షవురం చేసుకోడం యింకో సమస్యగా

తయారైంది. ఎలెక్ట్రిక్ షేవరు పెట్టుకుందుకు అవకాశం లేదు. రేజరూ అవీ పేర్చుకుందుకు స్థలం లేదు. భయంకరమైన యీ ఆయుధంతో నేను గెడ్డం గీసుకుంటూ వుంటే రైలు మళ్ళడం. పైన పెట్టిన సోపూ వగైరాలు నేలమీద నురుగ నీళ్ళలో పడడం జరిగింది.

ఈ ఒకటో తరగతి పెట్టెలో అన్నీ ఎంతో అందంగా, అమరికగా వున్నాయి. కాని తీరా ఉపయోగంలోకి తెచ్చేసరికి అంతా దల్ల క్రిందులు. ఇదంతా చూస్తే, ఉగండా విశ్రాంతి గృహంలోని యినుప చట్రాల అద్దాల కిటికీలూ, వాటినుంచి తప్పించుకుని మేం హాయిగా చెట్ల కింద పడుకోవడం జ్ఞాపకం వచ్చింది.

ఎంతో అలసి నేను నా పెట్టెకి తిరిగి వచ్చేసరికి నా తోటి ఆయన చక్కగా క్షవరం చేసుకొని నా లాగే కొంచెం కొంచెం స్నానంచేసి కూర్చుని వున్నాడు. ఇంకా ఓ రోజు పూర్తిగా అదే రైల్లో గడపాలి ఆయన. ఎంతో సేపు నిశ్శబ్దంగా కూర్చుని కిటికీలోంచి బయటికి చూశాం. ఆ కనపడిన దృశ్యాలు స్కాటిష్ భూములని జ్ఞప్తికి తెస్తున్నా యన్నాడాయన. నాకు మటుకు దక్షిణ ఆఫ్రికాయాని జ్ఞప్తికి తెచ్చాయి ఇవి. అలా సాగిపోతూన్న బయళ్ళల్లో నిండుగా పండిన గోధుమచేలూ, అక్కడక్కడ ఎప్పుడేనా కానవచ్చే చిన్న యిళ్ళూ చూడ ముచ్చటగా వున్నాయి.

"ఇదివర కో సారి యిక్కడికి విశ్రాంతి కోసం వచ్చాను. యిక్కడో వ్యవసాయదారుడు స్నేహితు డున్నాడు. ఆ రోజు ఎంతో బాగుంది యీ రోజులాగే. రాత్రిపూట ఉక్కపోసి విసుగెత్తించే మొంబాసానుంచి కారులో రావడం చాలా హాయిగా వుంటుంది. చక్కటి పల్లెటూరి భోజనం కోసం ఎదురుచూస్తూ స్నేహితుని యింట అడుగు పెట్టాను. నా కళ్ళకు ఏం కనుపించింది? నా స్నేహితుని శరీరం ముక్కలు ముక్కలై యిల్లంతా పరచుకుని వుంది. అతనికి విశ్వాసపాత్రులైన యిద్దరు కికుయూ పనివాళ్ళ శరీరాలూ అతని శరీర ఖండికలతో కలసిపోయి వున్నాయి. ఇంతటిదారుణ దృశ్యాన్ని నా ఆరేళ్ళ యుద్ధ పరిచయంలోనూ ఏ నాడూ చూసి ఎరుగను." ఓ క్షణం సేపు వూరుకుని మళ్ళీ అన్నాడు అతను:

"ఇది యీ వ్యక్తికి జరగడం దారుణమే. ఇన్నాళ్లూ 'వాళ్ళు' తనని తాకరని నమ్మినవాడు. వాళ్ళకి సహోదరుడుగా ప్రవర్తించాడు. చిన్నతనం నుంచీ కూడా కికుయూ మాట్లాడినంత సులభంగా యింగ్లీషుకూడా మాట్లాడలేక పోయేవాడు."

'వాళ్ళు' అంటే అతని వుద్దేశం మావ్ మావ్ అని.

మధ్యాహ్నాని కల్లా రైలు నకురు చేరుకుంది. ఈ నకురు ముఖ్యంగా మూడు రకాలుగా వుంటుంది: పరిశుభ్రంగా, అందంగా, వ్యవసాయదారుల టౌనులా కోఆపరేటివ్ దుకాణాలతో, కారు ఏజెంట్లతో, పూల తోటలతో హాయిగా వుంటుంది యూరోపియనుల విభాగం. 'ఇండియన్ అసోసియేషన్ హాల్' చుట్టూ ఇండియను తోటలతో పెరిగి వుంటుంది యిండియను భాగం. ఇక, సంత - బజారులాగా వుంటుంది ఆఫ్రికనుల భాగం, ముఖ్యంగా, యీ విభాగం క్రమేణా మారిపోతూ - జైలు గదులను పోలిన యిళ్ళ వరసలతో, చెట్టూ చేమా లేకుండా తయారవుతూ వుంది.

రైలు దిగగానే నా స్నేహితులైన స్కాండినేవియన్ దంపతులు కలుసుకున్నారు నన్ను. టాంగన్యికా ప్రభుత్వం అక్కడ పరిశోధనలు జరపడానికి అనుమతి యిచ్చేవరకూ యీ దంపతులతోనే నా నివాసం. రైలు దిగీ దిగగానే నా యీ స్నేహితుడు పక్కనే వున్న ఒక ఆంగ్ల యువతిని నాకు పరిచయం చేశాడు - ఆమె అభిప్రాయాలూ అవీ నాకు ఉపయోగ పడతాయన్న నమ్మకంతో. కికుయూ వితంతువుల, పిల్లల పునరావాస కార్యక్రమంలో యీమె కమ్యూనిటీ డెవలప్‌మెంట్ అధికారిగా పని చేసింది. ఉన్‌యోల్, ఉజిస్సు రైతులలో ఓలి విషయాలను గురించి నాకు చెప్పిన ము-గండా వనితకూ, యీమెకూ మావ్‌మావ్ తిరుగుబాటు అణచివేశాక కెన్యాలో పరిస్థితులు మరీ విపరీతంగా తయారు అయాయి. కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కార్యక్రమాలు ఇటు యూరోపియన్ విమర్శలకీ, అటు ఆఫ్రికను విమర్శలకీ కూడా నిలపవలసి వచ్చింది.

అక్కడనుంచి మేం ముగ్గురమూ ఫ్లెమింగో పక్షులకు ప్రసిద్ధి గాంచిన నకురు సరస్సు దగ్గిరకి వెళ్లాము. ఈ ఫ్లెమింగో ముక్కు-

పెద్దది. పాత రాతి యుగపు పనిముట్టులాగా వుంటుంది దాని ముక్కు. పిల్లి పంజా విసిరినంత నేర్పుతో యీ ముక్కును నీటిలోకి ముంచుతుంది. ఎంత బలంగా ముంచుతుందోగాని ఆ క్షణంలో కంటికి కనుపించని శక్తి ఏదో కదిలించినట్టుగా దీని శరీరం వణికిపోతుంది. అప్పుడే సన్నగా పూచల్లావున్న కాళ్ళతో అందంగా నడుస్తుంది ఫ్లెమింగో. యింత సన్నటి కాళ్ళమీద యింత సులభంగా, అందంగా ఎలా నడుస్తుందా అని ఆశ్చర్యం కలుగుతుంది మనకి. 'దాన్ని పూర్తిగా పక్షుల నివాసకేంద్రంగా అధికార రీత్యా గుర్తించారు' అన్నది కమ్యూనిటీ డెవలప్‌మెంట్ అధికారి.

"అవును. దాని కెంతో ఘర్షణ పడ్డతరువాత" అన్నాడు వ్యంగ్యంగా నా స్నేహితుడు.

"అవును. యూరోపియనుల అయిష్టత ! ముఖ్యంగా"

ఈ యిద్దరూ చూడడాని కెంతో స్నేహితులుగా మసలుతున్నా, ప్రతిక్షణం యిలా రాజకీయ పార్టీల విభేదాలతో ఎత్తిపొడుచుకుంటూనే వున్నారు. బ్రిటిషు గవర్నమెంటు సంస్థలో ఉద్యోగం చేస్తూన్న యీమె జాతీయ సమైక్యతకీ, న్యాయానికీ ప్రతినిధిగా మాట్లాడితే - అక్కడ నివాసం ఏర్పరచుకొన్న తెల్లదొరగా, తమదే హక్కు భుక్తం, తమరే యీ నేల ఫలవంతం చేశామన్నట్టు మాట్లాడుతున్నాడు స్కాండినేవియన్ స్నేహితుడు.

"ఈ జాతివాళ్లు కనుక ఈ ప్రదేశం లోబరచుకొని వుంటే పక్షుల కోసం ప్రాకులాడేవా రంటావా?'' అన్నాడు.

అతని పొలంమీది ఆఫ్రికను కూలీలతో ఎంతో ఆదరంగా మాట్లాడే వాడు. వారితో నవ్వుతూ అరుస్తూ ఎంతో చలాకీగా వుండేవాడు. వాళ్ళు పనిచేస్తూవుంటే తనూ ఏ మిషనుక్రిందనో వుండి విప్పుతూ తిరిగి అమరుస్తూ వుండేవాడు. "స్వతహాగా వీళ్ళలో చాలామటుకు మంచివాళ్ళే. నువ్వు వాళ్ళని మానవత్వంతో చూస్తే చాలు, ప్రాణం పెడతారు, వీళ్ళని పాడుచేస్తూన్నది పైవాళ్ళే."

ఈ 'మంచి కుర్రాళ్ళు' కికుయువాళ్ళు. మావ్‌మావ్ విప్లవంలో ప్రముఖపాత్ర వహించి ప్రపంచపు దృష్టిని ఆకర్షించిన తెగలోని సభ్యులు;

కెన్యాలోని మావ్‌మావ్ తిరుగుబాటు విపరీతమైన ప్రచారానికి లోనైంది. దాన్నిగురించి కోకొల్లలుగా రాశారు. ఇప్పటిదాకా రాసిన దానికి జతగా నే నేం రాయను. కాని దాన్నిగురించి కొన్ని పరిశీలింప వలసినవి వున్నాయి.

కెన్యా జనాభా ఆరున్నర మిలియన్లుగా లెక్కింపబడినది. దానిలో ఇరవయ్యో వంతుకింటె తక్కువభాగం వలస వచ్చిన గుంపులు ఆక్ర మించుకుంటారు. ఆసియనులు 1,65,000. యూరోపియనులు 64,700. ఈ యూరోపియనులలో సగంమంది మటుకే ఎత్తుప్రదేశాలలో వ్యవసాయ దారులుగా వున్నారు. మిగిలినవారు పోలీసు, మిలిటరీ, యితర ఉద్యోగాలలో వున్నవాళ్ళు. దక్షిణ ఆఫ్రికను యూనియన్‌లో నున్న యూరోపియనుల కంటె కూడా యిక్కడి వారు చాలా తక్కువ సంఖ్యాబలంలో వున్నారు. 3,011,000 యూరోపియనులు 9,606,000 ఆఫ్రికనులపై యాజ మాన్యం కల్గివున్నారు. 1958 నాటికి, వీరికి తోడు 441,000 ఆసియనులు, 1,360,000 'నల్లవాళ్ళు' ఏ సివిల్ హక్కులూ లేనివాళ్ళు వున్నారు. వీటిలో విలక్షణమైనది యూరోపియనులలోని విభిన్నత, స్కాండినేవి యన్స్, స్విస్, జర్మన్, ఆస్ట్రియన్, ఛెకోస్లోవేకియన్, హంగేరియన్, పోల్, జూయిష్ కాందిశీకులు, రష్యను యితర విప్లవ తెగలవారు, ఫాసిస్టులు - ఇంకా గ్రీకులు, ఆర్మేనియనులు, క్రిష్టియన్ ఆరబ్బులు ఎందరెందరో వున్నారు.

19 వ శతాబ్దం పూర్తి అయ్యేసరికి ఉగండాలో బ్రిటిష్ రూల్, ఆర్థిక పీడనమూ కూడా పూర్తి అయి ఒక దారిన పడ్డాయి. అందుకే మొంబాసానూ, విక్టోరియా సరస్సునూ, ఉగండానూ కల్పుతూ రైలుమార్గం వేయడానికి నాంది పలికారు. ఇది చాలా పెద్దపని. ఉత్తర హిందూస్థానం- ముఖ్యంగా గుజరాతు నుంచి తెచ్చిన కూలీలద్వారా పని జరగడం జరిగింది. ఈ రైలుదారి నిర్మిస్తున్నప్పుడు చాలా కష్టాలను ఎదుర్కోవలసి వచ్చింది. ఇప్పుడు కెన్యా కాలనీ వున్న చల్లని పీఠభూమిమీదుగా రైలుమార్గాన్ని ఏర్పరచడంలో సింహాలు, మస్సాయి క్రూరులు, అన్నిటికి మించిన శీతోష్ణపరిస్థితి. దరిదాపు పదివేల అడుగులకు పైగా ఎత్తుగావున్న అక్కడ

స్కాటిష్ ఇంజనీర్లకి బాగున్నట్లు, గుజరాతులోని సర్వసాధారణ రైలు కూలీలకి బాగుండదు కదా!

ఇరవయ్యో శతాబ్దపు తొలి దశాబ్దంలో యీ రైలుమార్గం లాభాలు సంపాదించి పెట్టడం ప్రారంభించింది. జనసంఖ్యే లేని పీఠభూమిమీద నుంచి సాగిపోయే యీ మార్గాన్ని చూసి చూసి యూరోపియనులకి బాగా అలవాటు అయిపోయింది. అందుకే యీ ప్రాంతంకూడా నివాస యోగ్యంగా వుంటుందన్న బంగారు ఊహ కల్గింది కొందరికి. ముఖ్యంగా లార్డు డిలామేర్ పెద్దయెత్తున యీ పునరావాస కార్యక్రమం ప్రారంభించాడు. గొఱ్ఱెల మందలు, పశువుల మందలు తోలించాడు. గోధుమ పిండిమరలు లేచాయి. మాంసం, పూలు వ్యాపారాలు సాగాయి. చూస్తుండగానే కెన్యా పీఠభూములు యీ చీకటి ఖండంలో యూరోపియనుల పాలిట 'స్వర్గం' గా వెలిశాయి. కొత్తగా తెరచుకొన్న యీ ద్వారాలగుండా రావడానికి సంసిద్ధులైనవారు సర్వసాధారణంగా ఐశ్వర్యవంతులైన ఇంగ్లీషు వారే; గౌరవ ప్రపత్తులు కల్గిన తండ్రుల కొడుకులు, విదేశాలలో వేటాడ్డం యిష్టపడేవాళ్ళు, సాహసమూ, సంతోషమూ కలిసి వుండి, విక్టోరియను పద్ధతి సంకుచిత సంఘనియమాలు లేని యీ చోటు యిష్టపడే యువకులు వచ్చి చేరారు యిక్కడ. చక్కని శీతోష్ణ పరిస్థితులలో గుంపులు గుంపులుగా జీబ్రాలు, లేళ్ళు, గ్నూస్, దుప్పులు, నిప్పుకోళ్ళు, సింహాలు కనిపించేవి. ముఖ్యంగా కికియు తెగతోనున్న ఆఫ్రికను జనాభా రానురాను తగ్గిపోతూంది. ఇంకా ఉత్తరాదిగా పోతే, అక్కడ భయంకరులైన మసాయి తెగవీరు లున్నారు. ఇంగ్లీషు సైనికు డెంత స్నేహపాత్రుడో వీరూ అంతే. అలాగే మన గూర్ఖాలు, హిమాలయను తెగలవారిలాగ.

ఒకే సమయంలో వివిధ పరిస్థితులు కలిపి పనిచేయడం సంభవించింది. అటువంటి అదనులో కికుయులు త్వరితగతిని నిర్వీర్యం, నిర్మూలము అయిపోతున్నారన్న దురభిప్రాయం అక్కడి యూరోపియను నివాసులలో కలిగింది. అమెరికాస్‌లో స్వజాతీయులైన అమెరిండ్స్ ఇలాగే నెమ్మదిగా ఆరిపోతున్నారన్న అభిప్రాయం కలిగినట్లు. ఇంకాస్ విష

యంలో, అజ్టెక్స్ విషయంలో, మయాస్ విషయంలో లాగే యిక్కడా జరిగింది. అంతర్గతంగా విషమ పరిస్థితులతోనూ, పోటీలతోనూ సతమత మవుతున్న సమయంలో కికుయులకు, మస్సాయీలకు మధ్య యూరోపియనులు ప్రవేశించడం జరిగింది. మస్సాయీలవంటి శక్తివంతులైన పశుపోషకులు నెమ్మదిగా ముందుకు సాగుతూ, మృదువైనవారు, భూమి సాగుచేసుకొనేవారు అయినా- బంటూతెగలను వెనక్కినెట్టడం ప్రారంభించారు. ఇలా యిరుకున పడిన వారు తీరవాసులైన మిజిఛండా తెగవారు, యిక్కడ కెన్యాలో కికుయులు. తరతరాలుగా యీశక్తివంతులైన ఉత్తరాది తెగలవారికి, బంటూ మాట్లాడే వారి యిరుగు పొరుగులకి మధ్య విభేదాలు రగులుతూనే వున్నాయి. ఉత్తరానికి దగ్గరలో ఉన్న బంటూ తెగకు చెందిన యీ కికుయులు మటుకు మస్సాయీ తెగల రాటు పోటులకు ఎక్కువగా గురి కావలసి వస్తూంది. తెగలకు మధ్య దెబ్బలాటలు, యిష్టం లేకుండా కికుయు కన్యలను మస్సాయీ పురుషులు పెళ్ళిచేసుకోవడం - యీలాంటివన్నీ చేరి ఒక కొలికికి వచ్చి విద్వేషాలు శిఖరాగ్రాన వున్న తరుణంలో 1903 నాటికి అమితోత్సాహంతో యూరోపియనులు యిక్కడ నివాసాలు ఏర్పరచుకోవడం ప్రారంభించారు. ఇటువంటి పరిస్థితే యితరత్రా కూడా- టాంగన్యికాలో జరిగింది. కాని తేడా ఒకటి వుంది. ఆ క్షణంలో జర్మనులు దండెత్తి రావడం, వీరూ బ్రిటిషువారిలాగా పూర్తిగా తెలివిమీరి వుండకపోవడం, మంచి శత్రువే చెడ్డ స్నేహితుని కంటె మిన్న అన్న వారి దృక్పథం - వీటివల్ల పరిస్థితులు మారాయి. "మేం రాకుంటే కికుయులు పూర్తిగా నాశనం అయిపోయేవారు" అన్నది ఆంగ్లధోరణి. వీరు నిజానికి బలవంతులైన మస్సాయీ తెగలనే యిష్టపడినా వారితో పోరాడారు.

జర్మను, బ్రిటిషు వలసవారు యీ దేశానికి ఒక్క న్యాయాన్నీ, క్రమశిక్షణనే కాకుండా యింతవరకూ యీ ప్రాంతాల తెలియని సుఖరోగాలను కూడా తెచ్చారు; క్షయ మొదలైనవాటిని తెచ్చారు. చూడ్డానికి తక్కువవే అయినా యివన్నీ ఆఫ్రికనుల పాలిట మృత్యువుగా పరిణమించాయి. ఈ రోగాలనుండి పూర్తి రక్షణ వారి శరీరంలో ఏర్పడక పోవడంచేత వేల సంఖ్యలో హతమైపోయారు. ఈ 'నాగరికత' తో

సంపర్కం వచ్చిన తొలిసంవత్సరాలలో, ముందు సంఖ్యలో సగం అయి పోయారు కికుయులు అని వినికిడి. మస్సాయీ తెగల ఒత్తిడి, కొత్తగా వచ్చిన రోగాలు, బ్రిటిషువారితో వచ్చిన వ్యవసాయపు అభ్యుదయం అన్నీ కలిసి ఒక విధమైన బద్ధకాన్ని-బ్రతుకుపట్ల బద్ధకాన్ని తెచ్చాయి కికుయు లకు. "అర్హులే నిలుస్తారు" అన్నదే నినాదం అయింది. ఇదే నిస్త్రాణ అమెరికా, ఆస్ట్రేలియా, యితర ప్రదేశాలలోని జాతులవారిని కూడా ఆక్ర మించుకుంది. "అర్హునకే మనుగడ" అంటే తెల్లవారికంటె అర్హులెవ రుంటారు? అక్కడక్కడ కూడా నేల పీలికలుగా కికుయు తెగలకని రిజర్వు చేసి మిగిలినదంతా శ్వేతజాతుల విస్తీర్ణానికై వినియోగింపబడింది; అందుకై నిర్ధారింపబడింది.

కాని అనుకోని విధంగా యీ 'ప్రత్యేకత' మలుపు తిరిగింది. కికుయులలో చాలామంది మతాంతరానికి కుతూహలం వ్యక్తపరిచారు. దానితో దరిదాపు మిలియను సభ్యత్వం కల యీ తెగలవారు క్రిస్టియను ఫాదరీలకు అభిమాన పాత్రులయ్యారు. మిషను స్కూళ్ళు, బట్టల మిల్లులూ అధికంగా పరిశ్రమించడం ప్రారంభించాయి. ఆఫ్రికనులను యీ దెబ్బతో పూర్తిగా-లోపలా బైటా కూడా మార్చడం జరిగింది. ఈ శ్రమ ఫలితం రెండువైపులా పదునున్న కత్తిలా తయారైంది. ఛాందసానికి నిలయమైన వారు యీ కత్తి తిప్పడంతో, ఆఫ్రికను సాంప్రదాయక చిహ్నమైనా పూర్తిగా అనుసరింప కల్గారేగాని ఆదరింప పూనుకోలేదు. మొదటి ప్రపంచయుద్ధం అంతమయ్యే నాటికి పూర్తిగా క్రైస్తవమతాన్ని స్వీక రించి, పాశ్చాత్య పద్ధతులను అనుసరిస్తూ తమ జాతిని, తమ నాగరికతను అసహ్యించుకొనే కికుయుల సంఖ్య అధికం అయింది. యూరోపియను పద్ధతి వస్త్రధారణ, ఆర్థికాన్వేషణే నాగరికతకు చిహ్నాలైనాయి. అభ్యు దయానికి మెట్లు! తత్ఫలితంగా వీరు యూరోపియనులని పూర్తిగా అను కరించడం సాగించారు. బరువైన బూట్లనుండి మోజైన పేచీకోరుతనం దాకా, శరీరాన్ని పూర్తిగా కప్పే దుస్తులనుంచి అతినేర్పుతో కూడిన వ్యాపారం దాకా అనుకరించారు. తమ నేర్పుని, అభ్యుదయాన్ని అందరికి తెలియజేశారు. తమకి తామే తెలియజెప్పుకున్నారు.

రెండు ప్రపంచ యుద్ధాలకీ మధ్య యింకో రకం వలసజాతి తయారైంది. వీళ్ళ జాతి, నాగరికతలలో శ్వేతజాతులకీ నల్లవారికీ మధ్య తేడాలను స్పష్టం చేయడమే కాకుండా, ఇతర యూరోపియనుల ఆధిక్యతను కూడా యినుమడింపజేశారు. అర్థంలేని కట్టుకథల చుట్టూ ఆధిక్యతను నిరూపించుకోవడం ఆఫ్రికనులది కాదనుకోండి! 'మేం వచ్చేదాకా' అక్షరాలు లేవు వాళ్ళకి. మేం వస్తేగాని చక్రం తిప్పడం తెలియదు వారికి. తమ ఆధిక్యతని ఏ విధంగానూ తెరమరుగు చేయలేదు సరి కదా, కొందరిలో కొందరు - పూర్వపు అమెరిండ్స్‌లాగా, టాస్మేనియన్స్‌లాగా శీఘ్రగతిని నిర్మూలం అయిపోరా అని ఆశించారు కూడా. యువకుడైన వారసుడు రోగిష్ఠి ముసలివారికోసం, వారి చావుకోసం ఎదురుచూస్తూ ఒక చిన్న గుడిసె ప్రత్యేకించుతాడు. ఇక్కడే ఒక ప్రశ్న తలెత్తుతుంది: అది ప్రాథమికమైనది కూడా!

ఒకేజాతికి చెందిన ప్రాణులలో యిలా బలవంతుడు బలహీనులపై ఆధిక్యత వహించడం ఒక్కటే వీరిమధ్య సంబంధ బాంధవ్యాలకి మార్గమా? వర్ణభేదాలవారు, వివిధ నాగరికతలకు చెందినవారు సమానులుగా, స్వేచ్ఛగా కలసి మెలసి బ్రతికే దారే లేదా?

'సమానులు' అన్నదానికి 'ఒకటే' అని అర్థం చెప్పుకుంటే చిక్కే. ఎందుకంటే, వివిధతెగలు, వివిధవ్యక్తులు ఒకటే అని ఎలా అంటాం? . అత్యధికంగా వర్ణాంతర, వర్గాంతర వివాహాలు జరిపించి, కొనసాగిస్తూంటే తప్ప ఈ విభేదాలు తగ్గవు, తప్పవు. ఇప్పటికీ యు. ఎస్. ఏ. లో, ఇండియాలోని ఆంగ్లో యిండియనులలో, పాకిస్తాన్‌లో యివి నిలిచివున్నాయి. వ్యక్తులెలాగైతే విజయవంతమైన వివాహాల ద్వారా విభేదాలకు స్వస్తి చెప్తున్నారో అలాగే తెగలూ చేయాలి. అప్పుడే ఈ హెచ్చుతగ్గులు సమసిపోయే అవకాశంవుంది; ఇదొక అందని ఎండమావి అనుకోనక్కరలేదు. పరిస్థితులు అనుకూలించడంతో ఈ పద్ధతి హవాయిలో ఫలితాల నిచ్చింది. బ్రెజిల్‌లో కూడా ఫలవంతం అయే అవకాశాలు కన్పిస్తున్నాయి. మెక్సికోలో, యితర లాటిన్ అమెరికన్

దేశాలలో కొనసాగేలా కన్పడుతున్నాయి. కాని సుదూర భవిష్యత్తులో యిటువంటి దేమీ ఆఫ్రికాలో జరగదేమో.

అయితేమాత్రం త్వరలోనే ఈ విశాల ఖండంలో ఏదో ఒక భాగంలో జాతుల సమైక్యతకి నాంది పల్కాడం జరగాలి. దీనికి జాగు పనికిరాదు. మానవజాతికే ప్రమాదం, విషాదకరం అనిపించే ఏ మావ్ మావ్ విప్లవమో పెద్దఎత్తున రేగినా, దానితోకూడా వచ్చే బీభత్సాన్ని అరికట్టాలి.

ఈ సమస్యలోని ముఖ్యాంశా న్నొకదాన్ని ఎదుర్కోక తప్పదు.

ప్రస్తుతంలోవున్న తేడాలను గుర్తించడం పక్షపాతం చూపడమా?

భార్యాభర్తలు వేర్వేరు తెగలవారైన పక్షంలో ఒకరిపై ఒకరు ఆధిక్యత వహించితీరాలా? ఆధిక్యత న్యూనతలను నల్లతోకలతో సహా అడ్డుకట్టాలా?

హవాయిలోగాని, బ్రెజిల్ మెక్సికోలలో గాని యిలాంటి బాధ లేదే! ఆఫ్రికాలోనే ఈ సమస్య - అందులోనూ యూరోపియనులు అత్యధిక సంఖ్యలలో నివాసాలు ఏర్పరచుకొన్న ప్రాంతాలలోనే ఈ విభేదాలు బలవత్తరంగా వుండడానికి కారణం ఏమిటో తెలుసుకోవాలి. నిజమే - ఎందువల్ల?

ఈ విషయంలో చేసిన పరిశోధనంతా ఒక దారిన పడిపోయింది. అది తప్పుదారి. అలవాటు ప్రకారంగా యూరోపియనులు - ఆఫ్రికనులు - లేకుంటే ఆసియనులు అనేస్తారు. దానితో విపరీతమైన తేడా యున్న యీ గ్రూపులన్నీ ఏం తేడాలు లేని ఏక గుంపులుగా అనిపిస్తాయి. కాని నిజానికి వీటిలో ఎన్నో తెగలు యిమిడివున్నాయని మనకి తెలుసు. సాధారణంగా ఒకే నాగరికతకు చెందిన తెగలోనే ఎన్నో చిన్నచిన్న తెగలుంటాయి: భాషాపరంగా, మతపరంగా ఎన్నో తేడా లుంటాయి. ఈ చిన్న తెగలు ఎలా పనిచేస్తాయో పరిశీలిద్దాం. జాతీయ, అర్ధజాతీయ తెగలన్నీ కూడా ఆడా-మగా, ముసలీ - ముతకా గుంపులతో, కొన్నిచోట్ల పేదా-గొప్పా తేడాలతో నిర్మితం అయివుంటుంది. ఇటువంటి సున్నితం

అయిన విషయాలను పరిశీలించి తెగలలోని చిన్న గుంపులలో తేడాలను తెలియచెప్పడం, ముఖ్యంగా ఆఫ్రికను దృష్ట్యా పరిశీలన జరపడం మానవ పరిణామ శాస్త్రజ్ఞుల పని. యీ ముఖ్యమైన పని ప్రారంభంలోనే యూరోపియను అధికారులపై ఆధారపడి వుంటుంది మరి ఈ దృశ్యానికి యూరోపియను దృక్పథం ఏమిటి? ఇరువైపులనుండీ కూడా పాలు పంచుకొనే స్త్రీపురుషుల పాత్ర ఏమిటి? ఎవరు వీటి నన్నిటినీ పట్టుకుని ప్రాకులాడుతారు? ఇటువంటి వెన్నో వర్ణసంబంధాలు ఎవరూ తెలుసుకోనైనా లేదు. వీటితో సంబంధం కల్గివున్నవి ఎన్నో సమస్యలు. వీటిలో ఒకటే విభిన్నమైన యూరోపియను వలసవారు, వారు వచ్చిన విభిన్నమైన వాతావరణాలు. ఈ విభిన్నత్వం దైనందిన జీవితంలో ఎంతో ప్రముఖపాత్ర వహిస్తూంది. అలాగే సామాన్యమైన యితరవర్ణ సంబంధాలపై ప్రభావం ప్రసరిస్తుంది. దక్షిణాఫ్రికాలో, అల్జీరియాలో అధిక సంఖ్యలోనున్న శ్వేతజాతులు స్థానికంగా ప్రముఖమైన యూరోపియను తెగకంటె విభిన్నత్వం కలవారు. ఈ పరిస్థితే న్యూనతాభావనకి దారితీస్తుంది. దీనితోపాటే 'అయ్యో పాపం' అన్న చిన్నచూపు. అలాగే, ఎలాగేనా అవకాశం దొరికినప్పుడు తిరగబడా లన్న కోరికా యూరోపియనుల మధ్యనే కూడా ఏర్పడ్డానికి అవకాశం వుంటుంది. ఇటువంటి వోకడలు న్యూనతాభావనతో సతమతమయే వారికే కాకుండా అటువంటిది కల్గినవారితో కలిసి బ్రతుకుతూన్న వారికి కూడా హానికరంగా పరిణమిస్తాయి. తిరగబడాలన్న కోర్కె అంతరాంతరంలో మునిగివున్న వారితో మరీ ప్రమాదం. ఎందుచేతనంటే-దీని అసలుస్వరూపం గుర్తించే ఇంగితజ్ఞానం వుండదు కనుక.

ఖండాంతరాలకి వలస వచ్చిన యూరోపియనులు యింగ్లీషు మాట్లాడినా, నిజమైన యూరోపియనులకి పైవారుగానే తోస్తారు. వీరు ఏదో తగుమాత్రం వర్ణభేదం కల జాతీయులుగానే తోస్తారు. పూర్వంలో ఇండియాలో పనిచేసి విశ్రాంతికై దేశం వెళ్ళిన "బుర్రా సాహెబ్" లు యిలాగే చూడబడేవారు. వీరు రిటైరైనాక ఇంగ్లండులో చిన్న యిల్లు కొనుక్కోనో, లేకుంటే అంతకంటే పెద్దదైనది ఏ కెన్యాలోనో సంపాదించుకునో కాలం వెళ్ళబోసేవారు.

ఇతరులకి, అంటే యిలాంటి సెకండు క్లాసు యూరోపియనులు కానివారికి తాము పూర్తిగా శ్వేతజాతి వారమని, ఆ ఘనత చాటుకోవాలని ఆత్రుత ఎక్కువ అయి, వారు దానితో పాటే యూరోపియనులకీ కానివారికీ, జాతీయులకీ మధ్య అగాధం ఎక్కువ చేశారు అంటే అతిశయోక్తి కాదు. మతం పుచ్చుకున్నవాడు మతప్రవక్త కంటె అధికుణ్ణి అనుకున్నట్టుంది యీ ధోరణి! నాజీ తెగలకంటె జాతీయత గల నాజీనని ఏ హెర్ గోబెల్స్‌గారో ప్రయత్నించిన ట్లుంటుంది! ఇలా అనడంలో నా ఉద్దేశం యూరోపియనులు కానివారందరి పట్లా న్యూనతాభావం కల్గి వుంటారు యూరోపియను లని కాదు. ముఖ్యంగా కొందరు. స్కాండినేవియన్స్‌కి యీ దుర్గుణము అసలే లేదు. యీ అంటువ్యాధి వారికి సోకనేలేదు. కాని వారు సూత్రానికి కట్టుపడని ఉదాహరణలలాంటివారు మాత్రమే. శక్తివంత మైన ఒత్తిడి నిచ్చేది—గౌరవం కోసం ప్రాకులాడ్డం అన్నది మానవ నైజం. దాని ప్రభావానికి లోబడేవారే అత్యధికులు. ఈ గౌరవం కోసం వేటాడ్డానికి అనువు శ్వేతజాతులు - జాతీయ తెగలు వున్న చోట్లు. ఆర్థికంగా స్తోమతు కలవారు, అధికారం చేతులో వున్నవారు యూరో పియనులు, అలాగే ఆర్థికంగా పీడితులు, సాంఘికంగా తక్కువ తెగకు చెందినవారు, అధికారం చేతలేనివారు, పాలితులు ఆఫ్రికనులు. అధికం, అల్పం అన్న సూత్రానికి యూకోపియనులలోనే తులతూగలేని యూరోపియనులే - నేర్పు లేకుండా శ్వేతేతరులపట్ల ప్రవర్తించడం ముదావహం. అల్జీరియాలో, దక్షిణ ఆఫ్రికాలోలాగనే ఈ పరిస్థితి కెన్యాలో కూడా బలంగా వుంది. అలాగే ఫ్రెంచి కోలనులు. ఇటాలియన్ స్పానిష్ గ్రీక్ చెకోస్లావేకియన్ ఏ యితర యూరోపియను తెగవారైనా సరే అరబ్స్‌ని బికాట్స్ అని అంటారేగాని, నిజమైన ఫ్రెంచి తెగవారు యీ తేడాని తెలియచేయడానికి చాలా చక్కగా ప్రవర్తిస్తూంటారు. దీనికి జత చేపి శ్వేతజాతుల బాధ్యత అన్నట్టు మతైకమయిన ఔన్నత్యం, ఆర్థిక జయము యివి కూడా జాతిభేదాలమీద దృష్టి కేంద్రీకరింపచేస్తాయి. యీ తత్వం మూలంగా మతైకమైన, జాతిపరమైన ప్రతీకారవాంఛ-తిరుగుబాటు తత్వం అంతర్లీనమై వుంది ఇరుపక్షాల వారినీ పీడిస్తుంది. న్యూనతాభావనతో

బాధపడేవారి మూలంగా తప్పుడు పనులకు దారి తీసే చేతలూ, వాటిని కొండంతలుగా వూహించుకుని ఎదుర్కొనడానికి యితరమైన తప్పుడు చేతలూ తలెత్తుతాయి. వీటికి వ్యక్తిగత స్వార్థమే కారణం. వీటికి కారణం తామే అని ఒప్పుకుందుకు ఆత్మగౌరవం అడ్డు తగులుతుంది. అందుకే కారణం ఏమిటన్న ప్రశ్ననే తలెత్తకుండా ఆత్మవంచన చేసుకుంటారు. ఇది దారుణమైన పరిస్థితి. దీనికి కారణం అసయిష్టతనం, కక్ష కాకుండా, ఉట్టి అమాయకత్వం, అజ్ఞానం కావడం, దూరదృష్టి లోపించడం, మానవ చేష్టల కన్నిటికీ పునాదివంటి మానవనైజమే అవడం - యీ విషాదకర మైన పరిస్థితిని యింకా విషాదపూరితం చేస్తుంది.

ఈ "నేటివ్ సమస్య" విషయంలో ఎన్నో వివాదాల మూలంగా ఒక ఉద్దేశ్యం ఏర్పడ్డం జరిగింది. యూరోపియన్ క్లబ్బులలో, పొలాల మీద, కమ్యూనిటీ డెవలప్‌మెంటు కేంద్రాలలో - ఎక్కడ పడితే అక్కడే యీ విషయంపై చర్చించడం జరిగింది. కెన్యాలో స్థిరమైన తెల్ల తెగల వారిలో ఎవరూ అనుమానించని ఒక గట్టి నమ్మిక వుంది. మిషనరీవారిది పైచేయి కాని రోజులలో నేటివ్ జనులకు తమ స్థానం ఏదో తెలిసి వుండేది; దానితోనే వారు తృప్తిగా వుండగల్గేవారు. కాని మొదట మిష నరీలు, తరువాత బ్రిటిష్ పార్లమెంటు సభ్యులు వచ్చి వీరి తలలలో ఆలో చనలకి తావిచ్చారు. వారు 'ఎక్కడో తమ స్థానం' అన్న ఆలోచనలలోపడి అసంతృప్తిపరులుగా తయారయారు. ఇంగ్లీషు పిల్లలకి అవసరమైన పద్ధతిలో తయారైన సిలబస్ ప్రకారం వారికి చదువులు నేర్పడం ప్రారం భించారు; వారిచే యూరోపియను పద్ధతిని దుస్తులు ధరింపచేశారు. ప్రతి ఆదివారం చర్చికి వస్తూండడం, తప్పకుండా చందాలు కట్టడం, న్యాయంగా ఒకే భార్యను వివాహం చేసుకోవడం చేస్తే మీరూ మాలాంటి మంచి క్రైస్తవులే అని చెప్పారు. ఇదివరలో వీరిలో లేనిది - భార్య పిల్లతల్లి అయితే తిన్నగా వేశ్యలకోసం నైరోబీదాకా ప్రయాణం చేసే తత్వం వీరిలో యిప్పుడు నాటుకుంది. ఈ విషయాలన్నిటినీ నాకు అర్థమయేలా వివరించిన వ్యక్తి కెన్యాలోని తెల్లవారిలో ప్రముఖురాలే. పూర్వపు ఘన తపై మమతతో గుడ్డిగా నమ్మే తత్వం లేనిది; అలాగే వర్ణభేదం అన్న

జాడ్యం కూడా లేనిది: న్యాయబద్ధంగా వుండాలన్న కోర్కె కలది. మావ్ మావ్ తెగలకు చెందని కికుయులలోని మంచి లక్షణాలని గుర్తించా లన్న ఆత్రుత కల యీామె ఒక వ్యవసాయదారుని భార్య. అయినా, యీామె మటుకు అన్ని అనర్థాలకూ కారణం మిషనరీవారు ముందుగా బైబిలు, తరువాత పత్రికలద్వారా చదువు నేర్పడంవల్ల వచ్చిందని నమ్ము తూంది. ఇదే బ్రిటిషు లేబరు సభ్యులు రావడానికి దారి తీసింది; ఇదే నాజర్ తరఫున ఏజెంట్లు రావడానికి అవకాశం యిస్తుంది; చివరికి యిదే కమ్యూ నిస్టులు రావడానికి కూడా దారి చూపుతుంది. దీన్ని మార్చాలి ...తరుణో పాయం చూడాలి . లేకుంటే ?

ఈ విషయంలో పైకి చెప్పకపోయినా, అనుకుందుకు అభ్యంతరం తోచలేదు నాకు-అమెరికనులు, ఆస్ట్రేలియనులు, టాస్మేనియనులు, యింకా యితర సముద్ర ప్రాంతాలలోని వలసవారు కూడా ముఖాముఖి యుద్ధంలో యీ నేటివ్‌లను రూపుమాపి శత్రుభయం లేకుండా చేసుకున్నారు. మనం ఎందుకు చేయలేము ?

చాలామంది శ్వేత జాతులవారు గుర్తించని విషయం ఒకటి వుంది: ఓ వంద సంవత్సరాల సాంస్కృతిక సమన్వయాలతో, మారిన రహదారి సదుపాయాలతో, సాంఘిక పరిస్థితులతో, కొత్త నమ్మకాలతో, మానవ తత్వ శాస్త్రరీతులతో ప్రపంచపు నమ్మకాలు పూర్తిగా మారాయన్న విషయమే అది.

కెన్యాలో సర్వత్రాకూడ పురుషులకంటే స్త్రీలే యీ జాతిసంబం ధాల విషయంలో పట్టుదల కలవారన్న నమ్మకం నాకు ఓ పట్టాన బోధ పడలేదు. మత కలహాల సమయంలో భారత దేశంలోని అనుభవాలకి ఇది విరుద్ధంగా వుంది. మగవారు విషజ్వాలలు రేపుతున్నా స్త్రీలుమటుకు రెండు కక్షదారుల మురాల మధ్య వంతెనగా పనిచేశారు. ఎందరో సంఘ సేవికలు-హిందువులు, ముస్లిములుకూడ-చేతులు కలిపి పనిచేసి అవమా నితులైన కన్యలని, స్త్రీలని కూడగట్టి వారివారి కుటుంబాలకి అప్పచెప్పారు; అటువంటి భారత దేశంనుంచి వచ్చిన నాకు యిక్కడి స్త్రీలు యిలా అగ్నిలో ఆజ్యం పోస్తున్నారని వింటే పురుషులపై నమ్మకం తగ్గింది.

యూరోపియను పురుషులు పుట్టినే యిలా స్త్రీలని అంటూ వుండవచ్చు, లేదా మానసికంగా సున్నిత భావనలకి తావు లేకుండా చేస్తూ వుండవచ్చు. నిజానికిది మానవ నైజంలో ఒక భాగమేకదా! పిసలైన మగవాని నడవడి ధోరణి యిలాగేకదా వుంటుంది? కాని కొద్దికాలం తరువాత, యిక్కడ కొత్తగా అంత తేలికైనది కాకుండా, తీవ్రమైన సమస్య వుందని తోచ సాగింది నాకు. తల్లి హక్కు తూర్పు ఆఫ్రికాలో ఎంత సబలైనదో, బానిస వ్యాపారం ఖండాంతరాలలో ఎంతటి విషమపరిస్థితో, అంతకు మించినదే యిక్కడ వుందనిపించింది.

మొదట్లో చాలామంది యూరోపియను స్త్రీలు దేశీయులు (నేటివ్స్) అంటేనూ, ఆ మాటకువస్తే ఆసియనులు అంటేనే విముఖులుగా వుండే వారు. వీరి ప్రసక్తి రావడమే వారికి యిష్టం లేకపోయింది. ఎంతో ప్రయత్నంపైన యిటువంటి మాటలు చిక్కాయి.

"ఓ, నేటివ్స్! దానికేం, మాదగ్గిరే పొలంలో ఓ రెండు డజన్ల మందిదాకా వున్నారు. వారిని అదుపులో పెట్టేది టామ్. ముగ్గురు యింటిపనికి వున్నారు. పాపని చూసుకుందుకి ఓ పిల్లవుంది. దాన్ని నేనే అదుపులో పెట్టాను. నమ్ము నమ్మకపో! అదో పెద్దపనే? ..."

సాధారణంగా ఎవరూ యీ దేశీయులను గురించి ప్రసంగించరు. ముఖ్యంగా యీ దేశీయ స్త్రీలుకూడ-వేళాకోళం చేయడానికి తప్పించి-ఆ ప్రసక్తి తీసుకురారు. విక్టోరియను కాలంలో నాగరిక సంఘంలో సెక్సు ప్రసక్తి ఎలా తెచ్చేవారుకాదో, యిక్కడకూడ దేశీయుల గొడవ అలాగే నిషిద్ధంగా తోస్తుంది; ...అదొక సాంఘిక మర్యాద.

నా స్కాండినేవియన్ స్నేహితుని పొలంనుంచి 'నకురు' తిరిగి వస్తూ ఒక క్లబ్బులో చాలా సరదా అయిన ఒక స్త్రీని కలుసుకోవడం జరిగింది. ఉన్నతమైన ఒక ఆంగ్లేయ కుటుంబంనుంచి వచ్చిన యీమెకి స్వాతంత్ర్యం తరువాత భారతదేశంలోని పరిస్థితులను గురించి తెలుసుకోవాలన్న కుతూహలం ఎక్కువగా వుంది. ప్రతి విషయంలోను సరదా వుంది ఆమెకి. ఆమె అడిగిన ప్రశ్నలుచూస్తే నిప్పుకోడిలా ఒళ్ళు దాచుకునే ప్రయత్నంలో తలదూర్చే తత్వం గోచరించలేదు; ఆఫ్రికను

దేశాలకికూడ స్వాతంత్ర్యం రావడం గుర్తించింది ఆమె. శ్వేతజాతుల కాలవాలంగా వున్న యీ ప్రదేశంలో, వాతావరణంలో యీ ధోరణి కొంచెం అసాధారణమైనదే.

దక్షిణ భారత దేశంలో నా జీవితం గురించి ఆమెకి వివరంగా చెప్పాను. "అక్కడ రెండువేలకుపైగా బ్రిటిష్ నివాసు లున్నారు మద్రాసులో. ఇంకా చాలామంది అమెరికనులు, ఖండాంతర యూరోపియనులు కూడా వున్నారు. వీరి సంఖ్య స్వాతంత్ర్యం తరువాత చాలా పెరిగింది." ....ఆమె యింకా అడుగుతూనేవుంది: "ఆంగ్లో యిండియన్స్ ఏమయారు? వీరిలో కొందరు-నీలికళ్లూ తెల్లని చర్మం గలవాళ్ళు - కెన్యాకు కూడా వచ్చారు. మిగిలిన వా రేమైనట్టు? గోవాకు చెందిన వా రేమయారు? ఇండియన్ క్రిస్టియను లేమయారు?" ఆమె కుతూహలం పూర్తిగా మానవ పరిణామ శాస్త్రకారుల కుతూహలం లాగే తోచింది.

"పనిచేసే స్త్రీలు ఎలా వుంటున్నారు? ఇప్పుడు ఆఫీసుల్లో ఎక్కువగా ముస్లిమ్, హిందూ వనితలు వుంటున్నారా?"

ఆమె విజ్ఞానయుతంగా అడుగుతున్న ప్రశ్నలపట్ల నా ఆశ్చర్యాన్ని ప్రకటించాను. కాని, తన స్నేహితులలో చాలామంది ఇండియాలో పుట్టిన వారేననీ, కొందరు కొంతకాలం ఇండియాలో వున్నవారేననీ, యుద్ధం తరువాత కొంతకాలం ఇంగ్లండులో వుండి ఇక్కడికి వచ్చినవారే అనీ చెప్పింది. తనుకూడా కొంతకాలం క్రిందటివరకూ యూరోపియను ఆఫీసులో బాధ్యతగల ఉద్యోగంలోనే వుండేదాన్ని అనీ, కాని యిక్కడ కెన్యాలో పుట్టి పెరిగిన ఒక యూరోపియన్‌ను వివాహం చేసుకుందుకని ఆ ఉద్యోగం వదిరేసేననీ, ఆ ఉద్యోగం వివాహితురాలైన స్త్రీకి తగింది కాకపోవడమే అందుకు కారణం అనీ చెప్పింది.

"స్త్రీల హక్కులకై పోరాడే వారీ పురుషులు అని భ్రమపడకండి-వర్ణభేదం లేకుండా. ఏ స్త్రీ గదిలోకి ప్రవేశించినా లేచినిలబడ్డం అది ఒక మర్యాదే; అన్ని విషయాలలోనూ వీరు ఆఫ్రికను మగవారినే బలపరుస్తారు. దేశీయమైన సారాకొట్లో స్త్రీలు 'పొంబె' తాగకూడదంటే దీన్ని వీళ్ళు బల

పరిచారు. ఎందుకో తెలుసా? ఆఫ్రికను తెగలవారి న్యాయాని కిది విరుద్ధం అని కాదు. యూరోపియన్ అధికారులు దీన్ని నిషేధించారు. అందుకనే!''

పోనీ, యూరోపియన్ పురుషులకంటె స్త్రీలు తమ ఆఫ్రికను సోదరీ మణులను అర్థం చేసుకోలేరా? అని తలపోశాను.

"నన్ను వ్యక్తిగతంగా అడిగితే 'తప్పకుండా' అని చెప్పగలను. కాని దీన్నిగురించి మళ్లీ ఎప్పుడేనా వివరంగా చర్చిద్దాం'' అన్నదామె. ''యిక్కడ మా తెల్ల వారి అమ్మాయిలు సృష్టించే కృత్రిమమైన బిగువు చాలా విపరీతమైనది'' అంటూ అందామె.

అక్కడే ఫ్రెంచి చిక్కుళ్ళకోసము, ఇటాలియన్ ఆలివ్‌లకోసము క్యూలో నిలబడ్డాను. పళ్ళేలు పట్టుకుని తిరిగి టేబిల్ దగ్గరకివస్తూ కలయ చూశాను. అక్కడ యూరోపియను కానివాడు ఒక్కడూలేడు. పని కుర్రాళ్ళుమాత్రం వున్నారు - తెల్లని దుస్తులూ తురకటోపీలూ పెట్టుకుని. 'యీ అందమైన క్లబ్బుకూడా వర్ణభేదానికి చిన్న అరా?' అని అడిగాను.

'కాదు. కాని యిదో ప్రైవేట్ క్లబ్ కదా! టెన్నిస్ ఆడడానికని ఓ యిండియన్ అమ్మాయినికూడా తీసుకు రాకూడ దిక్కడికి. ఆమె నేను పనిచేసేచోట చాలా పలుకుబడికలది కావచ్చు: చాలా సరదా అయిన వ్యక్తి కావచ్చు!'

ఆ క్షణంలో మా సంభాషణలో ఒక ఎయస్సు మళ్ళిన స్త్రీ జోక్యం కలుగ చేసుకుంది. యూరోపులో సంప్రదాయికమైన కుటుంబాలలో స్త్రీల ప్రతిపత్తినీ, యిక్కడ జాతిభేదాల సంబంధాలనీ కలుపుతూ మాట్లాడడం ప్రారంభించింది.

"ఇంటిదగ్గిర వుండే స్త్రీలు యీ నాటికీ ప్రతికూల వాతావరణంలోనే వుంటున్నారు. పాత సంప్రదాయం యీనాటికీ తల్లిదండ్రులు మగపిల్లలను యిష్టపడేలా చేస్తూంది. వారే కుటుంబ సంప్రదాయం నిలపడానికీ, ఆస్తి పంచుకుందుకూ వారసులు. వారే కుటుంబాన్ని ఆదుకునేవారు. వారు ముఖ్యంగా పురుషులు! నిజమే. రెండు ప్రపంచయుద్ధాల తరువాత యీ పరిస్థితి మారి పనిచేసే స్త్రీలకి అనుకూల వాతావరణం ఏర్పడుతూంది.

కాని సంఖ్యల దృష్ట్యా చూస్తే పరిస్థితి యింకా దిగజారిందని చెప్పాలి. న్యాయంగా చెప్పాలంటే నూటికి ఎంత మంది స్త్రీలకి 'ఏకభార్యా' సూత్రం క్రింద భర్తలు లభ్యం అవుతున్నారు? వివాహ బంధనానికి అతీతం అయిన సంబంధ బాంధవ్యాలు యీ నాటికీ - స్వీడెన్‌లోకూడా కూడనివిగా చూస్తున్నారు.

మేం పాలులేని కాఫీ త్రాగడం దాకా వచ్చాం. ఆమె యింకా సాగిస్తూంది. "సమానత్వం అన్నది చక్కని పదమే కావచ్చు. కాని సర్వసాధారణంగా అంత వాస్తవికమైనదిగా తోచదు. మగవారి మీద సహితం ఉద్యోగంలో అధికారం కల్గిన స్త్రీలు చాలా స్వల్పంగా వున్నారు. ఇక్కడ మా పరిస్థితితో దాన్ని పోల్చిచూడండి. ఇక్కడ ఒక్కడేనా మగవాడు పనివాడుగా లేని స్త్రీ అంటూ లేదు. మాలో చాలామంది అవసరపరిస్థితిలో వ్యవసాయ కూలీలకు సహితం అజమాయిషీ వహించవలసి వచ్చింది. కాని ఇది ఒకపక్క మాత్రమే. యూరోపియన్ కమ్యూనిటీలో కూడా యిక్కడ స్త్రీల స్థానానికీ, యూరోపులో వారి స్థానానికీ చాలా తేడా వుంది. ఇక్కడ పెళ్ళికాని మగవారి సంఖ్య కావలసినంత వుంది! ఇక్కడి తన ఉన్నతస్థితినీ, సాంఘిక సంపర్కాలపై వున్న విభేదాలనీ గుర్తించలేని గుడ్డివారు కాదు కదా ఆడపిల్లలు? బీదస్థితినుండి వచ్చిన పిల్లలే ఎక్కువగా యీ తేడాని గుర్తించ కల్గుతున్నారు. అందుకే మరీ ఎక్కువగా ఆఫ్రికనులని దూరం చేస్తున్నారు. రెండవ తరహా యూరోపియనులు గాని వారి ద్వారా ఎక్కువగా చేయపడుతున్న యీ విభేదాలు యూరోపియను స్త్రీల నడుమ కూడా పని చేస్తూన్నాయి. ముఖ్యంగా తక్కువ సాంఘిక ప్రతిపత్తినుంచి వచ్చినవారిమధ్య.

ఒక్క మెరుపులో పూర్తిగా యీ సంబంధ బాంధవ్యాలని విడమర్చి చెప్ప కల్గిన ఒక పిట్టకథ విన్నాను నేను. ఒక యూరోపియను రాజకీయ వేత్త యీ సర్వజాతి సమన్వయ సూత్రాన్ని ఉద్ఘాటించాడుట – "ఏ మంచి ఆఫ్రికను వ్యక్తినైనా సోదరునిగా భావించదానికి నా కెటువంటి అభ్యంతరం లేదు. కాని నా బావగారిగా మాత్రం కాదు!" అని జాగ్రత్తగా అన్నాడుట. అయితే రక్తసంబంధమా, నైజమా, ఈ జాతుల మధ్య తేడాలని సృష్టించడానికి కారణం? జాతులమధ్య అన్యాయానికి, జాతులమధ్య

ద్వేషానికి కారణం ఏమిటి? లేకుంటే - ఒక వింత రూపం దాల్చిన సాంఘిక ప్రతిపత్తి కారణమా? సాంస్కృతికమైన ఒక పరిస్థితి, దాన్ని సమూలంగా పరిశీలించే అవకాశం వుంటే, యింకేయితర సాంఘిక కట్టుదిట్టాలలాగే యిదేమో కారణం! పోనీ, మనతో పాటు పుట్టి పెరిగిన ఒక మానవ సహజమైన నైజగుణమా? మానవ కల్పితమైన సాంస్కృతిక బంధనమా? దీనికి ఏమిటి కారణం? ఒక చట్టంలో బిగింపబడి మార్పు లేకుండా సాగిపోయే నడవడియా? ఏమిటి కారణం?

ఇలా ఆలోచించిన కొద్దీ నిశ్చితాభిప్రాయాలు కలిసిపోరాయి. ప్రశ్నల పరంపరలు పుట్టుకు వస్తాయి. వీటికి సరైన సమాధానాలు చెప్పు కోలేని నా అసమర్థత నాకు తెలుస్తూనే వుంది. సాధారణం అయినవీ, ఏ విధంగానూ పైకి సంబంధం కనిపించనివీ సాంఘిక అలవాట్లను పరిశీలించడం మొదలుపెడితే, వధువు-ఓలి, పెళ్ళి ఖర్చులు, బానిసత్వం యివన్నీ నా తలలో మెదలడం మొదలుపెట్టాయి. ఇవన్నీ కలిసి నాకు స్తిమితం లేకుండా చేశాయి. వీటిలో ఏ ఒక్కటైనా యింకోదానికి నాంది పల్కిందా? ఏ రెండింటికైనా ఒకే కారణం వుండి వుంటుందా? లేకుంటే యివన్నీ యాదాలాపంగా ఒకేసారి జరగడం జరిగిందా?

దైనందినం మనని వేధించేదీ, సర్వసాధారణం అయినదీ ఒక ముఖ్యమైన ప్రశ్న వుంది: అదే-అభ్యుదయ పథానికి ఎదురీదే తత్వం ఎవరివల్ల వచ్చింది? ఉష్ణదేశాలలో బంగళాలు కడుతూ, తెరవబడని గాజు కిటికీలు అమర్చే బుద్ధి ఎవరిది? ఇవి కెనెడాలోని పైన్ అడవులలో ఉప యోగపడవచ్చు. ఉగండాలోని అరటితోటలలో శుద్ధ అనవసరం కదా! మొదటి తరగతి పెట్టెలలో పైకి అన్నీ అందంగా అమర్చి, కనీసపు ఉప సరాలని (ఉదా: స్నానానికి సదుపాయం) సహితం నిర్లక్ష్యం చేసే తత్వం ఎవరిది? నిజంగా దురుద్దేశం వున్నవారు కాదు కదా వీటి సృష్టికర్తలు? ముఖంమీది కోపం ముక్కుమీద చూపేవారుంటారా? ఇలాంటివి చేసే వారు ఒక తరహా స్థితిలో వున్నవాళ్ళు. దీనికి కారణం వారి వింతైన సాంస్కృతిక వాతావరణం. ఈ పరిస్థితిలో వారి స్వాభిమానం ప్రోత్స హించి పైపై మెరుగుల కోసం పరుగులు తీయిస్తుంది. సుఖం, తృప్తి

కంటే అదే ముఖ్యంగా తోస్తుంది వారికి, వాస్తవికతకి, ఆదర్శానికి జీవితంలో వున్న తేడాయే యిక్కడా కన్పిస్తుంది. సర్వమానవ సహోదరత్వం కావాలి అంటూనే బావమరిదిత్వం మటుకు వద్దనే తత్వం ఎవరిది ?

ఈ ప్రశ్న యింకో సమస్యకి దారి తీస్తుంది. ఈ నాడు మతం, సంఘం, జాతి మూలంగా విభిన్నంగా వున్న మానవజాతి కంతకీ సంబంధించినది యీ సమస్య. వీరిలో అందరూ ఏ ఒక్కనాడో నిశ్చయించి యీ బలవంతపు విభిన్నత్వం ఎవరికీ ఎందుకూ మంచిది కాదని నిర్ణయించితే: యింకో విధంగా చెప్పాలంటే - ఏకైక ప్రపంచం అన్న ధోరణి ప్రబలడం చూస్తూంటే విభిన్నపు తెగల మధ్య సాంఘికంగా నిషిద్ధం అయిన వివాహాన్ని ఆమోదించడం కదా ! ఇది వ్యక్తిగత అభిరుచిమీద, ఆకర్షణ మీద కాకుండా సాంఘికంగా గుర్తించడం అవదా ? ఈ ప్రశ్నలన్నీ సులభంగా సమాధానం దొరకనివే. కాని యీ ప్రశ్నలకి త్వరలోనే సమాధానాలు చెప్పుకోవాలి ; అతి త్వరలోనే చెప్పుకోవలసి వుంటుందనే నా భావన.

ఆస్ట్రియను పైను చెట్ల నడుమ చుట్టూ విస్తరించిన మైదానాల మధ్య వున్న ఒక పొలంలో యింట్లో, పుస్తకాల అల్మారులో జొమొ కెన్యటా రచించిన "ఫేసింగ్ మౌంట్ కెన్యా" (1933) అన్న పుస్తకం చూశాను. మళ్ళీ యీ పుస్తకం చదవడం ఒక చక్కని అనుభవం. ఈ పుస్తకానికి ఉపోద్ఘాతం రాసిన మలినో వస్కీ దగ్గర పంధొమ్మిది వందల యిరవైలలో ఇంగ్లండులో జొమొ కెన్యటా మానవ పరిణామ శాస్త్రం చదువుకున్నాడు. ఈ పుస్తకం రాసిన వ్యక్తికి తను చెప్తున్న దేమిటో బాగా తెలుసు ! శాస్త్రరీత్యా యీ పుస్తకాన్ని ప్రాచీనపు తెగల పురాణాలతో ప్రారంభించాడు. పాతకాలపు 'కికుయు' కథను తన ముసలి తండ్రి చెప్పినట్లు చెప్పాడు. అప్పటికి దేశంలో అశాంతిచిహ్నాలు గాని, మావ్ మావ్ సంఘంగాని వూహామాత్రంగానైనా లేవు.

కికుయు అన్న పదాన్ని గికుయుగా వాడుతాడు యీ పుస్తకంలో. పూర్వంలో ఒకానొకప్పుడు గికుయు, అతని భార్య మూంబికి తొమ్మండుగురు కూతుళ్ళున్నారు. ఇంక యీ ప్రపంచంలో ఏ యితర మానవకోటీ

లేదప్పుడు. అందుకే యీ తొమ్మండుగురికీ భర్తలు లేకపోయారు. గికుయుకి యిదో సమస్యగా తయారైంది. కెన్యా పర్వతానికి అముఖంగా వున్న ఒక పురాణ వృక్షం క్రింద దైవాన్ని ధ్యానించడం ప్రారంభించి తన కూతుళ్ళకి భర్తలని వుండేలా చూడమని ప్రార్థించాడు. దేవుడు యితని మొర ఆలకించి హోమాగ్ని ఎలా జ్వలింపజేయాలో నేర్పాడు: అలాగే తొమ్మండుగురు భర్తల కోసం ఎలా ప్రార్థించాలో నేర్పాడు. ఇదంతా జరిగాక, తొమ్మండుగురు యువకులు వచ్చి యీ కన్యలని తమ భార్యలుగా యివ్వమని అడిగారు. ఇవ్వడానికి తనకేమీ అభ్యంతరం లేదనీ, అయితే మీరందరూ తమ భార్యల యింటిచుట్టూ నివసించాలనీ కోరాడు. తరువాతి కాలంలో గికుయు, అతని భార్యా చనిపోయారు. తొమ్మండుగురు కూతుళ్ళూ ఆస్తిని పంచుకున్నారు; ప్రతి ఒక్కరికి ఎంతోమంది సంతానం కల్గింది. వారందరూ కూడా తల్లి పేరుననే పిలవబడేవారు — అచీరె, అగాచికొ, అరిమొ, అంబొయి, అంగరె, అంజిరొ, అన్‌గాయి, ఎథెగా, అధిరాండొ - యీ విధంగా తొమ్మిది ప్రత్యేక తెగలు ఏర్పడ్డాయి. వీరిలో వివాహ సంబంధాలు లేకుండా పోయాయి. ఒకే పూర్వీకురాలి సంతతి కావడమే దీనికి కారణం. కాని యీ తెగల వారందరినీకూడా "రొరెరెర్వా మబరి య మూంబి"—మూంబీ పిల్లలు అనే పిలుస్తారు. వీరూ, వీరి సంతతీ కూడా యిలాగే కాలక్షేపం చేస్తూ వచ్చారు. కాని కొంత కాలానికి యీ ఆడవాళ్ళ అధికారం అసహ్యించుకోవడం ప్రారంభించారు మగవారు. వీరంతా కలిసి దీన్ని అంత మొందించడానికి ఒక సూత్రం కనిపెట్టాలని నిశ్చయించుకుని ఒక హఠాత్ విప్లవం తేవాలనుకున్నారు. ఒక నిర్ణీత కాలంలో కూడబలుక్కున్న యీ గూడుపురాణీదారు లందరూ తమ భార్య లను గర్భవతులుగా చేశారట!

ఈ స్త్రీలకి ఎనిమిదవ మాసం రాగానే యిక వారు పోరాడలేని స్థితిలో, యీ పురుషులు తామనుకున్న విప్లవం తెచ్చారు; స్త్రీలని వారి వారి అధికార స్థానాల నుంచి తొలగించారు; ఇకమీదట నుంచి కుటుంబంలో పుట్టిన మగ కుర్రవాళ్ళే అధికారం చెలాయిస్తారనీ, తల్లిదండ్రుల ఆస్తికి కొడుకులే వారసులనీ నిశ్చయించారు. అప్పుడే పెళ్ళి సమయంలో కన్య

యింటికి వరుడు రావడం కాకుండా కన్యే భర్త యింటికి వెళ్ళిపోవాలని కూడా నిర్ణయించేశారు. ఇక పిదట తమ తెగపేరు మూంబీ పక్షంగా కాకుండా, తమ తండ్రి 'గికుయు' పేరున పిలువబడాలని నిశ్చయించారు. పాత తెగలలోని స్త్రీల పరమైన పేర్లని అప్పట్లో ప్రముఖులైన పురుషుల పేర్లుగా మార్చేశారు. వీటిలో తొలి రెండింటినీ అమలులోకి తెచ్చారు. స్త్రీలకు వారసత్వపు హక్కు పోయింది. అప్పటినుంచీ వీరి తెగపేరుకూడా గికుయుగానే నిలిచింది. కాని సంప్రదాయ సిద్ధమైపోయిన తెగలోని పేర్లు మార్చడం దాకా వచ్చేసరికి స్త్రీలకి కోపం ఆగలేదు. ఇలా చేయడం చాలా తప్పుగా భావించారు. ఇటువంటి నిర్ణయమే కనుక అమలులోకి తెచ్చినట్లయితే తామిక కాపురాలు చేయమని తెలియచేశారు (కెన్యాటా 1938:7). ఈ ఒక్క విషయంలోనే ఆ రోజు స్త్రీలు నిలువగలిగారు. ఇప్పటికీ ముఖ్యమైన కికుయు తెగలవారు ఆ తొమ్మండుగురు అక్కచెల్లెళ్ళ పేర్లనే పిలువబడుతూ వున్నారు. అంతటి కికుయు తెగ కూడా ఇలాగా తల్లిహక్కు నుండి తండ్రి హక్కు పరంగా మారిపోయింది. ఇక తండ్రే యజమాని గాని తల్లి కాదు.

ఈ కెన్యాటా పుస్తకాన్ని ప్రచారంగా విమర్శించారు. ముఖ్యంగా వ్యవసాయపు విషయాలలోనూ, రాజకీయ పద్ధతిలోనూ యీ విమర్శన జరిగింది. కెన్యాలోని భూవసతి విస్తరణా, పరిపాలన విషయాలూ వచ్చినప్పుడు యీ పుస్తకం కోర్టులోకూడా తేబడింది. దీని ద్వారా యీ గ్రంథకర్తకు మావ్‌మావ్ తిరుగుబాటుతోనూ, ప్రమాణ స్వీకారంతోనూ సంబంధం వుందని నిరూపించాలని చూశారు. కాని యీ పుస్తకంలో యీ కథాభాగాన్ని సంశయింపవలసిన అవసరంగాని, కారణంగాని కనిపించదు. మాతృహంశ జాతులుగా వుండే యీ కికుయు తెగలు పితృహంశకు మారడం అన్నది నిజమే. పాశ్చాత్య మానవ పరిణామ శాస్త్రవేత్తలు కూడా స్వయంగా పరిశీలనలు జరిపి యిదే నిర్ణయానికి వచ్చారుకదా!

పూర్వీకులు యిచ్చిన దానికంటె క్రింది మెట్టుకు ప్రతి కదలికతోనూ దిగిపోయారు మహిళలు. ఇది మాతృహంశ సంఘంనుండి పితృపరంగా సంఘం వేసిన ప్రతి అడుగులోనూ కన్పిస్తుంది. వీటన్నిటికంటె ఆశ్చర్య

కరం అయిన దేమిటంటే - యిటువంటి మార్పులు వస్తున్నప్పుడల్లా స్త్రీలు అందుకు ప్రోత్సాహం కల్గివుండడమూ, పురుషుల ఆధిపత్యానికి ఒప్పుకోవడమే; ప్రపంచం మొత్తంమీద కొత్తరకం దుస్తులను ఎంత ఉత్సాహంతో ఆహ్వానిస్తారో అలాగే యీ పోకడలనీ ఆహ్వానించారు మహిళలు. తమ పూర్వపు ఘనత ఒదులుకోవడం, ఏదో 'పాత పోకడ' అన్నంత నిర్లక్ష్యంగా చూడడం ఆశ్చర్యకరమే.

తూర్పు ఆఫ్రికాలో ఏ యితర బంటూ తెగల స్త్రీలూ ఎదుర్కోని కష్టాలని కికుయు స్త్రీలు ఎదుర్కుంటారు. అందరూ యీ విషయంలో ఏకీభవిస్తారు. అక్కడ స్థిరనివాసా లేర్పరచుకున్న శ్వేత జాతులవారు కూడా యీ విషయంలో ఒప్పుకుంటారు. ఒక ఆఫీసులో పొడగరి అయిన జాలువో యువకు డొకడు అన్నాడు - యీ కికుయు యువతులు భరించే కష్టాలను తన తెగలోని అక్క చెల్లెళ్ళు అసలు ఓర్చలేరని; ఒక యూరోపియను వ్యవసాయదారుడు చెప్పాడు-యీ మహిళలు తమ తలపై మోసే బరువుని ఒకసారి తూచాననీ, నూరునుంచి నూట పాతిక పౌనుల బరువు దాకా వున్నాయనీ, వీటిని వాళ్ళు అతని పొలం వెనకగావున్న 3000 అడుగుల ఎత్తుకి నడిచి తీసుకు వెడతారనీ చెప్పాడు. ఇవి అక్కణ్ణుంచి ఏడుమైళ్ల దూరంనుంచి తెస్తారట. "ఇలా వారిచేత పని చేయించేది నేను కాదు. వారి మగవాళ్ళే" అన్నాడాయన.

కికుయు తెగ మగవారుకూడా చాలా కష్టపడి పనిచేసేవారే. వారందరికీ కూడా కష్టజీవితం అలవాటే. అయినా కూడా మిగిలిన వారికంటె కొంచెం తేలిగ్గా తీసుకుంటారు వీరు. యీ చిన్న పరిశీలన నాకో సామెతని గుర్తుకి తెచ్చింది. కేంద్ర అస్సామ్‌లో నేను పరిశీలనలు చేస్తున్నప్పుడు ఖాసీ తెగలవారివద్ద విన్నానిది. మాతృహంశ తెగలుగా వస్తూన్న యీ ఖాసీ తెగలవారు మంగోలాయిడ్ వ్యవసాయదారులు; బలిష్ఠం అయినవారు. వీరి స్త్రీలు కికుయు సోదరీమణులకంటె సైజులో చిన్నగానే వుంటారు. వీరూ కష్టపడి పనిచేయడానికి అలవాటు పడ్డవారే. సాధారణంగా తమలపాకుల బుట్టలు తలపై పెట్టుకుని, పచ్చి చెక్కలను కూడా

పెట్టుకుని మార్కెట్టుకు తీసుకు వెడతారు. అక్కడ స్వంతంగా కుటుంబపు యజమానిగా స్వంత బాధ్యతమీద వ్యాపారం సాగిస్తారు; వారి పిల్లల తరపునకూడా చేస్తారు. కాని సూత్రం మటుకు 'ఏదైతే మగవానికి భారమో అదే ఆడదానికి తేలిక ' అన్నదే!

తలపై మోయలేని బరువులు మోయడమే కంటికి కొట్టినట్టు కనిపించే కికుయు స్త్రీల కష్టం. కాని వీరి అసలుకష్టం — తెగలోకి కన్యని ప్రవేశపెట్టేటప్పుడు యీ తూర్పు ఆఫ్రికాలోనే అమలులో వుండే ఒక పాతకాలపు ఆచారము. దీన్ని 'క్లిటొరి డెక్టమీ' అంటారు. దీన్ని మనం ప్రత్యేకంగా గుర్తు పెట్టుకోవాలి. యువకులని ప్రవేశపెట్టడం అన్నది తూర్పాఫ్రికాలో సర్వత్రా వున్నదే. సహారాకి దక్షిణంగావున్న ఖండం యావత్తూ యీ తతంగం వుంటూనే వుంటుంది. మనం తరువాత తెలుసుకున్నట్లు యిది తెగల విద్యావిధానంలో ఒకటి. ఇది ఎంత ప్రముఖమైనదంటే-టాంగన్యికాలో మిషనువారే వీటిని శీలవంతులుగా తయారవుతారన్న దృష్టితో పెద్ద ఎత్తున జరిపించేవారు. వీటిని నిషేధించలేదు అందుకనే. చాలామటుకు యీ తతంగం అంతా తూర్పుబంటూ తెగలలో మగ కుర్రవాళ్లకి సున్నతి చేయడం మటుకే జరిగేది. కొన్నిచోట్ల ఆడపిల్లలకి కూడా చేసేవారట. కాని కికుయు స్త్రీల విషయంలో జరిగే ఈ 'క్లిటొరి డెక్టమీ' చాలా విపరీతం అయినది, అతి బాధాకరమైనది అవడమే కాకుండా యీ శస్త్ర చికిత్స ఫలితాల విషయంలో అనేక ఉద్దేశాలు వున్నాయి. రోగాలకీ, కొన్ని పరిస్థితులలో మరణానికీ అవకాశం యిస్తుందిది. తొలిచూలు కాన్పు కష్టతరం చేస్తుంది. యీ శస్త్రచికిత్సమూలంగా ఆ స్త్రీకి యిక లైంగికమైన సంతృప్తే కలుగదు. ఇక్కడి మగవారి దృష్టిలో యిది తప్పనిసరి అంటారు. "ఇదే జరుగకపోతే కికుయు స్త్రీని సంతృప్తి పరచి యింటిపట్టున వుండేలా చేయడం మా తరంకాదు" అంటారు వీరు. యీ విషయంలోనే ప్రాటెస్టెంటు మిషనులలో యూరోపియను స్త్రీలకీ, అక్కడే పనిచేసే క్రిస్టియన్ కికుయు స్త్రీలకీ మధ్య భేదాభిప్రాయాలు వున్నాయి. యూరోపియను స్త్రీలు యీ శస్త్రచికిత్సను నిషేధించాలి అనీ, మిగిలినవారు-కికుయు స్త్రీలూ, కన్యలూకూడ యిది వుండి తీరాలనీ!

ఈ నమ్మకాల మధ్య పేచీలు చాలా ముఖ్యమైన పరిస్థితికి దారి తీశాయి. దీని ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకుందుకు కికుయులకి తమ కన్యల మీద జరిపే యీ శస్త్రచికిత్స చాలా ముఖ్యమైనది. జాతీయ చిహ్నంగా వారు దీన్ని చూస్తారు. ఇదే వారిని యితర ఆఫ్రికను తెగలనుంచీ, వలస వచ్చిన యూరోపియను ఆసియను వాసులనుంచీ దూరంగావుంచి తమ ప్రత్యేకత నిలబెడుతూందని నమ్ముతారు. టాంగన్యికాలోని మిషనరీల ఆధ్వర్యం క్రిందకు వచ్చిన మాతృహంశ తెగలవారు లైంగిక విజ్ఞానాన్ని, పదజాలాన్ని, తత్సంబంధమైన తతంగాలని యీ సంప్రదాయ సిద్ధమైన పూజలనుంచి తొలగించి వేశారు. ఇక్కడకూడ యీ శస్త్ర చికిత్స నిషేధించాలని చూశారు (అది స్త్రీలని నిర్వీర్యులనిగా చేస్తుందన్న దృష్టితో). కాని యీ సందర్భంలో శారీరక వాంఛలకి అతీతంగా నిలచినది ఆఫ్రికనులే! కికుయు తిరోగమనవాదులు ఈ పనిని ధైర్య చిహ్నంగా, సాహసిక చర్యగా పొగిడి శరీరాన్ని కష్టపెట్టడం ఘనతగా సాగించారు. యీ విషయంపై జరిగిన వివాదాలు కికుయులలోనే వీటిని సమ్మతించిన చర్చలకి ప్రాధాన్యం యిచ్చాయి. కికుయు నాయకులు యీ విషయంలో బలహీనత చూపలేదు. మావ్‌మావ్ సంస్థవారు యీ చర్చలకి చేయూతనిచ్చి జాతీయ కికుయు తిరుగుబాటుకై ప్రయత్నం జరిగించారు. మావ్‌మావ్‌ల భీకర తత్వాన్ని చూపడానికని నా కిక్కడి తెల్లవా రొక కథ చెప్పారు. ఒక యూరోపియను స్త్రీ ప్రొటెస్టెంటు యిటువంటి ఆపరేషను జరగనీయకుండా చాలా మంది కన్యలని కాపాడిందన్న కక్షతో కసితీర్చుకుందుకని ఒక రాత్రివేళ యీ మావ్‌మావ్ సభ్యులు ఆ స్త్రీని బయటికిలాగి యీ ఆపరేషను ఆమెపైచేసి నిర్దాక్షిణ్యంగా చచ్చిపోడానికని వదలివేశారట!

మావ్‌మావ్ అన్నది ఒక రహస్య విప్లవవాదుల సంస్థకి వచ్చిన పేరు. దీనికి ఆధారం ఏమిటో తెలియదు. కాని దాని ఉద్దేశ్యంమటుకు తెల్లవారి కిక్కడ జీవితం భయంకరంగా తయారుచేసి, వారికై వారు దేశం వదలిపోయేలా చేయాలని. అంతర్లీనంగా ప్రారంభం అయిన యీ విప్లవం రెండవ ప్రపంచయుద్ధం తరువాత బయల్పడి 1952 నాటికి విజృంభించింది. యీ సంస్థలో చాలామంది సభ్యులు కికుయులే. ఇదే కెన్యాలోకల్లా పెద్ద

తెగ, బలవంతమైనది కూడా. కాని యీ విప్లవ కాలంలో ఎప్పుడూ యీ తెగ పూర్తిగా పాల్గొనలేదు. అయినాకూడా చాలామంది కికుయులు జైళ్ళ పాలైనారు. కెన్యా ప్రభుత్వానికి 78000 మందిని పునరావాసితులను చేయడం పెద్దపనే అయింది. అక్టోబరు 1959 నాటికి యింకా వెయ్యిమంది దాకా యీ కాంపులలో వున్నారు. నిజానికి యీ పోరాటాలలో, ప్రభుత్వానికి విశ్వాస పాత్రులుగా వున్న కికుయులే ఎక్కువగా బాధింపబడ్డారు. వధింపబడ్డారుకూడ. వీరి సంఖ్య యూరోపియను ఆసియనుల సంఖ్యకంటె ఎక్కువగా తేలింది. బ్రిటిష్ ప్రభుత్వం యీ పరిస్థితిని గుర్తించికూడ సహాయం చేయలేదు. సరికదా దక్షిణాఫ్రికా నేషనలిస్టు ఆఫ్రికనులు యుద్ధంచేసి యీ కికుయు తెగనే సమూలంగా నాశనం చేస్తామంటే వద్దని వారించింది; అలా అయితే ప్రత్యక్షంగానే వర్ణభేదాల ఆధారమైన పరిపాలన స్థాపితం అయి వుండేది.

ఈ రహస్య సంఘంలో సభ్యులుగా తీసుకొనే పద్ధతి ఏడు ప్రమాణాలు స్వీకరించడం మీద ఆధారపడి వుంది. వీటిలో మొదటివి సాధారణమైనవే-మానవత్వ దృష్ట్యానూ, ఆత్మగౌరవం దృష్ట్యానూ. ఎవరికీ అభ్యంతరం వుండదు. వీటి మూలంగా సభ్యుడైనవాడు కికుయు తెగకై ప్రాణం యివ్వడానికి సంసిద్ధత తెలియపరుస్తాడు. వీటిపై ప్రమాణాలు మటుకు మావ్‌మావ్ హైకమాండుకు ఎదురు తిరగనని వుంటాయి. వీటికి ఎన్నో ఆచార కాండలున్నాయనీ, వాటిని అచ్చువేయడంకాని, వర్ణించడం కాని మన తరం కానిపని అనీ యీ విషయంపై వున్న వాఙ్మయం తెలియజేస్తూంది. వీటిలో ఒక్కటి మటుకు వుదాహరించాలి: అతి క్రూరంగా గొఱ్ఱెలని చంపి, తను మాట తప్పితే తనకీ అదేగతి పట్టుతుందని ఒప్పుకుంటాడు. కొందరు తెల్లవారు మటుకు యిలా బ్రిటిష్ ప్రభుత్వం మావ్‌మావ్‌లని క్షమించి పునరావాసులని చేయడం తగదనీ, ఎదురుపడి యుద్ధంచేసి యీ కికుయు తెగని సమూలంగా నాశనం చేయాలనీ నమ్మినవారు వున్నారు. ప్రభుత్వ సహాయంవున్న కికుయులు మావ్‌మావ్‌లని సమూలంగా నాశనం చేస్తామంటూ తీసుకునే ప్రమాణాలుకూడ క్రూరంగానే వుంటూ వచ్చాయని వీరంటారు.

ఏది ఏమైనప్పటికీ, రక్తదాహం, అంగవైకల్యం, భయంకర క్రూరత్వ ప్రదర్శనం యీ ప్రమాణ స్వీకార సమయంలోని అసభ్యకర ఆచార కాండ. ఇవన్నీకూడ కికుయు కన్యలను తెగలో ప్రవేశపెట్టడం వంటి ప్రత్యేకతకి నిదర్శనలే అనడంలో సందేహం అక్కరలేదు.

కికుయు స్త్రీలు మావ్‌మావ్ విప్లవంలో ఎక్కువగా పాల్గొనలేదు. కాని వీరే మావ్‌మావ్ క్రౌర్యానికి బలి అయిన జీవాలు. తెల్లవారికి, ప్రభుత్వానికి విశ్వాస పాత్రులున్న కికుయు ప్రాంతాలను సరిచేద్దామని నిశ్చయించినప్పుడల్లా యీ మావ్‌మావ్ సభ్యులు ఎక్కువమంది పురుషులులేని పల్లెని ఎన్నుకొని, తమ క్రౌర్యాన్ని అక్కడి స్త్రీలమీదా పిల్లలమీదా చూపేవారు. నిజానికి యీ పద్ధతే కికుయులపట్ల ప్రజానీకపు టుద్దేశాలని మళ్ళించి మావ్‌మావ్‌కి వ్యతిరేకంగా తయారు చేసింది 1954-55 సంవత్సరంలో.

కాని, ఎప్పుడైతే ఒక స్త్రీ యీ రహస్య సంస్థలో చేరడానికి సంసిద్ధురాలైందో, ఎప్పు డీ ప్రమాణ స్వీకార కాండలో పాల్గొందో అప్పు డామె పురుషులని రెచ్చగొట్టి ప్రతికక్షులపై హింసాకాండకి నాంది పల్కింది. అతి దారుణమైన చిత్రహింసకి - ఉదా. బ్రతికుండగానే ప్రతికక్షులని పాతి పెట్టడంవంటి విపరీతాలకి-దారి చూపింది.

మూంబీ మాతృదేవిని కాదని ఆమె సంతానానికి పతనం కల్గించి, మగవారు ఎప్పుడైతే పురాణరీత్యా ఆధ్వర్యం వహించారో అనాటి కక్ష యీ నాడీ రక్త స్నానంలో తీరిందని అనుకోవచ్చు. కాని యిదొక కుంటి సాకు. కాని ఎంత కాదనుకున్నా గతించినదాన్నీ, వర్తమానాన్నీ, భవిష్యత్తునీ కూడా కల్పుతూ వుండే వేవో వుంటాయి. వాటి ఉనికిని మాత్రమే మనం గుర్తించలేక పోవచ్చు.

ఈ దృష్టితో మనం చూడడం ప్రారంభించితే, కికుయు స్త్రీల చారిత్రిక పరిణామానికీ, ఆమె యూరోపియన్ సోదరికీ మధ్య జరిగిన చారిత్రాత్మక పరిణామం తల్లకిందులుది. యూరోపియనులు కాలవశాత్తూ ఆఫ్రికాకు వచ్చారు. ఇక్కడ రాజకుమారీలుగా చెలామణి కాసాగారు. కాని యిక్కడే పుట్టిన మూంబీ తల్లీకూతుళ్లు పతనమై, తమ సంస్కృతి

యిచ్చిన స్థానాన్ని కోల్పోయి, చివరికి బానిసలుగా తయారైనారు. ముందు తమ భర్తలకి బానిసలు; తరువాత విదేశీయులకి బానిసలుగా తయారైనారు. అనుకోని ఉన్నత స్థితిని పొందిన యూరోపియను మహిళలు, తమ స్థానాన్ని విషాదకరంగా కోల్పోయిన కికుయు మహిళలు తమ గత చరిత్ర నుంచి తప్పించుకోగలరా ?

ఈ మార్పు లేవీ సాంస్కృతికంగా మంచి పునాది నిచ్చేవి కానే కావు. రెండు విభిన్న సంస్కృతుల కలయికకి దోహదం యిచ్చేవి అసలే కావు. యీ సంస్కృతులు కలిశాయి. ఒకదానిపై ఒకటి తన ప్రభావం చూపక తప్పదు. వీటిలో యీ నాడు కలయిక గోచరింపక పోవచ్చు. కాని యివిమటుకు కలిసి ఏకం అయిన రూపందాల్చి ఒక్కటిగా మనక తప్పదు. అది ఒకరోజు జరిగి తీరుతుంది.

కాని, స్త్రీల పనులలో వచ్చిన మార్పులు మన అనుభవానికి పదును యిచ్చి సాంస్కృతికమైన మార్పులకి రూపం దిద్దుతాయి అనడంలో సందేహంలేదు.

కికుయు భవిష్యత్తు, యూరోపియను భవిష్యత్తు, ఆసియను భవిష్యత్తు - మానవ భవిష్యత్తే యిది అవుతుంది.

# 4. మకొండె పీఠభూమి

ఒక్క కుదుపుతో మా కారు ఆగింది. మా ముందు రెండు చెట్లున్నాయి. వాటి కొమ్మలు అల్లుకుపోయి వున్నాయి. ఇక కారు ముందుకి పోదు. ఆఫ్రికను డ్రైవరు దిగి డేరా వేసే సామానూ గట్రా దింపడానికి సాయం చేస్తాడు. అప్పటికే ఓ అరడజను మందిదాకా మకొండె రైతులు యీ కారు శబ్దం విని వుంటారు. ఒక్క పరుగున వచ్చి చుట్టూ గుమిగూడుతారు. ఈ పీఠభూమి గత చరిత్రని తెలుసుకుందుకు వచ్చాననీ, ప్రస్తుతం యీ తెగల స్థితిగతులను కూడా తెలుసుకుంటాననీ డ్రైవరు వారందరికీ తెలియ చేస్తాడు. ఈ తెగలలో ఒక తెగకి చెందిన వాడే డ్రైవరు కూడా.

డేరా వేస్తూంటే ఆ వింత చూసిన నవ్వులూ, ఆశ్చర్యకరమైన ఓహో! ఆహా! లూ తప్పనిసరైనవే! మొదట పై కేన్వాసు వస్తుంది. దాని మూలంగా ఎండవానల నుంచి తల దాచుకోవచ్చునని నమ్మిక. తరువాత లోపలి డేరా వస్తుంది. అల్యూమినియమ్ స్తంభాలకే దాన్ని కట్టినా, దాని పక్కలు మటుకు కర్రమేకులతో నేలకి బిగిస్తారు. ఈ మేకులు యిసుక ప్రదేశమైన ఆ నేలలోకి సుత్తితో దిగగొడుతూ వుంటే, తొలిసారిగా చిరునవ్వులు నవ్వుకుంటూ స్నేహాలు కలియడానికి నాంది జరుగుతుంది.

ఇక కారు అవసరం లేదు. గడ్డితో సగందాకా కప్పు పడిపోయి వున్న కారుని వెనక్కి మళ్ళిస్తూ "క్వహెరీ!" (గుడ్ బై!) అని వెళ్ళిపోతాడు డ్రైవరు. ఆకుపచ్చని గుబురుల వెనుకగా యీ కారు కనుమరుగు అయి

పోతుంది. కారు వెళ్ళిన దారి కూడా మిగల్చకుండా గడ్డి కప్పు పడి పోతుంది. ఆ కారుతో పాటే అప్పటివరకూ శబ్దాలతో నిండిన ఆ ప్రపంచం అంతం అయిపోయింది. ఇక యిక్కడిది పూర్తిగా వేరు ప్రపంచం. హఠాత్తుగా నాకనిపిస్తుంది-యిక్కడ ఎంత నిశ్శబ్దంగా వుంది! అని. పావురాలు చేసే చప్పుళ్ళు మినహా యింకేం వినిపించదు.

ఇకనుంచి మానవ పరిణామ శాస్త్రాని కవసరం అయిన వివరాల సేకరణ పని ప్రారంభం అవుతుంది. ఈ సేకరణలోకి అన్నీ వస్తాయి: మానవ సమస్య - పుట్టుకనుంచి చావుదాకా. నెమ్మదిమీద జరగవలసిన పనికై ఎదురుచూస్తూ యీ కొత్త స్థలంలో అలవాటు పడ్డానికై విశ్రాంతి తీసుకుంటాం. మొట్టమొదట 'నిప్పు' తయారుచేసి వెచ్చదనం తెచ్చు కోవాలి. ఇది లేనిదే యిల్లు లేదు; ఆహారం లేదు. నా సహాయుదారుడు ఎదుటవున్న చెట్ల నీడలు చూపుతాడు - అక్కడ వంటకి అనువుగా వుంటుందని. కాని డేరాపై కేన్వాసుకి నిప్పు దగ్గిర అవు తుందేమో! యీగల బాధ కూడా అధికమే అవుతుంది. తినుబండారాల చుట్టుపక్కల జుమ్మని మూగుతాయి యీగలు. అందుకని యింకొంచెం దూరంలో చెట్టు కింద పొయ్యి తయారుచేసుకుంటాం. వంట చాలా సుల భంగా ముగిస్తాం. ఉదయం భోజనానికి గుడ్లూ, వెన్నా, జామూ, వుడికించిన దుంపలూ. మధ్యాహ్నం, రాత్రీ జొన్నపిండి జావా, తీయనిఆకులూ దొరుకు తాయి అక్కడ. అవి తినడం, కోకో, పాలు త్రాగి పడుకోవడం రాత్రి.

బాగా ఆలస్యం అయిన మధ్యాహ్నం భోజనం ముగియగానే, నీడలు సుదీర్ఘాలు అవుతాయి. తెరచివున్న ద్వారం ద్వారా సూర్యుని కిర ణాలు డేరా లోపలి గదిలోకి ప్రసరిస్తాయి. ముందు ఆలోచన లేకుండా డేరా ముఖం పశ్చిమోత్తరంగా వుండేలా వేశాను. ఎంత గుడ్డిగా సంప్ర దాయాన్ని పాటిస్తామో! ఇలా ఏ యిండియాలోనో, ఉత్తర ధ్రువపు దేశాల లోనో వేస్తే ఫరవాలేదు. అక్కడ సూర్యుడు దక్షిణంగా నిలిచివుంటాడు. కాని యిక్కడ అలా కాదు కదా! నా మతిలేనితనానికి ఫలితంగా మధ్యాహ్నంవేళ కాస్సేపు తిరిగిరాడానికి బయలుదేరాను.... అనుకోకుండా యిదీ నా సంప్రదాయానికి నిదర్శనమే అయింది.

అడ్డదిగటాలుగా అల్లుకుపోయిన యిసుకదారుల నుంచి చల్లని మెత్తని గడ్డిలోకి మళ్ళింది నేల. వీటిలో ఏ దారి పట్టడం? ...మానవ పాదాలు అల్లిబిల్లిగా అల్లేసిన యీ కాలిబాటలు గడ్డిలో పరచినట్టువున్నాయి. నా వేళ్ళ సందున యిసుక మెత్తగా తగులుతూంది. ఈ యిసుక సముద్రం నుంచి వచ్చినదే. మన భూమి బిగుసుకోవడంతో యీ నిటారైన తూర్పాఫ్రికాలోని ఇన్‌సెల్‌బర్గులు ఏర్పడ్డాయి. అలాగే ఇండియా, అరేబియా, ఆఫ్రికాల మధ్య సువిశాలమైన సముద్రమూ, అంటార్కిటికాలో మంచూ కూడా ఏర్పడ్డాయి.

పీఠభూమిపై మటుకు నున్నటి గులకరాళ్ళు వున్నాయి. ఇది సముద్ర తరంగాల పనే! ఇది నదులూ, పూర్వంలో గ్లాసియర్లూ చేసిన పని కాదు. ఈ యిసుక పఱ్ఱమీద నీళ్ళు లేవు. ధారాపాతంగా వానలు కురిస్తే తప్పించి నీళ్ళు రావు. ఆ నీళ్ళయినా యీ యిసుకనేలలో క్షణాల మీద యింకిపోతాయి. ఈ పఱ్ఱ దాహం ఓ పట్టాన తీరేది కాదు. అది సముద్రంనుంచి పుట్టినదేకదా. అయితేనేం, యీ పఱ్ఱమీద కూడా చక్కని వృక్షసంపద వుంది - యిది సారవంతమైన నేల అని నిరూపించడానికి. వర్షాలు కురిసినంతవరకూ యీ నేల చాలా ఫలవంతమైనది. గడ్డి, గుబుళ్ళు, పెద్దపెద్ద చెట్లు యీ నేలలోని సారాన్ని పీల్చి వినీలాకాశంలోకి యింకో రూపంతో తలెత్తుతాయి.

ఇటూ అటూ కాకుండా తిన్నని దారివెంట నడవడం ప్రారంభించాను - అదొక నివాసయోగ్యమైన స్థలాన్ని కలుపుతుందన్న నమ్మకంతో. ఈ ఎట్టమైన మకొండె గుబురుల మధ్య ఎన్నో యిళ్ళు దాగుడు మూత లాడుతూ వుంటాయి. నా దారివెంట త్వరగా అడుగులు వేస్తాను ముందుకి ఎందుకంటే యిక్కడి ఇన్‌సెల్‌బర్గ్‌మీద, శ్రమపోర్చి పనిచేసే మాతృహంశ తెగలమధ్య పనిచేయడం అంటే ఉత్సాహం యినుమడిస్తూంది. ఈ దక్షిణ టాంగన్యీకా వ-మకొండె తెగలవారు వ్యవసాయం చేసుకునే వారే.

కెన్యాలో నే నెక్కువ వేచి వుండలేదు. టాంగన్యీకా ప్రాంతంలో నా పద్ధతిన పరిశోధనలు సాగించుకుందుకు ప్రభుత్వం అనుమతించింది.

నా పరిశోధనలకి నెవలా జిల్లా తగినదిగా నిశ్చయించడం జరిగింది. మకొాండె ఆర్థిక పురోభివృద్ధికి అభ్యుదయ పంథాలో నడిచిన ప్రభుత్వ కార్య క్రమమూ, సాంకేతిక విజ్ఞానమూ ఎంతగానో తోడ్పడ్డాయి. ఇటువంటి పురోభివృద్ధి సాంఘికంగానూ, యితరత్రానూ ఎటువంటి మార్పులను తెచ్చిందో పరిశీలింపవలసిన బాధ్యత మానవ పరిణామ శాస్త్రకారులది.

ఈ ప్రాంతాలని యిరవయ్యవ శతాబ్దారంభంలో పరిశీలించిన జర్మను శాస్త్రకారుడు డా. కార్ల్‌వ్యూలె, తరువాత వచ్చిన లైడన్ హేరిస్ మొదలైనవారికి 'మ-కొాండె' అన్న పదానికి అర్థం ఒకటే: అది తెల్లని గుండ్రని కర్రముక్క. మకొాండె స్త్రీలు తమ పెదవులకి కుట్లు కుట్టించు కొని పెట్టుకొనేవారు. దీనినే "నడొాన్య" అనేవారు. కుట్టు పెద్దది అయిన కొద్దీ యీ గుండ్రని కర్రబిళ్ళ పెద్దది చేసేవారు. ఈ కుట్టు ఎంతదాకా పెంచేవారంటే - దాని సైజు చిన్నసైజు ప్లేటు అంతో, చిన్నపిల్లల అర చేయి అంతో తయారయేది! ఈ నాటికీ కూడా అక్కడక్కడా ముసలి వారైన స్త్రీలలో యీ నడొాన్యాలు కనిపిస్తున్నాయి. ఈ అలంకరణలు మాట్లాడ్డం, భోజనం చేయడం వం॥ పనులకి ఆటంకంగానే వుంటాయి. ఈ అలంకరణ పెట్టుకొన్న స్త్రీల ముఖం పక్కనుంచి చూస్తే బాతు మూతి లాగా తోస్తుంది. వీటికి పుట్టుపూర్వోత్తరాలు కనిపెట్టడం అన్నది మా శాస్త్రకారులకు సహితం తెగని సమస్య. చాలా మంది యూరోపియనులు దీనికి ఒక కారణం చెప్తారు. మకొాండె పురుషులు తమ స్త్రీలను పిల్లలను బానిస వ్యాపారుల నుండి రక్షించుకోడానికి దీన్ని కనిపెట్టారు అంటారు. ఈ కర్రదిమ్మ దాల్చిన స్త్రీలు అసహ్యంగా వుండడం వల్ల ఎవరూ శ్రమ తీసుకుని అడగరని మగవారి ఉద్దేశ్యం అయివుంటుంది. కాని దీనికి విరు ద్ధంగా ము-మకొాండె తెగలోవారికి యీ పెదవి బిరడా అంద వికారిగా కాకుండా, స్త్రీల సౌందర్యాన్ని పెంపొందించే అలంకరణగా మాత్రమే తోచింది. మకొాండె పెద్ద మనుషులు కొందరు తమ చిన్ననాటి రోజులు జ్ఞప్తికి తెచ్చుకుంటూ మందహాసం చేస్తూ నాతో చెప్పారు: ఆ రోజుల్లో అందమైన అమ్మాయి దాల్చిన తెల్లని యీ పెదవి బిరడా నెలా ఆరాధించేవారో!

వ-మకొండె తెగవారు బానిసవ్యాపారుల వల్ల చాలా బాధలు పడ్డవారు. పందొమ్మిదవ శతాబ్దంలో యితరులవల్ల కూడా పీడింపబడ్డారు. మాతృహంశ తెగలైన యావో, మకువ, మవెర తెగలతో పాటు వీరు కూడా పోర్చుగీసు, తూర్పాఫ్రికా, న్యాసాలాండు, యింకా మాతృహంశ తెగల కాలవాలంగా వున్న ప్రదేశాల నుంచి దక్షిణ టాంగన్యికాకు బలవంతులూ, పితృహంశ తెగలకు చెందినవారూ అయిన వ-గొని తెగలచే తరిమివేయబడ్డారు. 1860-70 లలో ఆరబ్, యూరోపియనుల రాకకి యిది అర్ధ శతాబ్దం ముందు జరిగింది. అప్పటినుంచీ మకొండె బానిసలు, కూలీలు టాంగన్యికా మొత్తంమీద విస్తరించిపోయారు. కెన్యాలోకీ, జాంజిబార్‌లోకీ కూడా ప్రవేశించారు. దీనితోనే మకొండె అన్న తెగపేరు అన్ని గుంపులకీ ఉపయోగించారు. కాని నెవలా జిల్లాలోని మకొండె పీఠభూమిలోని అసలు తెగకి, వీరికి చాలా తక్కువ సంబంధం వుండవచ్చు. వీరిలో స్త్రీ పురుషులంతా తలకట్టు టాంగన్యికనుల లాగే అతి పొట్టిగా కత్తిరించుకుంటారు.

ఇది కాక, వ-మకొండె తెగవారు మిగిలినవారి కంటే సుమారైన పొడుగు కలిగిన, శ్రమకోర్చి పనిచేసే వ్యవసాయదారులే. నాయకుడు లేని గుంపులుగా వుండే వీరు ప్రజాస్వామ్య పద్ధతిని తెగను నడుపుతారు. దీనిలో వీరి దగ్గిర తెగలైన బంటూ, కికుయులను పోలి వుంటారు. దక్షిణాదినుంచి వ-గొని తెగలు (జులూ బంటూలకు దగ్గిరవారు) ఒత్తిడి తేవడం వల్లనే మకొండె తెగలు ఉత్తరాదిగా భూమధ్యరేఖకు సమీపంగా రావడం సంభవించింది. కాని జాతుల కథలలో యీ పరిణామం యింకో విధంగా వర్ణితమై వుంది.

ఈ విస్తరణ వివరాలను మకొండే పీఠభూమిమీదనే జరిగినట్లు చెప్తుంది యీ కథ. ఆ రోజులలో యీ పీఠభూమిలో దట్టమైన గుబురులు ఎవరూ చొరలేని విధంగా అల్లుకుపోయి వుండేవి. మిన్నంటే చెట్లు, గోలచేసే పక్షులు, రంగురంగుల పిట్టలు అన్నీ వుండేవి కాని మనుషులు మటుకు లేరు. యీ నాడున్న బజారుదగ్గిర, మహూట స్టేషనుదగ్గిర వున్న ఒక గుబురులోంచి ఒక మనిషి బయటకు వచ్చాడనీ, అతను అసాధారణ

మైన జీవితం సాగించాడనీ కథ. అన్నపానాదుల విషయం, అందం విషయం అసలు పట్టించుకో లేదట యీ వ్యక్తి. స్నానం చేయలేదు. దుబ్బులా పెరిగిన తలకట్టు కత్తిరించుకోలేదు. ఒక ప్రత్యేకమైన చెట్టు నుంచి ఒక మనిషి విగ్రహం చెక్కాడట యీ వ్యక్తి. యీ పని పూర్తి కాగానే రాత్రికి విశ్రాంతికై ఆశ్రమంలోకి వెళ్ళిపోయాడట. ఆ తరువాత యీ బొమ్మని సరిగా కూర్చోపెట్టాడట. ఆ బొమ్మ ఒక ఆడమనిషిది. మరుసటిదినం ఆ విగ్రహానికి ప్రాణం వచ్చిందట. ఆ వ్యక్తి ఆ ప్రాణం వచ్చిన బొమ్మని భార్యగా స్వీకరించాడట. ఇద్దరూ కలిసి రువుమా నది లోయలోకి వెళ్లారు. అక్కడి వేడికి, ఉక్కకి ఆగలేక ఆ నీటిలో ఒళ్లు కడుక్కున్నారట. అప్పటి కప్పుడే ఒక బిడ్డ జనించిందట వారికి. కాని దానికి ప్రాణం లేకపోవడంతో తల్లితండ్రులు దుఃఖితు లయారు. అప్పుడు వారు ఇంబంకురు లోయకి వెళ్లారు. అక్కడ యింకోబిడ్డ కల్గింది. కాని కొద్ది సేపటికే చనిపోయింది. దానితో వారిద్దరూ మకొ౦ండె పీరభూమిపై తొలుతవున్న గుబురు దగ్గరకి వచ్చి చేరారు. అక్కడ పుట్టిన బిడ్డ బ్రతికింది. ఎంతో ఆరోగ్యంగా వుంది. ఇక్కడ కల్గిన అనేకమంది పిల్లలకి యీ బిడ్డే ప్రథముడు. ఈ పిల్లలని తల్లితండ్రులు వ-మటొ౦౦డ అని పిలుచుకున్నారు. కాలక్రమాన వీరే వ-మకొ౦ండె తెగ అయారు. యీ ముసలి తండ్రి చనిపోయేముందు తమ తెగలో చనిపోయిన వారిని నిరారుగా పాతిపెట్టమని చెప్పాడట. తమ తల్లి అలాగే నిరారుగా నిలపెట్టినప్పుడు ప్రాణం పొందిందని కూడ చెప్పాడట. ఇతనే తమ తెగలవారెవరూ నదీ లోయలలోనూ, నీటికి దరిదాపులలోనూ నివాసాలు ఏర్పరుచుకో కూడదని కూడా హెచ్చరించాడు.

ఈ కట్టుకథ అంతరార్థం-బొమ్మను నిరారుగా నిలబెడితే ప్రాణం రావడంలో వుంది. అతనిచ్చిన హెచ్చరిక-నీటికి దగ్గరలో వుండద్దన్నది- అర్థం చేసుకోవాలంటే యీ ప్రాంతపు నీటి పరిస్థితిని అర్థం చేసుకోవలసి వుంటుంది.

చుట్టూ ఆవరించుకునివున్న మైదానాలను తలదన్నుతున్నట్టున్న ఎర్ర మట్టి చొచ్చుకు వచ్చిన గుట్టలపై వెయ్యి అడుగుల ఎత్తున వున్నది

యీ మకొాండె పీఠభూమి. ఊబిమయమైన 'రువుమ', సన్ననైన 'లుకులిడి' లోయలు సముద్ర మట్టానికి రెండువందల అడుగుల ఎత్తునేవున్నా వాటిని తలదన్నుతూ వుంటుంది యీ మకొాండె పీఠభూమి. నలభై అయిదుమైళ్ళ వెడల్పు, ఏభయిమైళ్ల పొడవు కల్గిన యీ విషమ చతుర్భుజాకార పీఠభూమి ఉత్తరాన రెండువేల అడుగుల ఎత్తుకల్గి రానురాను దక్షిణమునకు వచ్చే సరికి క్రిందికి దిగుతూ వుంది. యీ భూమిపై ఒకేఒకచోట వూబి ప్రదేశం వుంది. అదే "కిటాంగిరి పల్లపుప్రదేశము". ఈస్టాఫ్రికా తీరము పొడు గునా ఉన్న మిగిలిన ఇన్‌సెల్‌బర్గులలాగే మకొాండె పీఠభూమికూడా యిసుక మయ ప్రదేశము; భూభాగము ముడుచుకునే పరిస్థితిలో పైకి తోయబడిన సమతలప్రదేశాలివి. పూర్వం సముద్ర గర్భంలోవున్న యీ గుల్లనేలలో వర్షపు నీరుకూడా చాలాసేపు నిలువదు. వర్షం కురిసిన మరుక్షణంలో యింకి పోయి సమతల మైదానాలలో రువుమ, లుకులిడి నదుల అంచుల చల్లని వూటలుగా బయలుపడుతుంది అయినా కూడా ఇక్కడి మట్టి సారవంత మైనది కావడంచేత చెట్లూ చేమలూ మొలుస్తూనే వుంటాయి. యిక్కడి దట్టమైన చిట్టడవులు నవంబరు, ఏప్రెల్ నెలలమధ్య సాలీనా 30 అంగు ళాల వర్షాన్ని ఆకర్షింప కల్గుతున్నాయి. ఇప్పటివరకూ యీ వర్షపాతం అక్కడి జనాభా యావత్తుకీ - సుమారు 1,80,000 మందికి - సమృద్ధిగానే సరిపోతుంది. కాని 1921-22 లో యీ జనాభా దరిదాపు మూడుకోట్లు పెరిగినట్లు అంచనావేశారు. నిజానికి వీరికి నాంది 60 వేలు మాత్రమే. ఈ 60 వేలుకూడా 19 వ శతాబ్దంలో ఏ కొద్దిమంది పూర్వీకులనుంచో పెరిగిన జనాభా. ఈ పీఠభూమిలో నూటికి తొంభైమంది వ-మకొాండె తెగవారే.

ఇక్కడి వ్యవసాయపు పద్ధతి చాలా సులభమైనది. మార్పు పద్ధతిన భూమి సాగుచేస్తారు. దీనికి తోడుగా బీడుగావుండే నేల అట్టే పెట్టు కుంటూవుంటారు. నేల మారుస్తూ పంటలు సాగిస్తారు. ఇలా ఒక సారి పంటకీ,యింకోసారి అదేనేలలో పంట వేయడానికీ మధ్య పదిహేను నుంచి పాతిక సంవత్సరాల దూరం వుండేదట. కాని యీ రోజుల్లో దీన్ని తొమ్మిది, ఇంకా కొన్నిచోట్ల ఆరు సంవత్సరాలదాకా కూడా తగ్గిం

చారు. బీడుగా వుండి నేల బలం పుంజుకొందుకీ వ్యవధి చాలునని అభి ప్రాయం. ఇది నిజానికి విషమ పరిస్థితే అయినా వురకా పరుగున పెరుగుతున్న జనాభా మూలంగా యిలా చేయక తప్పలేదు. పూర్వపు పద్ధతిన చెట్లూ చేమలూ బాగా బ్రతికేవి; పశుగణాది పోషణ కుదిరేదేకాదు. కోళ్లూ, పందులూ కంటె పెంచగల్గేవారు కాదు. అత్యవసరాలకే పరిమితంగా వుండే నీటివసతి ఒక విషమ సమస్య యీ మకొండె నిత్య జీవితంలో.

గడ్డీ ఆకులూ కప్పిన చిన్న గుంటలలో ఈ వర్షపునీరు జాగ్రత్తగా చేర్చేవారు. ఈ నీరు సాధారణంగా వర్షాకాలంలో సరిపోయేది కాని సమృద్ధిగా మటుకు వుండేదికాదు. అంత శుభ్రంగానూ వుండేదికాదు. కాని, మే నుంచి సెప్టెంబరువరకూ వర్షాలు లేని రోజులలో పల్లపు ప్రాంతాలలో నున్న నీటి చెలములలోనుండి తీసుకుపోయేవారు. యీ నీటిని పైకి తీసుకు వెళ్ళాలంటే ముందు వేయి అడుగుల ఎత్తు తిన్నగా ఎక్కి పీఠభూమి అంచుచేరి, అక్కడినుంచి యిళ్లకి తీసుకుపోయేవారు. యీ యిళ్ళుమటుకు దగ్గిరగావున్నాయి. ఒక దానికీ ఒక దానికీ మధ్య సామాన్యంగా ఐదుమైళ్ళ దూరమైనా వుంటుంది. సాధారణంగా ఆడు వారూ పిల్లలూ యీ నీటిని ఆనప తుంబలలో క్రిందినుంచి పైకి తేడానికి ఐదారు రోజులు తీసుకునేవారు. ఎంతో కష్టం, కాలం వృథా అయినా ఈ ప్రయాణాలు చాలా సంతోషంగా వుండేవి. ఎప్పుడు వెళ్ళినా సరదాగా కబుర్లు, స్నేహితులు, చల్లని నీడలు పరచిన చెట్లక్రింద గుంటలలో స్నానం—యివన్నీ హాయిగా వుండేవి. అదపాతడపా యీ ప్రయాణాలు, పీఠభూమిపై విసుగెత్తే జీవితంనుంచి తప్పించడమే కాకుండా, వీరిని ఎంతో ఆరోగ్యవంతులుగా తయారుచేసేవి. మకొండె వాటర్ కార్పొ రేషన్ వారి ఒక ఉద్యోగి యిలా చెప్పాడు ; ఒకసారి ఏమీ బరువు మోయకుండానే, ఎత్తుకు కొంచెందూరం ఎక్కి ఓ చోట కూర్చుని ఒగర్చు కుంటూ విశ్రాంతి తీసుకుంటున్నాడట. అప్పుడే ఆయన ఎదుటినుంచి ఓ మకొండె ముసలామె - దరిదాపు డెబ్బయ్యేళ్ళు వుంటాయట-బుజంమీద నుంచి ఓ కర్రకి రెండు ఆనపతుంబలు తగుల్చుకుని నీరు తెస్తూ, ఆగి స్నేహపూర్వకంగా నవ్వుతూ, "హబారి బ్వనా!" (ఏమిటి విశేషాలు,

మిస్టర్ ?) అంటూ పల్కరించిందట. పెదవి బిరడాలతో వున్న ఆమె కనీసం ఆయాసపడడమైనా లేదట.

'మకొండె వాటర్ కార్పొరేషన్' ఒక రూపం దాల్చింది. పైకి నీటిని పంపులద్వారా సరఫరా చేస్తున్నారు. ఈ నీటి కిళాయిలు వెండి చుక్కలలా ఆ ప్రదేశంలో పరచుకుని వున్నాయి. మానవ పరిణామ శాస్త్రజ్ఞునికి యింత కంటె మంచి అవకాశం ఎక్కడ కన్పిస్తుంది? ఈ సదుపాయం వీరి నిత్య జీవితం మీద, ముఖ్యంగా మాతృవంశీకులైన యిక్కడి స్త్రీలమీద ఎటువంటి ప్రభావం ప్రసరింప జేసింది? ఈ నా పరిశోధనలలో తొలిభాగం అక్కడి కార్పొరేషను ఉద్యోగస్థు లందరికీ కుతూహలం కల్గించింది - యీ నీటి సరఫరా ఏ మాత్రం మార్పులు తెచ్చిందన్నది. కాని నా తుది పరిశోధనలో అంత కుతూహలం లేదు. కారణం అది ఒక్క శాస్త్రకారుల ఉత్సాహమే. కాని యిక్కడి ఉద్యోగస్థులు తల్లిహక్కు అన్నది ఒక సమస్యగా గుర్తించారు. అందుకే నెవలా జిల్లా కమిషనరు ఆఫీసులో అడుగు పెట్టేసరికి నాకేం కొత్తగా అనిపించలేదు. ఇక్కడ ఎంతో స్నేహ పూర్వకంగా నన్ను ఆహ్వానించారు; అసలు కమిషనరుగారి కుటుంబం ఎంతో ఆదరణ చూపారు. ఇదంతా కలిపి, నేనో కొత్త చోటులో వున్నట్టు అనిపించనేలేదు. సరి కదా ఏదో చిన్ననాటివి జ్ఞప్తికి తెచ్చుకుంటున్నట్టు అనిపించింది. ఇక్కడ జనవరి ఉత్తర ధ్రువ ప్రాంతాలలో జూలైకి సమానం. ట్రాక్టర్లు, కార్లు వచ్చి, పల్లెసీమల సౌభాగ్యాన్ని మార్చని ముందు ఆస్ట్రియాలో వున్నట్టుంది యిక్కడి రమణీయ దృశ్యాలు. ఈ చోటు కూడా మొదటి ప్రపంచయుద్ధానికి పూర్వం కట్టినదే. జర్మనుల నిర్మితం. మధ్యకాలపు కోటను పోలిన యిటువంటి దానిలోనే నేనూ పుట్టి పెరిగాను. అక్కడ నిలబడి చూస్తూంటే కంటిముందు రమణీయమైన దృశ్యం వెల్లివిరుస్తూంది. ముందు ఎఱ్ఱటి అంచు కల్గిన రాతిఅంచులు, అంతు లేనట్టు కనిపించే ముదురు ఆకుపచ్చ అడవులు, వీటి మధ్యనుంచి వెండి జలతారులా సాగిపోయే రువుమ నది - యిదే బ్రిటిష్ - పోర్చుగీసు - యీస్టు ఆఫ్రికాలకు సరిహద్దు. వీటన్నిటికీ పైన వేసవి మేఘాలు.

ఎంతోసేపు మకొాండె వాటర్ కార్పొరేషను గురించీ, 1954 నుంచీ దీని చరిత్రను గురించీ, దీని ప్రాముఖ్యాన్ని గురించీ మాట్లాడిన పిదప నాకు అతి ముఖ్యమైన మాతృహక్కు విషయం కూడా వచ్చింది.

''మకొాండె మాతృఅంశ తెగలను గురించిన వివరాలు మాకు చెప్తారని తలుస్తాం. మాకు దాన్ని గురించి ఎక్కువగా తెలియదు; ఒక్కొక్క సమయంలో, తండ్రికంటె కూడా 'మజొాంబ' తల్లి తరపు మేనమామ పిల్లవానికి స్కూలు జీతం కట్టడానికి తగిన వ్యక్తి అన్నది మినహా మాకేం తెలియదు'' అన్నారు.

అసలు పని ప్రారంభించడానికి ముందుగా నెవలాలో నే కొన్ని దినాలు యీ మాతృహక్కు గురించిన హాస్య విషయాలు చాలా విన్నాను. ఒక మిషన్ ఫాదరు యీ మాతృహంశను గురించిన ఒక కొత్తరకం థియరీ ప్రతిపాదించారు. అతని దృష్టిలో బహుభార్యాత్వమే దీనికి కారణం. జంతుతత్వాని కిదో దోహదమన్నంతగా యీయన దీన్ని ఖండించారు.

"చాలామంది భార్యలూ, ఆరోగ్యంగా వుండే పిల్లలూ మితిమీరి ఉండే సరికి, ఆ తండ్రి వీరినెలా సముదాయిస్తాడు? అందుకే భార్యల తమ్ముళ్లని పిలిచి వారి సహాయాన్ని అర్థిస్తాడు. న్యాయంగానే యీ మేన మామలు తామే వీరి తండ్రులా అన్నంత అధికారంతో సోదరీమణుల పిల్లలని అదుపులో పెడతారు. అందుకే యీ మేనమామల జులుమ్ యీ తెగలలో!'' అన్నా రాయన.

నా ముఖంలో అనుమాన సూచనలు పొడసూపినట్లు గ్రహించాడు కాబోలు, యింకా వివరంగా ప్రారంభించాడు: ''నేను తొలుత ఈ మకొాండె పీరభూమికి వచ్చినప్పుడు యిది ఇంకా జర్మనుల క్రిందనే వుండేది. మజొాంబ ఎక్కడ చూసినా అధికారంలో వుండేవాడు. ప్రస్తుతం స్కూళ్లువున్నాయి. జనాభాలో మూడు వంతులమంది క్రైస్తవులే. తండ్రే కుటుంబ అధికారిగా గుర్తింపబడుతూ వస్తున్నాడు. ఎందుకంటే క్రైస్తవులకు ఒక్కతే భార్య. ఆ భార్యనూ పిల్లలనూ చూసుకోవడం కష్టం కాదు. దీనికి పైె సహాయం, సహకారం అవసరంలేదు. కనీసం స్కూలు జీతాలైనా మేన

మామ కాకుండా తండ్రి కట్టుకుంటున్నాడు. ఓలి ధనంలో కూడా, పెద్ద భాగం పిల్ల తండ్రికే పోతుంది-వీరిలో క్రైస్తవులైన వారిలో. ముస్లిమ్ తండ్రులు వీరినుంచి నేర్చుకొని తమ పిల్లలు ఓలి ధనం ఎక్కువగా లేవాలని ప్రయత్నిస్తున్నారు."

మాతృహంశ తెగలలోని కుటుంబం అన్నదానిలో అప్పుడు పుట్టిన బిడ్డకి సన్నిహితం అయిన రక్త బంధువు-మగవాళ్ళలోకి - మేనమామ. ఎందుచేత ? ఇతని తల్లీ, చెల్లెలి తల్లీ కూడా ఒకరే కావడం వల్ల. ఇలా తల్లివైపు నుంచి బంధాలు వుంటాయి. ఇంకొక తల్లి వంశానికి చెందిన తండ్రి పైవాడే. అతను పిల్లలకి తండ్రి; వారి తల్లికి భర్త కావచ్చు. శారీరకంగానూ, మానసికంగానూ కూడా వారికి సన్నిహితుడు కావచ్చు. అయినా కూడా అతను యింకొక తల్లి బిడ్డే కదా!

ఇక్కడ కాకుండా నా ప్రయోగాలను, పనిని యింకొక చోట ప్రారంభించవలసి వచ్చింది. ఆధునిక యంత్ర తంత్రాంగాలకీ, కారు రోడ్లకీ, భారతీయ దుకాణదారులకీ ఎంతదూరంగా వుంటే అంత మంచిది నాకు. అక్కడైతే కపీసం పోల్చి చూసుకునే అవకాశం లభిస్తుంది. ఇందుకోసమే నేనీ పీఠభూమిలో డేరా వేయవలసి వచ్చింది. నా యీ తొలి రోజు మధ్యాహ్నం ఓసారి అలా తిరిగిరావాలని నడవడం ప్రారంభించాను. నే నడవడం ప్రారంభించిన కాలిబాట ఓ పెద్ద చెట్టు చుట్టూ ప్రదక్షిణం చేసింది. ఇక్కడ అంతగా జనాభా ఒత్తిడి లేకపోవడం మూలాన్ని యింకా యీ చెట్లు కొట్టివేయలేదు. ఈ చెట్టు మ్రాను చుట్టుకొలత దరిదాపు మకొండెలోని యింటి చుట్టుకొలతకి సరిపోతుంది. ఈ మ్రాను తిన్నగా మూడంతస్తుల మేడ అంత ఎత్తుదాకా పెరిగి అక్కడనుంచే గొడుగులా కొమ్మలు వేసుకొస్తుంది. ఈ కొమ్మలలో ఒక్కటి చాలు నే పుట్టిన దేశంలోని అడవిచెట్ల మ్రాను అవడానికి.

"ఎంత అద్భుతమైన గోపురం!" అన్న నా ఆలోచన పైకి అన్న మాటలకంటె బిగ్గరగా ధ్వనించింది. ఓ క్షణం సేపు ఆగి దాన్ని చూసి తిరిగి నడక సాగిస్తాను. నా బాట అలా ముందుకి సాగుతూనే వుంది.

అష్టవంకరలు తిరుగుతూ ముందుకి సాగిపోతూన్న ఈ బాటని చూస్తే ఏదో చరిత్ర కెక్కని కాలంనాటి అక్షరమాలలా తోచింది. దీన్ని నేను చదువలేనో ? దీనికి అర్థం లేదో ? .. నా ఆలోచన లింకా ఆ ఆకాశాన్నంటుతున్న ఆకుపచ్చని చాందినీ లాంటి చెట్టుమీదనే వున్నాయి.

"ఇదికూడా బహుశా పూర్వపు పవిత్ర వృక్షాలలో ఒకటేమో ! ఇలాంటిదాని క్రిందనే తమ పంటముందు రాపిడివల్ల అగ్ని పుట్టించే మకొండె తెగల పెద్దలిక్కడే వుండేవారేమో ! తరవాత యీ చెట్టుక్రింద కొంత ధాన్యం, కొంచెం పిండీ పెట్టేవారు. ముంగు అనే దయామయుడైన గొప్ప దైవానికి కృతజ్ఞత తెల్పడం యిది. దీని తరువాత యిక్కడినుంచి నిప్పు తీసుకువెళ్ళి ప్రతి యింట్లోనూ తిరిగి పీటితో నిప్పు ముట్టించేవారు - దైవాన్ని ఆహ్వానిస్తూ. అటువంటి క్రతువేదైనా యీ చెట్టు క్రింద చేశారేమో ? ఏమో - 1905 లో మాజిమాజి విప్లవం రాకముందు, యింకా జర్మనులు వచ్చిన తొలి సంవత్సరాలలో కూడా యివి జరిగేవేమో !"

"ఏమో. అవునేమో !" అంటూ నా ఆలోచనల ప్రశ్నలకి సమాధానం తోస్తుంది. ఏమో! అయివుండవచ్చు. కాని దాని వల్ల యిప్పుడు ప్రయోజనం లేదు కదా ? ఎంతో కాలంనుంచీ వ-మకొండెలకి యిది తమ ఆటవిక తత్వానికి అర్థంలేని మూర్ఖపు పూజలనీ, యీ నాటు పనులన్నీ మానేయవలసినవనీ చెప్తూ వచ్చారు. ఇప్పుడు వీ రివి నమ్ముతున్నారు - నిజంగానే అనాగరికమైనవని. ఈ రోజులలో దీనికి బదులు కొత్తగా కడుతున్న చర్చికి విరాళాలు యివ్వచ్చు నంటున్నారు. మకొండె పీఠభూమికి నీటి సదుపాయం తెచ్చిన ప్రభుత్వానికి ఎగ కొట్టకుండా పోల్‌టాక్సు కట్టమంటున్నారు. ఏ రకం అయిన సాంఘిక ప్రయోజనం యివ్వని యీ చెట్లకంటె పైవే నయం అని చెప్తున్నారు. ఇలాంటి చెట్లు చాలా భాగం నరికివేయబడ్డాయి. వంటచెరుకుగా అమ్మివేయడం జరిగింది మిషను పెద్దలు యిలా పైకి నిర్ణయించక పోయినా పని జరిగిపోయింది.

"ఈ చెట్లని పరిశీలించడం ద్వారా మకొండె సాంఘిక జీవితం నాకేం దగ్గిరే వుందా ?" నన్ను నేనే ప్రశ్నించుకొని, అసలనుకున్న

కార్యక్రమాన్ని వదలిన దగ్గిర నుంచి తిరిగి ప్రారంభిస్తాను. నే నడవడం ప్రారంభించినప్పుడు అదే కదా నా దృష్టిలో వున్నది ?

నా కాలిబాట మళుపు తిరిగి వంకరలు పోతుంది. చీకటి పడేలోపున తిరిగి నా డేరా చేరగలనా ? జోడు రోకళ్ళ చప్పుడు - కసోవా దుంపలు దంపే చప్పుడు - యీ గుబురులని దాటుకుని వస్తూంది. ఇదే మకొండె పీఠభూమిలో, ఆఫ్రికా మొత్తం మీద సాయంత్రం స్త్రీలు చేసే పని. ఇదే రకంగా యింకో రకం చప్పుడు - వరస తప్పని పావురాల గోల. అడిగిన దే లక్షసార్లు అడిగినట్లు - లక్షలాది పక్షులు సువిశాలమైన యీ ఖండం యావత్తూ దద్దరిల్లేలా ప్రశ్నిస్తూంటాయి. నా ఆలోచనల తాడు తెగుతుంది నా ప్రోగ్రామ్ గోడవను దాటి, అనంత కాలంలోకి, స్థలాల లోకి చొచ్చుకుపోతాయి నా ఊహలు. గుబురుల మధ్యనుంచి సాగిపోయే కాలిబాటను మించిపోయిన నా వూహలకి ఓ క్షణం పాటు గతం అంతా సుస్పష్టం అవుతుంది; ప్రేమైక చిహ్నాగా ఎంచే యూరోపియను పావురాల కూత వేసవి సాయంత్రం వింటున్నట్లు అనిపిస్తుంది. దీన్ని దాటి యింకో జ్ఞాపకం వచ్చి నిలుస్తుంది. ఇండియాలో ఢిల్లీలో మోతీ మసీదు దగ్గిర తొలిసారిగా పావురాల కూత విన్నాను. అదీ యిలాగే వున్నా లయలో ఏదో తేడా, ధ్వనిలో ఏదో కొత్తరంగు. "అల్‌హాక్ ఉల్‌హాక్ అల్‌హాక్ ఉల్‌హాక్" (దేవుని న్యాయం, దేవుని న్యాయం) అన్నట్టు వాటి పాత నాకు వినిపించేది. కాని యీ వరస తప్పని కూతలలో నాలో అంతులేని ప్రశ్నలు, నిగూఢమైనవి - యూరోపియన్, ఇండియన్ పావురాల ధోర ణిలో తోచనివి - వినిపిస్తున్నాయి. ఈ ఆగని లయలో ఆఫ్రికను జనుల కేం అర్థం స్ఫురిస్తూంది ? ఎంత తల పగల కొట్టుకుని ఆలోచించి చూసినా తోచేది ఒక్కటే సమాధానం: "మాకు తెలియదు. పూర్వపు మేన మామలూ తండ్రులూ వేరే! వారంతా విగ్రహారాధకులు! వారు చెప్పి వుండేవారు. కాని మాకు ఎలా తెలుస్తుంది ? మా కింకేం తెలియదు" అందుకే యీ గువ్వల ప్రశ్నావళి అలాగే వుంటుంది. తొలుత ప్రశ్న - వెనకా ముందాడే ప్రశ్న. తొలుత నెమ్మదిగా, తరువాత త్వరితగతిని వినిపిస్తుం దీ ప్రశ్న—"ఎందువల్ల ? ఎందువల్ల ? ఎందువల్ల ?"

నే నింకా ముందుకి సాగుతాను : యీ రొద విసీ విననట్టు నడుస్తున్న నేను క్షణం సేపు అలాగే ఆగిపోతాను : క్షణం సేపు వూపిరి సలుపదు నాకు. ఎవరు? ఎవరలా నా కేసి చూస్తున్నారు? దట్టంగా పెరిగిన ఈ మకొొండె గుబురుల నుంచి నా కేసి ఎవరు చూస్తున్నారు ? ఆ గుబురులను ఒత్తిగించి చూడదానికి వెనుకాడతాను నేను. ఏ చిరుతపులో, సింహమో నేను అలా తమ కేసి చూస్తే సహించకపోవచ్చు. అలా రెప్ప వాల్చకుండా చూస్తూ వుంటాను. అప్పుడే హఠాత్తుగా రెండు మొగ్గల్లాంటి మానవ నేత్రాలని గుర్తు పడతాను. నడుమ బంగారు చుక్కలతో అప్పుడే విచ్చుకున్న కళ్లవి. అవి నా కేసి కాకుండా నాలో నుంచి చూస్తున్నట్లు తోస్తుంది. వాటి చూపుని పట్టి నేనూ పైకి చూస్తాను. వెనుక దాటి వచ్చిన చెట్టుపైకి చూస్తున్నాను నేను కూడా. అక్కడే వుంది అది ! ఆకాశా న్నంటుతూ కదలిక లేకున్నా జీవం వుట్టిపడుతున్న ఆ పవిత్ర వృక్షం - సాంఘికమైన ప్రయోజనం లేని యీ చెట్టు ! వింత కదా !

చివర కింక ముందుకి నడవడం సాగిస్తాను నేను. నా యీ దారి కొంత సేపటికి కాకపోతే కొంత సేపటికైనా మానవ నివాస యోగ్యమైన స్థలానికి తీసుకుపోక పోతుందా? పరిశుభ్రంగా, మెత్తగావున్న యిసుకలోకి చొచ్చుకు పోతున్నాయి నా బొటనవ్రేళ్ళు.

ఈ సన్నని దారులవెంట గంటలకొద్దీ నడిచినా, సముద్ర మధ్యం నుంచి దిఙ్మండలా న్నెంత చూడగలమో, యిక్కడనుంచీ అంతే చూడగలం. తరువాత నేను ఈ పీరభూమిలోని యితర స్థలాలనుకూడా చూశాను. పసుపు ఆకుపచ్చ తెలుపు రంగుల కలయికలు కల్గిన తరంగాలమీద భూమట్టంమీద యీదుతున్నట్టు ముదురునీలం, పట్టు కుచ్చుల్లాంటి రెక్కలు కల్గిన సీతాకోక చిలుకలతో, రంగురంగుల ముక్కులతో, రెక్కలతో మూరెడు తోకలతో, మెరిసే అంచుల రెక్కలతో, ఎగిరెగిరి పడే పక్షులతో నిండిన ఆకాశం క్రింద వున్నట్టు, యీదుతున్నట్టు వుంటుంది.

హఠాత్తుగా నే నొక యింటిముందు శుభ్రంగావున్న సెరటిలో నిలబడి వుండడం గుర్తించాను. పదిహేను మీటర్ల యీ స్థలం—చక్కని

జేగురురంగు యిసుకతో వుంది. దీన్ని దాటితే మట్టితోనూ, గడ్డితోనూ కట్టిన—దోసిలిలో పట్టినట్టున్న రెండు యిళ్ళని చేరుతాం. ఇలాగే హేన్సిల్, గ్రెట్‌ల్ యీ అడవిలో అనుకుని వుంటారు. అనుకోకుండా మానవ నివాసస్థలం కనిపిస్తే ఆకర్షింపబడ్డట్టే - భయపడ్డం కూడా జరుగుతుంది...."హోడీ!" అని అడుగుతాను. (నేను రావచ్చా! అని) తక్షణమే గుడిసె వెనుకవైపునుంచి స్నేహపాత్రమైన ఓ కంఠస్వరం వినిపిస్తుంది "కారీబూ" అంటూ (దగ్గిరకు రండీ! అని).

ఈ మొదటి యింటి వెనుకగా దళసరి ఆకులతో వున్న జీడిమామిడి చెట్టు కనిపిస్తుంది. ఆ చెట్టుక్రింద రోటిలో జోడు రోకళ్ళతో ఓ పెద్దావిడా, ఓ చిన్నపిల్లా కసోవా దుంపలు దంపుతున్నారు. ఈ రోలు కర్రది. చెట్టు మొదలు నరికి తయారు చేసిన యిది బలంగా వూని నిలిచివుంటుంది. నన్నుచూసి, కొత్తవాణ్ణేకాక యూరోపియన్‌ని కూడా అవడంచేత ఆ స్త్రీ నడుం దగ్గిరవున్న నల్లని కనికిగుడ్డ వక్షోజాలమీద కప్పుకొంటూ చంకల క్రిందగా దోపుకుంటుంది. ఈ ప్రత్యేక ప్రవర్తన ఆ చిన్నపిల్లని భయపెడుతుంది. దంపుతూన్న రోకలి వదిలేసి, రెండవ యింటిదగ్గిరకి పోయి తలుపు వెనక దాక్కుంటుంది.

సన్నగా నవ్వుతూ నుదుటిమీద చెమట తుడుచుకుంటుంది పెద్దావిడ. ఆవిడ ఆపిల్లదాని తల్లా? అమ్మమ్మా? అన్ని జాతులలోను ఒక్కలాగ తెలియ చెప్పవు-వయస్సు తెచ్చే చిహ్నాలు. మకొండె అమ్మమ్మలు కొందరికి వయసువాళ్ళ శరీర సౌష్ఠవం వుంటుంది. వారి ముఖం కాలానికి అతీతంగా వుంటుంది. కసోవాపిండి వెదురు చేటలో చెరుగుతూంటే చూస్తూ ఆవిడతో కూర్చుని కొంచెంసేపు మాట్లాడుతాను. తలుపు వెనుకనుంచి ఆ చిన్నపిల్ల తొంగి చూస్తుంది. ఈతడు పూర్తి ము-జుంగు కాదేమో? అందరికీ తెలుసు - నిజమైనవాళ్ళు ఆఫ్రికను చిన్నపిల్లలని తినేస్తారు! లేకుంటే సముద్రాలు దాటించి బానిసలుగా పంపేస్తారు! వింతసేనలూ, యుద్ధాలూ ఈ నేలకు వచ్చి చాలా రోజులే అయినా

యింకా మా యూరోపియనులంటే వింత అభిప్రాయం పాతుకుని వుంది యిక్కడ.

వీరిలో చాలా పెద్దవారికి కొందరికి మాత్రమే—వ-గొని దోపిడీలు-మచెంబరాజు, 1886 లో జర్మనులరాక, వీరిపై మాజీమాజీ విప్లవం 1905 లో జ్ఞాపకం వున్నాయి. ఒకసారి నా ప్రశ్నకి యిలాంటి పెద్ద ఒకరు సమాధానం చెప్పారు. ఉత్తరాదిన ఉన్న ఇలురుకొండ ప్రాంతం నుంచి వ-మవెర వారు వచ్చారు, అలాగే దక్షిణాదినుంచి వ-గొని వచ్చారు, కాని వ-డచ్చీ (జర్మనులు) అంత ప్రదేశంలోనూ వున్నారు. అప్పుడు వ-మవెర వారు అన్నారు. "వ-మకొొండె మీరు మాకు యుద్ధంలో సహాయం చేయండి: అప్పుడు నవెలాలో ప్రతి సంవత్సరం పోల్‌టాక్సు మూడు షిల్లింగులకంటె ఎక్కువ కట్టనక్కరలేదు. అలా మీరు రాకుంటే మీ యిళ్ళు తగులబెడతాం: మీ మేనల్లుళ్ళని, మేనకోడళ్ళని అందర్నీ బానిసలుగా అమ్మేస్తాం అన్నారు. అందుకని వీరితో మేం కలిశాం. మాకు యుద్ధం అంటే యిష్టం లేకపోయినా, తప్పలేదు. అప్పుడు వ-డచ్చి కోపించి పెద్ద మరఫిరంగులు తెచ్చారు. మా పిల్లలంటే వారికి గిట్టదు. ఇదే కసోవా దంపుకునే రోటిలో ముగ్గుర్ని దంపి చంపారు. ఇందుచేతనే మీలాంటి వారిని చూస్తే పిల్లలు యిలా పారిపోతారు. మీరు స్నేహ చిహ్నగా ఓ బొమ్మ చూపితే సంతోషిస్తారు.''

అంచేత ప్రస్తుతపు 'వ-జుంగు'ను గురించి మాట్లాడ్డం ప్రారంభించాము.

"మీ ఉద్దేశ్యం బ్రిటిష్ వారనా? వారు చాలా సహృదయులు. కోపగించుకోరు. వ-డచ్చివారిలాగా హిప్పో కొరడాతో కొట్టరుకూడా. కాని వారి కోర్టు వ్యవహారాలు ఓ పట్టాన అర్థం కావు. ప్రతి కొద్ది సంవత్సరాలకీ పోల్‌టాక్సు ఎందుకు పెంచుతారో తెలియదు. జర్మనులకి మూడు షిల్లింగులు యిచ్చేవాళ్ళం, కాని యిప్పు డెందుకో వీళ్ళు ముప్ఫయి పుచ్చుకుంటున్నారు''.

"అవును. కాని మకొండె వాటర్ కార్పొరేషను లాంటివి స్థాపించా లంటే డబ్బు కావాలి గదా ? అదెక్కడి నుంచో రావాలి. అవునా ?'' అడిగాను.

నా మనస్సులో యూరోపియనులను గురించీ, వారి వెనుక వాతావరణం గురించీ యిలాంటి సంభాషణలన్నీ వున్నాయి. అందుకనే తలుపు వెనక దాగుకున్న చిన్నపిల్లని యివతలకి రప్పించాలని ప్రయత్నించలేదు. దానికి బదులు పెద్దావిడతో పాటు దంపులో సాయం చేయాలని ప్రయత్నించాను. ఇది ఆమె ఓర్పుకి పరీక్షగా తయారైంది. ఇంకా మెడ ముందుకు సాచి తొంగి చూసి, ఆగలేక యివతలకి వచ్చి నా చేతుల్లోంచి రోకలి అందుకుంది. సరిగ్గా ఎలా దంపు వేయాలో వేసి చూపెట్టింది. మొదట శరీరాన్ని పూర్తిగా సాగేలా పైకెత్తాలి. అప్పుడే రెండు చేతుల తోనూ రోకలి పైకి ఎత్తాలి. తరువాత వంగి రోకలి క్రిందికి దించి పోటు వేయాలి. అదంతా ఎత్తు తక్కువ బల్ల మీద నుంచి యీత కురికినట్టుంది. ఇలా చేస్తే కసోవా బాగా దంపబడుతుంది. శ్రమ కూడా తక్కువగా వుంటుంది. ఇది స్త్రీలకి తగిన వ్యాయామం కూడాను. శరీరానికి చక్కని ఆకృతి నిస్తుంది. పురుడు సులభతరం చేస్తుంది. నేను మళ్ళీ ప్రయత్నించే సరికి అ అమ్మాయి కూడా నవ్వేస్తుంది-కొంచెం ఫరవాలేదన్నట్టు. పొడుగ్గా గుడ్డులా వున్న ఆమె తల నిమురుతూ 'క్వహెరీ!' (గుడ్ బై!) అంటాను. 'అసంతె!' (థాంక్యూ!) అంటుంది పెద్దావిడ చాలా మర్యాదగా. చిన్నపిల్ల తల్లే పెద్దావిడ అని తెలిసోయింది. నేను త్వరత్వరగా వచ్చిన దారినే పోతూంటే, ఆశ్చర్యంగానూ సాదరంగానూ చూస్తుంది. చీకటి పడకుండా డేరా చేరాలని నా ఆత్రుత, ఆమె చూపులో ఆశ్చర్యం, ఇక రాని పూర్వపు జీవితం పట్ల నిరాశ అన్నీ కన్పిస్తాయి. నా స్కూలు సెలవులలో యిలాగే రైతులకి గడ్డి కోతలలో సహాయపడి నెత్తిన పెట్టుకొని తెచ్చేవాడిని. ఈ ప్రస్తుతపు వ్యవసాయదారుని స్త్రీ జుట్టు దగ్గరగా కత్తిరింపబడి వుంది. ఈమె శరీరవర్ణం కూడా ఆస్ట్రియా పల్లెసీమలలో వింత ఆలోచనలు రేపుతుంది. ఈ తేడాను తప్పించి వీరిద్దరి మనస్తత్వాలలోనూ పోలికలే ఎక్కువగా తోస్తాయి. ఆలోచించే కండ్లతో, నిశ్శబ్దంగా ప్రశ్నించే పెదవులతో

వున్న ఈ ముఖం నాకు సుపరిచితమే అనిపించింది. నావైపు చూస్తున్న ఆమె కళ్ళు ప్రత్యేకించి నన్నే చూడడం లేదు ; నే వెళ్ళే దారిని పరిశీలిస్తున్నాయి. ఆకాశాన్నంటుతున్న ఆ పవిత్రమైన చెట్టు, దాని విస్తృతమయిన గొడుగులాంటి కొమ్మల గుంపులూ చూస్తూందేమో తెలియదు. 'క్వహోరీ' కంటె మంచి మాట లేమైనా చెప్పాలని అన్పిస్తుంది నాకు. మంచి చెయ్యి; హృదయం కల్గి వుండు. ఏదైనా ఒక మంచి - నాలాంటి వారు తరతరాలుగా యీమెలాంటి వారికి చేసిన లోటుని తీర్చేది-హృదయాన్ని విప్పి చెప్పేది - ఏదైనా మంచిది యీమెతో చెప్పాలనీ, ఆమె కేసి చూడాలనీ ప్రయత్నిస్తాను. కాని అప్పటికే నుదుటిమీద చెమట ఒత్తుకుంటూ తల వంచేసింది. ఆ చేష్ట కన్నీటిబిందువును తుడిచివేస్తూందా అనిపించింది. నేను సాగిపోతూంటే తిరిగి జోడు రోకళ్ళ పోటు వినిపించడం ప్రారంభించింది. ఆ చిన్ని రోకలి చప్పుడు విస్తరించి విశ్వాంతరంగా ప్రశ్నిస్తూన్న పావురాళ్ళ ప్రశ్నలలో కలిసిపోయింది— ఆగని, ఆపని స్వరమేళ . అదే.

"ఎందువల్ల ? ఎందువల్ల ?"...............

# ౫. తెగలు - వారి భూములు

నేను భారతదేశంలో ఏ పద్ధతిపై నా పరిశోధనలు సాగించానో అదే పద్ధతి యిక్కడ మకొండె పీరభూమిమీద కూడా విజయవంతం అయింది. కొత్త స్థలంలో నివాసం ఏర్పరచుకొన్నాక తొలుదొల్త చిన్న చిన్న సహాయాలు చేయడానికి ఎవరొస్తారో వారి ద్వారా సులభంగా స్నేహాలు కలుస్తాయి. కర్రలు తేవడానికి సహాయం చేయడం, మొఛిఛ గుడ్లు సాయంత్రం భోజనానికి సరదాగా తేవడం లాంటివి. ఇలాంటి రాకలు మరునాటి వుదయం మనం వెళ్ళడానికి దారి తీస్తాయి. అక్కడ మన కెటువంటి ఆహ్వానం లభించిందో చూసుకుంటే తొలి స్నేహాలు ఏర్పడ్డట్టే భావించవచ్చు.

ఈ విధంగా నేను చూసిన యిల్లు మొకంజవనోలోని "మతివ రాజబు ముకులు కులు'' అనే అతనిది. నే సిద్ధం చేసిన మేపులో ఒకటో నెంబరు దీనికి లభించింది. మవిహుంబొ తెగకు చెందినది యీ యిల్లు ఈ చుట్టుపక్కల యిళ్ళన్నీ వాళ్ళవే. ఈ యిల్లు ఆ పల్లె పెద్దదీ కాదు, ఐశ్వర్య వంతులదీ కాదు. కాని సాంఘికంగా మానవ పరిణామ శాస్త్రం శోధింప దలచినప్పుడు యిలాంటిది చాలా సహజమైన ప్రారంభం; శాస్త్రయుతంగా వివిధ వివరాలతో ప్రారంభిస్తే అయోమయంగా తయారవొచ్చు.ఇలాంటిదే కూడా చాలా ముఖ్యమైన అంశంగా రూపొందవచ్చు. ఆ యింటి ప్లానుని, గుండ్రంగా వుండే యింటి ఆకృతి ఎప్పు డిలా దీర్ఘచతురస్రంగా తయా

రైందనీ, యీ మూడు గదులూ, వరండాలూ ఎలా తీర్చి దిద్దారనీ మొదలైన వివరాలను సేకరించేకంటే మతిపను కలుసుకొని కబుర్లు చెప్పడమే నాకు ముఖ్యం అనిపించింది. నన్ను చూడగానే రెండు గుడ్లు నా చేతులో పెట్టాడు - వాటి కోసం వచ్చానని. సంప్రదాయికంగా పది సెంట్లు జర్మనుల చేతులో పడేసినట్టు కాకుండా, అధికంగా గుడ్లు కావలసి అక్కడికి వచ్చానేమో అనుకున్నాడు. తెల్లని అరబు టోపీ క్రింద అతని చిరునవ్వు వెల్గింది. పొడుగాటి 'కంజు' ధరించాడు. మెడదగ్గిర తెరిపిగా వదలి వేసిన యీ విశాలమైన దుస్తులు ప్రాక్ దేశాల ఆచారంగా తోచింది. అతని తొలి నామంలోని అర్థం ఏమిటి? అని అడిగితే మర్యాద సూచకంగా తల వంచాడు. మతిప అన్నది బంటు. రెండవ పేరు-రాజబు అన్నది-తండ్రి వైపునుంచి వచ్చినది. అవివేకంగా తోచే ప్రశ్న లేమీ అడగలేదు. అతను లోపలిగుమ్మంలో నిలబడి చూస్తూన్న ఆమెకేసి చూపాడు. ఆమె అతని నాల్గవ భార్య. ఆమె ధరించిన నల్ల కనికి బట్ట చంకల క్రిందుగా దోపుకొంది. చక్కగా క్రాపు చేసిన తల నిరారుగా నిలబెట్టింది మగవానిలా. చక్కని భుజాల మీద నిలిచిందా తల. ఇద్దరు చిన్న ఆడపిల్లలు, ఇద్దరబ్బాయిలు - అందులో చిన్నవాడు తల్లిని పట్టుకు వేలాడుతున్నాడు. ఈ పిల్లలు తన మొదటి ముగ్గురు భార్యల పిల్లలనీ, వారి తల్లి తెగలకు చెందినవారనీ వివరించాడు మతిప.

నా చేతిలో ఎన్నో దారాలు వున్నాయి. ఒక్కొక్కటీ ఒక్కొక్క దిశగా సాంఘిక దృష్టిని, మానవ పరిణామ శాస్త్రాన్ని వివరిస్తూంది.

మర్యాద కోసం నే నడిగిన దాని వివరణ వినవలసి వచ్చింది. పేర్లు కూడా వాటి గాథలను తెల్పుతూ వుంటాయి. ఒక్కడు మినహా యిక్కడ వున్న అందరిలాగే మతిప ముస్లిమ్. అరబిక్ కాని బంటూ పేరు వుంది; అరబిక్ దైన రాజబు అన్న తండ్రి తరపు పేరుంది. అంతే కాక తాతగారి పేరైన ముకులు కులు అన్న బంటూ పేరు కూడా వుంది. చాలామంది పేర్లలో మొదటిపేరు అరబిక్‌ది. రెండవదో, మూడవదో మాత్రమే-బంటూ - తమ పూర్వీకులు 'పగాన్' అన్నది సూచిస్తుంది. ఇలాగే మగ్నూస్ క్రైస్తవ మతం పుచ్చుకుని, రోమన్ కాతలిక్

స్కూళ్ళకి వెళ్ళేటప్పుడు - లాటిన్ స్వంత పేరుకి తండ్రి తరపు అరబిక్ పేరు జతపరుచు కుంటాడు.

మాతృహంశలో తల్లిపేరు వస్తున్న తెగలు యీ సందర్భంలో మవిహాంబొ తెగకు తల్లకిందులుగా వుంటాయి పితృహంశ తెగలలో మొగవారికి పెట్టే పేర్లు. గత రెండు మూడు తరాలలో ఆడవారిని కూడా అరబిక్‌లో 'అమ్మాయి' అనే అర్థం వచ్చే 'బింటి' అని పిలుస్తున్నారు. దీనికే ఆమె తండ్రి పేరు కలుపుతారు. ఉదా: బింటి ఉమారి - ఉమారి అనే వాని కూతురు. అంతేకాని ఆమె పేరునో, తల్లి పేరునో పిలవడం జరగలేదు. ఈ అంతరాంతరాలలోని పొందులను అర్థం చేసుకోవడం కష్టమే. ఎందుకంటే వంశవృక్షాలు మానవ పరిణామ శాస్త్రకారులకి ముఖ్యం. అవి యిలా అయోమయంలో పడిపోతాయి. ఈ వంశ వృక్షాలూ, తెగలలోని సంబంధ బాంధవ్యాలూ సరిగా వుంటే ఒకే చోట వున్న యిరుగు పొరుగులను, వారి సంబంధాలను, సరిగా తెలుసుకోవచ్చు. ఇతని పేరు మగ్నూస్ హమిసి రాజబు అన్న దాన్నిబట్టి యితడు తండ్రి తరపు మేనల్లుడే గాని, తోడ బుట్టిన అక్కచెల్లెళ్ళ తరపు వాడు కాదు. ఇతను నా తొలి స్నేహితుడు మతిప రాజబు ముకులుకులు.

ఈ పేర్లఅయోమయం కంటె ముఖ్యమైనది ఒకటి వుంది. స్వంత పేరు, తల్లి తరపు తెగ చిహ్నమూ చూస్తే-పేరుకి తల్లి స్థలానికీ విరుద్ధం అన్నది గోచరమౌతుంది. వీటిలో రెండవ దాన్ని పట్టి కికుయు కట్టు కథలలోని మూంబి-ఆమె తొమ్మండుగురు కుమార్తెల కథలాగా, పెళ్ళి కుమారుడు పెళ్ళికి తరవాత భార్య తెగవారి ప్రాంతానికి వచ్చి స్థిరనివాసం ఏర్పాటు చేసుకుంటాడని. యీ తల్లిఅంశ తెగ లక్షణం ఒకొండె పీర భూమిలో పూర్తిగా అమలులో లేదు. దానికి కారణాలే యిప్పుడు పరిశీలించాలని.

మొకన్‌జొవనోలో చుట్టుపక్కల ఎనిమిది యిళ్ళు వున్నాయి. నేను II అని గుర్తించిన యిల్లు ఆ స్థానిక తెగ పెద్ద 'ముసనంబొవ' ది. నెలకి నలభై షిల్లింగులు (25 రూ.) యితనికి ప్రభుత్వం నుంచి ముట్టుతాయి. లిటిహాలో యితన్ని నియమించినది లివలి. ఈ చుట్టుపక్కల



తూర్పు ఉగండాలో ఓ పల్లె దృశ్యం
(గాదెలూ, నివాస గృహాలూ అరటి తోపుల మధ్య యిమిడి వుంటాయి.)



దక్షిణ టాంగన్యీకా మకొండె పీఠభూమిలో ఒక యింటి ముందట సాయంత్రపుపని.

తొలి స్నేహితురాలు
(మకొండె పీర
భూమిలో)



వలుగురులో ఒక కుటుంబము.
టాంగన్యికాలో తూర్పు ప్రాంతం.



నాడు

వృద్ధులైన మకొండె మహిళలు. యీనాటికీ పెదవి బిరడాలతో అక్కడక్కడ కన్పిస్తారు. అవి వారి చిన్నతనపు స్మృతి చిహ్నాలు.



నేడు

పెదవి బిరడాల సంప్రదాయం పోయింది.

వెదురుతో నేత. మధ్యాహ్నం పూట ఉబుసుపోకకు కబుర్లు చెప్తూ ఉలుగురులోని కిపర్‌బిటులో మహిళలు చేసే పని.





ఓసోవాదుంపలు దంపి పిండి చేయడం అయింది, ఇక వండడమే తరవాయి.



నగామ లయనృత్యంలో ఉగురు చిన్నపిల్లలు.

చిరిగిన విదేశపు కోటు ప్రతిష్ఠకు చిహ్నం!



ఆఫ్రికను యువతి

కిపర్ బిటులోని
ముజుమి మవన్యేముప





ఉగండాలోని ముస్లిమ్ పిల్లలు



కిపర్ బిటులో ముజుమి యిల్లు. గుండ్రని యింటి భాగం, వెనక గది చూడవచ్చు.



ఇల్లు కడుతున్నప్పటి దృశ్యం. గోడలు మట్టితో మెత్తడం అయింది.

విభిన్నత్వంలో ఏకత్వం
ఉగురు





అక్కాచెల్లెళ్లు.



కిపర్ బిటులో హబిబా ఆధ్వర్యం క్రింద జరిగిన నగోమా నృత్యం.



హబిబా. కెమెరామందు ।



ఇంట్లో పిల్లలు



ెలుకోసం. వరుసలో

ప్రాంతంలో యితడు పుట్టి పెరగక పోయినా అతనికి అధికారం లభించింది. పురాతన స్త్రీ 'బి ముకుబ్వా' ఛిటోలో ద్వారా మాతృహంశ హక్కు యితనికి లభించింది. అందుకే అధికారం వచ్చింది. ఎన్నో సంగతులు జాగ్రత్తగా చూసుకుంటూ, ఎన్నో సార్లు యీ తెగ పెద్దలతో వాద ప్రతివాదాలు జరిపినమీదట యిదివరకు నా కేర్పడ్డ అభిప్రాయాలు తప్పని తేలింది. ఇక్కడి కుటుంబాలు ముసలిదైన ఛిటోలో వంశీయులే కాకుండా ఆమె ఐదుగురు అప్పచెల్లెళ్ళ వంశీయులు కూడా – ఆమె మనుమరాళ్ళు.

వీటన్నిటి కంటె అయోమయం అనిపించిన దేమిటంటే – యీ ఐదుగురు అక్కచెల్లెళ్లూ బింటి నహౌలె – నహౌలె అనే వ్యక్తి కుమార్తె అని పిలువబడేవారు. నిజానికి వీరందరికీ వ్యక్తిగతమైన యింకో పేరు వుండనే వుంది – వారి అక్క ఛిటోలోకి వున్నట్టే. కాని యీ వ్యక్తిగతమైన పేర్లు ఆరేడు తరాలు దాటేసరికి ఎవరికీ జ్ఞాపకం లేవు. వీరిలో ప్రతి ఒక్కరూ తన స్వంత బింటి నహౌలెను గురించే మాట్లాడుతారు. పాపం ! యీ మానవ పరిణామ శాస్త్రకారుడు యిన్నాళ్లూ యీ ఐదుగురునీ కలిపి ఒక్క స్త్రీగా మాట్లాడాడు !

ఈ పరిస్థితినిపట్టి ఎక్కడో మూలగా వున్న యీ ముకంజొవానో పల్లెలోనే మాతృహంశ తెగలూ, పద్ధతులూ సడలుతున్న వన్నది తెలుస్తూంది. దానికి కారణం యిది – పూర్వపు పెద్దలు మగవారు, ఛిటోలో తెగకు చెందినవారు యిక్కడికి వచ్చి తమ భార్యలను చుట్టుపక్కల తెగలలో నుంచి తెచ్చుకుని తద్వారా తండ్రి నివాసస్థానంలోకి తల్లి వచ్చి నివాసం ఏర్పరచుకొనే పెట్రిలోకల్ పద్ధతికి నాంది పల్కారు.

దీని లక్షణా లిలా ప్రస్ఫుటంగా వున్నాకూడా, తొలుత ఏర్పడిన మాతృహంశ తెగల చిహ్నాలు పూర్తిగా పోలేదు ఈ మకొండె పీఠభూమి మొత్తంమీద. భార్య నివాసస్థలానికివచ్చి స్థిరపడడం, భార్య తెగకు చెందిన భూములను సాగుచేయడం అన్నది సజీవ చిహ్నాగానే వుంది యిక్కడ. అబ్దుల్లా ఫండి ఈ విషయాన్ని రుజువుచేస్తున్నాడు.

అబ్దుల్లాఫండి కమ్మరిపని చేసేవాడు. మటొంగవెలెలో నివాసం. మకొండె వాటర్ కార్పొరేషను పంపింగు కేంద్రం అది. 1958 లో నేను ఈ స్థలం చూచినప్పుడు యితను రెం డెకరాల పొలం సాగుచేస్తు న్నాడు. ఆ భూమి అతని స్వంతతెగ 'నందల'కు చెందినదికాదు అతని భార్య బింటిమెజీది. ఈమె తెగ ముంగ. బింటిమెజీ నివాసంలోకివచ్చి స్థావరం ఏర్పరచుకున్నాడు. ఈమె తెగపెద్దలు యితన్ని వ-జీకి బంధు వుగా గుర్తించారు. మెజీకి విడాకు లివ్వాకకూడా అబ్దుల్లా ఈ భూము లను పండించడానికి సమ్మతించారు. మెజీ తిరిగి వివాహం చేసుకుని భర్త నివాసస్థలానికి వెళ్ళిపోయింది. అబ్దుల్లా అమినా అనే యింకో వనితని-యింకోతెగ-బొండెకి చెందినదాన్ని వివాహం చేసుకున్నాడు. అయితే నేం, తొలిభార్య కుమార్తె ఫతుమా తండ్రితోనే ఉండిపోయింది. తల్లి భూముల మీద పనిచేస్తూంది-తల్లి ఈ తెగను వదిలి వెళ్ళిపోయినాకూడా. ఇలా చేయడంద్వారా మాతృహంశ ఆచారం అయిన తల్లి భూములపై, తల్లి యింటిదగ్గిర వుండడం అన్నదాన్ని అంటి పెట్టుకుని వుంది. అలాగే పితృహంశ ఆచారాన్నికూడా ఆమెదాటిపోలేదు. తండ్రికూడావుండి భూము లను చూసుకోవడంద్వారా, ఆర్థికంగానూ, రక్త సంబంధం రీత్యానూ యీమె తండ్రికి దగ్గిరగావుంది. తల్లికి దూరమైంది. ఈ చుట్టువక్కాల వారికి యీమె బింటి అబ్దుల్లా కూతురే. ఈ ఉదాహరణలో కుటుం బపు ఏర్పాట్లవల్ల మార్పులు ఒక అడుగు ముందుకు జరిగితే - మానవ పరి ణామం దృష్ట్యా రెండడుగులు ముందుకు వేశాయనే చెప్పుకోవాలి. ఫతుమా బింటి అబ్దుల్లా యింకో తెగలోని మహమ్మద్ ఉంబిలి అనే అతణ్ణి వివాహం చేసుకుంది. ఈ ఇద్దరూ వారి చిన్నపిల్లతో సంతోషంగానే కాలం వెళ్ళబుచ్చుతున్నారు. కాని ఎప్పుడైనా వీరు విడిపోవాలనుకున్న పక్షంలో ఫతుమా తల్లి భూములమీదనే వుండిపోతుంది-తండ్రితోపాటు. ఆమెపిల్ల సంప్రదాయకంగా ఈ భూములకి అధికారిణి అవుతుంది. ఇలా జరిగిన పక్షంలో విడాకులు పుచ్చుకున్న ఆమెభర్త అతని తెగకు తిరిగి వెళ్ళి పోతాడు. లేకుంటే యింకో తెగలోని స్త్రీని వివాహం చేసుకుంటే ఆ

తెగకు వెళ్ళిపోతాడు. ఈ రెండు కుటుంబకథలూ, యింకా యితర వివరాలూ పరిశీలించిన పిదప నే నీ క్రింది విధంగా నిర్ణయించుకున్నాను :

ఒకటి : అవాంతరాలు వచ్చినప్పటికీ, తండ్రితరపు పేరు పెట్టడాలు, తల్లిపోయి భర్త తెగవారిదగ్గర నివాసం ఏర్పరచుకోవడంవంటివి వచ్చినప్పటికీ మాతృహంశ లక్షణాలు శక్తివంతమయే వున్నాయి.

రెండు కులపెద్దలు భూములు వ్యవసాయానికై యివ్వడంలో తమ చెల్లెళ్ళ భర్తలకీ, కూతుళ్ళ భర్తలకీ ఎక్కువ ప్రాధాన్యం యిస్తూనే వున్నారు. ఈ దాతృత్వం పూర్వంలో జనాభా ఒత్తిడి లేనప్పుడు సంప్రదాయ సిద్ధంగా ఎలా వుండేదో యీనాడూ అలాగే వుంది అని ఒప్పుకోక తప్పదు.

కాని యీనాడు ఈ పరిస్థితి తలక్రిందులైంది. జనాభా మూడురెట్లు పెరిగింది; భూవసతి లేదు; నిస్సారమైన బీడులు; అడవుల నరికివేత; వర్షాలులేమి-యివన్నీకూడా బంధకాలే. అయినాకూడా పాతకాలపు పద్ధతులు నిలచివున్నాయి. అంతేకాదు. ప్రతి తెగవారుకూడా తమ సభ్యులసంఖ్య పెంచుకోవాలనే చూస్తారు ; అసలు నినాదం "పనిచేసే చేతు లెక్కువైతే ఐశ్వర్యం ఎక్కువవుతుంది", "యోధు లెక్కువైతే రక్షణ ఎక్కువవుతుంది" అన్నవి తెలియకుండానే అమలులో వుండి వుంటాయి. యువకులు తమ భార్యల భూములపై నివాసం ఏర్పరచుకొనే పద్ధతిని ప్రోత్సహిస్తూనే వున్నారు. అలాగే పెద్దలు కొందరు భార్యలను తెచ్చుకొని యూరోపియను పద్ధతి వివాహ సంబంధాలు పెంచుకోమని ప్రోత్సహిస్తున్నారు. ఇలా అయితే తమ భూములపైకి భార్యలు వచ్చి నివాసం ఏర్పరచుకొంటారు.

ఇక్కడే వాద ప్రతివాదాలకూ, సామాన్య ప్రాముఖ్యానికీ సంబంధించిన అనేక ప్రశ్నలు తలెత్తుతాయి. ఈ పరస్పర విరుద్ధమైన పోకడల ఫలితాలేమిటి ? వీటికి ప్రారంభం ఎక్కడ ? అని ప్రశ్నించుకుంటే—అత్యధిక జనాభావల్ల పెరిగిన నిత్య జీవితావసరాలు, పరిశ్రమల పెంపు, పట్టణవాసపు పోకడల పెరుగుదల, యివికాక మన స్తత్వరీత్యా

ఏర్పడ్డ యితర కారణాలు-ఉదా : మతంమార్పు, ఉదాహరణ యోగ్యంగా ప్రభుత్వచర్యలు; ఇతరరకాల ప్రచారం-యివేమైనా కారణాలా? ఆఫ్రికను పద్ధతి మాతృహంశ తెగల కులాచారాలు, ఈ యూరోపియనుల పరిచయాలూ అభ్యుదయ ప్రపంచానికి పనికిరావా? ఆఫ్రికావి కావడంచేత పాతకాలపు పద్ధతులు అయాయా? ఈ ప్రశ్నలన్నీ ఒకదానిపై ఒకటి ఆధారపడి వున్నాయి. ఏ ఒక్కదానికీ ప్రత్యేకంగా సమాధానం చెప్పుకోలేము కాని రచన సాఫీగా జరగడానికేనా వీటికి సమాధానం చెప్పుకొందుకు ప్రయత్నించాలి.

భార్యా భర్తలు కలసి ఎవరిపక్కకి ఎవర్ని తీసుకువద్దాం అన్న ప్రయత్నంలో ఫలితం ఏమిటి? ఒక్క మాటలో చెప్పాలంటే వధువుధర. ఓలి. కొద్ది సంవత్సరాల క్రిందటివాకా టాంగన్యికాలోని ఈ మాతృహంశ తెగలలోవారికి పెళ్ళి ధరలన్నవే తెలియవు - ఏదో లాంఛన ప్రాయంగా తప్పించి. కాని ఈ కొత్త ఆచారంకూడా త్వరగానే పుంజుకుంటూంది. కాని పూర్వం పశ్చిమ ఆఫ్రికాలో జరిగినట్టు దుష్ఫలితాలతో కాదు ; పెళ్ళి ధరలూ, బానిస వ్యాపారమూ చారిత్రకంగా కలిసి నట్టేవున్నా ఎంచుకు మహిళల ప్రతిపత్తిని కించపరుస్తున్నాయన్నది-తూర్పు ఉగండాలోని పితృ వంశీకులలోకూడా-ఇక్కడ వధువుధర ఓలి అన్నవి సాంప్రదాయమైనవి. పాతుకుపోయిన ఆచారం మనం తెలుసుకున్నాం. అందుకే ఈ కొత్తగా వచ్చిన పెండ్లి ధరలన్న వాటిని గురించి ఎక్కువగా వివరింప నక్కరలేదు. మాతృహంశ సంఘముపై అలాంటి ఫలితాలనే యిచ్చాయి యివి కూడా. పెండ్లికొడుకుకి భార్యను తన నేలపై వచ్చి వుండడానికి అవకాశం యిస్తాయి ఈ పెండ్లికి చెల్లించే ధర. ఇందువల్లనే యింటికి తెచ్చుకున్న భార్య కొనుక్కున్న "బానిస" తో సమానంగా చూడబడేది. నేను ఉగండాలో కమ్యూనిటీ డెవలప్‌మెంటు సంస్థలో కలుసుకొన్న ఒక ఆఫ్రికను అధికారిణి ఈ సంగతే అంది.

తరువాతి ప్రశ్న. ఈ పోటీపడే తెగల మధ్య పొత్తు ఎలా వస్తుంది? ఎక్కడ వీరిపోటీ తెగిపోతుంది? వ - మకొండె తెగలవారు సర్వసాధారణంగా మాతృవంశీకులే. భర్తలే భార్యల యింటికి వస్తారు.

వీరికి తలక్రిందులైన పితృహంశీకుల అలవాట్లు కొన్ని అయినా అమలు లోకి వచ్చిన తరువాత కాని ఈ బలాబలాలు చూసుకోవడం అన్న ప్రశ్నే లేదుకదా. ఈ రకం అలవాట్లు-భర్తతో వెళ్ళడం వంటివి. క్రిష్టియను మిషను వారే తెచ్చారు. ఈ మాతృహక్కు విషయంలో యూరోపియనుల దృక్పథం తప్పుదారిన ఉన్నది. తల్లితమ్ముడు అధికారంలోకి రావడం అన్నది బహు భార్యాత్వం మూలాన్నే అనేదే ఆ తప్పుదోవ. కాని అస లీ మేనమామ ప్రాముఖ్యత యీ కుటుంబాలలో ఎలా వచ్చిందంటే - అతనే తల్లి తెగకు చెందిన సభ్యుడు; అత నామె సోదరుడు కావడంతో యింకా సంబంధం దగ్గరైంది. మానవ పరిణామ శాస్త్రం అంతగా తెలియని వ్యక్తు లీ విష యాలు గుర్తించరు మాతృహంశ తెగలలో తల్లి కెంతో రక్షణ వుం దన్న విషయం వారికి బోధపడదు. కాని రాజకీయవేత్తలు ఆఫ్రికనులలో సాంఘికమైన కట్టుదిట్టాలను, మత నమ్మకాలను పూర్తిగా మార్చాలన్న ఉద్దేశం లేకపోయినా, ఈ తల్లితరపు చుట్టం యింటి యజమాయిషీ వహించడం అన్నదాన్ని అపనమ్మకంతోనూ, వింత దృష్టితోనూ చూస్తారు. ఆతను తన మేనల్లుళ్ళకీ, మేనకోడళ్ళకీ స్కూలు జీతాలు సహితం కట్టేటంత బాధ్యత వహిస్తాడంటే గమ్మత్తుగా తోస్తుంది వీరికి. సహజంగానే యిలాంటి పరిస్థితి ఆఫ్రికను నాగరికతలోని ఉత్తమ లక్షణా లని బలపరిచేదిగానూ, ముఖ్యంగా మాతృహంశ సంఘాన్ని మిన్నగా చూసేదిగానూ తోచదు. ఏది ఏమైనా శక్తివంతమైన మిషను సంస్థలు అధికారుల ఆదరాభిమానాలతో వీటికి వ్యతిరేకంగానే పనిచేస్తాయి.

దక్షిణ టాంగన్యికాలో యిటువంటి ప్రత్యేక పరిస్థితిలో యింకో పార్టీకూడా తలదూర్చి వుంది . అదే అరబ్స్. ఈ పీఠభూమిలో మూడు వంతులలో రెండు వంతుల మంది ముస్లిములు కావడంతో ముస్లిమ్ వ- మకొండెలకి మతం యిచ్చే అధికారం వుంది. ఈస్టాఫ్రికాలో, పురాతన కేరళ దేశంలోలాగ వలసవచ్చిన అరబులు స్థానిక కన్యలను వివాహం చేసుకుని, దృక్పథ వైశాల్యం కల తమ మత సూత్రాలను బోధించారేగాని చాలామందిని మార్చాలన్న ప్రత్యేక ప్రయత్నం చేయలేదు. మాతృహంశ తెగలకు చెందిన ఉత్తర మలబార్ మాపిలాస్ లాగే మకొండె, మకువ,

యువో ముస్లిములు సంప్రదాయకమైన తమ తల్లి తెగల కుటుంబపు అల వాట్లనే అసులులో వుంచుకున్నారు. అలాగే, ఆఫ్రికనుల జీవితాలతో, అలవాట్లతో ఎక్కువగా జోక్యం కలుగజేసుకోలేదు. కాని ఒక్కసారి క్రైస్తవ మతానికి మళ్ళించడం అన్నది ప్రోత్సహించడంతో, సాంప్ర దాయికమైన సూత్రాలను కాదని, తండ్రి యింటిపెద్ద, తండ్రి యింటికే వధువు రావాలి అన్నది నిర్బంధం చేయడంతో ముస్లిములుకూడా ముందుకి వచ్చి, జాంజిబార్, ఒమన్, కైరో, బాగ్దాద్‌లలోని ముస్లిములు యిలాంటి పితృహంశ అలవాట్లను అమలులో వుంచరు కనుక మేమూ అలాగే మారతాం అంటారు. వీరి వాదనకూడా 'యిదే అభ్యుదయం,నాగరికం'అని.

కాని పెళ్ళిచేసుకున్న నూత్న వధూవరుల తెగలవారు ఎవరికివారే ఎదుటివారిని తమ తెగలలోకి తేవాలని ప్రయత్నాలు చేస్తారు. పాత కాలపు అలవాట్లపై మోజుంటే వధువుయింటికి రమ్మని, యూరోపియన్ ఆధునిక పోకడలపై మోజువున్న పిల్లవాడైతే తన తెగలోకి రమ్మని అంటున్నారు. ఇదొక విషమ పరిస్థితి. విపరీతంగా జనాభా పెరిగిపోయిన తెగలలోని పెద్దలు నిజానికి సంతోషించాలి-బరువు భారంతో కృంగిపోయిన భూములని వదిలి యువతరం దూరంగాపోయి కాబోయే అత్తవారింట నివాసం ఏర్పరచుకోవడం సంతోషదాయకమేకదా. భూసారం యింకా తగ్గిపోయి, బీడు నేలగా వుంచే కాలంకూడా తగ్గించేసే ప్రయత్నాలు జరుగుతున్నాయి కనుక ఈ పరిస్థితి మారవచ్చు. ఇలా చేయడంవల్ల సారం తగ్గి పంటలు పండక పోవచ్చు-వర్షాలలాగే. అడవులనూ, పెద్ద చెట్లనూ నరికేసి వర్షాన్ని అలాగే దూరంగా తోలివేశారుకదా। ఈ లోగా అసలు పరిస్థితి గుర్తించక యీ యిటా - అటా అన్న పోటీ జరుగుతూనే వుంటుంది. అలాగే కాలక్రమంగా యూరోపియనుల ప్రాబల్యం పెర గడంతో, తండ్రే గృహ యజమానిగా వుండడం ఆధునికం అనీ, అదే అభ్యుదయం, అదే నాగరికం, అందుకని అదే అనుసరింపతగ్గ సుగుణం - అన్న నమ్మకం కూడా బలపడుతూంది. "ఇది ఆధునిక యుగం", "ఎవరూ దీన్ని అరికట్టలేరు", "ఇది ముందడుగు'', "ఎవరూ కాలాన్ని వెనక్కి తిప్పలేరు'' - పోటీపడుతూన్న ప్రతి తెగల జతలలోనూ యివే వాదనలు.

సుముఖంగా తోస్తున్నాయి. ఇవన్నీ సత్యంగా గోచరిస్తాయి. నమ్మకం కలిగిస్తాయి - ఒక్క బస్సు డ్రైవరు కథ ఉదాహరణగా తీసుకుందాం.

బస్సు నడపడం, ప్రతి నెలా డబ్బు సంపాదించడం అన్నది నిజంగా అభ్యుదయమే. పాతకాలపు ఆరబ్ నివాసస్థలం (మికిందానిబే) దగ్గరగనూ, మకొండె పీఠభూమికి క్రిందుగానూ వున్న జిల్లా కేంద్రం-మట్వారాలో ఒక బస్సు డ్రైవరుకి మంచి పనే వుంది. ఇతని భార్య వీలున్నప్పుడల్లా క్రిందికి వెళ్ళి భర్తని చూసి వస్తూండేది. అలాగే సెలవు దొరికినప్పుడల్లా యితగాడూ వచ్చి పోతూండేవాడు - భూమీ పుత్రా చూసి. తరువాత యితనికి డారెస్సలామ్‌కి బదిలీ అయింది. ఇది చాలా ఉత్తరాదిన భూమధ్యరేఖకు దగ్గిరగా వున్న స్థలం. ఇక్కడా డబ్బు బాగా వచ్చేది; తన భార్యని తెచ్చుకుని హాయిగా కాలం గడపడానికి తగినంత డబ్బుంది. అతడు చనిపోయినా, యిద్దరూ విడాకులు పుచ్చుకున్నా భార్య తిరిగి ఆమె తెగవారికున్న భూమి సాగు చేసుకుందుకు పోవచ్చు. కాని ఆమె చిన్న కూతురు డారెస్సలామ్‌లో పెరిగి పెద్దది కావడంతో ఎక్కడా కాలూనడానికి అవకాశం లేదు. పెద్దయాక ఉద్యోగం చేసుకోవాలి. లేదా ఎవర్నైనా పెళ్ళి చేసుకోవాలి. అంతకు మించిన రక్షణ లే దామెకు.

కాని వ-మకొండెలు చాలామంది బస్సు డ్రైవర్లు కాదింకా. అయినా కూడా యీ బస్సుడ్రైవరు, లేకపోతే యింకో రకం జీతగాణ్ణి చూపి కూడా చిన్నకారు వ్యవసాయదారులవి, తల్లిఅంశపు అలవాట్లని చిన్న చూపు మాస్తూ, యివి ఆధునిక కాలానికి తగినవి కాదనీ, పాతకాలపువి, అనాగరికమైనవి, ఛెంజీ - ఆదిమనివాసుల లక్షణం అనీ నిరసిస్తున్నారు. ఇది చాలదా యీ సంప్రదాయం నశించిపోడానికి ?

ఇక్కడి పాలకవర్గం వారు తాము సాధించిన దానికి గర్వపడవలసినదే! మ-కొండె వాటర్ కార్పొరేషన్ విజయవంతం కావడం గొప్ప విజయమే అనాలి. అంతమాత్రంచేత వీరు అధిక తరం అయిపోతూన్న జనాభా సమస్యనూ, పీఠభూమిపై నున్న భూవసతి తక్కువై పోడాన్నీ, పంటలు తగ్గిపోవడం లాంటి వాటినీ గుర్తించలేదని కాదు. వీటికి అనుకూలించేవి రెండే మార్గా లున్నాయి.

ఒకటి : ఆకుల ఎరువు వుపయోగించి, పీఠభూమి అంచుల వెంబడి రాతి ప్రదేశంలో కూడా పంటలు పండించే ప్రయత్నం చేయడం. తొలి సంవత్సరాలలో మంచిపంటలు వుండవచ్చు కాని రాను రాను అడవులు తగ్గిపోవడం, వర్షాలు లేకపోవడంతో పంటలు తగ్గే అవకాశం వుండకపోదు.

రెండు. రువుమ లోయని యంత్రాలతో వ్యవసాయం సాగించేటందుకు అనువుగా చేయడం. ఈ బురదతో కూడిన కొత్త నేల అడవులు హిప్పోపోటమి, ఏనుగులకు నిలయమై వుంటాయి. ఈ నదీ లోయలో మొసళ్ళు నిండి వుంటాయి. కాని యంత్రాంగాలు తెచ్చి పని ప్రారంభిస్తే అమెరికను పద్ధతి ట్రాక్టరు వ్యవసాయం అనువవుతుంది. చక్కని పద్ధతిన కో-ఆపరేటివ్ వ్యవసాయం ప్రారంభిస్తే, కిలిమంజారో ప్రాంతంలో కాఫీ తోటలు వేసి ఐశ్వర్యవంతులైన 'ఛగ్గా' తెగల లాగే యిక్కడి వారూ సంపన్నులు కాగల అవకాశం లేకపోలేదు.

ఈ రెండిటిలో ఒకటో, రెండూనో త్వరలోనే ప్రారంభించక తప్పదు. భయంకరంగా పెరిగిపోతూన్న జవాభా సంఖ్య, తరిగిపోతూన్న పంటలు ఏదో ఒక చర్య త్వరితగతిని తీసుకొనేలా చేస్తాయి. కొద్ది మాసాలలోనో, సంవత్సరాలలోనో కదలిక రాక తప్పదు. కాలం వృథాచేయడానికి అవకాశం లేదు. అద్యతన భవిష్యత్తులోనే ఈ లోయలో ప్లాటులుగు ర్తించికాంట్రాక్టరులు బుల్‌డోజర్లతో అడవులని కూలతోస్తారు. ట్రాక్టర్లతో యీ కొత్త భూమిని వ్యవసాయానికని దున్నడం ప్రారంభిస్తారు. తొలి ఫలితాలు అతి విజయవంతంగా వుండడంతో యీ భూముల కోసం ఎగబడడం జరుగుతుంది. ఎక్కువ పాడినవారు – ధైర్యసాహసాలున్న యువకులు త్వరితంగా డబ్బు చేసుకుంటారు....ఎటు చూసినా కూడా కాలం వృథాచేయడానికి వ్యవధి లేదు.

మకొండె సంఘ జీవితంలో మకొండె వాటర్ కార్పొరేషను వల్ల వచ్చిన మార్పులని గురించి కొంచెంగా తెలుసుకున్నాను నేను. ఈ పరిశీలనలు ముందు ప్రణాళికలకి పనికివస్తాయేమో! ఎందుకైనా వీటిని కాగితంపై పెట్టే అవసరం కనబడింది నాకు.

బ్రిటిష్ అధికారులతోనూ, ఆఫ్రికను పెద్దలతోనూ నేను మాట్లాడుతున్నప్పుడు, నా పట్ల వారిదృష్టి చాలా సౌమ్యంగానూ, స్నేహపురస్సరంగానూ తోచింది. ఉత్సాహ జనకమైన ఒప్పందాని కొచ్చినట్లు తోచింది. ఈ కార్పొరేషను పీఠభూమిపైకి మంచినీటిని తేబోతుందన్నప్పటి నా ఉత్సాహం జ్ఞాపకానికి వచ్చింది నాకు. మంచినీరు! ఇదే కనక పైకి వస్తే స్త్రీలకీ, పిల్లలకీ పెద్ద బరువు దింపేసినట్టే! నా ప్లానులు మకరెరెలో చాలా త్వరగా చేసేసుకున్నానే! కెన్యాలో ఎంతో ఆత్రుతతో డారెస్సలామ్ నుంచి ప్రభుత్వం పంపే సమాధానం కోసం ఎదురు చూశాను. అది నా ఓర్పుకి పరీక్ష అయింది.

ఇప్పుడో? నా విధి ఏదో నేను నిర్వ ర్తించుతూ పోవాలంటే ఏం చెప్పాలి? నన్నాదరించిన వారిని-స్నేహ స్వభావులైన యీ యితర జాతీయులని సంతోష పెట్టడం నావిధి కదా? నేను పరాయివాణ్ణయినా నా ఉద్దేశాలను నిపుణుని వుద్దేశాలుగా ఎంచి వినడానికి సంసిద్ధంగా వున్నారు. వారికి వ్యతిరేకంగా చెప్పి స్నేహితులని దూరం చేసుకోనా? ఆలోచించిన పిదప ఐదుభాగాలుగా నే చెప్పదలుచుకున్నది కాగితం మీద పెట్టాను. ముఖ్యమైన కొన్ని అంశాలు యిక్కడ ముచ్చటిస్తే చాలు - అంతా బోధపడడానికి.

పీఠభూమిపై అందరూ యీ పంపింగు స్టేషను అంటే చాలా వుత్సాహంగా వున్నారు. అన్ని ప్రాంతాలవారూ తమ ప్రాంతపు పరిసరాలలో నీటి కియస్క్ ఒకటి త్వరగా ప్రారంభించాలని అర్జీ చేస్తూనే వున్నారు. ప్రజాభిప్రాయమే యీ ప్రణాళికకి ముఖ్యాంశం అనే పక్షంలో వెనుకంజ వేయవలసిన పనే లేదు.

కార్పొరేషను నీరు చాలా ఖరీదు అవుతుందన్నది రహస్యంగా వుంచలేదు. కార్పొరేషను అధికారులే యీ విషయంలో కావలసిన సంఖ్యలు యిచ్చారు. పాత పెట్రోలుడబ్బా, డెబ్బీ - నాలుగున్నర గేలనుల నీరు పట్టేది (ఇరవై లీటర్లు) - పదిహేను సెంట్లు ఖరీదు అవుతుంది (1½ నయాపైసలు). స్థానికంగా పెట్టిన కియస్క్‌లో యీ పని ఒక ఉద్యోగి నిర్వహిస్తాడు. ఈ డబ్బు వసూలుచేసే బాధ్యత కూడా యీ అధికారిదే. (డారెస్సలామ్‌లో మునిసిపాలిటీ వారు నీటికై వసూలుచేసే

దాని కిది పది రెట్లు ఎక్కువ రేటు.) ఇరవై రెండున్నర గేలనులకీ డెబ్భయిఅయిదు సెంట్లు అవుతే యిది న్యూయార్కు, మాస్కో, లండన్, పెకింగ్ లాంటి పట్టణాలలో వేసే రేటుకి పది రెట్లకంటే ఎక్కువే అవుతుంది. దీని ప్రాముఖ్యత అర్థం చేసుకోవాలంటే మకొండె ఆర్థిక విధానం అర్థం చేసుకోవాలి. అవసర వస్తు సముదాయ విషయం చూస్తే యీ పీఠభూమిమీది జనం నిర్భాగ్యులు కారు. పరిశుభ్రమైన యిళ్ళు ఇరుకుగా కాకుండా దూర దూరంగా హాయిగా వున్నాయి వీరికి. మొత్తంమీద నిండైన భోజనమే చేస్తారు. కానైతే మాంసకృత్తులు తక్కువ, పిండి పదార్థాలెక్కువ, విటమినుల భాగం తక్కువే. వీరికి ఓ విందుకి కావలసినవన్నీ-కృత్రిమ ముఖాలు, డోళ్ళు, డాన్సులు, నాటుసారావంటి పొంబె-వీరే స్వంతంగా తయారుచేసుకుంటారు. కాని ధనరూపేణా మాట్లాడవలసి వస్తే సంవత్సరానికి మూడు వందల షిల్లింగుల కంటె ఎక్కువ సంపాదించే రైతులెవరూ లేరు. ఇదేనా డబ్బు తెచ్చే జీవిమావిడి వంటివి వుంటేనూ, స్థానిక పల్లె పెద్దగా ప్రభుత్వం జీతం యిస్తేనూ. అయినాకూడా మకొండె ప్రజ యీ నీటిని ఎంతో ఆత్రంగా కొంటారు. రోజుకు సరిపడ నీరు కొనడానికని పదిహేను సెంట్లకోసం గృహిణి పోరుతూనే వుంటుంది. ఇవంతా లెక్క చూస్తే సంవత్సరంలో ఆరుమాసాల పాటే వీరు కియస్కునుంచి నీరు కొంటే - అదే మొత్తం ఇరవై ఏడు షిల్లింగులు అవుతుంది. అంటే సంవత్సర ఆదాయంలో పది శాతం పోతుందన్నమాట.

పీఠభూమి క్రింది మట్టానికి దిగి, మెల్లిగా స్నానంచేసి బట్టలు వుతికి ఆనపతుంబలలో నీరు తేవడం అన్నది యిక అనాగరికపు అలవాటుగా కన్పిస్తుంది. కాని కుటుంబ ఆదాయం మీద యీ ఖర్చు మటుకు గట్టిగానే కన్పిస్తుంది. బట్టల వుతుకులకి, స్నానాలకి యీ నీళ్ళు ఉపయోగించడం అన్న ప్రశ్నే లేదు. రోజువారీ కూలీకో, ఏదో ఒకటి కార్పొరేషనులో పనో, కనీసం కుట్టుపనేనా దొరుకుతుందా, కొంచెం డబ్బు సంపాదిద్దామా అన్న ఆలోచనే అందరిదీ. చాలా దూబరాకోరైన మనిషి గాని ఓ డెబ్బీ నీరు స్నానానికని కొనుక్కోడు. అదైనా స్నానానికి సరి

పడే వీరైనా కాదది. ఇందువల్లనే స్నానం అన్న దాన్ని ఉపేక్షించడం జరుగుతూంది. ఇంకో పక్కగా కొట్లలో రకరకాల గుడ్డలు అమ్మకానికి పెడుతున్నారు. రోజూ నీరు కొనడం మూలంగా పెరిగిన ఖర్చుదారీతనం అన్ని పక్కలా పెరుగుతూంది. రాను రాను గుడ్డలకై పెట్టే ఖర్చు ఎక్కువ అవుతూంది. ఈ కొనడంలో పొదుపు లేకుండా పోతూంది. అందరికీ కనిపించేలాంటి కొనుబడి పెరిగి అన్ని విధాలా యిది పెరుగుతూంది. పూర్వంలో మకొండె వాసులలో ఆభరణాలూ, ఇళ్ళూ వాకిళ్ళూ కొనేసి అందరికీ తెలిసేలా కర్చులు చేసే అలవాటు లేదు. కాని యీ రోజుల్లో ఖరీదైన కార్పొరేషను నీళ్ళు కొనుక్కోడం, పరిశుభ్రంగా లేని శరీరాల మీద ఖరీదైన దుస్తులు ధరించడం యీ కుటుంబాలలో సర్వ సామాన్యం అయిపోయింది. వీరి కర్చుల నొకసారి పరిశీలించి చూసినట్టయితే తేలేది - రాబడిలో నూటికి డెబ్బయి అయిదు పాళ్ళు ఖరీదైన దుస్తులు కొనడానికి పోతూంది ఆహారపదార్థాలలో యింకా మాంసకృత్తులు, విటమినులు తగ్గిపోతున్నాయి. ఇంకో ఉదాహరణ తీసుకోవాలంటే, కప్పుకొందుకు దళసరి వెచ్చని దుప్పట్లు లేవు. ఈ దుస్తుల విషయం తరువాత చర్చించుతాను. కాని యిక్కడ సాంఘికమైన ఫలితాలను గురించి ముచ్చటింపవలసిన అవసరం వుంది.

పూర్వంలో స్త్రీలే ఎక్కువగా క్రిందనున్న మైదానాలకు దిగి నీళ్ళు తెచ్చే పని చేసేవారు. ఈ అత్యవసర వస్తువుని తేవడంతో సంఘంలో బలంగా వున్న యీ స్త్రీల స్థానం యింకా బలపడేది. ఇప్పుడు యీ స్త్రీలే నీటికోసం, బట్టలకోసం డబ్బు అడుగుతున్నారు. కుటుంబానికి కావలసిన డబ్బు యివ్వ కల్గిన స్థితిలో స్త్రీలు కాక మగవారే వున్నారు. వీరు పైగా డబ్బు సంపాదించేవారు. ఈ విధంగా స్త్రీలు తమ స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుని, వేధించుకు తినే గృహిణులుగా తయారవుతున్నారు. ఈ మార్పు స్త్రీల ప్రతిపత్తి పెంచేది కాదు. అసలే సాంప్రదాయికమైన మాతృహంశ ఆచారాలు కాదంటూ మిషనులు, విదేశీ సంస్థలు ఎంతో ఒత్తిడి తెచ్చి స్త్రీల ప్రతిపత్తి తగ్గించేశారు.

ఇంకో కోణంకూడా వుంది ఈ సమస్యకి · శారీరక శ్రమ కూడ బెట్టుకోవడం. స్త్రీలుగాని, పురుషులుగాని క్రిందికి దిగి నీరు తెచ్చేటప్పుడు వినియోగించే గంటలన్నీ యిప్పు దేమౌతున్నాయి? ఇవన్నీ ఆర్థికంగా ముందంజకు లాభాలేకదా?

వర్షాకాలంలో, వ్యవసాయపు పనులు ఎక్కువగా వుండే సమయంలో, ఆకాశంనుంచి వచ్చే నీరు స్నానాలకీ, బట్టలు వుతుక్కుందుకూ కూడా సరిపోతుంది. కాని ఏప్రెల్‌నుంచి సెప్టెంబరు వరకు చలిగా వుండే కాలంలో, పొలంపనులు కొద్దో గొప్పో వున్నా, అంత ఎక్కువగా వుండవు. ఈ సమయమే ఉన్‌యగో ఉత్సవాలకి అనువైనది. ఇప్పుడే కుర్రవాళ్ళని తెగలలోకి తెచ్చే క్రతువులు, నాట్యాలు, కృత్రిమముఖాలు, విందులు అన్నీ జరుపుతారు. ఇలాంటి రోజులలో వారాని కోసారో రెండు సార్లో స్నేహితులతో సరదాగా తిరిగి నీరు తేవడం అంత బాధాకరమైన పనిగా తోచేదికాదు. ఇప్పుడో? నీరు తేవడం మానేయడం వల్ల మిగిలిన గంటలన్నీ ఫలవంతమైన కృషిలోనూ, అభ్యుదయ సాధనలోనూ వినియోగిస్తున్నారా? యిలా దాచిన శరీర శక్తికీ, సమయానికీ ఏమైనా ఫలితం కన్పిస్తూందా?

నా కిక్కడేమీ సాక్ష్యం దొరకలేదు నిదర్శనగా చూపడానికి. యీ విషయాలు ఆఫ్రికన్ పెద్దలతోనూ, బ్రిటిష్ అధికారులతోనూ మాట్లాడవలసి వచ్చినప్పుడు వారి ముఖాలపై నిరుత్సాహం సుస్పష్టంగా కనబడేది. తెగల సాంఘిక పటిష్ఠత అన్నది — ఏదో కొద్ది షిల్లింగులు సంపాదించడం మీదా, ఖర్చు పెట్టడంమీదా ఆధారపడి వుంటుందని చెప్పడం కాని, వినడంకాని వాళ్ళకి యిష్టంలేదు. "నువ్వు దేన్నిగురించి బాధ పడుతున్నావో, మేం కోరేది అదేకదా" అంటారు వాళ్ళు. ''ఈ ఆఫ్రికనులని డబ్బు గణించే వాళ్ళగా, ముందుకు రావాలన్న కుతూహం కలవాళ్ళగా, పోటీ పడేవాళ్ళగా తయారుచేయాలి. ఎక్కువ పని, ఎక్కువ సంపాదన, ఎక్కువ ఖర్చు! దొంతరగా ఐదు వరసల బట్టలు ధరించనీ, ఒక్కొక్కటి ఒక్కొక్క ఖండం నుంచి తెప్పించినది కానీ, అతనిష్టం. చూడు, యిప్పుడు జోళ్ళు తయారు చేసే ఫ్యాక్టరీ స్థాపించడానికి ఎంత పెట్టుబడి పెడుతున్నారో చూశావుగా?

ఆఫ్రికన్ భార్యలు జతలకి జతలు జోళ్ళు కావాలని భర్తలని పోరబట్టే కదా యిది సాధ్యం అవుతూంది? తొలుత పోటీపడ్డం నేర్చుకోనీ, ఆ రీతిన మూలధనానికి మదుపుపెట్టి తరువాత పరిశ్రమలు స్థాపించనీ. ఇలా వీళ్ళు చేసి తీరాలి. జనాభా పెరుగుతూంది. మేం శాశ్వతంగా అంటి పెట్టుకుని వుండమకదా! అభ్యుదయం! అయ్యా-యిదే అది - అభ్యుదయం!'' అంటారు.

వీరిలో కొందరు నే చెప్పబోయే దేమిటో అర్థం చేసుకుందుకు ప్రయత్నించి తలూపి "నువ్వు చెప్పేది అర్థం అవుతూంది. కాని అప్పుడే దాని కంతకీ ఆలస్యం అయిపోయింది కదా! జర్మనులు వచ్చినప్పుడు ప్రయత్నించి వుంటే ఫలితం వుండేదేమో. కాని ఆ సమయంలో కెన్యాలో మేం చేసుకున్న అయోమయం తెలుసుకదా! పంధొమ్మిదివందల యిరవైలలో సర్ డోనాల్డు కెమరాన్ గవర్నరుగా ఉన్నప్పుడే సూటిగాగాని పరిపాలనా సూత్రాలు రూపం దాల్చాయి; అదే నీ మనస్సులోవున్న దానిలో కొంత భాగం అయ్యుండవచ్చు. కాని ఈ రోజుల పోకడ దానికి దూరమై పోతూం దన్నది గుర్తించే వుంటావు. ఆఫ్రికనులకు ఎక్కువ యూరోపియను పద్ధతులు కావాలి, ఎక్కువ క్రైస్తవ మతం కావాలి, మిషను పాదరులు కావాలి అంటున్నారు. దీని అర్థం—యింకా పారిశ్రామిక అభివృద్ధి, పోటీ,దేశీయమైన అధికారాన్ని ధిక్కరించడం అని కాదా. యువకులు, పురోగమనాభిలాషులైన ఆఫ్రికనులే ఈ అభివృద్ధికి కారకులు-మేం కాదే!"

ఇంత చెప్పాక కూడా నేను లొంగలేదు. మకొండె వాటర్ కార్పొరేషను వల్ల వచ్చిన అనుభవం, ఎదురుచూడని ఫలితాలూ, హఠాత్తుగా వచ్చిన పారిశ్రామికాభివృద్ధి ఫలితాలుగా మనం లెక్కించకూడదా? యీ ప్రమాదం తప్పించవచ్చు కదా? గోలచేస్తూ కొత్త ప్రణాళికలు - రుమువ లోయలో యాంత్రిక వ్యవసాయానికి సదుపాయాల వంటివి ప్రారంభించవచ్చును కదా! గత కాలపు తప్పటడుగులు భవిష్యత్తులో ఉపయోగించేలా మార్చుకోవచ్చును కదా. మానవ జీవితంలోనూ సంఘ జీవితంలోనూ కూడా యిది సంభవమే కదా?

ఈ ఉద్దేశం నాలో క్రొత్త ఆశ మొలకెత్తించింది. కో ఆపరేటివ్ వ్యవసాయం ః ప్రాచీన తెగలవారీ సంఘం రూపం దాల్చడానికీ సమిష్టి వ్యవసాయం నాంది కావచ్చుకదా ? మకొండె పీఠభూమిపై నున్న తెగల వారి భూముల నెవరూ సర్వేచేసి మేపులు గీయలేము. కుల పెద్దలకే ఈ విషయాలు తెలుసు. వారే తగాదాలను తీర్చేవారు. త్వరలోనే తెగల వారి భూ వసతి మొదలైనవాటి కో విలువకట్టాలి. రుమువ లోయలో వ్యవసాయానికే తయారైన పక్షంలో ఏ కొందరో ప్రోత్సాహకుల కిచ్చే బదులు ఓ కులంవారు మొత్తంగా వ్యవసాయం చేసేలా భూమిని నిర్ణయింప వచ్చునుకదా ? కులపెద్దలు డైరెక్టరులుగా వుండి, యువకులచేత, స్త్రీల చేత పనిపాటలు చేయించ వచ్చునుకదా ? కులానికి మొత్తంగా చెందిన భూమిమీద వచ్చిన దానిలోనుంచి జీతాలూ కర్చులూ పెట్టవచ్చు. యీ విధంగా ఒడిదుడుకులు పోయి, అందరికీ, భార్యలకి కూడా (సంప్రదాయకమైన మాత్ృ తెగల కుటుంబాలలో కుమార్తెలకీ, చిన్న పిల్లలకీ కూడా పంచుతారు) పోయిన ప్రతిపత్తి స్వాతంత్ర్యం వచ్చేలా చేయవచ్చునే. ప్రచారం మూరఖత్వం తెచ్చిపెట్టిన అనవసరపు ఆచారాలని సరిదిద్దుకో వచ్చును కాదా. ఆధునిక పారిశ్రామిక అభివృద్ధిలోని మంచిని, ప్రాచీన సంప్రదాయాల అలవాట్లలోని రక్షణను ఈ విధంగా కలుప వచ్చునుకదా ? యిలా ఆలోచిస్తే దీనికి ద బ్బెలా వస్తుందన్న సమస్య తలెత్తవచ్చు. యిలాంటి కష్టాలని ప్రపంచం మొత్తంమీద సమిష్టి వ్యవస్థలన్నీ దాటి వచ్చాయికదా ?

సమిష్టి ఆస్తివల్ల యింకా లాభాలున్నాయి. వ్యవసాయ దారునిగా ఒక్క వ్యక్తి, మకొండెకాని, యింకెక్కడి నుంచేనాకానీ - సులభంగా అడవుల నిబంధనలు, చట్టం కొట్టి పారవేయవచ్చు: చట్టానికి విరుద్ధంగా హక్కులేని స్థలాన్ని ప్రవేశించవచ్చు: చెట్లు కొట్టేయవచ్చు; నేలసారం వుడిగి పోయేదాకా వ్యవధి యివ్వకుండ సాగు చేయవచ్చు: తిరిగి కంటికి కనబడకుండా పోవచ్చు. ఆ రీతిన చేసిన అప్పులు తీర్చ నక్కరలేదు ః ఒక కులానికంతా కలిపి ఆస్తిగా భూమి వున్నప్పుడు యిలాంటివి జరిగే అవ కాశం తక్కువ.

అడవుల చట్టాలని జాగ్రత్తగా పరిపాలింప వలసిన అవసరం చాలా వుంది; యిలాంటి రక్షణవున్న అడవులపై దొంగతనాలు జరగడం ప్రారంభం అయితే, వాతావరణపు మార్పులు, వర్షాలు రాకపోవడం, నెమ్మదిగా తరిగిపోయే ఆటవిక సంపద; సారం వుడిగిన నేల—యివన్నీ విషచక్రంగా తయారై, సహారాలో జరిగినట్లే జరుగుతుంది; మెడిటరేనియన్ సముద్రంలో కార్ట్స్ రాతి బండలపైలాగ, యీరాక్, పెర్షియా, పాకిస్తాన్, ఇండియా... ఇలాగే సహారాకి దక్షిణంగావున్న ఆఫ్రికనులకు కూడా-యింకో రెండు తరాల తరువాత జీవన్మరణ సమస్యగా పరిణమించక తప్పదు.

త్వరలోనే టాంగన్యికాలో స్వయం పరిపాలనా ప్రభుత్వం ఏర్పడుతుంది. భవిష్యత్ తరాలకోసం ఎవరు ఆలోచిస్తారు? ఎవరు పనిచేస్తారు? యువకులు, ఉత్సాహవంతులు-త్వరగా డబ్బు చేసుకుందాం అన్న వీరా? లేక గుంపులుగా కూడిన కులపెద్దలూ, మాతృహంశ తెగల ఒడుదుడుకులు పడని అలవాట్లా?

నా చేతిలోని మానవ పరిణామ శాస్త్రపు దారపుపోగుల సంఖ్య పెరుగుతూనే వుంది. వీటికి అంతు లేనట్టుంది. నా పనికి తగిన సరుకుదొరక లేదని ఫిర్యాదు చేయడానికి మటుకు అవకాశం లేదు. ఏదో ఒక తెగవారి ప్రాంతంలో నివాసం ఏర్పరచుకొని వారి మధ్య పనిచేస్తూ త్వరితగతిని నాగరికతవైపు మారే వీరిలోని సమస్యలను నెమ్మదిగా పరిశీలించాలన్న నా కల మీద ఒక నిముషం తలపోశా నొకసారి. నాకున్న తక్కువ వ్యవధి ముందర యీ సమస్యల అత్యాధిక్యతను పోల్చి చూసుకున్నాను. అప్పుడే అది ఏప్రిల్. అక్టోబరు నాటికి యిండియాలోని మద్రాసులో నా విశ్వవిద్యాలయంలో చేరిపోవాలి. ఆరు నెలలు మాత్రమే వుంది. కావలసిన విషయాలు సేకరించడానికి, స్థానికం కంటె అధికమైన కొన్ని విషయాలు తలపోయడానికి మాత్రం అవకాశం వుంది. నా పరిశీలన పూర్తి చేయడానికి మాత్రం అవకాశం లేదు. ఇదే నా తృప్తికి తగ్గట్టు చేయాలంటే కనీసం రెండు మూడు సంవత్సరాలేనా పడుతుందని నా అంచనా ... ...

# 6. రెండు మవెరా తెగల పేర్లు

మకొండె దట్టమైన గుబురుల గోడలను వదలి బయటకు రాగానే సము ద్రాన్ని వెనుక విడిచి ఒడ్డుకు వచ్చినట్టు అనిపించింది. రివరెండ్ ఫాదర్ అల్కుయిన్ మా మధ్యాహ్న భోజనం ముందు హాల్లో పెట్టించారు. నడాండా మైదానం మీద బెనిడిక్టయిన్‌వారి కేంద్రపు భవనా లవి. మవెరా తెగల ద్వంద్వ కులతత్వాలను గురించి పరిశీలించాలని నా కోరిక. దీని విషయంలోనే నేను మరునాడు మకువెకు ప్రయాణం అయి వెళ్ళాలని ప్లానులు తయారుచేస్తున్నాం. అదే క్షణంలో మాకు భోజనం సద్దుతూన్న కుర్రాడు-ము-మవెరా తెగకు చెందినవాడు - ఆఫ్రికాయనులు తయారుచేసే ఒక భోజన విశేషం పట్టుకొచ్చి పెట్టాడు. నా సంతోషం తెలియబరచ కుండా వుండలేకపోయాను. ఫాదర్ ఆల్కుయిన్. ఆల్ప్స్‌కి అటువైపున వున్న బవేరియా దేశం నుంచి వచ్చినవాడు కావడంవల్ల నా సంతుష్టిని చిరునవ్వులో అర్థం చేసుకున్నాడు. కాఫీ కూడా అయినాక తన గదికి తీసుకువెళ్ళి కిస్వహిలిలో తను ప్రచురిస్తున్న అనేకపుస్తకాలని చూపెట్టాడు నాకు. వాటిలో చాలా మటుకు అతను రాసినవే.

"చూడు. యిక్కడ, ప్రసవ సమయాన వుండే అన్ని ఆచారాలూ, అలవాట్లూ చెడ్డవని అనను. వీటిలో కొన్ని చాలా మంచివి. తప్పక అమలులో వుంచి తీరవలసినవి. ఇవి తల్లి బిడ్డల ఆరోగ్యం, పరిశుభ్రాలని

ఓ కంట కనిపెట్టేవిగా వుంటాయి. మిగిలినవి అర్థం పర్థం లేని నమ్మ కాలతో కలిసి చెడ్డవిగా తయారైన అలవాట్లు. ఉదాహరణకి చూడండి, ప్రసవవేదనపై కేంద్రీకరించకుండా బాధ మరిచిపోడానికని ఆమెని పదేపదే తన ప్రియుల పేర్లు చెప్పమంటూ వుంటారు. ఆమె చెప్పినట్లయితే యీమె చేసిన తప్పు ఫలితం ఆ ప్రేమికులకి తగిలి యీమె శ్రమ తగ్గుతుందని వీరి మూర్ఖపు నమ్మిక. బాధ భరించలేక, తాను వ్యభిచరించినా లేకున్నా ఎవరో కొందరి పేర్లు చెప్పేస్తూ వుంటుంది ఆమె. చూశావా, భయమూ, అజ్ఞానమూ ఎలాంటి పనులైనా చేయిస్తాయి" ఫాదర్ అల్కుయిన్ తన జీవితంలో సగం భాగం యివో తెగకు చెందిన యీ రెండు మూడు తెగల మధ్యనే గడిపేశారు. వీరితో కలిసి మసలడం, ఎన్నో విషయాలు తెలుసుకోగల్గడం నాకు సంతోషం కల్గించింది. ఆఫ్రికన్ ఆచారాల పట్ల యిలాంటి మధ్యేమార్గాన్ని గూర్చి చర్చికి సంబంధించిన ఉన్నతాధికారు లిలా సవ్యంగా ఆలోచించడం నాకు ధైర్యాన్నిచ్చింది.

మేం ముందు హాలులో కూర్చుని వున్నప్పుడే బిషప్ కూడా వచ్చారు. స్విస్ జర్మను భాషలో వారి దేశానికి చెందిన ఒకరి రచనలను గురించి మాట్లాడారు. 19 వ శతాబ్దంలో తల్లిహక్కును గురించి అధికార యుతంగా రాసిన రచయిత-బఛోఫెన్ నే నీ విషయంలో ఎందుకు ప్రత్యేక మైన పరిశోధన చేస్తున్నానో తెలుసుకోవాలని కోరారు. నేనూ నా ప్రత్యేక అభిమానం తెలియ చేయడానికి వెనుదీయలేదు. దక్షిణ భారతంలో, అస్సాంలో, ఈస్టాఫ్రికాలో మాతృహక్కు సంఘాలలో ప్రత్యేకంగా నా దృష్టి నాకర్షించిన విషయం - స్త్రీ పురుషుల మధ్య సంతోషకరం అయిన సమానత్వం-గురించి చెప్పాను. నా ఉత్సాహంలో చాలా ముందుకి పోయి నట్లున్నాను. తక్షణమే, బిషప్‌గారు పితృఅంశ తెగలైన కిలిమంజారో ప్రాంతాల ధనిక తెగ వ - ఛగ్గ ఇరింగాలో వ - హిహి దగ్గరలోనే వున్న సొంగియలోని వ-గొని తెగలను గురించి చెప్పారు. చూడండి, నిజంగా అధికారం కలవి, బలవత్తరమైనవి, విస్తృతం అయిన తెగలన్నిటికి ఒక్కడే పెద్ద. అంతేకాని ఆ తెగలోని పెద్దల గుంపుకాదు-అధికారం చేత చిక్కించు కునేది. రేపు మాతృహంశ తెగలవారిని కలుసుకుంటారుకదా? మకొవె

లోని మవెర మిషన్‌కు మిమ్మల్ని తీసుకు వెళ్ళమని ఫాదర్లలో ఒక రికి చెప్పాను. అక్కడ పది పన్నెండేళ్ళపాటు మవెర ఆచార వ్యవహారాలు, భాషను గురించి తరచిచూపిన ఒక మేధావిని కలుసుకుంటారు. స్విట్జర్లాండులోని సెయింట్ గోథార్డ్ నుంచి వచ్చినది మొద లాయన కదేవని."

మేం బయలుదేరి ప్రయాణం సాగిస్తున్నాం. ఏనుగగడ్డితో నిండిన ప్రదేశంనుంచి, పెద్దపెద్ద చెట్లు నిండిన అడవి ప్రాంతంలోకి చొచ్చుకు పోతున్నాం. కొన్ని చోట్ల యీ గడ్డి కారును దాటిన ఎత్తులో పెరిగింది. ఎత్తుగా పెరిగిన ఆ చెట్లకొమ్మలు ఆకాశంలో గూడుల్లా అల్లుకుని నీడ పరుస్తున్నాయి. ఎర్రటి ముఖాలతో, పొడుగాటి బూడిదరంగు తోకలతో యిటూ అటూ బాణాల్లా దూసుకుపోతున్నాయి కోతులు. ఒక్కొక్కసారి ఆగి చప్పుడుచేసే మా కారు యింజనుకేసి వింతగా చూస్తున్నాయి. లేక దాల్లో కూచున్న మా కే నో ! !—నన్ను తీసుకు వెడుతున్న యీ మత గురువుకూడా నాలాగా ఆస్ట్రియా దేశస్థుడే. నాతోకూడా మా స్థానిక భాషలో తన జీవితంగురించి, తన యుద్ధంలో అనుభవాలను గురించి, తనెలా స్టాలిన్‌గ్రాడ్ ముట్టడిలో ఖైదీగా పట్టుపడ్డం - మొదలైన వాటిని గురించి సరదాగా మాట్లాడుతున్నాడు. అందువల్లే సైబీరియాలోని కమ్యూనిస్టు ఫ్యాక్టరీలలోనూ, వ్యవసాయ క్షేత్రాలలోనూ చాలా సంవత్సరాలు గడి పాడు. ఇప్పు డీ నల్లవారి మధ్యకి వచ్చాడు.

తన పని బాధ్యత లంటే చాలా సంతోషమే. బహు వివాహాల ఆచారమే తామెదుర్కొనే ముఖ్య సమస్య అని మాట్లాడుతూ ఎంతో మంచి మనసుతో నవ్వుతూంటే-చేస్తూన్న పని చాలా నిండు హృదయంతో చేసే మనిషిలా తోచాడు.

నిజానికి ప్రొటెస్టెంటు మిషనువారికి మరీ గడ్డు పరిస్థితి; బహు భార్యలనే కాకుండా, మద్యపానాన్నికూడా నిషేధింప వలసిన నిర్ణయం వారిది. మూడోవారైన ముస్లిములు భార్యల సంఖ్య నల్గురికి పరిమితం చేసి, త్రాగుడు నిషేధించారు. కనీసం-ఫ్యాక్టరీలలో తయారైనదేనా మాన మని వీరి ఉద్దేశ్యం!

ఆఫ్రికనులలో బహు భార్యలకు కారణం-ఈ మతగురువు దృష్టిలో బిడ్డతల్లితో భర్తకు సంగమయోగం కూడదన్న "మూఢనమ్మకం." అలా జరిగినట్టయితే, తల్లిపాలు కాస్తా విషంగామారి ఆ బిడ్డ చనిపోతుం దని వీరి నమ్మకం. కాని దీనిలో కొంచెం నిజం లేకపోలేదు. పిల్ల పాలు త్రాగుతుంటే తిరిగి గర్భధారణ జరిగితే యీ పిల్లకి తగినన్ని పాలు వుండక పోవచ్చు; దాని ఫలితంగా ఆ బిడ్డ చనిపోవచ్చు. అందుకే సాధా రణంగా భార్యలు యీ పరిస్థితిలో యింకో భార్యని తెచ్చుకోమంటారు. ఆ వచ్చేది సాధారణంగా దగ్గిర చుట్టమే అయివుంటుంది. తనూ గర్భవతి అయేదాకా చాకిరీ చేస్తుంది. అలా జరిగితే మూడోది వస్తుంది: అదేనా మూడో పిల్లదాన్ని తెచ్చుకొందుకు తగిన స్తోమతు ఆ భర్తకి వుంటేనే.

చర్చి అధికారు లీ చిక్కు సమస్య నెలా పరిష్కరించాలని చూస్తున్నారో? అనిపించింది నాకు. నిజమైన చిక్కుప్రశ్నగా తోచింది యిది. ప్రొటెస్టెంటులలో లాగా గర్భ నిరోధ విషయం ఎత్తే ఆవకాశంకూడా లే దిక్కడ. పేరులో కాకుండా నిజంగానే రెండవ భార్య లున్నారు. వీరిని పని పిల్లలనికూడా అనవచ్చు. మతాధికారు లెవరేనా వచ్చే టైములో వీ రెవరూ అందరిముందూ మసలరు. మరి యిది మసిపూసిమారేడు చేయడంకదా? ధర్మం ఎలా అవుతుంది?

ఓ సంఘపు టాచారాలను అలవాట్లను సమూలంగా రూపుమాపా లన్న ప్రయత్నం చేయదల్చుకున్నప్పుడు — యీ సమస్యపట్ల వాస్తవ దృక్పధాన్ని అలవరచుకోవలసిన అవసరం ఎంతైనావుంది. యీ మధ్య ఒక విషయం జరిగింది. యూరోపియనుల అసూయంతటిది ఆ విషయం. ఇద్దరిలో ప్రతి ఒక్కత్తె తమ ఒకే భర్తనుండి గౌను అడిగే హక్కు లేదంటూంది. ఎందుకంటే చర్చిలో పెళ్లి చేసుకున్న తనకి, న్యాయ మైన భార్యకి ఒక కినికి బట్టా, రెండు అద్దకపు గుడ్డలూ మాత్రమే వున్నాయి. ఇలాంటప్పుడు రెండోది యూరోపియన్ దర్జీవాడు కుట్టిన గౌను కావాలనడం అన్యాయం!

సంప్రదాయకంగా స్నేహభావం, సహకారం ప్రబలివున్న స్త్రీల మధ్య అసూయ, ద్వేషం పెంపొంద చేయడంలోని నిజాయతీ అనుమానాస్పదంగా తోచింది నాకు. నాతో ప్రయాణం చేస్తూన్న యువకుడైన మతవాది నా ముఖంమీద ఈ అనుమానాలని చదువ గల్గినట్టున్నాడు-ఇంకా మాట్లాడుతూనే వున్నాడు. ఇంతట్లోకే రోడ్డు పక్కగా వున్న ఓ మిషన్ దగ్గిరకి వచ్చి ఆగాము మేము. రొట్టె, గుడ్లు, వెన్న, కాఫీ, పళ్ళు యివి తింటూకూడా మాట్లాడుతూనే వున్నాడు. అది ఆ పూటకి రెండో భోజనం మాకు. ఈ మిషనుస్కూలు చూస్తున్న వ్యక్తి ఆ పక్కనేవున్న చిన్న పల్లెనుంచి వచ్చినవాడు. ఏదో కొంచెమైనా మార్పు తేడాని కనుగుణంగా ఈ దేశీయులని మార్చకల్గితే అదే చాలు. మిగిలినది అదే జరుగుతుందని నాతోటి ప్రయాణీకుడు అంటూ వుంటే 'ఔ' నన్నట్టు తల వూపుతున్నాడు.

అప్పుడే నేను తొలిసారిగా మవెర పిల్లలని చూడగలిగాను. ఉదయం స్కూలు ముగియగానే యిళ్ళకి వెడుతూన్న ఆడపిల్లలు మా కిటికీ ముందు నుంచి వెడుతూ చాలా గౌరవ పూర్వకంగా నమస్కరించారు - వింతగా సన్నగా నవ్వుకుంటూనే. మకొండేలోని వీరి సమవయస్కుల కంటె ఏపుగానూ నేర్పుగానూ తోచారు వీళ్ళు. వీరి జుట్టుకూడా ఎక్కువేవుంది. నల్ల కినికి; ప్లాస్టిక్ పూసలు-అంతా మకొండె పిల్లలలాగే తోచారు నాకు. అక్కడ నేను వున్నప్పుడు నా డేరా గుమ్మంముందో, గుడిసె గుమ్మంలోనో యీ పిల్లలందరూ గుంపుగా చేరేవారు. నేనప్పుడు పెంచుతున్న ఆట బొమ్మ కోతిని బల్లమీదా, లేకుంటే దట్టంగా జుట్టున్న ఏపిల్ల తలమీదో ఆడిస్తూండే వాడిని. కేకలు ఎక్కువైతే, దుకాణంలోంచి తెచ్చిన నాలుగు పిప్పరమెంట్లు పంచేసరికి సంతృప్తి నిండేది. కాని అలాంటి దిక్కడ మవెర పిల్లలతో సరిపోదని తోచింది. మకొండె పిల్లలలా వీరు మృదువుగా తోచలేదు.

ఈ విషయం నా తోటివాణ్ణి అడుగుదాం అనుకున్నాను. ధైర్యస్థులైన తెగలలోని ఆడపిల్లలు చాలా స్వతంత్రులుగా కన్పిస్తారెందు చేతననో? గెలుపునందిన తెగలు అందమైన ఆడవారిని ఎత్తుకుపోయి తమ

తెగలకు తల్లులుగా చేయడంవల్ల నా - అస్సామ్‌లోని కాశీలలాగ? ఇందు వల్లే యీ తెగలలోని ఆడపిల్లల కదోరకపు వింతతత్వం వస్తుంది. లేక యుద్ధవీరులతత్వం ప్రబలిన మగవారి మూలాన యిలాంటి ధోరణి వచ్చిందో-యూరోపియనులకు ముందు కేరళలోని నాయర్ తెగలకులాగ?

"దీని కంతకీ కారణం మాతృహంశ లక్షణాల మూలాన్నే" అంటూ వివరింప సాగాడు నా స్నేహితుడు. ఈ ప్రాంతంలో క్రిస్టియనులైన యువకుల నాగరికతను గురించికూడా వివరించడం మొదలుపెట్టాడు.

ఈ స్కూలు ప్రారంభించి కొద్ది సంవత్సరాలే అయింది. ఈ చుట్టుపక్కల వారిలో చాలామంది యింకా పూర్తిగా అనాగరికులు. మీ మకొండెలకు వలె 1868 నుండీ యిక్కడికి మిషనులద్వారా నాగరికత రాలేదు. నిజమే, వీరు ప్రొటెస్టెంటులే. కాని యూరోపియన్స్? అవునా? సన్నగా నవ్వుతూ, మవెరా తెగలకు కుటుంబం అంటే ఏమిటో అర్థం కావడాని కింకా కొంతకాలం పడుతుంది. తండ్రే యింటికి అధికారి అని తెలియాలికదా. ఇప్పటికీ యింకా ఆడపిల్లలింకా అనాగరికంగా వున్నారు అన్నారు.

ఆఫ్రికనులపట్ల, ఆఫ్రికను ఆచారాలపట్ల మత అధికారుల పద్ధతి యింకా నాకు అగమ్యగోచరంగావుంది. స్కూళ్ళల్లో యీ పద్ధతులకి ఒక రూపం ఏర్పడుతూంది.

త్వరలోనే మేం తిరిగి బయలుదేరాం. మకొవెకి చేరేదాకా మా ప్రయాణం నిశ్శబ్దంగానే సాగిపోయింది. మళ్లా యింకోసారి మా కళ్ళ ముందు దృశ్యం పూర్తిగా మారిపోయింది. కొంచెం దూరంలో ఎత్తుగా ఓకొండమీద కొత్తగాకట్టిన చర్చి ఒకటి కన్పిస్తూంది. అక్కణ్ణుంచి అనంతంగా సాగిన అడవిప్రాంతం, దాన్ని దాటి విశాలంగా సాపుగావున్న భూభాగం కన్పిస్తూంది. దానిపై ప్రముఖంగా 'ఇలులు' కొండ కన్పిస్తుంది. ఓ అరడజనుదాకా మవెర యిళ్ళు కన్పడుతున్నాయి - నలుచదరంగా, విశాలంగా, పరిశుభ్రంగా. బొప్పాయిచెట్లూ, మామిడిచెట్లూ చుట్టూ వున్నాయి. పల్లెటి ఆఫ్రికనులు యూరోపియనులుగా రూపాంతరం చెంద

డాని కవసరం అనుకునే సరుకంతా — పెట్రోలుటిన్నులు, రేకుల యింటి కప్పులు-అక్కడ కనబడుతూనేవుంది. కొద్దిమంది యువకులు ఫుల్‌పాంట్లూ నల్లని జాకెట్లూ ధరించినవాళ్ళు మమ్మల్ని ఆహ్వానించారు. చుట్టుపక్కల వున్న కోళ్ళుమటుకు అరుచుకుంటూ పారిపోయాయి।

ఇక్కడ పారిష్ సువిశాలంగా వుంది. నన్నక్కడి అతిథిగా వదలి నా స్నేహితుడు యింకో మిషన్ యింటికి వెళ్ళిపోయాడు. ఇక్కడి ముగ్గురిలోనూ ఒకతను స్విస్ జాతీయుడు, యింకొకడు ము-మకువ తెగ వాడు. ఇద్దరూ కూడా చాలా సరదాగా పైనుంచి వచ్చినవారితో మాట్లాడా లని కుతూహలం కలవారుగా తోచారు. మూడో వ్యక్తి స్విస్‌వాడే అయినా చాలా ముభావంగా వుండే తత్వం లాగుంది. అయితే ఆఫ్రికను పిల్లలపట్ల చాలా స్నేహభావం కలవాడుగా తోచాడు।

స్కూలు పిల్లలు బయట ఆడుతూ పాడుతూ ఉన్నారు. కిస్వహిలిలో "ని పలెకె క్వ మమ" - మా అమ్మ దగ్గరకి పంపెయ్ అని దాని అర్థం. అది వింటూ "పాపం" అన్నాడాయన; తల్లే యీ కుర్రవాళ్ళకి సర్వం - యిల్లు, కుటుంబం అంతా అమ్మే అన్నాడు. ఇతనికి స్విస్ జర్మనులో మాట్లాడ్డమే వచ్చును. కాని మిగిలిన యిద్దరూ యింగ్లీషులో సమాధానం చెప్పగలరు. నేను వారసత్వంలోని వింతలను గురించి తెగల పేర్లను గురించి అడిగిన ప్రశ్నలకు స్విస్ ఫాదరు ఇంగ్లీషులోనే సమాధానం చెప్పాడు - ఆఫ్రికను అతనుకూడా మా సంభాషణలో పాల్గొందుకు అవ కాశం వుంటుందని. తెగల వారసత్వం విషయాలలో మాతృహంశ సంస్థలలోనూ కుతూహలం గల ఏ శాస్త్రజ్ఞునికైనా ఉత్సాహం కల్గించే ఎన్నో విషయాలను వారు నాకు చెప్పగల్గారు.

వ-మవెరలో ముఖ్యమైన తెగను 'ఛిపింగా' అంటారు. ఇతర మాతృహంశ తెగలలో లాగే యీ పేరు తల్లినుండి సంక్రమిస్తుంది. కాని ప్రతి ము-మవెర స్త్రీ పురుషునికీ రెండవ తెగ పేరొకటి 'ఛిలగ్వే' వుంది. ఇది తండ్రి తరపు నుంచి వారసత్వంగా సంక్రమిస్తూన్న పేరు. ఈ రెండిటి కలయిక వలన - కుటుంబపు నామం ద్వంద్వమై వుంటూంది-

సమకాలిక సంఘంలో. అమెరికా, ఇంగ్లండు, స్పెయిన్, స్విట్జర్లాండు మొదలైన వాటిలో కూడా యిది కన్పిస్తూంది. కాని యిక్కడ ఆఫ్రికాలో తల్లి పేరు గాని తండ్రి పేరు కాదు - ముందు వుండేది.

1850 - 60 ల మధ్యన, టాంగన్యికాలో జర్మనులు అడుగు పెట్టకముందు - నే నిప్పుడున్న స్థలానికి - నడండాకు దెబ్బయి మైళ్ళు పశ్చిమంగా వున్న బంగాళానది ప్రాంతంనుంచి మవెర తెగలు తరలి వచ్చారు. వీరిని తరిమినవారి జోరుకి నిలువలేక ఇలులు పర్వత చరియ లలో తలదాచుకున్నారు. ఆ పర్వతమే యిప్పుడు మన ముందున వున్నది.

"అదిగో అక్కడే" అంటూ ఆఫ్రికను మతాధికారి ఆ నల్లని కొండలవైపు చేయి జాపాడు.

రాత్రి వచ్చింది. నిశ్శబ్దం ఆవరించింది, తల్లుల కోసం కుర్రవాళ్ళ ఆత్రం తగ్గింది. గాలిలో చలనం లేదు. చెట్లమీద ఆకుకప్పలు అప్పు డప్పుడు స్పష్టంగా వినిపించేలా చప్పుడు చేస్తున్నాయి.

అక్కడే వ-మవెరలను తరిమిన వ-నగొని అపజయం గాంచారు. అందుకనే ఇలులు-కనుమ పవిత్రమైంది. విజయం గాంచిన మవెర జనం 'లు-లు-లు' అంటూ అరిచారు. అప్పటినుండీ యీ కొండమీద ప్రార్థనలు జరిపేవారు. అవేనా సృష్టికర్త అఛిపంగానియాకు మాత్రమే పరిమితం. ఈ అఛిపంగానియాకూ ఛిపింగా పదానికీ ఏం సంబంధము లేదు. ఈ పేరు తల్లి నుండి సంక్రమించినది. ఈ పదం మ-మవెరలో కుపింగ అన్నదాన్నుంచి వచ్చింది. కిస్వహిలలో కు-పిండా లాగే దీనికీ ప్రేమించు, ఇష్టపడు, కలిసి వుండు అని అర్థం చెప్పుకోవచ్చు. ఈ ఛిపింగా పదం మాతృహంశ తెగల కుటుంబ సభ్యుల సంఘీభావానికి చిహ్నంగా వాడబడుతూంది.

ఇంకా వినాలనే వుంది నాకు. కాని బాగా ఆలస్యం అయింది. నా స్నేహితులు అక్కడి అతిథుల గదిలో నన్ను వదలి వెళ్లారు. నేను కిటికీ

తెరిచి అవతలికి చూశాను. అడవిమీద నుంచి ఆకాశంమీదనుంచి మకొండె పీఠభూమి వైపుగా సదరన్ క్రాస్ (నక్షత్ర సముదాయం) వాలివుంది. ఆ పీఠభూమికే నేను కొద్ది రోజులలో తిరిగి వెళ్లిపోతాను. ఉదయాన్నే నేను ముగ్గురు పెద్దలను కలుసుకోవలసి వుంది-వారెలాంటి వ-జిలుగా వుంటారో అన్న ఆలోచనలో పడ్డాను.

పెళ్ళిళ్ళు, పుట్టుకలకు సంబంధించిన రికార్డులు ముందు పెట్టుకుని కొద్ది కుటుంబాల వంశవృక్షాలను తిరిగి సృష్టించి చూడాలని మేం ప్రయత్నిస్తుండగా ఆ ముగ్గురు పెద్దలూ మా సహాయార్థం వచ్చారు. ముసలి అతను-బాగా ఏపైన మనిషి - ముదురు పసుపురంగు కుంజు ధరించాడు. మిగిలిన యిద్దరూ దళసరి వూలుకోట్లు, వాటిక్రింద దొంతరగా చొక్కాలూ ధరించారు. ఆ ఉదయసూర్యుని వేడికి నా పల్చటి చొక్కా కూడా నాకు యిబ్బంది కల్గిస్తూంది. కాని నా స్నేహితులను నొప్పించకుండా వుండడానికని అదేనా ధరించాను. ఈ పసుపురంగు కుంజు తప్పించి ప్రాక్‌వాసుల సాధారణతే కనబడ దిక్కడ. మకొండె వాసులలో యిలా కానే కాదు. ఈ మవెర తెగల పెద్దలు యుద్ధవీరులకు చెందినవారు; మర్యాదలకు భంగం రానివ్వని వారు. కాని నాగరికతలో ఇంకోటి పోల్చి చూడడానికి తగినన్ని అవకాశాలు లేనివాళ్ళు. ముస్లిమ్‌లతో సంపర్కమే లేదు. కనీసం ప్రొటెస్టెంట్ మిషనుల పరిచయం కూడా లేదు. మకొండె పీఠభూమిలో కంటే సంప్రదాయ సిద్ధమైన ఆఫ్రికను మతావలంబకుల సంఖ్యే ఎక్కువగా వున్నారు. అక్కడ యిటువంటి వారిని చాలా కొద్దిమందిని మాత్రమే చూడ గలిగాను నేను. ఛివొంగాకు చెందిన మునియచి మకొండె తెగవాపి "మిటినికొ మలడ్య" ను కలుసుకున్నాను నేను. అది యిప్పుడు జ్ఞాపకం వచ్చింది. అతనప్పటికీ యింకా శుద్ధ స్వజాతీయుడే। సంవత్సరానికో సారి తాను చేసే పూజను గురించి చెప్పా డతడు. పండించిన ప్రతి ధాన్యం

అర్పించి, రాపిడివల్ల నిప్పు పుట్టించి ఆ పుణ్యవృక్షం క్రింద పూజ చేసే వారు. ప్రతి యింటివారూ యీ నిప్పునుండే నిప్పు తీసుకువెళ్ళి యిళ్ళదగ్గిర మంటలు పెట్టుకునేవారు.

కాని యిక్కడ వీరి ధోరణి యింకోలా వుంది. పల్లె పెద్దలంతా అతి ఛాందసులైన రోమన్ కాతలిక్కులు; పాత మతాన్ని గురించి కనీసం మాట్లాడ్డానికేనా యిష్టపడరు. కాని తమ ఆత్మాభిమానం, గౌర వం దక్కేందు కనువుగా నిలవాలనే తాపత్రయపడతారు. అదేనా ఎప్పుడు? ద్వంద్వ నామధేయం కల తమ తెగలను గురించీ, వారి వారసత్వపు న్యాయ సూత్రాలను గురించీ చర్చ వచ్చినప్పుడు.

యావోకు చెందిన మాతృహంశకు సంబంధించిన వ-మకువ తెగ వారికీ, నెవలలోని వ-మకొండె వారికీ కొంచెం సామ్యాలూ, పోలికలూ వున్నాయి. ఇక్కడే లిండి జిల్లాలో వున్న మ-మవెరలకు ఆ మాత్రం పోలిక కూడా లేదు. మా మకువ మతగురువుకు యీ మవెర ద్వంద్వ నామధేయపు ప్రాముఖ్యం తెలిసినట్లు లేదు. ఇలాంటివి - యీ దక్షిణ టాంగన్యికాలోనూ, మళ్ళీ మొరొగొరొ జిల్లాలో రొడీషియాలో మాత్రమే కనబడతాయి. ఇతని కంటె పెద్దవాడైన స్విస్ మతగురువుకి కూడా యిది తెలియదు. ఈ ముగ్గురు మవెర వజీలు, యీ యిద్దరు మతగురు వులు, నేనూ కలిసి తల పగులకొట్టుకోవలసి వచ్చింది - యీ పద్ధతి ఓ రకంగా అర్థం చేసుకుంటూ వచ్చేసరికి. ఉదాహరణకి: ఈ రెండు తెగలపేర్లూ మొట్టమొదట ఎలాగ అమలులోకి వచ్చాయి?

కొద్దిరోజుల పాటు కొన్ని కుటుంబాల వంశవృక్షాలు పరీక్షించ డంతో నూట ఏభయి తెగలపేర్ల జాబితా చేశాను. వాటిలో రెండు రకాలవి - మాతృహంశ ఛిపింగా, పితృహంశ ఛిలగ్వే - వున్నాయి. నే మొట్టమొదట తీసినవి యీ క్రిందివి:

| ఛిపింగా మాతృహంశ తెగ | ఛిపింగా పితృహంశ తెగ |
|---|---|
| 1. నగురువె, పంది (దీనికిఆచారా లంటి పెట్టుకొని లేవు.) | 2. నపంబ, యిచ్చే తత్వం గల వ్యక్తి |
| 3. న్నింబో-పక్షి జిగుర్ధు | 3. దీన్నే ఛిలగ్వే పేరుగా ఉప యోగిస్తారు |
| | 4. మపఛె, జత (ఛిలగ్వే అంటే ఒకటే) |
| | 5. మాంజె, పిల్లలకోసం ఆకుల కప్పు |
| 6. సెన్‌బుక, బలహీనత | 6. ఛిలగ్వేగా కూడా ఉపయో గిస్తారు |
| 7. ఛింగువైల్, తగిలే, బాధించే వస్తువు | 8. మైంది - తెలియని |
| 9. ముస్‌కోలూ - ఆడజంతువు | 9. ఛిలగ్వేగా ఉపయోగిస్తారు |
| 10. సెఛింగా - తెలియని | 10. ఛిలగ్వేగా ఉపయోగిస్తారు |
| 11. ఛిటుంగులి - తెలియని | 13. ఛిలగ్వేగా ఉపయోగిస్తారు |
| 12. జింజిలి - కోపిష్టి | 14. ఛిలగ్వేగా వాడుతారు |
| 13. నగోంబా - పెద్ద అరటిపండు | 15. ఛిలగ్వేగా వాడుతారు |
| 14. కలెంచా - చిన్న దెబ్బ | |
| 15. బింగా - ఇలులు దగ్గరవున్న ఒక పుణ్యపర్వతం | |

ఈ నూట ఏభయి తెగలపేర్లూ, వాటి వివరాలూ చర్చించే సరికి ఒక దాని నుంచి యింకొకటి తెలియడం ప్రారంభించింది. కాని ఏ సూత్రాన్ని పట్టి తెగలపేర్లలో ఛిపింగా అని, ఛిలగ్వే అని, లేకుంటే రెండూ అనీ పిలవడం వచ్చిందో మటుకు తెలియలేదు. ఇంకోటి; తెగపేరుగా వ్యవ హరింపబడిన మాటల అర్థాలు, చర్యలూ కూడా చాలా విస్తరించి వున్నవి. పూజనీయమైన కొండకూ తెగపేరుకూ గల సంబంధంలోని కిటుకు ఏమిటి ?...నిజానికి దక్షిణాన్నుంచి వచ్చిన వ-నగోని వారిపై జయం

సంపాదించడం గురించి అందరూ గర్వపడతారు. కాని ఎవరూ కూడా మిఖింగా తెగకు, మిఖింగా కొండకు గల సంబంధాన్ని మటుకు వివరించి చెప్పలేరు. మ-వెర తెగలూ, వ-నగొని తెగలూ చాలా దూరంగా వున్నాయి. ఇద్దరినీ విడగొడుతూ ఒక లోతైన లోయ కూడా వుంది. 1958 లో నేను వారి మధ్య వున్నప్పుడే యీ విషయం గుర్తించాను. మకొవె ప్రాంతంలో నే నొకసారి మామూలుగానే ఒక యింటికి వెళ్ళినప్పుడు ఒక చిన్నవాడు నాతో మాటల సందర్భంలో అన్నాడు - ''యిప్పటికీ కూడా వధువుధరలు యివ్వనందుకని వ-నగొని తెగలకి వ-మవెరలంటే లోకువే ; కాని ఇదే స్థితిలో వ-మవెరలు యీ వ-నగొనీలకు పశువులూ, బానిసలే భార్యలన్న చిన్న చూపు చూస్తారు''. ఇది వింటూ వుంటే కొద్ది వారాల క్రిందట ఒక ముసలి ము-మకొండె చెప్పినది జ్ఞాపకం వచ్చింది. వ-మవెరలు భయంకరంగా 1905 ప్రాంతంలో మకొండె పీఠభూమి ప్రాంతానికి వచ్చారనీ, అప్పట్లో మజి-మజి తిరుగుబాటును జర్మనులకు వ్యతిరిక్తంగా లేవదీయాలనీ వారి ఉద్దేశ్యం" అని చెప్పాడు.

ఇన్ని సంప్రదాయాల విభేదాల మధ్యనుంచి, జాతుల మధ్యనుంచి ఏదో ఒక దారం తెగకుండా వున్నట్లు తోస్తుంది-ఇదంతా వింటూ వుంటే. స్విస్ గురువు తమలో పూర్వం ఒకరిని వీరు చంపేసినా, వీరి పట్ల అభిమానం వున్నట్టే కనబడతాడు. వీరు వనగొనిలని తరిమినట్టే వ-డచ్చిలను కూడా తరిమారు.

''గత ప్రపంచయుద్ధంలో స్విట్జర్లాండు నెవరేనా ఆక్రమించడానికి వస్తే మనం అందరం యుద్ధానికి దిగేవాళ్ళమే కదా ?'' అన్నాడు ఆవేశంగా.

వ-మవెరలు చాలా రకాలుగా ప్రత్యేకత వహిస్తారు. తల్లి తండ్రుల నిద్దరనూ ఏదో రకంగా తమలో యిముడ్చుకుందుకని వారు కనిపెట్టిన యీ ద్వంద్వ పద్ధతి నాకు చాలా కుతూహలాన్ని కల్గించింది.

నా యీ స్నేహితులతో కలసి కొద్ది రోజులపాటు పని చేశాక నాకు వారి పేర్లలో ఒక పద్ధతి కనిపించింది ; మవెరలలో ఒక మొదటి జత

వున్నారని వూహించుకుందాం; ఒక స్త్రీ, ఒక పురుషుడు. రెండు తెగలు- ఒకటి ఛిపింగా, రెండవది ఛిలగ్వే. ఈ తొలి జత పిల్లలందరికీ - తల్లి దగ్గరనుంచి ఛిపింగా, తండ్రి దగ్గరనుంచి ఛిలగ్వే సంక్రమిస్తుంది. ఇలాగే తల్లి ఛిపింగా కూతుళ్ళ నుంచి మనుమలకి సంక్రమిస్తే, తొలి తండ్రి ఛిపింగా అందరికీ సంక్రమిస్తుంది. అతని ఛిలగ్వే (రెండవపేరు) అందరు పిల్లలకీ సంక్రమించి మనుమలూ, మునిమనుమలకు వెడుతుంది. కాని, కూతుళ్ళ సంతతికి కాదు. ఎందుచేత? ఈ కూతుళ్ళు తమ ఛిలగ్వేను తమ తండ్రినుంచి తెచ్చుకుంటారు కదా. అంతే కాని, తమ తాతలనుంచి కాదు.

ఈ పద్ధతినే యీ క్రింద ఉదాహరిస్తున్నాను - వివరంగా అర్థం అవుతుందని.

## మవెర వంశవృక్షం




భర్తల తండ్రితరపు, భార్య తల్లితరపు పూర్వీకులను బొమ్మతో గుర్తుల ద్వారా చూపడం జరిగింది. తెగల పేర్లు తరువాత నింపడం జరిగింది. మాతృహంశపేర్లు, రెండవ పితృహంశపేరు యివ్వడం జరిగింది. యీ తెగల పేర్లు కొన్నిటికి అర్థాలు దొరుకుతాయి: ఉదాహరణకి. ఛిలెంబ - తలపాగ; ఛుబ=నునుపైన; ఛుమ=పూనలు; కటబిల=ఉరితీయు; మపిట=

దారేపోయే; మవపె=దెబ్బలాట; మవంబె=కొండ; నఘిటు=అటవికమైన; నగొండె=యుద్ధం; నగుంఛె=కప్ప; నగుటొ=చెట్టు; న్నింబొ=జిగురు.

ఈ చతురతతోకూడిన పేర్ల వారసత్వం నన్ను ఆలోచనలలో ముంచెత్తింది. ఈ సంప్రదాయకమైన ఆఫ్రికను వారసత్వపు పద్ధతి సమకాలిక పాశ్చాత్య సంఘంలో చిక్కు సమస్యగావున్న విషయానికి పరిష్కారమార్గం సూచింప గలదేమో అనిపించింది. మన సంఘంలో స్త్రీలు అన్ని విషయాలలోనూ-ఆర్థికంగా, రాజకీయంగా, మతైకంగా - స్వేచ్ఛాజీవులు. అయినా వివాహానంతరం న్యాయబద్ధమైన తమ ప్రత్యేకత వదిలేసి భర్తపేరిట పిలవబడుతున్నారు-యీ భర్త పరాయి దేశస్థుడు, మతస్థుడు, తెగవాడు అయినాసరే.

నా ఉద్దేశ్యాల నిక్కడ బయటపెట్టాను. ఆఫ్రికను గురువుగారి ముఖం మీద ఆలోచన పరచుకుంది; మిగిలిన స్విస్ గురువు లిద్దరూ వేళాకోళం ధ్వనించేలా చిన్నగా నవ్వేరు.

"పూర్తి సమానత్వమా? ప్రపంచం మొత్తంమీద ఏమోగాని స్విట్జర్లాండులో మహిళలకి ఓటు హక్కు లేదు. ఫెడరల్‌కు ఓటు వేసే హక్కు యీ మధ్యనే జినివాలో వచ్చింది, మిగిలిన రెండు కాంటొనెల్ ఓటింగు—వాడ్, నౌఛాటెల్ వున్నాయి.

తిరిగి మకొండె పీఠభూమికి వచ్చేశాను. నాకు చాలా సంతోషంగా వుంది. దైనందిన చర్యలో మునిగిపోయాను. నీళ్లు తెచ్చుకోవడం దట్టమైన మకొండె గుబురులు-అన్నీ తాత్కాలికంగా నైనా నా యింటిని చేరినట్టు అనిపించాయి నాకు. ఆఫ్రికాలో యిదే నాయిల్లు. న్యాయానికి యీ ప్రపంచంలో ఏ యిల్లు తాత్కాలికం కాదు?

ఉదయాన్నే జోడు రోకళ్ళచప్పుడు వినబడుతూంది. తెల్లని కసావ దుంపలని మెత్తటి పిండిగా దంపుతున్నారు. ఆ పిండితోనే ఉదయాన్ని నేను జావ చేసుకుంటాను. ఓ బకెట్టు చన్నీళ్ళు, ఓ బకెట్టు వేడినీళ్ళు-ఆకుపచ్చని ఆకుల నీడపరచిన చెట్టుక్రిందనే నా స్నానాలగది

వడండాలోని స్నానాలగది అంత సుఖంగా లేదు. కాని యిది చుట్టూవున్న తోటని కలిసి వుంది. లయ తప్పకుండా కూసే పావురాలు. వాటి ననుస రిస్తూ వందలాది పక్షుల పాటలు. మకరెరె జ్ఞప్తికి వచ్చింది. ఏదో ప్రత్యేకమైన సందేశాన్నది అందిస్తున్నట్టు వింటాను నేను.

సూర్యుడు పైకి లేచాడు; గాలి కెగిరే కుంజాలు ధరించి కొందరు మగవాళ్ళు, నల్లని కనికి ధరించి మగువలు ఆ దారి వెంటనే పొలం పనులకి వెడతారు. వంగిన తొగోలలతో భూమిని దున్ని మట్టి గుల్లచేస్తారు. వస్తూవస్తూ కొద్దిగా 'మఛిఛ' ఆకులు సాయంత్రంపూట వంటలోకని కోసు కుంటారు. వ-మవెరకు వెళ్ళివచ్చాక యిక్కడి జీవన ప్రవాహం చాలా నెమ్మది అనిపించింది నాకు. యీ ఇద్దరి జీవితాలలో ఉన్న తేడావల్లనో? లేక ఇద్ పండగ ముందు ఉపవాసాల చివరికి రావడం మూలానో-నా కర్థం కాలేదు. సాయంత్రం పూటల స్నేహితులూ చుట్టాలూ అంతా కలిసి యింటి ముంగిట వాకలిలో కలసి కూర్చోవడం, సాయంత్రం సూర్యాస్తమయం కోసం ఎదురుచూసి తరవాతనే ఆరోజు ఉపవాసానికి స్వస్తి పలకడం— యిదంతా నేను పరికించాను. ఇండియాలోలాగే సూర్యాస్తమానం తరు వాత స్త్రీలు ఆహారం పట్టుకువచ్చి అందరికీ పంచి తమ మగవారి దగ్గిర కూర్చుని తామూ తింటారు. పెద్దపెద్ద పువ్వులు అద్దిన ఎనామిల్ పళ్ళేలు నాగరికతకు చిహ్నాగా వున్న రోజులివి.

హకరొరొలో నాకు కొత్త స్నేహితులు కలిశారు. వీరు మకొండె బంధువులతో కలసి ఒకటి రెండు తరాలుగా యిక్కడే వుంటున్న మకువ కుటుంబాలవారు. మకొవెలో రోమన్ కాతలికు మతగురువుగా వున్న మకువ యువకుని గురించి చెప్పాను వీరికి. అతన్ని గురించి యింకా వినా లన్న కుతూహలం కనబరచారు. వీరు మతదృష్ట్యా ముస్లిములే. కాని ముస్లిములకి యితర మతాలను పట్టించుకునే పట్టుదలలు తక్కువ. "మన మంతా దేవుని దగ్గిరనుంచి వచ్చాం; అక్కడికే తిరిగి వెళ్ళిపోతాం" అన్న నమ్మకం వారిది.

ఒక రోజున మత సాహిత్యం-చవుకగా జాంజిబార్‌లో ముద్రించి నది-పట్టుకుని మకువలలోని ఓ పెద్దమనిషి, ముసలి - వచ్చాడు నా దేరా

దగ్గరకి. ఆరబిక్ అక్షరాలతో ముద్రించిన కిస్వహిలి లిపి అది. ఓ క్షణం పాటు అది రాసినది ఫాదర్ అల్‌కుయిన్ ఏమో అనిపించింది. కాని కొద్ది సేపటి తరువాత నిజమైన ఆరబిక్ ము'ఆలిమ్‌ని కనిపెట్ట కలిగాను. ఇండియాలోని అహమ్మదీయ ముస్లిములను గురించిన బాధపట్టుకుంది మూసాకి. గుజరాతీ ప్రాంతాలనుంచి వచ్చిన అనేక ముస్లిములని తెలుసు మూసాకి. కాని ఒక్క అహమ్మదియాసే తప్ప మిగిలిన వారంతా వజుంగులలాగా, యూరోపియనులలాగా చాలా ముభావంగా వుండేవారు. ఆఫ్రికను ముస్లిములతో కలసి ప్రార్థించేవారు; భోజనం చేసేవారు. కాని అహమ్మదియాస్ పిసలైన ముస్లిములే కారని కొరాన్ ఉపాధ్యాయులు చెప్తుండడం వల్లనూ, వాళ్ళ మతం సరైనది కాదనడం వల్లనూ అనుమానాలు తలెత్తాయి. "అందుచేతనే మీరు మాతో అన్నీ పంచుకుంటున్నారుకదా, మిమ్మల్నడిగి తెలుసుకోవాలని వచ్చాను'' అన్నాడు మూసా.

అతని నమ్మికకు నాకు చాలా ఆనందం కల్గింది. నా ఇద్ ప్రార్థనలకి వారి మసీదుకి వస్తానన్నాను. చిన్న గుడిసెలావున్న యిలాంటి మసీదులోనే కదా పదమూడు వందల సంవత్సరాల క్రిందట మహమ్మదు ప్రార్థించాడు?

ఈ పీఠభూమిమీద నా కివి ఆఖరు రోజులు. కొన్ని నెలల క్రిందట రాగానే ఎక్కడ నేను డేరా వేసుకున్నానో అక్కడే తిరిగి వేశాను. ఈ సారి తెలివిగా తూర్పు దక్షిణాలుగా నాటాను కర్రలు. అయినా మధ్యాహ్నం పూటలు వేడిగానే వున్నాయి. అత్యుత్సాహ వంతులైన పల్లెవారు నన్నీవల పడుకోనీయరు; చిరుతలూ, పులులూ వస్తాయని వారి భయం.

"మెలుకువగా వున్న వారి నవి ఏం చేయవు కాని ...యివతల పడుకుంటే ఏ కొండచిలువో మిమ్మల్ని కొరుక్కోవచ్చు!''

అందుకని మంచివాడిలా లోపలే పడుకుంటాను. రాత్రిపూట చల్లగాలి మెల్లిగా నా డేరాలోకి చొచ్చుకుని వచ్చేలా లోపలికప్పు తెరచి వుంచుతాను. ఇది రహస్యం. అలా మెలకువగానే పడుకుని నా చేతుల్లో వున్న

ఎన్నో విషయాలను ఒక పద్ధతిలోకి తేడానికి ప్రయత్నిస్తాను. ఇవన్నీ కూడా దేని కది దేనితోటీ సంబంధం లేనిదిగా కనబడినా అన్నీ ఒక్కదానిగా అమరేవే. ఈ మాతృహంశ తెగల రైతులు ఎన్నో సంవత్సరాలుగా పోరాటం జరిపారు - తమ కది యిష్టం లేకపోయినా కూడా. వనగొనిల వలె భయంకరంగానూ కాదు; మూడువందల సంవత్సరాల క్రిందట తమ ముందున్న ప్రతిదాన్నీ చంపుతూ, కాలుస్తూ సర్వనాశనం చేస్తూవచ్చిన వజింబలలాగా కాదు. నెమ్మదిగా నవ్యంగా పోయే యిక్కడి మకొండె మాతృహంశ తెగల తత్వంలో వుంది. తెగ ప్రభుత్వం ఎక్కువయింది. అధికారం ఒక్కరి క్రింద కేంద్రీకృతం అవదు. ఈ గుంపు లన్నీ అభిమానం ద్వారా కాని అరాజకం, పోటీ మూలంగా కలిసి వుండవు. ప్రతి ఒక్క కుటుంబం - ఒక యూనిట్‌గా వుంటుంది. అందులో తండ్రి, తల్లి, పిల్లలే కాకుండా తల్లి తమ్ముళ్ళు ముఖ్యులుగా వుండి యింకా వీరి క్రింది అన్ని కుటుంబాలూ కలిసి వుంటాయి. ప్రతి మగవాడికీ రెండు బాధ్యతలు - కుటుంబాలలో తండ్రిగా వుంటాడు; ఇంకో కుటుంబంలో తల్లి సోదరుడుగా వుంటాడు. దీనివల్ల సహకార యుతమైన అభిమానమే వుంటుంది కాని పోటీ పడే గర్వం వుండదు. ఇది జాగ్రత్తగా పెంపొందించవలసిన సూత్రం గాని సాంఘికమైన కట్టుబాట్ల ఫలితంగా అనాయాచితంగా వచ్చినదిమాత్రంకాదు.

"నీ పొరుగువారిని దాటిపోవాలన్న దృష్టితో ఎప్పుడూ మెహర్బానీ పోకడలు పోకు" ఇదే సూత్రం. ఇందువల్లే యీ గడ్డికప్పుల మట్టి యిళ్ళన్నీ ఒకేలాగా ప్రశాంతంగా వుంటాయి.

అన్ని యిళ్ళకీ నిప్పు పంటల తరువాత పుణ్యవృక్షం క్రింద వెలిగించిన మంటనుంచి వచ్చినదే. ఈ అనాగరిక చిహ్నాలను రూపుమాపాలన్నది వచ్చాక ఉచిత వేతనాల పోటీలు పెరిగాయి. మన నాగరిక లక్షణాలన్నీ వీరి మధ్యనున్న మంచి వాటికి తల్లక్రిందులే. అభిమానం, సహకారం వుంటే వాటిని పారద్రోలి పోటీ పెట్టడం నాగరికత!

కాని మనకై మనంకూడా సార్వజనీనమైన ఒక సమానత్వం తేవాలనే కదా కలలు కంటున్నామ్! మన నాగరికత కూడా "నీ పొరుగు వారిని

నీలాగే ప్రేమించు; అభిమానించు!'' అన్నదానిమీదనే ఆనుకుని వుందని కదా! అలాంటప్పుడు ఓర్పు లేకపోవడం ఏమిటి? క్రిష్టియను కుటుంబం అన్నది తండ్రి మీదనే ఆధారపడి వుండాలి. తల్లికిగాని మేనమామకుగాని స్థానం లేదనడంలో సబబు లేదే? సాధారణంగా మిషను టీచర్లకీ, బోధకులకీ కూడా పిల్లవాని మేనమామ చాలా వింతవ్యక్తిగా తోచి అతన్నేమిటి కుర్రవాడికి జీతం కట్టమని అడగడం అనుకుంటారు. అందుకని తండ్రినే కట్టమంటారు. నీ పిల్లలపై నీ కధికారం వుండాలి. అలా వుండడమే అభ్యుదయం సాధించడం అని చెప్తారు-పాతను కాదనడమే అభ్యుదయం అయినట్టు. పిల్లలకి, తల్లికి మధ్య బంధాలన్నీ అనాగరికమైన వన్నట్టు.

కాని పారిశ్రామికంగా ముందంజ వేయడానికీ ప్రేమాభిమానాలతో బంధింపబడిన వికేంద్రీకృత అధికారానికీ పొత్తు కుదరదనుకోవడం నిజం కాదు. 'అభ్యుదయం' అన్నది-అంములోనూ క్రైస్తవంలో మానసిక విలువలపై ఆంక్ష పెడుతుందనడం అబద్ధం అవుతుంది. అభ్యుదయం కంటె - అదంటే మనం తీసుకొంటున్న అర్థమే అవివేకంగా తోస్తూంది. తన భార్యని ఆమె యింటినుంచి తీసుకు వచ్చేయాలని భర్త నెందుకు ప్రోత్సహించాలి? ఇది అభ్యుదయం పేరిటనా? లేక మనం అలా చేశాం కనుక వీరూ చేయాలనా? ఇప్పుడో ఆ స్త్రీ వచ్చిన యింట్లో కొత్త మనిషిగా తయారై, ఆ యింటివారు ఖరీదిచ్చారు కనుక వారికి లోకువై పడివుండాలి. మాతృహంశ తెగలలో యీ వధువుకి ధర యీయడం పుట్టినే లాంఛనంగా జరిగినా యీ రోజుల్లో ధర పెరిగి ...భార్య జీతం యిచ్చి పెట్టుకున్న కూలిదానిలా తయారైంది. లేకుంటే తన కోసం గొడ్లనో, డబ్బునో యిచ్చిన వారికి బానిసగా తయారైంది. మనం ఎందుకీ విష బీజాలు నాటాలో నా కర్థం కావడం లేదు. గాలి లేపితే దుమారా న్నెదురు కోడానికి సిద్ధపడాలి కదా!

ఇలా ఆలోచనలతో నిద్రలేకుండా పడుకున్న నాకు సముద్ర ప్రయాణం చేస్తున్నట్టు అనిపించింది. చుట్టుపక్కల ఎక్కడా శబ్దాలులేవు. రేడియోలు, కార్ల చప్పుళ్ళు లేవు. ఒక్కొక్కప్పుడు ఎండుటాకుల చప్పుడు; యింకొకప్పుడు పొంగిన సముద్రం లాగా ఎక్కడో వినిపించే

ఉరుముల చప్పుడు. ఒక్కొక్కప్పుడు క్రిందనున్న యిసుక కలలు కంటోందేమో అనిపిస్తుంది. అలాగే నన్నూ ఆ కలలోకి లాక్కుపోతూ వుంటుంది. కొంచెందూరంలోనే తూర్పున అరేబియన్ సముద్రం వుంది. దీనిమీద గతించిన ప్రయాణాలన్నీ నాకు గుర్తుకొచ్చాయి. మూడు పురాతన భూతలాల మధ్యగా ప్రశాంతంగా వుంది సముద్రం. దాని నీటిపై బంగారం పరచి వుంది. కొండలమీద, బండలమీద దక్షిణ అరేబియాలో వెండి పరచినట్టు వుంది. "ఈ దారినే షీబారాణి ఇథోపియాకు ప్రయాణం చేసింది" అని తూర్పాఫ్రికా ప్రజలు చెప్పుకుంటారు. ఈ నాటికీ తల్లినుంచే వారసత్వం సంక్రమించిదన్న సంప్రదాయం అక్కడినుంచే వచ్చిందేమో వీరికి; అది మూడు నాల్గువేల సంవత్సరాల క్రిందటి మాట. మన జీవితాలెంత క్లుప్తం? మన చేతులతో మనమే యీ సంతోషాన్ని నాశనం చేసుకోవాలా? అసలే ఊయల నుంచి మృత్యువు దాకా వున్నది చిన్న జీవితం కదా! మనం యిది చేయాలా?

యింకా ఎంతో సౌందర్యం మిగిలింది. ఇది కూడా నాశనం అయిపోవాలా? విక్టోరియను కాలపు ఆశావాదం నాకు అర్థ అవుతుంది— పారిశ్రామికాభివృద్ధి సాధిస్తే చాలు. యిక దేన్నిగురించీ బాధ పడక్కర లేదు. నాకు అర్థంకాని దేమిటంటే-యిదే ఆశావాదం. సున్నితమైన అనుభూతి-సంప్రదాయంపట్ల కల ఈ జాతుల మధ్య దాన్ని గుర్తించలేక పోవడం. యూనివర్శిటీలో చదివి మంచి సంస్కారం కల ఒక ఇంగ్లీషు అధికారిని కలుసుకున్నాను నేను. మధ్యయుగాల కళను గురించి అర్థం చేసుకోవడంలో అత నిదివరలో ఎంతో సహాయం చేశాడు. ఆఫ్రికను లంటే ఆదరాభిమానాలు కల యీ వ్యక్తి చాలా స్నేహపాత్రుడు. మేం యూగలను గురించి, యిక్కడి దారుణం అయిన వేడిని గురించి, ఆఫ్రికాలో పనిచేసేవారి ఉద్యోగాలలో అస్తవ్యస్తమానూ మార్పులు - వీ టన్నిటిని గురించి మాట్లాడుతూంటే చక్కని ఆశావాదిలా ఒక్కమాట అన్నాడు: "ఇదంతా నిజమే. కాని రైల్లో వెడుతూంటే ప్రతి ఒక్క స్టేషను దగ్గిరా పూర్వం ఒకటి రెండు గుడిసెలూ అవీ వుండే పల్లెటూరు-యీ నాడు - చక్కటి కాంక్రీటు కొట్టుల వరసలు, మిషనుస్కూళ్ళు, కార్పొరేషను నీళ్ళ

తొ్తిలు-యివన్నీ చూస్తూంటే-యివన్నీ తేడానికి మనం కూడా చేయూత ఇచ్చాం కదా అన్న గర్వం కల్గుతుంది. ఈగలు, వేడి, యింకా అన్నీ కూడా వున్నా మనం యీ మాత్రం తేగల్గాం కదా! ఇంతేకాదు, ఆఫ్రి కాకి పనిగా రావడం అన్నది వీటన్నిటినీ మించినదే అని చెప్పాలి. ఎన్ని లోపాలున్నా యిక్కడ అందంగా హాయిగా వుంటుంది" అన్నాడాయన.

దీనికి మనం ఏం సమాధానం చెప్పగలం· ఇతనికి దయలేదా? తన పని ఏమిటో తెలియదా?-అన్నీ తెలుసునే. మిగిలిన మిషనువారు కూడా యింతే కదా. ఇప్పటి ఆఫ్రికను కుర్రకారుకి మీ తాతల తరాలవారు నమ్మిన దేవుడు దేవుడేకాదు. వారిది మతమూకాదు: అది అనాగరికం-ఛెంజీ-అని చెప్పినందువల్ల ప్రయోజనం ఏమిటి? వీరుకూడా ఏ నమ్మకానికీ దాసులు కాకుండా, అసలు దైవం అన్న నమ్మకం కూడా లేకుండా చేసుకుందుకా?

ఆ ఆఖరు రోజు సాయంత్రంపూట వాతావరణం పండగనాటి ఉత్సాహంతో వెల్లివిరుస్తూంది. చలికాలం వచ్చే లక్షణాలు అప్పుడే కన బడుతున్నాయి. కర్ర రోళ్ళలో జొడు రోకళ్ళపోటు సర్వదా సర్వత్రా వినబడుతూనే వుంది. పాడ్యమినాటి చంద్రుడానాడే కనబడతాడు. ఆ మరునాడే రామడీన్ విందు జరుగుతుంది. అదే దీర్ఘకాలం సాగిన నిరా హార దీక్షకి, చీకటికి స్వస్తి; కొత్త వెల్గుకి, కొత్త ప్రాణానికి నాంది.

నే తీసుకున్న నోట్సులు, పుస్తకాలు అన్నీ మూసేశాను. నా జీవితంలోనే ఓకొత్త సర్గ అంతం కాబోతోంది. ఇంకొకసారి ఆ పుణ్య వృక్షాన్ని చూడాలని నిశ్చయించుకున్నాను; నే మొట్ట మొదటిసారిగా వెళ్ళిన యిల్లు, చూసిన దంపుడు - అన్నీ చూసివద్దాం అనుకున్నాను. అక్కడ కూడా ఒక వాటర్ కార్పొరేషనువారి కినాక్ నెలకొల్పారని విన్నాను. కడసారిగా ఆ వంకలు తిరిగిన కాలిబాటద్వారా దట్టమైన గుబురులగుండా నడవాలని తలపోశాను.

హఠాత్తుగా ఏదో కేక వినిపించింది. ఇదివరలో ఎప్పుడూ ఇక్కడ అలాంటిది నేను వినలేదు. అది పెద్దవారి కంఠంలాగగాని, చిన్న పిల్లల కంఠస్వరంలాగగాని ధ్వనించడంలేదు. దాని వెనువెంటనే యింకొకటి.... దానివెంట మరి ఒకటి ..."చంద్రుడు ...చంద్రుడు''.

ఒక్కొక్కప్పుడేదో ఎదురుచూడని క్షణంలో పాతకాలపు స్మృతులు తలెత్తి హృదయంలో మూసివున్న కిటికీ తెరిచినట్టనిపిస్తుంది. ఈస్టరు రోజున ఆలివ్ సైప్రస్ చెట్లను దాటుకుంటూ కొండ చరియలలో ప్రతిధ్వనిస్తూ గ్రీక్ కేక విన్పిస్తుంది. "క్రీస్తు లేచాడు: క్రీస్తు దేవుడు లేచాడు'' అని.

ఈ చంద్రుడెంత నిశ్శబ్దంగా గాలిలో తేలిపోతున్నాడు! పరిశుద్ధమైన తెల్లని రేఖ బంగారు పళ్ళెంలో పెట్టినట్టు ... ఇంత అవాస్తవికమైనదీ ప్రపంచంలో ఎలా వెల్గుతూంది? ..యీ గతించిపోయే చీకటి ప్రపంచంలో ఎలా వెల్గులీనుతూంది?

మానవ హృదయాంతరాళంలో నుంచి వచ్చే యీ మహదానందకరమైన కేకలు ప్రపంచం మొత్తంమీద తమ కృతజ్ఞతని చాటుతాయి. అవే యీ నిశ్శబ్దం ఆవరించిన మకొండె గుబురులలోనూ నిండుతూంది. నేను అడుగు వేయలేను. నా దృష్టినంతా ఆ సన్నని వెల్గురేఖ అరికట్టింది. ఈ దక్షిణ ధ్రువంలో యీ చిన్న చంద్రుడు 'యింటిదగ్గిర' చూసిన దానికి తలక్రిందులుగా వుంటాడన్నది నేను గమనించాను ... అది గుర్తించినా ... చుట్టూ వున్న సోదరులకువలె; సోదరీమణులకువలె నాకూ హృదయమారా కేక వేయాలని అనిపించింది.

''ఈ ప్రపంచంలో యిక్కడను మించి యింకో యిల్లులేదు. యీ వెల్లువలాంటి వెల్గు అది" అనిపించింది.

నే చూడవెళ్ళిన ఆ పెద్ద వృక్షాన్ని యింకా నరికివేయలేదు. అదలాగే వుంది. అక్కడి యిల్లూ, వాకిలీ, జీడిమామిడి చెట్టూకూడా అలాగే వున్నాయి. కాని వీటన్నిటికీ వెనుకగా నల్లని యినుప దూలాలమీద కళ్ళు మిరుమిట్లు గొల్పేలా మెరుస్తూంది నీటి టాంకు. దానికీ అన్నిటికిలాగే ఆరు నలుచదరపు ముఖాలున్నాయి. బలంగా కట్టినట్టు × మార్కు పెట్టారు; ఇది చూడ్డానికి దిట్టంగా కనిపించుతూంది; కొంచెం భయానకంగానూ, అమానుషంగానూ కూడా తోస్తూంది.

కొంచెం తరువాత రైతుభార్య యివతలికి వచ్చింది, కూడా వచ్చిన చిన్నపిల్ల నన్ను గుర్తుపట్టినట్టు సిగ్గుతో చిరునవ్వు నవ్వింది-యింకా నాకు

కనోవా దుంపలు దంపడం వచ్చా-అన్నట్టు. ఓ, యిప్పుడు బాగా వచ్చునని చేసి మరీ చూపాను. తల్లి కూడా నవ్వింది. నీళ్ళు దగ్గిరకి వచ్చాయి - జీవితం సులభతరం అయిందికదా? అని ప్రశ్నించాను. ఆలోచించకుండా యీ ప్రశ్న అడుగుతూంటేనే నాకు మకొండె పూర్వీకుల కథ జ్ఞాపకానికి వచ్చింది.

కొత్త దుంపలువేసి దంపడం ప్రారంభిస్తుంటే నా ప్రశ్నవేశాను. వింటూ తలవూపింది. "అవును, చూడండి. ఇంత దగ్గిరలో కావలసినంత నీరు....అదిగో అక్కడే'' అంది.

ఆ ధోరణి చూస్తే ఆ గర్వంలో ఏదో భయంకూడ మిళితం అయి వున్నట్టు తోచింది నాకు. కావలసినది అతిగా దగ్గిరలోవుంటే అందంలేదు. సుఖం లేదేమో? లేకుంటే మకొండె పూర్వీకులు 'నీటికి దగ్గిరగా నివసించ వద్దు' అన్న హెచ్చరిక యింకా ఎక్కడో జ్ఞాపకం వుందా ?

నాకేం సమాధానం దొరకలేదు. అందుకే అన్నాను"క్వహెరిమమః" (గుడ్‌బై మదర్!) అని.

''అసంతె బ్వనా! అసంతె సనె'' అంది ఎంతో మర్యాదగా. (థ్యాంక్సు మాస్టర్, థ్యాంక్సు వెరిమచ్!)

తరువాత యింకొకసారి ఆ సుళ్ళు తిరిగి సాగిన కాలి బాటద్వారా నా డేరా చేరాను. ప్రాచీనమైన ఆ చెట్టుదగ్గిర మలుపు తిరగడానికి ముందు కడసారిగా ఓ సారి వెనుదిరిగి చూశాను. అక్కడే ఆ యిద్దరూ దంపు కొంటున్నారు. వారి యిళ్ళకప్పులను దాటి భయంకరంగా నిలచివున్న ఆ వాటర్ టాంక్ ముందా యిద్దరూ చాలా స్వల్పులుగా కనిపించారు. ఒకటో రెండో పోట్లువేసి తల్లి ఆగింది. నుదుటి మీదనుంచి చెమట తుడుచుకుంది, మళ్ళీ యిదివరలోలాగే — అదొక కన్నీటిబొట్టు తుడుచుకున్న ట్టని పించింది నాకు.

ఇక ముందుకి నడిచాను - తిన్నగా సాగిన కాలి బాటవెంట నడి చాను. అంతకంతకి దూరం అయిపోతున్న రోకళ్ళ చప్పుడు....అల స్యంగా సాగిపోతూన్న పావురపు ఆలాపనలో కలిసిపోయింది ... ......

# 7. ఉలుగురు
# కనుమలు

నా ముందు భోజనానికి కూర్చున్న పాట్రిక్ కునాంబి సులభంగా చిరునవ్వు నవ్వాడు. "మీరు ఉలుగురు సాంఘిక వ్యవస్థని పరిశోధించాలని వచ్చారని డి-ఓ. ఫోను చేశారు. మీకు సహాయం చేయడానికి కుతూహల పడుతున్నాను. ఇది హర్షింపదగ్గది. మీ గురించి కూడా డి. ఓ. నాకు చెప్పారు. మీరు ఉప సుల్తాను కదా. అంతేకాకుండా ఉపాధ్యాయునిగా చరిత్ర అంటే ఆసక్తి కలవారని కూడా విన్నాను".

నా ముందు కూర్చున్న యువకుని ఉత్సాహవంతమైన ముఖం చూసి ఎంతో తృప్తితో నేనూ సమాధానం చెప్పాను. రోమన్ కేతలిక్కు ఉపసుల్తాను పాతకాలపు తెగ నాయకుడా ? ఈ కాలపు పాశ్చాత్య పరిపాలనాధ్యక్షుడా ? – అన్న సందేహం వుండీ కూడా, మకొండె, మవెర లలో నా పని ఎలాంటిదో వివరించి చెప్పాను. తూర్పు టాంగన్యికాలోని యీ మరొగొరొ జిల్లాలో నా కంతా కొత్తే. ఎంతో ఉత్సాహంతో ఎదుటి వారి ఉద్దేశాలు గ్రహించాలన్న కుతూహలం వ్యక్తంచేస్తూ నే చెప్పేదాన్ని విన్నాడు కునాంబి. ఇది యువతరపు మేధావుల లక్షణంగా గుర్తించ గలిగాను నేను. కాని మకొండె పీఠభూమిమీద, వ-మవెరాల మధ్య నా అనుభవం వేరుగా వుంది. ఇక్కడి నా మేధావంతులయిన స్నేహితులు తెగలకు వెలుపలివారే; ఒక మకువ పూజారి, కమ్యూనిటీ డెవలప్‌మెంటు ఆఫీసరైన యావొ యువతి ఇంగ్లండులో చదువు పూర్తి చేసుకొని నాకు సహాయంగా వున్న ఆమె బావగారూ, వీరు కాక మకొండె ఎం. ఎల్. సి.

అయిన జస్టినస్ మపొండ - ఈయన ప్రారంభదశలో నాకెంతో సహా యం చేశారు యీ పీఠభూమిమీద. వయస్సులో పెద్ద. గంభీరమయిన వ్యక్తిత్వం యీయనది. ఆఫ్రికను యువతకు చిహ్నంగా యీయనని ఉదా హరించలేం. అందుకే ప్రస్తుతం విషమస్థితిలో పడ్డాను. తొలిసారిగా యువమేధావితో మాట్లాడినప్పుడు ఆ మేధావి నే పరిశీలిస్తున్న తెగకు చెందినవాడే కావడంతో క్రొత్త పరిస్థితి ఏర్పడింది.

మేం మాట్లాడుకుంటూ వుంటే, పోలిష్ కాందిశీకుడైన ఆ హోటలు యజమాని వచ్చి అడిగాడు "శ్రీమతి కునాంబి ఎందుకు కూడా రాలే" దని.

ఆదే మధ్యాహ్నం తన భార్య డారెస్సలామ్ వెళ్ళవలసి వచ్చిందని చెప్పాడు. తరువాత తరువాత, కొండ ప్రదేశమూ, చల్లనిదీ అయిన ఉలుగురు కనుమలలో నన్ను కునాంబి తన నియోజక వర్గానికి తీసుకు వెళ్లాడు. ఇది వ-కవరెలలో నున్న బగమొయొ ప్రాంతంలో వుంది. తన భార్య సంఘసేవను గురించి చెప్పాడు. ఇద్దరూ ఉపాధ్యాయులుగా వున్నప్పటినుండీ, విద్యా, సాంఘిక, ఆర్థిక వికాస కార్యక్రమా లనేకం వీరిద్దరూ కలిసి కొనసాగించారు. గృహ పరిశ్రమలు నెలకొల్పి వివిధ సంప్రదాయాల నుండి పెంపొందిన విభిన్న పద్ధతులను సమన్వయం చేస్తూ ..జాతి పెద్ద, విద్యార్థి దశ, జాతుల కలయికలోని బలం, పార్ల మెంటు పద్ధతిన ప్రజాస్వామ్యం - వీటన్నిటినీ కలిపే రీతిని గృహ పరి శ్రమలను నెలకొల్పారు. ఇదంతా కలిపి ఏకమై ఒకే తరహాగా కన బడింది. ఇది టాంగన్యికా ప్రత్యేకత కూడా. ఇటువంటి సమైక్య చిహ్నాల కోసం యిదివరలో నా భారతీయ, అందుకు పూర్వం యూరో పియను అనుభవాలను తరచి చూశాను. కాని కనబడలేదు. బ్రిటిషు ఆఫీసర్ను, డచ్చి మిషనరీలు చేర్చి అట్టే పెట్టిన మొరొగొరొ జిల్లా పుస్త కం చూపి నేను తెలుసుకున్న 'లుగురు' చరిత్రను యథార్థమని నిర్ణయిం చాడు తొలి రోజు పాట్రిక్ కునాంబి.

1884 లో జర్మనులు రావడానికి పూర్వం ఉలుగురు పర్వతాలు మట్టం నుండి శిఖరాగ్రం వరకు దట్టమైన అడవిగా వుండేవి. వాటి ఎత్తు సముద్ర మట్టానికి ఎనిమిది తొమ్మిదివేల అడుగులు వుంటుంది. ఆ

రోజులలో ఉలుగురు కనుమలలో ఎవరూ వుండేవారు కాదు. ఈ పర్వత ద్వీపానికి ఉత్తరంగా వ్యవసాయిక భూములున్న బగమొయొ ప్రాంతం, (ఇది పాత అరబ్బు రేవు) వసరమో ప్రాంతం, డారెస్సలామ్ చుట్టు పక్కల, ఇంకా దక్షిణంగా వస్తే తూర్పు తీరాన్న మసై పశువుల కావలా దారులూ, యింకా ఉత్తరాదిన చూడ చక్కగానుండే వ-గొగొ మొదలైన జాతులు వుండేవి. ప్రస్తుతపు మొరొగొరొ జిల్లాకు దక్షిణంగా జనాభా అతి పల్చగా వున్న పల్లపు నేలలు - యివి అనారోగ్య భూయిష్ఠమైన వూబి నేలలు. రుఫిజి, దాని ఉపనది, రుహ నదుల ప్రవాహస్థలం యిది.

సంవత్సరాల క్రిందట, ప్రస్తుతపు ఉలుగురు పర్వత నాయకుని వంశీకుడైన కింగొలా తొలిసారిగా ఉబెన నుంచి వచ్చి, అనుచరులను యితర తెగలనుండి సంపాదించుకున్నాడు. వీరిలో బలాఢ్యులు స్వేచ్ఛా ప్రియులు అయిన వ-హిహె వారున్నారు. వీరినే తరువాత జర్మనులు అణగతొక్కారు. ఇతరులైన - హెండెని, బగమొయొ, కిసరవె జిల్లాలలో కూడా వలసప్రజల కూటాలు వున్నాయి.

వ-లుగురు యీ విభిన్న తెగల మనుష్యుల కలయికతో ఒక కొత్త తెగగా పెరిగింది. ఇది తూర్పు ఆఫ్రికా తెగల మూలాలలో అతి విచిత్ర మైనది కాని యీ తెగ, చుట్టుపక్కల వున్న వ-కవరె, వసరమె, వనుగురు, వ-కమి, వకవరె మొదలైన యితర తెగలతో పోలికలు కల్గి వుంది. అంతే కాదు, వీరికి సంప్రదాయ శత్రువులైన వ-కుటు, బవి కిర-జు, ముటాంబొ చుట్టుపక్కల - వీరందరితోటీ కూడా పోలికలు కల యీ తెగ ఎలాగ పుట్టింది? తూర్పు ఆఫ్రికాలో సామాన్యము గాని, అందులోనూ, వున్న కొద్ది మాతృహక్కు తెగలలోనూ కూడా సామాన్యంగా తోచని యిలాంటి జాతి తలెత్తడానికి ఏ పరిస్థితులు ప్రోద్బలించాయి? గత శతాబ్దిలో చెలరేగిన గోపీ దండెత్తినప్పుడు వివిధ జాతులు ఉత్తరాదిగా పలాయనం సాగించాయని చెప్పుకోవచ్చు. వ-గొని యింకా దక్షిణాదిగా వ్యాపించి విక్టోరియా సరస్సు అంచువరకు వచ్చినా - ఉలుగురు తప్పి వుంటుంది. మొరొగొరొ జిల్లాయే యీ దండువల్ల ఏమీ నష్టపడ లేదు. దానిలో అరబ్బు యితర బానిస వ్యాపారులు మాత్రమే చరిం

చారు. ఉలుగురు పర్వతశ్రేణికి యింకా దక్షిణాదిన వొకటు కూడా యింతే. తరువాత ముఖ్య రహదారి అయిన డారెస్సలామ్‌కి - మవన్‌జకు మధ్య సంచరించారు

గత శతాబ్ది తొంభయిలలో యీ వ-లుగురు తెగ బయలుదేరి ఉలుగురు పర్వతాలను పైపైకి ఆక్రమించుకోసాగారు. జర్మనులు అప్పటికీ త్వరితగతిని నశించిపోతూన్న ఆటవిక సంపదకు భయపడసాగారు. కాని, జనాభా పెరుగుదల, నేల వుప్పు విరగడం జరుగుతూనే వుంది. 1930 లో బ్రిటిష్ జిల్లా అధికారులు అంచనా వేసి లుగురు జనాభా తొంభై ఒక్క-వేలు అని తేల్చారు 1958 లో నూటఅరవై వేలు.

కొత్తగా సంపాదించిన నా యీ విజ్ఞాన ప్రదర్శనకు గర్వంగా తల వూచాడు పాట్రిక్ కునాంబి. ఇదివిని ఉలుగురు చరిత్రకి తన స్వంతం కూడా కొంత చెప్పగలనని చెప్పాడు. 'మా మేనమామ నగ్‌వాసెగ్వా XI మా మాతృహక్కు- తెగలో పదిహేనో కిబ్వే. ఈయన మా నాన్నగారి కంటె కూడా పెద్దవాడు. అప్పుడు మా నాన్నగారు జాంజిబార్‌లో వుండే వారు. 1866 లో అప్పటికి లివింగ్‌స్టన్ కూడా రాలేదు అక్క-డికి. 1956 లో నా మేనమామ పోయేనాటికి ఆయన వయస్సు 110 దో,120 సంవత్సరాలో ఉంటుంది. ఏవేవో కథలు చెప్తూ వుండేవాడు. అందరూ అనుకునేటట్టు, ఇతర తెగలలాగా మా తెగ దక్షిణాన్నుంచి రాలేదనీ, యింకా ఉత్తరాదిగా దూర దూరంలోవున్న పర్వత ప్రదేశంనుంచి వచ్చిందనీ అనేవాడు. ఒకానొకప్పుడు మా పూర్వీకులు ప్రయాణం సాగించి ఎడారిలాంటి నేలను దాటుకుంటూ వచ్చారు. తరువాత రెండు నదులు దాటి తెల్లని శిఖరంగల ఒక పర్వత ఛ్ఛాయకు చేరారు. యింకా ప్రయాణం సాగించి సమతల ప్రదేశాలని దాటుకుంటూ యింకోగుంపు కొండలనిదాటి చివరికి ''పాంగ్వే'' అనేచోట కొంతకాలం ఆగారు. దాని తరువాత యింకా దక్షిణాదిగా సాగి యింకో ''పాంగ్వే''కి (ముకెజ కనుమల ప్రాంతంలో వుంది) చేరి, అక్క-డినుండి సాగి మొత్తంమీద యింకో మూడుచోట్ల ఆగారు. యివి కూడా పాంగ్వే అనే పిలవబడుతున్నాయి. వీటిలో ఆఖరుది కొరొగ్వే మైదానానికి క్రిందుగా పాంగని, హన్‌దెని జిల్లాలలో వుంది. తమ ప్రయా

జాన్ని యింకా సాగిస్తూ ప్రస్తుతం బగమొయొ జిల్లాలోవున్న జిగువ దేశానికి వచ్చారు. ఈ ప్రదేశం టాంగన్యికాలో మాతృహక్కు తెగల నివాసస్థలము. ఇక్కడే వారి ఆఖరు మజిలీ—'పాంగ్వె' వుంది. ఇదే సెంట్రల్ బగమొయొలోవున్నది. పాట్రిక్ కునాంబి యిక్కడ ఉచ్చారణ వివరణ చేశాడు. అన్ని పాంగ్వెలలోకీ ఆఖరు పాంగ్వె మొదటి అక్షరం తేలికగా పల్కబడుతూంది.

వ-కవరె దేశంగుండా పోతూన్నప్పుడు యీ మ-వెంద తెగవారు యింకో రెండు చోట్లకూడా ఆగారు. కాని వీటిని 'పాంగ్వె'అని అనలేదు. వీటిని మబిగిల; పూగు అని పిలిచారు. మొటంబో దగ్గిర వీరు ఉలుగురు పర్వతాలలోకి ప్రవేశించారు. చిట్టచివరకు యీ మ-వందె తెగ ఉఌగురు తూర్పు చరియలలో ప్రవేశించి అక్కడనుంచి విస్తరించుకున్నారు,

ఒక రోజున తొలి కిబ్వె ఎత్తుగానున్న కొండలలోకి వేటకి వెళ్లాడు. అక్కడే 'మగొామ' అనే అతను నివసిస్తూండేవాడు. కిబ్వె మేనకోడలు కాచిన బీరు చవిచూపి మగొామ యింకాకొంచెం తనకి తయారుచేపి యిమ్మన్నాడు. ఆమె సరేనంది. ఇది కాచుతూ వున్నప్పుడు కలియ బెట్టడానికి వంగితే వీపునవున్న పిల్ల కాస్తా ఆ కాగుతూన్న కల్లులో పడి చనిపోయిందట. ఈ నష్టానికి పరిహారంగా మగొాను యిద్దరు బానిసలని, కొంచెం నేలని కిబ్వెకి యిచ్చాడు. దానితో కిబ్వె అక్కడే నివాసం ఏర్పరచుకున్నాడు. ఈ విధంగా కొత్త తల్లిహక్కు తెగని ఉలుగురు పర్వతాలలో ప్రారంభం కావించాడు కిబ్వె అని పాట్రిక్ కునాంబి చెప్పాడు.

ఈ కట్టుకథ పదుగురు తెగల సమన్వయమైన లుగురు తెగపట్ల కుతూహలాన్ని ఎక్కువ చేస్తుంది. ఈ తెగలోని వారిలో చాలామంది దక్షిణాన్నుంచి వచ్చినవారని చెప్పుకుంటారు. దీనివల్ల యితర విషయాలు కూడా చిక్కుకుంటున్నాయి. కాని కట్టుకథ అనిపించే పై వివరణ ప్రకారం మవెండా తెగవారు చాలా దూర ప్రదేశంనుంచి ఒక ఎడారిని దాటి వచ్చారంటున్నారు. బహుశా అది కెన్యా శిఖరము కావచ్చు; కాకపోతే ఇథోపియా అవొచ్చు. ఇక వారు చెప్పే రెండవ తెల్లటి పర్వత శిఖరాగ్రం కిలిమంజారో కావొచ్చు. కెన్యా శిఖరం అనగానే నాకు మూంబి మాతృ

దేవి, ఆమె కూతుళ్ళకు సంబంధించిన కికుయు కధ జ్ఞాపకం వచ్చింది. దీనికి తోడుగా సాలెగూళ్ళలా అల్లుకుని ఎన్నో పురాతన సంప్రదాయా లున్నాయి-ఇతోపియాని, షీబారాణి బిల్‌క్విస్‌నూ కలుపుతూను, దక్షిణ అరేబియాను, ప్రాచీన సంప్రదాయం అయిన సింధునదీ నాగరికతను కలుపుతూను. భూతకాలపు దూర తీరాల పురాణ కధలచుట్టూ కదలాడే కలలా యివి ? వీటిని స్థానికం అయిన నా పరిశోధనలతో కలపడానికి అవ కాశమే లేదు.

ఒక దేవుడు అన్న నమ్మిక కల్గిన "పాగన్'' మతాన్ని గురించి నా స్నేహితుడు అన్నాడు. కాని తరువాత నేను తెలుసుకున్నాను. బలికని నిర్మించిన గుడిసెలను (Cha Mlungu) పెట్రోలుపోసి తగలపెట్టేవారట ఉత్తేజితులైన మతాంధులు. 'గురు' 'కురు' అంటే ఉన్నతమైన అని ఉత్తరాది బంటూ భాషలలో అర్థం చెప్పుకుంటారు. కి-సుకుమ కి-నమ వెజి అంటే టాంగన్యికాలో అర్థం చెప్పుకున్నట్లు. ఉగండా, ఉత్తర కెన్యా భాషలలోకూడా యిదే అర్థం చెప్పుకుంటారు.

మా కిలుగురు భాషలో ఉపాధ్యాయుణ్ని పేరు పెట్టి కాకుండా "సెకులు" అనే పిలుస్తాం - తెలుసా ? గౌరవార్థమే కాని 'కులు' కి, సంస్కృతంలో ''గురు" శబ్దం - వీటికి సంబంధం వుండి వుండదా ?

వంకీలు తిరుగుతూ పైకి పోయే రోడ్డుమీద ప్రయాణం చేస్తూంటే, తొలుదొలుత వలస ప్రారంభించిన వారికి ఎంత ఉత్సాహంగా వుండేదో వూహించుకో గలిగాను. మగెట నుండి ఛెన్‌సెమకు రోడ్డు అంత వంక రలు తిరుగుతూ పోతుంది. ఈ పర్వత చరియలు అప్పట్లో దట్టమైన చెట్లతో వుండి యింకా అందంగా వుండేవేమో. ఇప్పటికీ 9000 అడు గుల ఎత్తున వున్న రిజర్వు అడవిలో ఆకుపచ్చని చెట్లు దట్టంగా కన్పి స్తాయి. జొన్నలూ చోళ్ళూ పండే అంతస్తులుగా వున్న పంట భూములు పక్కలనుంచి రోడ్డు సాగిపోతూ వుంటుంది. అక్కడక్కడ నేల పూర్తిగా తుడిచిపెట్టుకు పోయి నల్లనల్లగా కన్పిస్తూ వుంటుంది. వర్షాలు పడి పైనుంచి ధారావాహినిగా వచ్చిపడే నీరు మంచి మట్టినికూడా క్రిందకు లోయలోకి తోసుకుని పోతుంది. ఈ పర్వత చరియలలో అక్కడక్కడా

చుక్కలలాగా చాలా యిళ్ళు కన్పిస్తాయి. చీమల బారులలాగా స్కూలుకు పోయే పిల్లల గుంపులు కన్పిస్తాయి. పెద్ద తగరపు శిలువలూ, మేరీ మాత మెడళ్లూ పిల్లలూ పెద్దలూ కూడా ధరిస్తారు. ఈ రేకు శిలువలు నీలపుచారల చొక్కాల కాలరుమీద నుంచి మంత్రపు తాయత్తుల లాగా కన్పిస్తూంటాయి. ప్రతి ఉదయం స్కూలుకి వెళ్ళే దారి పొడుగునా అరుచుకుంటూ పరుగెడుతూ పోతూవుంటారు యీ పిల్లలు. వీళ్ళు నన్ను వింతగా చూస్తారు. మిగిలిన వ-జుంగు వారిలా మోటారుకారులో కాకుండా నేను నడిచి వెళ్ళడమే వాళ్ళ వింత చూపులకి కారణం. మిష నరీలు, డెవలప్‌మెంటు ఆఫీసర్లు, వ్యవసాయపు అధికారులు వీరందరూ కార్లలో వెడతారు. కాకుంటే నేను చొక్కాయ తొడుక్కోనని కాబోలు వారి ఆశ్చర్యం! పైకి నాల్గువేల నుండి ఆరువేల అడుగుల ఎత్తుకు ఎక్కుతున్నప్పుడు చల్లగాలి అనుభవిద్దామని ఆశిస్తాను నేను. అది జూన్ మాసం. దక్షిణార్ధ గోళంలో చలికాలమే. కాని ఎంత వేడిగావుంది.

మృదువైన ముఖకవళికలు కల దక్షిణ బంటూ కుర్రవాడు నా కూలి వాణ్ని అడుగుతాడు - ఎక్కడికి వెడుతున్నారు, ఎక్కణ్నుంచి వచ్చారు అని. పొడుగ్గా సన్నగా వున్న ఏడేళ్ళ అమ్మాయి వింత ఆకారం కల నా తోలుసంచి కేసి ఆశ్చర్యంగా చూస్తుంది. తల యిలా తిప్పితే చాలు చక్కని నీటైన హమిటిక్ ముఖం తీరు గోచరిస్తుంది నాకు. ఎర్రని ఉంగరాల జుట్టులో చేతివేళ్ళు పెట్టి వూగిస్తాను. ఆ జుట్టు యూరోపియను పసివాళ్ళ జుట్టంత మృదువుగానూ తోస్తుంది నాకు.

శారీరకంగా వ-లుగురు తెగలలో కానవచ్చే తేడాలు వారు వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన వారన్నది నిరూపిస్తుంది. కొన్ని వారాల తరువాత "బవకిరాజు" లోని నా విశ్రాంతి గృహంలో కూర్చుని యివే శారీరకమైన విభేదాలను గురించి ఆలోచిస్తూనే వున్నాను. ఇద్దరు స్త్రీలు - స్నేహితులూ యిరుగుపొరుగులూ అయివుంటారు అనుకున్నాను. వీరిద్దరూ ఒక చోట కలుసుకోవడం చూడగానే ఆఫ్రికను కులాల రీతులు నాకు జ్ఞప్తికి వచ్చాయి. నీలోహమిటిక్ జాతి లక్షణంగా మృదువైన తీరు ఉత్తరాన్నుంచి, బంటూ తెగ లక్షణంగా గుండ్రని, ఘనమైన ఆకృతి దక్షిణాన్నుంచీ వచ్చినవి.

కాని నిజానికి వీరిద్దరూ స్వంత అక్కచెల్లెళ్ళట. 'మమమొజ', 'డడమొజ' ఒకే తండ్రి బిడ్డలు; ఒకే తల్లి బిడ్డలు. మెండిలియన్ వంశక్రమాని కిది నిదర్శన.

మటంబొకి దిగువగా ఎదురుగా వున్నది వలగురు తెగల కూటము. బవకిరజు సంప్రదాయ సిద్ధంగా పోటీదారులుగా వుంటున్న పకుటు ప్రదేశానికి మొదట్లోనే వుంది. ఈ స్థలం తప్పక వెళ్ళి చూడమని నా స్నేహితులు ముఖ్యంగా పూర్వపు నెవల డి. ఓ. గా వుండిన మిస్టర్ డన్ స్టన్ ఒమరి ప్రోత్సహించారు. కాతలిక్కు మతం పూర్తిగా ఆవరించుకొని వున్న యీ కనుమలలో బవకిరజు ఒక్కటే ముస్లిమ్ మతం క్రింద వుంది. సంప్రదాయమైన సంస్కృతి, మాతృహక్కు సంప్రదాయాలూ అక్కడ యింకా బలంగా వుండే అవకాశం వుందనీ, వాటి నక్కడ పరిశోధింప వచ్చుననీ చెప్పారు. ఈయనే, బవకిరజుకు చెందిన 'హెగా'ను గురించి చెప్పాడు. హెగా మాతృహక్కు తెగల వంశీకుడు. ప్రఖ్యాతి గాంచిన ముగ్గురు వర్షాన్ని సృష్టించిన వారిలోనూ ఒకడు కూడా. ఒకానొకప్పుడు యీ వర్షబ్రహ్మలు ఉలుగురులో అతి ప్రాముఖ్యం వహించి వుండేవారు. వీరి శక్తి "గుప్త శక్తుల" మీద అధికారం చలాయించడంలో వుంది. వీరి వ్యక్తిత్వాన్ని ఆపేరనే పిలువవచ్చుకూడా. వీరి వంశంలోనివారు అందరు నాయకుల వంటి నాయకులుగా చలామణీ కాలేదు. అయినాకూడా వీరిని విదేశీ ప్రభుత్వాలు గుర్తించాయి. ప్రస్తుతం హెగా బిరుదుతో వున్న నాయకుడు టాంగన్యికాలోని యునైటెడ్ నేషన్సు ట్రస్టు భూమికి నాయకత్వం వహిస్తున్నాడు. బ్రిటిషుప్రభుత్వం యితన్ని గుర్తించింది.

మొరొగొరొలోని డి. ఓ. ఏంథొనీ మూర్ సూచనలమీద బవకిర లోని నా పని ఒక పద్ధతిమీద సాగింది. నా ప్రయాణానికి అవసరం అయిన ప్రతి చిన్నవిషయం ఆయనే అమర్చాడు. చివరికి నా వంటమనిషి రషీదీ దగ్గిరనుంచి, ఆయన తన స్వంత కారులో బవకిరా ప్రాంతాలకు తీసుకువచ్చి విశ్రాంతి గృహంలో వదిలిపెట్టి నాకు ధైర్యాన్నిచ్చేలా చిరునవ్వు నవ్వారు. ధీరత్వాన్ని తెలిపే ఆ పెదవులు మాట్లాడిన మాటలు

తక్కువే అయినా అవి ఎంతో ధైర్యాన్నిచ్చేవి ; సహాయం చేసేవి - నా కృషిని యింకా ముందుకు దారి చూపి నడిపించాయి. రషిది అద్భుతమైన వంట సృష్టించేవాడు. ఈ అడవులతో నిండిన కొండలలో వున్న ప్రమాదాలను గురించీ, భయంకరమైన మలేరియానుగురించీ, ఛెంజీ మనుషులను గురించీ చెప్పకుండా. సిగ్గుతో సన్నగా నవ్వుతూ, దారిలో మరీ దూరం కాకుండా వుంటే వెళ్ళి తన ప్రియురాల్ని చూసివస్తాననేవాడు. ఆమె యింకెవరో కాదు, హెగా చిన్న దొర మట్వాలా కూతురే. ముందు ఆలోచనతో రషీది మైదానంలో వున్న భారతీయ డూకా దగ్గరనుంచి ఇంకో దీపమూ, ఎనామిల్ పళ్ళాలూ తెచ్చుకుందామని చెప్పేవాడు. వాటి అవసరం వుంటుందనేవాడు.

డూకావాలా ఆజానుబాహుడు. బిగువాటి యూరోపియను గౌనులు ధరించి యిద్దరు చుట్టాలు కొట్టులో సహాయం చేస్తూ వుండేవారు. వీరందరి మీదా అతని భార్య అజమాయిషీ వహించేది. ఈవిడకూడా యూరోపియను దుస్తులే కట్టుకున్నా కొంచెం ఒదులుగా ధరించేది. వీరందరూ కూడా మట్వాలాని పొగిడేవారు. అతను ప్రభుత్వాని కెంత విశ్వాసపాత్రుడుగా వున్నాడో అందరూ చెప్పుకొనేవారు. అతను నాకూ కావలిస్తే తప్పక సహాయం చేస్తాడని అనుకునేవారు.

డూకావాలా మటుకు గంభీరంగా నాకు చెప్పేవాడు. కొండ చరియలమీద అంతస్తులుగా వ్యవసాయం సాగించే కొత్త పద్ధతిని ప్రభుత్వ వ్యవసాయశాఖ ప్రారంభించాలని తలపోసినప్పుడు దరిదాపు ఎలా విప్లవం సాగిపోయిందో చెప్పేవాడు. అన్ని సమస్యల కంటె పెద్దవి యీ ఆఫ్రికను కనుమలు !

సుదూర భవిష్యత్తులో ఫలితాలు యివ్వని శ్రమ - తొలిసారిగా అంతస్తులు ఏర్పరచి కొండ చరియలను వ్యవసాయ యోగ్యం చేయడం అన్నది. ప్రస్తుతం యీ ప్రాంతాలకి వచ్చి వున్న కమ్యూనిటీ డెవలప్‌మెంటు ఆఫీసరే యీ పని ప్రారంభించి వుంటే యీ తొలి యిక్కట్లు త్వరగా తీరిపోయి వుండును. "చాలా మంచి మనిషి ; మంచి పరిపాలనా దక్షుడు. మీరు తప్పకుండా ఆయన్ని చూడాలి" అన్నారు.

కారణాలు తెలియకుండానే, వ్యవసాయిక ప్రణాళికలు విఫలత కొంచడాన్ని గురించి విన్నాను. ఈ సందర్భంలో యీ ప్రణాళిక పూర్తి వివరాలను గురించి తెలుసుకోవాలని ప్రయత్నించాను. అప్పుడు అందరూ చేస్తూన్న వివరాలు ఒక రూపం దిద్దుకుంటాయి. ఇటువంటి ప్రణాళికకు భావనాదర్శకమైన వూత కావాలి. మిషనువారు యీ కావలసిన వూత యివ్వకపోతే కష్టాల నధిగమించడం కష్టతరం అవుతుంది. ఆఫ్రికను నాయకులే అయినా, ఎంతటి సదుద్దేశాలు వ్యక్తం చేసినా చాలదు. మిషను వారిని విమర్శించడం ఎవరికీ యిష్టం వుండదు; విమర్శించరు కూడా. చాలా మటుకు సాగుబడి క్రిందవున్న భూములు, ఆ ప్రాంతాలలో నున్న స్కూళ్లు అన్నీ మిషనులవే. పలుకుబడి సృష్టించుకోగలరు వాళ్ళు. బజారులో నాతో అధికంగా మాట్లాడే వ్యాపారికి వారంటే అమితమైన ఆదరణ. కారణం, ఆ ప్రాంతాలలో అతని సరుకు ఎక్కువగా కొనేది వారే. "బ్రిటిషు కుటుంబీకుడు కుటుంబం మొత్తంగా ఎంత త్రాగుతాడో, ఒక్క డచ్చి పౌరు డంత త్రాగుతాడు. కొత్తగా మతాన్ని పుచ్చుకున్న ఆఫ్రికనుల గుంపు అంత కంటె ఎక్కువ తాగలేదు. ముఖ్యంగా యీ వ-లుగురులలాగా వింత ప్రకృతి కలవారైతే!"

బీరు బిల్లు తెమ్మని పిలిచాడు. "చూడండి, ఒక నెలసరి బిల్లు యిది. అవును! డచ్చి ఫాదరీలు నాకు మంచి కాతాదారులు. వారిలో చాలామంది చుట్టలూ, పెట్రోలూ, ఫోటో సామానులు కూడా ఎక్కడి కక్కడే కొనుక్కుంటారు. ఆ వ్యాపారంలో కింకా దిగలేదు నేను. అదంతా పాడైపోయే సరుకు. ఏమైతే నేం, డచ్చి ఫాదరీలు బలమైన యువకులు!".

బజారు కవతలగా ఉలుగురు కనుమలు కనుచూపు మేరదాకా విస్తరించుకొని వున్నాయి. వాటి నీలి స్ఫటికాల్లాంటి శిఖరాలు సాయంత్రపు ఆకాశంలో గిరిగీచినట్టు కన్పిస్తున్నాయి. నేలా, ఆకాశమూ - యీ రెండు నీలాలూ ఒకదానిపై ఒకటి పడుతున్నాయి. వీటిలో సూర్యుని బంగరు రంగులు మిళితమైనాయి. ఆ క్షణంలో తొలుదొల్త దీర్ఘ ప్రయాణం తరువాత యీ కనుమలను ఎక్కడో ఎక్కిన మవెండ తెగలవారు జ్ఞప్తికి వచ్చారు నాకు. నా కిదే ప్రారంభం.

ప్రతిసారీ కూడా మానవ పరిణామ శాస్త్రకారునికి ఫీల్డు అనుభవాలు కొత్త ప్రపంచాన్ని చూపుతూ వుంటాయి. దాన్ని ప్రవేశించాలని చూస్తాడు, అక్కడ మానవుని ఆశలు కన్పిస్తాయని, మానవుని భయపెట్టే భయాలు గోచరిస్తాయని తలపోస్తాడు.

కిపరెబిటు పల్లెను నేను నిర్ణయించుకున్నాను. బవకిరజు లోని నా బసకు రెండు ఫర్లాంగుల దూరంలో వుంది. ఇక్కడి బస చిన్నది. కాంక్రీటు కట్టడం. ఉగండాలోలాగా ఇనుపచట్రాల కిటికీల బాధ యిక్కడ లేదు. సామాన్యమైన కర్ర రెక్కల కిటికీ తలుపులు నా పడక గదివి. ఎప్పుడూ అవి తెరిచే వుండేవి. మధ్యాహ్నంవేళ వేడి అధికం అయినప్పుడూ అవి మూయవలసి వచ్చేది. కాని ఆ టైములో నేను ఫీల్డు పనిమీద తిరుగుతూ వుండేవాణ్ని. బంగళా నిరాడంబరంగా వున్నా కూడా పెద్ద పెద్ద వృక్షాల ఛాయన వుంది యిది. ఈ పుణ్య వృక్షాల తోపులో కాకుండా తన కాబోయే బావగారు వంటగది వసారాలో పడుకుంటాడనీ, చిరుతలు వస్తాయేమో నన్న భయం అనీ రషీది చెప్పినప్పుడు - బహుశా పూర్వపు వర్షబ్రహ్మల నొక రిద్దరిని యీ ప్రాంతాలలో పూడ్చి వుంటారని అనుకున్నాను.

కిపరెబిటులో పద్దెనిమిది యిళ్ళు వున్నాయి. వీటిలో రెండు సంప్రదాయ సిద్ధమైన గుండ్రటి కట్టడాలు. మిగిలినవి చదరంగా ఆధునికమైనవి. మకొండె పీరభూమిలోలాగే యిక్కడ ఒక పల్లెపెద్ద-మిజీ వున్నాడు. మామూలుగా చెప్పుకున్నట్టు యితణ్ణి నాయక, ఉపనాయక, అధికార బిరుదాలతో చెప్పుకోలేం. ఇతని పేరు "మసుమి మవెనే మువ." మసుమి వ్యక్తిగతమైన పేరు. మవెనె అంటే ''సొంతదారు'' అని (హిందుస్తానీలో 'వాలా' అన్నట్టు). 'మువ' అంటే వర్షం అని చెప్పుకోవచ్చు. ఈ పేరు పూర్వపు హెగఒకూ, యిద్దరు యితర లుగురు నాయకులకూ సంబంధం వున్నట్లు సూచించుతూవుంది. మసుమి మటుకు తన ఉపదేశ కాలంలో ఎక్కువగా వర్షాలు పడ్డందువల్ల వాటి జ్ఞాపకార్థమే తన రెండు పేరులూ అని చెప్పాడు. ఇలా చెప్పినాకూడా అతని అతిజాగ్రత్త, కళ్ళలో చూపు, ఇవన్నీ చూస్తూంటే అతనుకూడా వర్షబ్రహ్మల తెగవాడనీ, యీ



కిపర్ బిటు పల్లెలోని యిండ్లు.

(హాబిబ యిల్లు రెండో నంబరు కలది.)

చెప్పినది నిజం కాదనీ తోచింది. సామాన్యమైన ము-లుగురుకి అతీత మైన ఎన్నో విషయాలు ముసుమికి తెలుసు. 1916 లో జర్మనులు యీ తూర్పు జిల్లాలని వదలి వెళ్ళినప్పుడు తాను చిన్నవయస్సులో వున్నాననీ, తరువాత వచ్చిన బ్రిటిషు యిండియను దళాలు రావడం గుర్తుందనీ చెప్పాడు. ఈ యుద్ధానంతరం కాటకంవచ్చి ఎందరో చనిపోయారని చెప్పాడు. తన తల్లితల్లి-మొనికాకూడా అతనికి గుర్తుంది. తనూ, తల్లి కిమెలు ముస్లిములు. అయినా తన మేనల్లుళ్ళనీ, యిరుగు పొరుగులనీ అడిగి, తన పూర్వీకులు ఎవరో, తమ తెగ కెలా యిటువంటి పేరు వంశపారంపర్యంగా వచ్చిందో అంతా వివరించాడు ముసుమి. ఈ పద్ధతి ఏర్పరచుకొన్నదానిలాగా వుంది. మకొండె తెగలలోవలె ఏకకుటుంబ పద్ధతిని పోలివుంది. కాని లిండి జిల్లాలోని వమవెర తెగలవారిలాగా భిన్న కుటుంబ నియమానికీ సంబంధం కల్గివుంది. పలువురు తమ విషయాలను గురించి చెప్తున్నప్పుడు నేను చాలా జాగ్రత్తగా వినేవాణ్ణి. వీరికి పేరంటే ఏదో దూరమైన విషయంకాదు; సంప్రదాయకమైనదీకాదు. అది వారి నిత్యజీవితం. ఈ పేర్లు ఒక పద్ధతి ననుసరించి పోయినవి కాదు. బ్రతికివున్న, చనిపోయిన చుట్టాలకు అన్వయించుకొనేవి.

'లుకోలో' అన్నపదం నాకు ముందు అర్థవంతంగా తోచింది. వ-మకొండె తెగలవారు మాతృహక్కు సంప్రదాయాన్ని సూచించడానికి వుపయోగించే పదమే యిది. దాన్ని బి-ముకుబవ ఛిటొలొ, లేకుంటే ఆమె కుమారుడు నహులె, అతని కూతుళ్ళ బింటి నహులె - మకొంజొవనొలో వుపయోగించినట్లే. కాని యీ ఉలుగురు ప్రాంతంలో 'లుకోలో' పదానికి అర్థం ఎక్కువ అని తోచింది. ఉలుగురులలో ఒక వ్యక్తి "లుకోలో" అంటే-అతని వంశానుక్రమమూ, మాతృహక్కు తెగపేరులూ కలసి అని చెప్పుకోవచ్చు. ఇదే మకొండెలో అయితే-ఏదో కొన్ని తరాల వంశానికే అర్థం చెప్పుకోవలసి వుంటుంది. అక్కడ మాతృహక్కు తెగను లిటవా అని వాడుతారు. (కిస్వహిలిలో ఉకూ అనాలి) అందుకే ఉలుగురులోని లుకోలో మకొండెలోని 'లిటవా' పదాలు ఒకే అర్థాన్ని యిస్తున్నాయి. మవెర పదం ఛిపింగ.

లుగురు వంశవృక్షం



[108-వ పుటలోని టేబిలులోవలెనే మగ ఆడ వంశ పారంపర్యం చిహ్నాలుగా గుర్తింపబడ్డాయి. తెగలపేరులు చిహ్నా కెదురుగను, ముఖ్యమైన తెగ పెద్ద అక్షరాలు, తరువాతవి చిన్న అక్షరాలలోనివి.

లుగురు పేర్లలో చాలా వాటికి అనువదించుకోతగ్గ అర్థాలు వుండవు. (మగొబె అంటే ధాన్యపుగాది, మగండె అంటే ఒకరకం తిను బండారం।)

108-వ పుటలోని టేబిలు లోలాగా వంశానుక్రమం గీతలద్వారానూ, ముఖ్యంగా మాతృహక్కు తెగల వంశానుక్రమం అడ్డులేని గీతలూ, తరువాత పెరిగిన తండ్రిహక్కు సంప్రదాయానికి చుక్కల గీతలూ ఉపయోగించ బడ్డాయి. తాతముత్తాతలపేర్లే తెలియనిచోట్ల ? వుంచడం జరిగింది.]

వ-మవెర తెగలలోవలెనే యీ వ-లుగురు తెగలవారిలోకూడా అసలు తెగపేరుకి తోడుగా రెండవ పేరు - తండ్రినుంచి సంక్రమించినది 'మతల' కూడ వుందని తెలుసుకున్నాను. మవెర తండ్రి తరపు తెగ పేరునకు (ఛిలగ్వే) లో మాటలకూ సమన్వయం కుదురుతుందేమో అని చూశాను. ఈ పని కోసం సంప్రదాయాలు, ఆచారాలు అన్నీ ఆలోచిస్తూనే, అంతరాంతరాలలో యీ విషయానికే సంబంధంలేని దేదైనా నిజమైనది కనబడవచ్చునని తలపోయసాగాను.

ముసుమి నా యీ తాపత్రయాన్ని కుతూహలంతో తిలకించసాగాడు. లుకులోకూ మటలాకూ గల సంబంధం ఏమిటి? వింతతోటీ ఆశ్చర్యంతోటీ కూడిన చిరునవ్వు ఆ ముడుతలుపడిన ముఖంలో మెరిసింది. నా యీ వర్ష బ్రహ్మస్నేహితుడు నేననుకుంటున్నదానికి విభిన్నంగా తలపోస్తున్న ట్లున్నాడు: వంశవృక్షాలు తెగల పేర్లు వలసలు. కానిఅదేమిటో? పాట్రిక్ కునంబి తెగవారు (మవెండ) ఎలాగ చాలా దూరంనుంచి, ఉత్తరదిశనుంచి వచ్చారో చెప్పాను. కాని యిక్కడ జాతుల రాకలను గురించిన గాథలన్నీ కూడ దక్షిణానికే చెందుతున్నాయి. ఉదాహరణకి, దక్షిణ ఎత్తు ప్రదేశాల లోని ఇరింగ అలాగే వహెహెకుగల సంబంధాలనుకూడ సూచిస్తూ వుంటాయి.

ముసుమికి ఒక మేనకోడలుంది, హెలెన్. (హెరిని అని ఉచ్చ రిస్తారు) ఆమె భర్త ఉమర్ (ఓమరి) తో దగ్గిరలోనే నివసిస్తూంది. ఇద్దరూకూడ బలమైనవాళ్ళు. వ్యవసాయం చేసుకునేవాళ్ళు. హెలెన్ మేనమామకంటె చాలా పొట్టిగా కన్పించేవాళ్ళు. వ్యవసాయం ఒక్కటే జీవితంలో ముఖ్యమైనది అని వాళ్ళు చెప్తే నాకేం ఆశ్చర్యం కల్గలేదు. కాని జీవితంలో సరదాకి కోరుకో తగ్గవి వర్ణించేటప్పుడు కనికీ నల్లని బట్ట ధరించిన ఆమె వేసుకున్న ప్లాస్టిక్ ఆకుపచ్చ పూసలు అని చెప్తుందేమో అనుకున్నాను. కాని భర్తతోపాటు ఆమెకూ దేవుడంటేనే (ములుంగు) ఎక్కువ యిష్టం అంది. ఉమర్ అన్నాడు—''మన మానవులం తినడం, నిద్రించడం, చనిపోవడంవంటివే జ్ఞాపకంవుంచుకుంటామనీ, దేవుడంటే అది వేరు, మనం చనిపోయాక అతని సాన్నిధ్యం చేరుకోవచ్చు."

ఈ భార్యాభర్తల ఊహలు నమ్మకాలు నన్ను ఆకర్షించాయి. అలాగే వారి పేర్లుకూడ. ఆరబ్బీ ఉమరు, యూరోపియన్ హెలెన్. 1936 లో పుట్టిన హెలెన్ పూర్తిగా ముస్లిం వాతావరణంలో పుట్టింది. మరి ఎలాగ క్రైస్తవ మత విధి అయిన జ్ఞానస్నానం పుచ్చుకుంది? పుట్టిన కొద్ది వారాలలో హెలెన్‌కు జబ్బుచేస్తే దగ్గరలోవున్న మిషను ఆసుపత్రికి తీసుకు వెళ్ళారట. అక్కడి డచ్చి ఫాదరీలు తమవద్ద అద్భుతమైన ఔషధంవుందనీ,

అది పుణ్యతీర్థం అనీ దానిని తలమీద జల్లాలనీ చెప్పారట. ఆవిధంగా ఆమెకు క్రైస్తవమతం అందించడం జరిగింది. తరువాత కోలుకుంది. కాని తిరిగి స్కూలుకి రాలేదు. ఉమర్ కూడ కొరాన్ ఏ ఉపాధ్యాయుని దగ్గిరా చదువుకోలేదు. ఏదెలాగుంటేనేం, యిద్దరూ ముస్లిము రైతులుగ బ్రతికారు. ఆఫ్రికను వ్యవసాయదారులు వారు; అన్నిటాకూడ పూర్వపు ఆఫ్రికను పద్ధతి పూజలు జరుపుకొంటారు. ఒకేఒక గొప్ప దైవంవున్నాడు వారికి-మలుంగు. అరబ్బులతనినే "అల్లా" అంటాడు.

మే, జూన్, జూలైలలో భూమధ్యతరరేఖపై రాత్రులు అతి చలిగా వుంటాయి. సాయంత్రం అవుతూంటే కొండల్లో అతి చలి. ప్రతి యింటి ముంగిటా మధ్యాహ్నం దాటేసరికి చిన్నచిన్న చలిమంటలు వెల్గడం ప్రారంభిస్తాయి.

ఒకరోజు కొండ అంచుమీదుగా పల్లెలు తిరిగివస్తూ నేను ఒక యింటి ముందుగా వెల్గుతూన్న మంట ముందు చతికిలబడి కూర్చున్నాను. కర్రదుంగతో చెక్కిన పీటమీద కూర్చుని నోట్సు రాసిరాసి నా వేళ్ళు కొయ్యబారి పోయాయి. మంటదగ్గిర వాటిని వెచ్చ చేసుకుంటూంటే హాయిగా వుంది. చలితో చచ్చిపోయిన నా వేళ్ళు రాసుకుంటూ వుంటే ఏదో తెలిసినవానిలాగా ముసలి ములుగలుగ చిరునవ్వు నవ్వాడు. నాపక్కనే చార్‌పాయిమీద కూర్చున్నాడు. పొడుం ఓపట్టు పట్టాలని లేదా? తనదగ్గర చిన్న గాజుగొట్టంలో వుంది. భార్యని పిలిచాడు ముస్టిలకొగను. ఇదంతా నేను పొడి పీల్చను అని చెప్పేలోగానే జరిగి పోయింది. ఇంక యితర విషయాలను గురించి ముచ్చటించడం మొదలు పెట్టాం.

ప్రస్తుతపు కిలొస జిల్లాలోవున్న తమయిళ్ళన్నీ 1905 లో వచ్చిన 'మజిమజి విప్లవం' మూలంగా మంట కలిసిపోయాయి. అతని తల్లి తండ్రులు చనిపోయారు. ఎలాగో అతనుమటుకు ఉలుగురు ప్రాంతానికి వచ్చాడు. అతనికి 1916 సంవత్సరము, జర్మనుల ఓటమి జ్ఞాపకంవుంది. కాని తండ్రి పక్కనుండివచ్చిన రెండవ తెగ పేరు మటలమటుకు జ్ఞాపకం లేదు. ఇది ప్రత్యేకంగా కన్పడింది నాకు. తమ 'లుకొలో' తెలియనివారు

యిప్పటిదాకా కన్పడలేదు నాకు. లుకొళొ తల్లి తరపునుండి వచ్చిన తెగ పేరు. ఇంకో జిల్లానుంచి వచ్చినాకూడ ములుగలుగ తను ము-లుగురు వాణ్ణనే నమ్మేవాడు. ఈ విషయాన్ని ఆ వర్గపు వ్యక్తులందరూ ఒప్పు కున్నారు కూడ.

నేను యిల్లు చేరేసరికి చాలా చీకటి పడింది. చివరికి నా పరిశో ధన కో దారి తోచింది. మటల అన్నది రెండవ జాతి పేరు. తండ్రి తరపున వచ్చినది. మవెర సంఘంలో ఛిలాగ్వేలాంటిది. కాని మవెరలోని తండ్రి పేరులాంటిది కాదు. ఇది మాతృహక్కు తెగ ముఖ్యమైన పేరే. ఇదే అతని లుకొళో. మవెర తెగలో తల్లికితండ్రికికూడ రెండు తెగనామాలు వుండాలి. ఒకటోది తల్లి పక్క చిహ్నగ వచ్చినది, రెండవది తండ్రి తరపుగా తరువాత వచ్చినది. కాని లుగురులలో యీ పద్ధతి లేదు. ఇక్కడ తల్లితండ్రు లిద్దరికీ ముఖ్యమైనది ఒక తెగనామమే వుంటుంది. తల్లి తరపున వచ్చినది లుకొలో కాని తండ్రి లుకొలోమటుకు పిల్లలకు సంక్రమించినప్పుడు వారి రెండవ తెగనామం మటలగా మారుతుంది.

పాశ్చాత్యదేశాలలోని ద్వంద్వ వంశ నామాలకీ వాటికీ పోలిక వుంది. లిండి జిల్లాలో వ-మవెర తెగలవారిలోకంటె యిక్కడే పోలిక ఎక్కువ. పాశ్చాత్య సంఘంలో తండ్రిగుంపు పేరే(అతని వంశపు పేరు)ప్రాముఖ్యం వహిస్తుంది. ఇక్కడ తల్లి యింటిపేరు ప్రాముఖ్యం వహిస్తుంది.

స్త్రీ పురుషుల మధ్య సమానత్వం రూపొందించడం విషయంలో ఆఫ్రికాలో నెలకొన్న యిటువంటి సాంఘిక ఆచారాలను పాశ్చాత్యులు తమ సమస్యలను పరిష్కరించుకొనడానికి అనుసరించుకొనివున్నారా ? సహృదయము, జాతిగర్వము, సాంస్కృతికమైన పక్షపాతాలు కొంచెం మారంగా వుంచినట్లయితే ఆలోచనలు, ఆదర్శాలు యిచ్చిపుచ్చుకోడాని కెంతో అవకాశం కల్గి రెండు సంస్కృతులు కలుసుకొందుకు అవకాశం ఏర్పడేది, ఇచ్చిపుచ్చుకొనే తత్వం ప్రదర్శించిచూస్తే యిద్దరికీ లాభదాయ కంగా అయేదేమో ! బాగా రాత్రి అయిపోయింది. నేను పొగచూరిపోతున్న హరికెనుదీపం వూదేశాను. అప్పటికి గుర్తుకొచ్చింది. నా చుట్టూ యింకా

ప్రాణులు కదలాడుతూనేవున్నాయి, రాత్రించరులైన పక్షులు, గబ్బిలాలు, దీపవుపురుగులు. పూజనీయమైన ఆ చెట్ల కొమ్మల సందులలోనుంచి యీ జీవితప్రవాహం సాగుతూంది. ఎక్కడో నెమ్మదిగా గురగుర చప్పుడుకూడ విన్పిస్తూంది-అదేమిటి? లిఖితంకాని మానవగాధ కీ శబ్దాలు ఏమిటి జత చేస్తున్నాయి?

కిపర్‌బిటు పల్లెలో ఎవరు ఎంతటి ప్రముఖపాత్ర వహిస్తున్నారన్నది నెమ్మదిగా తెలుసుకొంటూవచ్చాను. మైదానాల్లో ధనార్జనచేసి నూరు షిల్లింగుల ఓలికి ఇరవై షిల్లింగులు ఎడ్వాన్సుగ యిచ్చాడు-హూసేనీ మొరోగొరాలో పనిచేసేవాడు. మవటటు హూసేని వధువు. వయసులో చిన్నది. నెమ్మదైనది. కాని యీ విషయంలోమటుకు క్రైస్తవాన్ని, యిస్లాముని అతిగా కలిపేశాడు హూసేనీ అని నా నమ్మకం. మైదానాల నుండి వచ్చిన నేను ఆధునికతకు చెంది కిపర్‌బిటులో ఆధునికత పెంపొందించాలన్న అతని కోరిక చొప్పున తన తరఫునాణ్ణి అని తోచినంతవరకు హూసేనీ స్నేహితుడే. ఎంతో సహాయకారిగూడ. కాని, నాకు సంప్రదాయకమైన విషయాలలో నమ్మకంవుందని తెలియగానే నాలో అతని కుతూహలం పోయింది.

గత పన్నెండు సంవత్సరాలుగ కుష్ఠుగావున్న రామధని వున్నాడు. బవకిరజులోని ఆస్పత్రిలో మందు పుచ్చుకుంటున్నాడు. రోగం ముదరకుండ మటుకు అరికట్టగలిగారు. ఇంకా చివళ్లులేని వేళ్లతో ఏదో పనిచేస్తూ, తన తల్లి చెల్లెలి కూతురుమీద ఆధారపడివున్నాడు. ఈవిడ పేరు పిటమిని. భర్తపేరు ఆల్‌ఫాని. దగ్గరలోనే ఓ యింట్లో వుంటున్నారు. తినడానికి తాము పెట్టేది అతనికి చాలుననీ, అతనేం పని చేయలేడనీ, మహాచేస్తే, కొంచెం కోతల సమయంలో సహాయం చేయకలడు అని చెప్పాడు ఆల్‌ఫాని. అందరి యిళ్ళలాగా ఇతని గుడిసెకి మట్టిగోడలు లేవు. ఉట్టి కర్రచట్రం మటుకే వుంది. పూర్తిగాలేని వేళ్ళతో మట్టి మెత్తడం పని చేసుకోలేడు. ఎవరికీ సహాయం చేయాలని తోచలేదు. కొండగట్టునవున్న యీ గుడిసెమీదుగా చల్లని గాలులు వీస్తాయి. మంటకూడ యిటువంటి

యింటిముందు ఎక్కువసేపు నిలిచివుండదు. అలాంటి సైమలో ఒకే కిటికీ తెరుచుకొని రెండు కంబళీలు కప్పుకొని పడుకొనేవాణ్ణి నేను !....

ఈ పల్లెలో ప్రాముఖ్యం వహించిన యింకో వనిత హబిబ. ఇరవై ఆరేళ్ళ యువతి. పల్లెలోని ప్రముఖులకి బంధువు. వీరి తెగ నాయకురాలు మొనిక మనుమరాలు. తనయింట్లో ఒక్కర్తే వుంటూంది. భర్త మైదానపు స్థలంలో పనిచేస్తున్నాడు. పొడగరిగావుండి అందరి తోటీ సరదాగా వుండేది. ఈ సైములో కొండప్రాంతాలలో ధాన్యం దొరకదు. అందుకే మైదానంనుంచి నే వచ్చేప్పుడు రెండు బస్తాలు బహుమానంగా తెచ్చాను. దాని బీరు కాచినది యీమే.

ఆఫ్రికనులాగే కన్పించినా,ముఖకవళికలు,శరీరపువర్ణమూ బొంబాయి లోని నా అరబ్ స్నేహితులను జ్ఞప్తికి తెచ్చేవి. తూర్పు ఆఫ్రికా తీరపు ప్రాంతంలోని జనాభాలో కానవచ్చే అరబు పోలికలు గుర్తుకువచ్చాయి. ఆమె కలిమిడితనమూ, పనిచేయించడంలోని నేర్పూ సామాన్యులకి అతీతంగానే వుండేవి. ఒక రోజున నన్నూ, నా అసిస్టెంటూ, అనువాదకుడూ విలియమ్ మెబెననూ తన 'సంబ'కు (పొలం?) తీసుకు వెళ్ళింది. విశాల మైన పొలమే. రేవులవారీ వ్యవసాయంక్రింద వుంది. ప్రస్తుతం జొన్నచేను వుంది. మేం యీదుకుంటూ, యీడ్చుకుంటూ వెళ్ళవలసి వచ్చింది. పెద్ద చెట్లక్రిందుగా, గుబురులుగా పెరిగిన పొదలను దాటు కుంటూ పొలం చేరాం. రెండు అంతస్తులను విస్తరించుకుని వుంది యిది. పొలం ఆ ఎండలో ఎంతో అందంగా వుంది. మా తలలనుదాటి పెరిగింది. మేం ముగ్గురంగూడ ఆరడుగుల లోపువాళ్ళమే. హబిబ అంచనా ప్రకారం ఆ పొలం ఓ ఎకరం వుంటుందని. కాని విలియమ్ అంచనా ప్రకారం యింకా తక్కువే వుంటుంది. ఏమైతేనేం - ఆమె దాన్ని చూసుకొని చాలా గర్వంగావుంది. ఆమె పెళ్ళికి పూర్వం,ఆగస్టు సెప్టెంబరులలో పొలంలో చాలాభాగం ఆమె బాగుచేసుకుంది. అక్టోబరు నవంబరు వేడి నెలలలో భర్త సహాయంతో ఎండిన చెట్లని తగలబెట్టి పని పూర్తి చేసింది. వేడికాలం పూర్తికాకుండా విత్తులు నాటింది జన వరిలో. తరువాత భర్త వెళ్ళిపోయాడు. దరిదాపు పని అంతా తనొ

క్కర్తే చేసుకుంది. జొన్న విడివిడిగా నాటింది. అలాగే ఫిబ్రవరిలో కలుపు తీసింది. మార్చిలో రెండోసారి కలుపు తీసినప్పుడు ఆమె సహోదరీ, వారి భర్తలూ చేయూత నిచ్చారు. అగస్టు చివరో, సెప్టంబరు మొదట్లోనో పొలం కోతకివస్తుందనీ, యీ కోత పంగతో (కత్తిలాంటిది) గాని, ముండుతో (కొడవలి) గాని చేస్తానంది, కోసిన తరువాత రెండు రోజులలో పోగులుపెట్టవచ్చు. జొన్న దులిపేనాటికి ఆమె భర్త వచ్చేస్తాడు. లేకుంటే చుట్టాలని సహాయం అడుగుతుంది. నాల్గు డెబ్బీస్ (పెట్రోలు డబ్బాలు) ఒక కుండనిండ జొన్న వస్తుందని హాబిబ నమ్మకం. అది ఓ సంవత్సరానికి తనకి చాలని ఆమెఊహ. కాని విలియమ్ మటుకు యీ ఆశాభావాలకి పునాది తక్కువ అనీ, ఇద్దరు అక్కగార్ల యింటినుంచీ సహాయం కావలసేవుంటుందనీ అన్నాడు. కాని పల్లెకు సరిపడ బీరు రెండు గంపల ధాన్యంతో తయారుచేస్తానని అంది హాబీబా. బీరు వండటంలో యీమె నేర్పు యిప్పడిప్పుడే ఫలవంతం అవుతున్నది.

ఒక వుదయాన్న వంశవృక్షాలూ, చరిత్రలూ తయారుచేసే నా పని హాబాబీ యింటి సమీపానికి తీసుకువెళ్ళింది. నన్నుజూడగానే వచ్చి యిప్పుడే తయారవుతున్న బీరు రుచిచూడమని ఆహ్వానించింది హాబిబా. పరిశుభ్రంగావున్న ఆమె చిన్న యింటిలోకి నేనిదే తొలిసారి వెళ్ళడం, ఉన్న మూడు గదులలోను ఒకటిన్నరగదులు బీరువంటకానికని కేటాయించింది. మడత కుర్చీమీద కూర్చోపెట్టి యింట్లో వండుతున్న బీరుతో పరిచయంచేసింది. వైనులాగ లేకపోయినా ఆ బీరు ఘాటుగా తోచింది నాకు. ఇది కాదసలు గమనింపవలసినది. తను చేసిన పని కెంతో గర్వించింది హాబిబా. నా శక్తివంచనలేకుండ పొగడగలిగాను నేను. ఆమె యిల్లు ఎంతో శుభ్రంగా చాపలు పరిచివుంది. చిన్ని అద్దం, పత్రికలలోని రంగుబొమ్మలు అలంకరణలుగా వున్నాయి.

ఈ వంటకల్లు తాగడానికి బాగుంటుందన్న సమయంలో పెద్ద విందొకటి ఏర్పాటుచేశారు. ఆ రోజు రాగానే యింకా మధ్యాహ్నంగానే వినోద కార్యక్రమాలు ప్రారంభం అయాయి. నా తొలి అనుభవం నిరాశే. చాలామంది యూరోపియను పద్ధతిన వస్త్రులు ధరించివచ్చారు. సాంస్కృ

తికదృష్ట్యా యిది క్షమింపరానిదిగా తోచింది నాకు. యూరోపియను పద్ధతి వస్త్రధారణ పాతకాలపుదనీ, వీలునుపట్టి మారేది కాదనీ, సుఖవంతమైనది కాదనీ అందరూ అప్పుడప్పుడు చెప్పుకుంటారు. తొలి రోజుల పెట్టుబడి దారీవర్గం రాణించిన కాలంలో పారిశ్రామిక విప్లవపు రోజులలో యివి చెల్లినట్టు యిక చెల్లవు. అక్కడ యూరపులోనే పని లేదు. అలాంటిది ఆఫ్రికాలో అనవసరంకూడ. సంప్రదాయసిద్ధమైన పల్లెలో యీ పాతకాలపు యూరోపియను డ్రస్సులో ఓ డజనుమంది ఆఫ్రికనులు వ్యంగ్య చిత్రాల లాగ గోచరిస్తారు. నేసిన యింటికప్పులకీ తొమ్మిదివేల అడుగుల ఎత్తు అయిన పర్వత శిఖరాలకీ ముందు వారు వికృతంగావుండరా? ఆడపిల్లలు సహజంగానే నాజూకుగా అందంగావుంటారు. ఆ కట్టుకొనే నల్ల కనికీ బట్టలోనే. యూరోపియనులు 'నగ్నతను' భరించలేరు కనుక యిప్పట్లో యీ బట్టని వక్షోజాలకుపైగా కట్టుకుంటున్నారు. పాతగుడ్డల బజారులో కొనుక్కొని గౌనులు తొడుక్కొనివచ్చారు యీ విందుకు మటుకు. హబిబ మటుకు యింకోలా ఎలాగ డ్రెస్ చేసుకుంటుంది? ఇదంతా ముసుగు నృత్యంలాగా వుంది. కాని చుట్టూవున్న అందమైన సీనరీ ముందు యిది బొత్తిగా వ్యంగ్యంగా వుంది. ఆడవారూ మగవారూ కూడ.

విందులో పూర్తిగా పాల్గొనేలోపుగనే నన్ను వ-జీకి ముసుమి మవెన్య మవ ఆధిక్యంకింద తీసుకువెళ్లారు. చక్కని అరబు కంజూ ధరించాడాయన. ఆఫ్రికను ప్రకృతిలో ఇదీ ఎబ్బెట్టుగానే వుంది. ఇస్త్రీ పాంటూ డిన్నరు జాకెట్టులాగ. కాని యీ ముసలి వ్యక్తి నిండైన విగ్రహానికి ఎంతో నిండుతనాన్ని యిచ్చింది.

ఎంతో ఊరేగింపుతో హబిబా యింటికి నన్ను తీసుకువెళ్లారు. ఆ యిల్లంతా విందుకని తీర్చిదిద్దారు. చిన్న కప్పులోంచి యీ కొత్త సారా నేను తాగవలసివుంది. నిషా ద్రావకాల కలవాటులేని నాకు దాని మంచి చెడు లేమంత తెలియలేదు కాని చాలా బాగుందనిమటుకు చెప్పాను.

సూర్యుడు బాగా పైకి లేచాడు. వేడి ఎక్కువగానే వుంది కాని చెట్ల నీడలలో చల్లగా వుంది. తొలి నగోమ లయ ప్రారంభం అయింది.

నగొామ లయను గురించి నేను చాలా విన్నాను. మిస్టర్ లుబంబుల-కంపలా మ్యూజియమ్ అధిపతి చేసినది నాకెంతో అద్భుతంగా తోచింది. మిగిలినవి ఏవీ దానితో పోల్చతగ్గవిగా తోచలేదు. కొన్ని చాలా తక్కువ రకానివిగా కూడ తోచాయి. బుష్ స్కూళ్ళలో కుర్రాళ్ళకి మార్చింగు నేర్పి, ప్రార్థన పాటలు పాడిస్తూంటే కాళీ మోబిల్ ఆయిలు డబ్బాలమీద కర్రముక్కలతోటీ, ఇనుప కడ్డీలతోటీ వాయిస్తుంటారు. అసలు తయారుచేసిన మద్దెల కర్రలో, మునివేళ్ళో వుపయోగిస్తారు. ప్రత్యేకంగా తయారుచేయబడిన కర్ర నగొామలమీద. కిపరీబిటు నగొామ ఆర్కెస్ట్రా మరీ బాగులేదనికాదు. వాటిలో ఒక డోలు చూశాను. అది మధ్య అస్సాములోని కాసీ, గారో కొండల ప్రాంతంలో ఉపయోగించే ఒక డోలును పోలివుంది. దాన్ని అక్కడ బిగ్నగమ్ వారు ఉపయోగిస్తారు. హూసేని యిక్కడ సంగీత విద్వాంసుడుగా చెలామణీ అవుతున్నాడు. నేను అనుకున్నదానికంటె యీ లయగోష్ఠి తక్కువగానే సాగింది. ప్రతి డాన్సూ స్త్రీ పురుషులు వృత్తాకారంలో తిరగడంతో ముగుస్తూంది. వీరి వెంట పొడుగాటి ఆబట్టలమూలంగా తడబడుతూ, పిల్లలుకూడ చిన్ని బొమ్మల్లాగ సాగివస్తున్నారు. హబిబ ఒకొక్కప్పుడు నిజమైన అడుగులు వేస్తూ సాగింది కాని, ఆ బిగువాటి జాకెట్టు, అద్దకపు స్కర్టు అడ్డుతగులుతూ వుండేవి. ఈ అద్దకపు కంగా ఇంగ్లాండునుంచి కాకుంటే ఇండియానుంచో జపానునుంచో వచ్చివుంటుంది. సూర్యుని వేడి ఎక్కువ అవుతున్న కొద్దీ బీరు తాగడం ఎక్కువ అయి నృత్యం వెనుకకు నెట్టబడింది. మకొాండె పీఠభూమిలోని మకొాంజవనోలో యిటువంటి నగొామ నృత్యం ఒకటి చూశాను. ఓ ఐదు గంటలసేపు నాట్యం చేసి, చూసి రెండు గంటలవేళ పడుకొందుకు వెళ్ళాను. ఆరు గంటలవేళ లేచి నాట్యం ముగింపు చూద్దామని వెళ్ళాను. అప్పటికీ యింకా శక్తివంతంగా నాట్యం సాగుతూనే వుంది. కాని యిక్కడ తేడాగా వుంది. సాయంత్రపు చల్లగాలి సమయానికే నాట్యం ఉధృతం తగ్గింది. రాత్రి తొమ్మిది అయేసరికే అందరూ విశ్రాంతికి వెళ్ళిపోయారు. ఇక్కడ ఉలుగురు నగొామ పద్ధతి యింతేనా అని అడిగినమీదట పూర్వంలో

యిలా వుండేది కాదట. "అప్పుడంటే మేం అందరం- వ-ఉలుగురు అందరూ నాట్యం చేసేవాళ్ళం.''

''మరి యిప్పుడో ?"

"ఇప్పట్లో ముస్లిములు మాత్రమే చేస్తున్నారు. కేతలిక్కులు నాట్యం చేయరు."

ఇక్కడ నగొామ నృత్యం జరగడానికి క్రితంరోజు నా స్నేహితు డొకడు-మకొాంజవనోలో అన్న మాట జ్ఞాపకంవచ్చింది. రాత్రి రాసు కున్న నోట్సును సరిచేసుకుంటున్నాను. పెద్దవాళ్ళ ముందు చిన్నపిల్లలు చేసిన నృత్యాన్ని గురించి, మిగిలిన అడుగులను గురించి వివరాలు తెలుసు కుంటున్నాను. నెమ్మదిగా నవ్వుతూ అత నిలా సమాధానం చెప్పాడు: "నిజానికి దీన్ని గురించి మీకంటె నాకు తక్కువ తెలుసు. నిన్నటి రోజు వరకు ఎప్పుడూ నేను నగొామ నృత్యం చూడలేదు. నేను క్రైస్తవుణ్ణి. మా తండ్రి పార్సన్‌గా పని చేశాడు. మీతోకూడ వచ్చివుండకపోతే నేను యీ నృత్యం చూసేవుండను.''

ఇంకాఇంకా వంశవృక్షాలు, జాతి పుట్టుపూర్వోత్తరాలు, కుటుంబ గాధలు, కధలు రోజుకిరోజు నా నీలిరంగు నోటుపుస్తకాలలోనికి ఎక్కు తున్నాయి. రానురాను నా మనస్సులో స్థానిక రంగుల చక్కని చిత్రాలు ఏర్పడి నాచుట్టూ వస్తువులు, విషయాలు ఒక రూపాన్ని దిద్దుకొంటున్నం దుకు ఎంతో సంతోషంగా వుండేది నాకు. ఉదయంనుండి మధ్యాహ్నం వరకు అందరినీ కలుసుకోవడం పని పూర్తిచేసుకొని నేను విలియమ్ కొాస్త సరదాగా తిరిగివచ్చేవాళ్ళం. ములుగలుగ దంపతులను చూసి కాస్సేపు కూర్చుని కబుర్లు చెప్పేవాళ్ళం. స్థానికమైన సారా సీసా నొక దాన్ని అతి చాకచక్యంతో సంపాదించాను. తరువాత ఎండిన పొగాకు కాడలు కొన్నాను. ఇతర నేర్పరులు మిగిలిన సరుకులు కలిపి నూరేవారు, నేను మాట్లాడ్డానికి వెళ్ళినచోట్ల యీ పొడి కొంచెం యిచ్చి, తరువాత కబుర్లకి దిగేవాణ్ణి. ఆరోజు పని అయి తిరిగిపోయేటప్పుడు మిగిలిన దాన్నంతా యీ ముసలి దంపతులకిచ్చి యింటికి వచ్చేసేవాణ్ణి.

ఈ సాయంత్రపు కబుర్లలో ఎన్నో విషయాలు దొర్లేవి. ములుగలుగ, అతని భార్య ముస్టిలకోగ ఎంతో జాగ్రత్తగా ఒక షిల్లింగు దాచుకున్నారు. వారి బట్టలు, గంపలు, కుండలు, గొడ్డళ్ళు, తొగోళ్ళూ కాక యిదే వారి గొప్ప ఆస్తి. ఏదైనా అత్యవసర పరిస్థితిలో యిది పనికివస్తుంది. దాన్ని కాస్తా పొడుము కొనడానికి ఉపయోగించరు. అందుకే నా చిన్ని కానుక ఆ ముసలి జీవితాలకి 'జలసా'గా తోచేది.

నేను రోజులన్నీ కిపర్‌బిటులోనే గడిపేయలేదు. విలియమ్‌తో సహా అతని పల్లె చూడ్డానికి వెళ్ళాను. మిషను స్టేషనులో అతను మేష్టరుగా పనిచేస్తూండేవాడు, తరువాత నావంటవాడు రషీదా తన కుటుంబాన్ని చూసివద్దామని తెగ అడుగుతూండేవాడు.

ఒకనాటి రాత్రి నా గదినంతా పెద్దపెద్ద నల్లచీమలు ఆక్రమించుకున్నాయి. రషీదా, అతని అవబోయే బావగారూ కలసి ఆకులతో కాగడాలు కట్టి చీమలమీదకి వచ్చారు. ఎందరు కలిసి ఏంచేసినా చీమలు తగ్గలేదు. ఆఖరుకు ఆస్పత్రికి పంపి, చీమలకి ఒక విరుగుడు ద్రావకాన్ని తెచ్చారు. అదే గెలిచింది. ఇదంతా జరిగేసరికి రాత్రి రెండు దాటింది. ఆ మసిలో, తెల్లని ద్రావకపు మధ్యన నాకు విశ్రాంతి చిక్కింది. తలుపులన్నీ తెరచుకొని, శుభ్రమైన గాలిని లోనికి రానిచ్చి నిద్రపోయాను.

నా సుఖంకోసం ఎంతో శ్రమపడి చీమలమీద యుద్ధానికి పూనుకున్న రషీదా సహృదయం నా కర్థం అయింది. అతని ఫోటోలు తీయకపోయినా, అతని కాబోయే భార్యదీ, ఆమె చిన్ని చెల్లెలుదీ కూడ తీయకపోయినా, అతని తండ్రి పల్లెను దర్శించి రావాలని నిశ్చయించుకున్నాను. నిజానికి పనిమానుకుని అక్కడికి వెళ్ళవలసిన అవసరం లేదు నాకు. అది సరదాకోసమే; రషీదాకి నాపైగల అభిమానానికి నా కృతజ్ఞత తెలపడంకోసమే. ఇప్పుడు-అక్కడ ఉలుగురులో గడపిన రోజులు తలుచుకుంటే, ఆ ఒక్కరోజే ఎంతో సంతోషదాయకమైనదిగా, అన్ని వారాల నా వునికిలోకీ, అదొక్కటే నిజమైన ఆఫ్రికను రోజులాగ ప్రత్యేకత వహించి నిలుస్తుంది.

తెల్లవారుఝామున మేం కిపర్‌బిటునుండి బయలుదేరేసరికి ఎవరూ యింకా యిళ్ళలోనుంచి రాలేదు. సంప్రదాయకమైన చిన్నగుడి ఛమ్లుంగు, పల్లెకి అవతలి పక్కగా నిలచివుంది ప్రశాంతంగా. చిన్న యిల్లు. గుండ్రంగ వుంది. భగవంతునిపైగల భక్తితో యిచ్చే ధాన్యం బహుమతులు మొదలైనవి యీ యింటిలో వుంచుతూవుంటారు. సువిశాలంగా పరచుకొని వున్న పీడలక్రిందనుంచి చివరికి ఏనుగగడ్డి ఆవరించుకొనివున్న ప్రదేశంలో ఎక్కడో దాగివుండిన యిల్లు వచ్చేదాక, మాచుట్టూ కదలాడే కొండలూ, చెట్లూ తప్పించి యితర ప్రాణి కానరాలేదు మా కంటికి. రషీదా అక్క రోడ్డువార ఓ చిన్ని కొట్టు పెట్టుకొని అగ్గిపుల్లలు, సిగరెట్లు, అరటిపళ్ళు అమ్ముతుంది. ఈ అక్కా, ఆమె భర్తా మమ్మల్ని పల్కరించారు. చుట్టూవున్న సీనరీకూడ చాలా అందంగావుంది. గుబురు మొక్కలలో వూదారంగు పువ్వులు పూశాయి. దారిపొడుగునా లోయదాకా యివే గుబుర్లు. దాని కావలిదిశనే వుంది అతని తల్లితండ్రుల యిల్లు. ఆ ఉదయపు ఎండలో చాపమీద పడుకున్న తన ముసలి తండ్రిని పరిచయం చేస్తూంటే రషీదా కళ్ళు మెరిశాయి. ఆ ముదుసలి కళ్ళుకూడ అలాంటి మెరుపునే చూపాయి. కాని అది అస్తమిస్తున్న తారక వెల్గులాగ తెలుస్తూనే వున్నాయి. ఆపరేషను జరిగాక చెలరేగిన బాధలనుగురించి ఆతడు ఏమీ అనుకోవడమే లేదు. తరువాత ఒక కంగా బుజంమీద కప్పుకొని రషీదా తల్లి వచ్చింది. ఏవో కుశలప్రశ్నల అనంతరం జొన్న, కోడిగుడ్లు, కూరలతో నాకు భోజనం పెట్టారు. సూర్యుడు కొంచెం క్రిందికి దిగాక యింటిముంగిట కాళీ స్థలంలోకి ఎండ వచ్చింది. అప్పుడే నేను కొన్ని ఫొటోలు తీశాను.

తన కొడుకు పని నచ్చిందా అని అడిగాడు రషీదా తండ్రి. మరొ గారొలో తను చేయించుకున్న ఆపరేషను గురించి కొంచెం వివరాలు చెప్పాడు. "ముసలి శరీరానికి యౌవనం ఎలావస్తుంది? డి.ఓ.తో మాట్లాడి నాకొడుక్కి ఆఫీసు బోయిపనివచ్చేలా చూడగలరా?" క్రిష్టియను కాకపోయినా తన కొడుకు రాయడం చదవడం నేర్చుకున్నాడని చెప్పాడు. బవనషవారికి సిఫార్సు చేస్తారా? నిజానికి యీ పదానికి అర్థం—మిస్టర్

సంభాషణ అని; కాని జిల్లా అధికారికి వుపయోగిస్తా రా పదాన్ని. ఇతని పని ఏదైనా సమస్య పరిష్కరింపవలసివచ్చినప్పుడు వ్యక్తిగతంగా చర్చించి పరిష్కరించాలి. ఆంధోనీమూర్ సీరియస్ స్వభావం జ్ఞాపకంవచ్చి యీ విషయంలో ఏమీ నిశ్చయంగా చెప్పలేదు నేను. ఏదో ఒకటి చూస్తానని మటుకు అన్నాను.

మా తిరుగు ప్రయాణంలో నురుగులు కక్కుతున్న జలపాతాల్లో స్నానంచేశాం. మాకు కుడిపక్కగా ఎండవేడికి ఉలుగురు శిఖరాలు బూడిద వర్ణంలో కన్పిస్తున్నాయి. కిపర్‌బిటులోకి రాగానే ఎండలో క్షూర్చుని ముసుమి కన్పించాడు. నేనింకా ములుగలుగ యింటివివరాల సేకరణ పూర్తిచేయలేదని చిన్నగా నవ్వాడు.

"ఉదయాన్న వెడుతూ మీరు ఆగలేదు"-నా రాకపోకలనేకాకుండ, నేను రాకపోవడాన్ని గుర్తించినందుకు నేను గర్వపడ్డాను.

"మీరు మాతో ఎన్నో రాత్రులు గడిపారు. ఎన్నో రాత్రులు మివిటు క్రింద నిద్రించారు."

ఇదే పూర్వపు వర్షబ్రహ్మలు అక్కడ పాతబడ్డారా అని అడగ డానికి సరైన టైం అని తలపోశాను. కళ్ళు విప్పిచూశాడు ముసుమి. చుట్టూ కలయచూసి చిరునవ్వు నవ్వాడు. ఓ క్షణం తరువాత అన్నాడు. "ముసలివాళ్ళని కప్పిపెట్టారు. నిజమే."

అలవాటైపోయిన దారివెంట మివిటు వెడుతూ, ఆఖరు వెల్గులు నాయింటిముందున్న చెట్లకొమ్మలతో ఆడుకోవడం చూశాను. అన్నీ ఆకాశంవైపే చూపుతున్నాయి. అక్కడికి దూరంలో దొలిచినట్లున్న శిఖరాగ్రాలలాగే .......... "ఇంటి జాబితా" అంటే నా ఫీల్డు పనిలో- పనిముట్ల లెక్క, ఆయుధాలు, దుస్తులు, పాత్రలు : అద్దము క్షవరపు పెట్టూ యివన్నీ కలిపి కదిలెడి ఆస్తిగా గుర్తించబడుతుంది. ఇవి గుర్తించే టప్పుడే ఉజ్జాయింపుగా యీ వస్తువులు కొనడానికి డబ్బుగానో, ధాన్యం గానో, లేకుంటే కూలి రూపంగానో ఎంత యిచ్చారన్నదికూడ లెక్కలోకి తీసుకోడం జరుగుతుంది. ఆయా వస్తువుల సేకరణను గురించిన చరిత్ర కూడ తెలుసుకుందుకు ప్రయత్నిస్తాను, ఆ చరిత్ర ఒకొక్కప్పు డీ వస్తువు

లెందుకు కొనవలసివచ్చిందన్న విషయాన్ని విశదం చేస్తాయి. ఉదాహరణకి, విదేశీ దుస్తులు తీసుకుంటే, ఒకొక్కప్పుడు ఎక్కువ ఖరీదులు తెస్తాయి. ఉన్ని బొచ్చు దుప్పట్లు చలికాలంలో పనికివచ్చేవి, ప్రస్తుతంలో అనవసరంగా తోస్తాయి .. అవి వున్నవి లేనిది ఎవరూ పైవాళ్ళు గుర్తించరు. అందువల్ల పోయే గౌరవం కనుపించదు. దాన్నీ, యితర విషయాలనీ తెలుసుకుందుకు ఎంతో సంభాషణ సాగాలి. గౌరవనీయుడూ, అనుభవశాలీ అయిన మజి కనుక వుంటే యీ సంభాషణలెంతో చమత్కారంగాకూడ వుంటాయి. చివరికి ఒకరోజున XII నంబరుయిల్లు జాబితా రాయాలని ముసుమికూడ ములుగలుగ యింటికి వస్తాడని ఆశించాను. అప్పుడే దాచుకున్న ఒక్క షిల్లింగ్‌కి జతగా యింకేమైనా విలువైనది వుందని చెప్తాడని. ముసుమి తన యింటిముందు ఎవరో విదేశీయులతో (వ-జెనీ) కూర్చునివున్నాడు. ఆ కొత్తవాళ్ళందరు నల్లని యూరోపియను జాకెట్లు, వెడల్పాటి అంచులుకల టోపీలు ధరించివున్నారు. ముసుమి తన కంజు తొడుక్కొని దానిమీద డిన్నరు జాకెట్టు తొడుక్కొని కూర్చున్నాడు. అతని కళ్ళలో ఆందోళన గుర్తించడం యిదే తొలిసారి. ఆదారిన వెడుతుంటే నాకేసి తిరిగేనా చూడలేదు. వారి సంభాషణలో అంతమునిగి తేలుతున్నాడు.

పల్లెకి ఉత్తరాన్ని యింకా చాలామంది వున్నారు వీళ్ళు. హబిబ యింటి ప్రాంతంలో చెట్లక్రింద కాంప్‌వేశారు. మంటలు పెట్టుకొని, తృప్తిగా భోజనానికి సిద్ధం అవుతున్నారు. యూరోపియను దుస్తులతో చాలామంది వయస్సులోవున్న స్త్రీలు కన్పించారు. పిల్లలకి పాలివ్వడానికి వీలుగా గౌనులు లో పక్క వదులుచేసుకొనివున్నారు. అందరూ ఓ ముసలామె దగ్గిరలో కూర్చున్నారు. ఆ టోపీలు, దుస్తులు ఆఫీసర్ల రీవిని చూపుతున్నా కండలు తిరిగిన శరీరాలమీద ఆ బిగువుపాటి దుస్తులు అసభ్యంగా తోస్తున్నాయి. ఆఫ్రికనుల అంగసౌష్ఠవం బాగుంటుంది. కొంచెం మెడ లావు, ముఖం గుండ్రన, వీటిని మిగిలిన శరీరపు శక్తివంతమైన పొందిక కనుమరుగు చేస్తుంది. ఛాతీమీద బట్టలేకుండ హాయిగా వుంటే వున్నట్లు ఆ లావాటి మెడక్రింద బిగువైన కాలరు ఏమీ బాగుండదు.

ఆ గుంపులోనుంచి ఒక పొడుగాటి వ్యక్తి లేచి నన్ను ఆహ్వానించాడు: ఇక్కడి వాళ్ళంతా వ-గంగా-వైద్యులు అని చెప్పాడు. పల్లెవాసుల పిలుపుమీద వచ్చాం అని చెప్పాడు.

"ఎందరో మనుష్యులు చచ్చిపోయారు. ఇంకా ఎన్నో అవరోధాలున్నాయి. దీనికంతా కారణం చెడుశక్తులు" అన్నాడు. నా అనువాదకుడు చెప్పాడు-వీరు సేకరిస్తూన్న ధనం మొరగొరాలోని బవనషొరికి యిస్తారని.

పల్లె మొత్తంమీద ఉత్సాహం, ఉద్రేకం నిండిపోయాయి. ఎవరూ ఇంటి జాబితాను గురించి ఆరోజు అనుకోలేదు. యీ వ-గంగ రాకను గురించి అందరూ తలో విధంగానూ చెప్పుకుంటున్నారు. దరిదాపు ఇరవై మందిదాకా వున్న యీ గుంపు రుపుజి లోయనుండి వచ్చామని, అందులోని లావుపాటి వ్యక్తి గువుమలి మురుఫిజి, తాము వ-హెహె తెగవారమనీ, అందుచేత దక్షిణాదినుంచి వచ్చిన కొన్ని ఉగురు తెగలవారికి చుట్టాలమే అనీ చెప్పాడు. యీ కొత్తవారు ఉసంబె (మందు) ఎలాగ యిస్తారో వివరించాడు. రుచీ వాసనా లేని తెల్లని పొడియిచ్చి, దాల్లో కొంత మింగమనీ, మిగిలినది రోగి తలమీద పెట్టమనీ చెప్తారు. యీ మందు పుచ్చుకున్న వ్యక్తి దగ్గిర రహస్యమైన శక్తి ఏదైనా వుంటే మైకం వచ్చినట్లయి నిజం చెప్పడమూ, ఆ శక్తి ఎక్కడ దాచివుంచారో ఆ స్థలంకూడా చెప్పడమూ జరుగుతుందట. అప్పుడు యీ వ-గంగ ఆ శక్తిని తీసుకొని కాల్చేసి, యీ మైకం పోడానికి రోగికి యింకోమందు యిస్తారు. ఇంకోసారి యిలాంటి దుష్టశక్తిని దేన్నీ యింటిలోనికి రానీయకూడదనీ, అలాచేస్తే చచ్చిపోతావనీ యీ వ-గంగకు అర్థమయేలా చెప్పివెడతారు.

ఈ రెండు మందుల వెలా ఒక షిల్లింగు, లేదా ఒక బస్తా ధాన్యం కాని, ఒక కోడిగాని అని నిర్ణయించారు. రోగి ఎలాగైనా యివ్వవచ్చు. పల్లెవాసులు డబ్బు చెల్లించకపోతే దుష్టశక్తు లున్నాయని అంటారనీ, అలా యిచ్చిన డబ్బు మొరగొరోలోని ధనాగారానికి వెడుతుందనీ నమ్మారు. యీ చివరి రెండూ మటుకు నేను నమ్మలేక పోయాను. రకరకాల కథలు

యీ కొద్ది రోజులలోనూ అల్లుకుపోయాయి. ఒక రోజు అనుకోకుండానే XII నంబరు యింటిలో లెక్క చూడ్డానికని వెళ్లాను. ఇదివర కంత సులభంగా జరగలేదు. రోమను కేతలిక్కు మతస్థుడైన విలియము ఆ మందు పుచ్చుకోలేదు. తన శిలువా మెడల్సూ యివ్వడానికీ ఒప్పుకో లేదు. డచ్చి ఫాదరీలు తమని రక్షిస్తారనీ, ప్రభుత్వం తమ నేమీ చేయ లేదనీ అందరు స్కూలు టీచర్లూ అన్నారు. ఎవరూ డబ్బు యివ్వలేదు. అబ్దుల్లా కుంగ్వ-మతర్షి-హెగ చిన్న అధికారి విలియమ్ చుట్టం కావడంతో నాకూ చుట్టంగానే తోచాడు. మైదాన ప్రాంతంలో ఎవరూ డబ్బు కట్ట లేదనీ, అయినా ఎవర్నీ దుష్టశక్తులని నిందించలేదనీ, అంచేత డబ్బు యివ్వవద్దనీ ప్రోత్సహించాడు.

ఒక మధ్యాహ్నం విలియమ్‌తో కలిసి కిపర్‌బిటు చివరిగావున్న ఒక యువతిని చూడ్డానికి వెళ్లాం. ఈమెకు ఐదుగురు భర్తలని విన్నాము. భారత పురాణాల్లో ద్రౌపదిలాగా తూర్పాఫ్రికను కుటుంబ జీవితంలో యీమె ఒక వింతే. అందుకే యీమెతో మాట్లాడాలని నిర్ణయించు కున్నాము. మేం అక్కడికి వెళ్లేసరికి గుమ్మంలో యిద్దరు యువకులు పని చేస్తున్నారు. ఒకతను కర్రపిడి చెక్కుతున్నాడు. వీ రిద్దరినుండీ ఏం సమాధానాలూ రాబట్టలేక పోయాం. వీరు ఆ యింటి యిల్లాలి అన్న దమ్ములో, లేక ద్రౌపది విషయంలోలాగా స్వంత అన్నదమ్ములో తేల్చుకో లేక పోయాం.

తరువాత ఆమె యివతలకి వచ్చింది. వ-గంగవారు తన దగ్గరకీ వచ్చారనీ, తననుండి సతాన్‌ని తోలివేయగల మన్నారనీ చెప్పింది. పదిహేను షిల్లింగులు అవుతుందన్నారు. అయితే ఆ పదిహేను షిల్లింగులు ఆమెదగ్గిర లేకపోయాయి. అంతేకాదు. తన దగ్గిర సైతాన్ వుందన్న నమ్మకంకూడా ఆమెకు లేదంది.

మేం తిరిగి వస్తూంటే యిద్దరు వ - గంగలను కలుసుకున్నాం. ఎక్కడికి ప్రయాణం అని యాధాలాపంగానే అడిగాం.

"మాదగ్గిర యింకో-మందు కొంచెం చవుకది, పది షిల్లింగులకే వచ్చేది-వుంది. పుచ్చుకుంటుందేమోనని వస్తున్నాం. అయినా తీసుకో మని ఎవరినీ బలవంత పెట్టడంలేదు మేము.''

ఆ మరుచటిదినం అందరు వ - గంగలూ అదృశ్యమై పోయారు. కిపర్‌బిటు అలసినట్టు అయిపోయింది. ముసుమ యింకా ఆందోళన పడుతున్నట్టే వున్నాడు. ఆరోజుకూడ నాతో రావడాని కంత సుముఖుడుగా కనపడలేదు. అయినా నేనే వెళ్లి ములుగలుగ యింటిలోని వస్తువుల జాబితా తయారు చేద్దామని నిర్ణయించుకున్నాను. ఎక్కువగా ఏం పనిలేదు. మకొండె పీఠభూమిలోని నా పరిశీలనలపై ప్రభుత్వానికి రిపోర్టు పంపాలి. అంతేకాకుండా యీ వ - గంగలను గురించి, వీరికీ 'బొమ'కూ గల సంబంధంగురించి వున్న అనుమానాలను గురించీ ఆంథొనీ మూర్‌కి తెలియచేయాలి. ఆంథొనీమూర్ సెలవుకూడా అయిపోవచ్చింది. ఎక్కడికక్కడ నేను సిద్ధంగా వుండాలి. ఏక్షణాన్నైనా నాకు ప్రయాణానికి అన్నీ సిద్ధంగా వున్నాయన్న కబురు రావొచ్చు.

సరాసరి వారందరికంటే యీ ముసమ ములుగలుగ దంపతులు బీదగావున్నారు. వారి ఆస్తి అంతా కలిసి రెండు జింబె, ఒకొక్కటి మూడు షిల్లింగులుచేసే తొగోలలు, రెండు షిల్లింగులుచేసే ముండుకత్తి, కర్ర తిరగలి, మూడు మంచాలు, ఐదు వెదురు జల్లెళ్ళు, రెండు రోకళ్ళూ, మూడు కుండలు, మూడు తగరపు కుండలు వున్నాయి. అన్నీకూడ స్నేహితులు, చుట్టాలు బహూకరించినవే. అన్నిటికీ చరిత్ర వుంది. అన్నిటి విలువా కలిపి మహావుంటే ఇరవై అయిదు షిల్లింగులు వుంటుంది. విలువచేసే బట్టలలో ములుగలుగ ఆరబు కంజు; ఇతని దుస్తులే నలభై అయిదు నుంచి ఏభయి షిల్లింగులదాకా వుంటుందని అంచనా వేశారు. అతని భార్య సాధారణంగా నల్ల కినికిస్ ధరిస్తుంది. ఓ రంగుల పైగుడ్డ 1955 లో మటంబాలోని మిషను షాపులో కొన్నది వుంది. ఐదు షిల్లింగులది. పూసలదండలు ఏభై సెంట్లు. అంతా కలసి ఇరవై ఒకటిన్నర షిల్లింగులకి మించదు. (మూడు షిల్లింగులు = రెండు రూపాయలు, ఒక షిల్లింగు = నూరు సెంట్లు).

జాబితా అంతా రాసి పరచిచూశాక ఆ "షిల్లింగు" జ్ఞాపకంవచ్చింది. అదెక్కడ పెట్టావని అడిగాను.

ములుగలుగ ముడుచుకుపోయిన ముఖంలో విషాద ఛాయలు అలముకున్నాయి. ఆ మందు పుచ్చుకున్నాడు, తన భార్యతో సహా. ఇదెలా సంభవించిందని ఆశ్చర్యపడ్డాను. ఇంకో షిల్లింగుకూడ మరి యివ్వలేదా? సహృదయతతో చిరునవ్వు నవ్వుతూ యిలా అన్నాడు: "నాకు తెలియకుండ రహస్యంగా అదో షిల్లింగు దాచింది. ఎప్పుదేనా ఒక షిల్లింగు పొడికోసం అని వాడుకోవచ్చు అని చెప్తూవుండేవాడిని. కాని ఇచ్చేది కాదు. నాది దాచుకున్నంత కాలం యిచ్చిందికాదు. ఇప్పుడో- రెండూ కలిసి ఆ వ-గంగలకి వెళ్ళిపోయాయి" అన్నాడు.

ఆ క్షణంలో నేను పొడుం నింపిన కాళీ బీరు సీసా జ్ఞాపకానికి వచ్చింది; వూళ్ళోకి యీ వ-గంగలు రాని క్రితంరోజే దాన్ని నింపాను. దాని సంగతే మరిచిపోయాను.

తరువాత ప్రతీదీ శీఘ్రంగా జరిగిపోయింది. నేను తిరిగి యింటికి వెళ్ళేసరికి మైదానంనుంచి మతర్షివచ్చి మొరొగరోకు సోమవారంనాటికి ప్రయాణ సదుపాయం చిక్కిందని చెప్పి వెళ్ళాడు.

ఆ రోజు శుక్రవారం. ఓ నిముషంకూడ దండుగ చేయడానికి లే దిక. మరుచటినాటి ఉదయమే కారువచ్చి నన్ను స్నేహితుల పొలాల దగ్గిరకు తీసుకుపోతుంది. నా సామానంతాకట్టి రెడీగావుండాలి. పెట్లలోనూ సంచీలలోనూ కుక్కి కాగితాలూ అవీ సద్దేశాము. కారుకోసం వేచివున్నాం. అప్పుడు జ్ఞాపకానికి వచ్చింది-పొడుంతో నింపిన బీరు సీసా. పల్లెకి ఆ కొసకి వెళ్ళి రాడానికి విలియమ్‌కికాని, రషీదీకికాని వ్యవధిలేదు. నాకు జానపదకథలలో కల సరదాను తెలిసినవాళ్ళు పొడుపుడు కథలు వేస్తూ సమాధానాలు చెప్పడం ప్రారంభించారు. కిస్వహిలిలో వాటిని మెథలి అంటారు. ఉదాహరణకి దీన్ని చూడండి.

హుంకుతము, హుంకొతము; కాతి-కాతి, ఉచుంగు''

''తొలి తీపి, తుది తీపి. కానిమధ్యన వగరు" అంటే ఏమిటి?

సమాధానం "జువ'', అంటే సూర్యుడు: ఉదయాన, సాయంత్రం సూర్యరశ్మి హాయినిస్తుంది. కాని మధ్యాహ్నంమటుకు వేడి ఎక్కువకదా:

ఇంకోటి;

"నైమి లిమ సంభ నైమి పట మబొగ మవిలిటు''

పొలం పండించాను, రెండు గుమ్మిళ్ళు దొరికాయి"

అంటే సమాధానం: "మసివ". మక్కికి మక్కి అర్ధంచెప్పుకుంటే పాలు అని అర్థం. తల్లి పాలిళ్ళు అని కూడ అర్ధం ధ్వనిస్తుంది. ఓలి యిచ్చి భార్యను సంపాదించాను అని భావం.

రషీదీ కిఌగురులో యింకో చిక్కు కధ చెప్పాడు.

''మజుంగొ కొక కలెక లికొటె''-యూరోపియను వెళ్ళిపోయాడు. పాత కోటు విడిచివెళ్లాడు.

సమాధానం: "నయెంబ''. ఒక రకం పండు. సీతాఫలంలాగ నిండా గింజలతో కూడినది.

ఈ చిక్కు ప్రశ్నలో అర్థం ఎంతకీ తెలియలేదు. రషీదీ అతి జాగ్రత్తగా ఏమీ తెలియనివాడిలా ముఖంపెట్టాడు. నేను ఎవరూ కోరుకోని నల్ల గింజలు-పాతగుడ్డలలో దొరికే పేలేమో అనుకున్నాను. ఇవే పేరాటైఫస్ మొదలైన అంటువ్యాధులకి కారణం ఆఫ్రికాలో.

చివరి అతిధివచ్చి మా మాటలు మార్చాడు. ములుగలుగ తన కంజు వేసుకొని, నా పొడికీ, అనేకసార్లువెళ్లి వారిని చూపినందుకూ కృతజ్ఞత చెప్పడానికి వచ్చాడు. ఎంతో హుందాగా అన్న యీ మాటలలో దుర్బలత్వం గోచరించదు.

"నేనెందరో వ-జుంగులని చూశాను. అందరూ పాతవస్తువులు యిచ్చి వెడతారు. కాని వారిలో ఎవరూ తమ జీవితాలను ప్రతిరోజూ మాతో పంచుకోలేదు" అన్నాడు.

నేనిచ్చిన పొడిసీసాను ములుగలుగ యింటికి పట్టుకువెళ్ళినప్పుడు, ముప్లిలకొగ పెదవులపై వెలిగే చిరునవ్వులు వూహించుకున్నాను నేను ......

# 8. ఆఫ్రికను ప్రకృతి, ఆఫ్రికను జాతీయత

ఆఫ్రికను ఖండంలోని వివిధ ప్రాంతాల జనం భాషరీత్యా ఎన్నో భాగాలుగా వుంటూంటారు. ఇదే కాక సంప్రదాయికమైన నాగరికత, శారీరకమైన రూపభేదాలుకూడా ఎక్కువే యిక్కడ. ఉదాహరణగా నియో హేమిటిక్ తెగలను, బంటూ మాట్లాడే తెగలను చూడవచ్చు. దాని కంటెకూడా కొట్టవచ్చినట్టు కనబడేది ఆఫ్రికను ప్రకృతిలో కానవచ్చే తేడాలు-కాంగోలోయ, బురదవూబిమయం అయిన పశ్చిమ తీరం - వీటిని సహారాతో, కలహారి ఎడారులతోగాని, చల్లని మరొక్కో ఎత్తు ప్రదేశాలతో అల్జీరియా, రొడేషియా, ట్రాన్స్‌వాల్, కేప్, కెన్యాలతోగాని పోల్చి చూడండి: భౌగోళికంగా కావలసినంత విభేదం గోచరిస్తుంది.

ఇప్పుడు ఆఫ్రికాలో రాజకీయమైన సరిహద్దులు, భాష మొదలైన వాటిని దాటి వున్నాయి. ఘన, గినియాలు బ్రిటిష్, ఫ్రెంచివారికి చెందిన వలస రాజ్యాలుగా వున్నా-ఆఫ్రికను దృష్ట్యా చూసినట్టయితే చాలా సన్నిహితం అయినవిగా తోస్తాయి. కాని ఘన-బ్రిటిష్ సోమాలిలాండ్‌కి గినియా ఫ్రెంచి సోమాలీలాండ్‌కి రాజకీయంగా దగ్గరైనా స్వతహాగా చాలా దూరమే. వర్షాధారమైన అడవి ప్రదేశం అయిన కాంగో బేసిన్, ఉగాండా లోని కొన్ని భాగాలూ నిజాని కొక భౌగోళిక ఖండమే. కాని ఉగాండాలో భాగాలు రాజకీయంగా ఉగాండాలోకి వస్తాయి. ప్రస్తుతపు ఆఫ్రికను దేశాలు సహజ సాన్నిహిత్యం వల్లా యితరత్రానూ రూపందాల్చలేదు.

గత వేల సంవత్సరాలుగా వచ్చిన వలసవారి వల్లకూడా ఒక రూపం దాల్చాయి. యూరోపియనులు, ఆసియనులు-వీరేకాక సర్వదా కదలి పోతూండే ఆఫ్రికను ప్రజ - హేమైట్స్, నిలోహెమైట్స్, నిలోటిక్స్, బంటూస్, సూడనీస్, కొయిసన్, పిగ్మొయిడ్ - వీరందరూ కూడా యిలా రూపం దాల్చడానికి సహాయం చేసినవాళ్ళే.

అయినా కూడా దక్షిణ ఆసియాలోలాగే యీ ఆఫ్రికాలో కూడా భౌగోళికంగా విభిన్నత కల్గిన దేశం మొత్తంమీద ఏకత్వం ఒకటి కన బడుతుంది. ఇది యూరప్‌లో కానరాదు. పోల్చిచూస్తే ఆసియా, ఆఫ్రికాలకంటే యూరపు చాలా చిన్నది. అందుకే ఆఫ్రికను ప్రకృతిని గురించి, దీని మానవాధికమైన గుణాన్ని గురించి మాట్లాడడానికి అవ కాశం వుంది.

నా పరిశోధనను యీ మాతృహంశ తెగల నడుమ సాగిస్తూనే, స్నేహితులతోనూ, ఒంటరిగానూ కూడా ప్రయాణం చేసే అవకాశం కల్గింది నాకు తూర్పాఫ్రికా ప్రకృతితో నాకు బాగానే పరిచయం కల్గింది: ఎంతో గర్వంతో నా చిన్ననాటి కల జ్ఞాపకం వచ్చింది; తెలియని దేశాలను కనిపెట్టాలని; జంతుశాస్త్రంలో ప్రావీణ్యం సంపాదించాలని.

ఒకసారి నేను ఏకాంతంగా వున్న ఒక అడవి ప్రదేశం చివరనుంచి నడిచి వెడుతున్నాను. అక్కడ ఒక్క వ్యక్తికి తగిన ఒక డేరా చూడడం సంభవించింది-అదే "గుబురు". యూరోపియనులు చెట్లు కప్పబడివున్న ప్రదేశాన్నంతా "గుబురు" అనే అంటారు ఆఫ్రికాలో - అదేదో నిజమైన అడవి కాదన్నట్టు, నాకుమటుకు యిదీ అడవిలాగే తోచింది. ఇండి యాలోలాంటి అడవేయిది. కాని ఇండియాలో యిలాంటి డేరా ఎక్కడా చూడలేదు నేను. స్నాన సదుపాయం లేనిది, లోపల లైనింగైనాలేనిది. లోపలకి చూస్తే కాంప్‌బేబిళ్ళు రెండు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. వాటి నిండా నల్లని స్టీలు పెట్టెలే. పైన చిల్లులున్నాయి. రబ్బరుబూట్లు ధరిం చిన ఆఫ్రికను కుర్రాడు చెప్పాడు తన అధికారి యిప్పుడే తిరిగివస్తాడు అని. ''ఏదో పట్టుకునే'' అంటూ నవ్వుతూ అన్నాడు.

ఇది నిజమే అయింది. సన్నగావున్న ఒకాయన - చూడగానే యూరోపియన్ అని చెప్పవచ్చు-వచ్చాడు. అతని నల్లని కళ్లే నన్ను ముందుగా ఆకర్షించాయి. సన్నగానున్న పాము అతని యినుములాంటి వేళ్లసందున వేలాడుతోంది. అదికూడా తరువాత నాకంటపడింది. నన్ను చూడగానే ఓ పెట్టిమూత తెరిచి దాల్లో యీ పాముని పడేసి మూత వేసే శాడు. చేతులు దులుపుకొని చేయి ముందుకు జాచాడు స్నేహ పూర్వకంగా. అతని మాటతీరు తల్లిని, ముక్కుతీరు తండ్రిని గుర్తుతెస్తూంది. ఏదో విప్లవంవల్ల బయటపడి తరువాత విదేశాలలో నివసించిన స్థానిక పెద్ద అతనితండ్రి. టీ తాగుతూ యీ సంగతులన్నీ దరిదాపు డెబ్బయి సంవత్సరాల క్రిందట జరిగాయని చెప్పాడు. చూడగానే ఏభై ఏభైఅయిదు మించదని అంచనా వేసుకున్న యితని వయస్సు డెబ్బయిఏళ్లు. ప్రపంచంలోకెల్లా విషసర్పాలను సేకరించి అమెరికాలో పరిశోధన కేంద్రాలకీ, జూలకీ సరఫరా చేస్తున్నాడు. దక్షిణ టాంగనియకా ఇందుకు తగిన స్థలం. అమెరికాలో చక్కటి ధరలు తెస్తాయి అవి. నాకు మంచిదే-ఎందుకంటే నాకొచ్చే ధరణం ఏ మంత ఎక్కువదికాదు అని చెప్పాడు.

ఒకదాని తరవాత ఒక పెట్టె తెరుస్తూ నలుపు, ఆకుపచ్చ 'మంబా' అని పెంపుడు జంతువులను తీసినంత సులువుగా తీస్తున్నా డతను. ఇంకో పెట్టె తెరవకుండా చూపిస్తూ దానిప్రాముఖ్యం చెప్పాడు. ఇది-తనను చూసేవారి కళ్లల్లో సూటిగా విషం పిచికారీ చేస్తుందట. ఇంకా చాలా వున్నాయి. ఉదా : గబాన్-రెండు రకాల విషాలని ఒకేసారి శరీరంలోకి పంపి వైద్యసహాయం పూర్తిగా అనవసరం చేస్తుంది. ఈ పాములన్నీ సన్నగా గిలగిల్లాడుతూ లేవు. కొన్ని బలమైన మగవాని పిక్కంతలావుగా కూడ వున్నాయి. చాలా అందమైన రంగులతోవుంది వాటి చర్మంతీరు. లేత పసుపు, పసుపు, మట్టిరంగు, ఊదా, నీలం, నలుపు ..అన్ని రంగులలో వుంది. వీటిలో కొన్నిటి అలవాట్లు దారుణం అయినవి. వెతుక్కొని మనుషుల కోసం వేటాడుతాయి. ఇండియాలో వీటి సోదరులు ..తొక్కితేనో, కొట్టబోతేనో ప్రమాదకరంగా ప్రవర్తిస్తాయి. కాని నా స్నేహితుడు యీ హత్యాత్మకమైనవాటిపై మక్కువ ఎక్కువ కల్గివున్నట్టు తోచాడు.

ఆఫ్రికాలో, నేను కలుసుకొన్న యూరోపియనులలోకంతా యిలాంటి వృత్తిలో వున్నవారు బహు కొద్దిమంది. అస లిది సాధారణమైనది కానే కాదు. అయినాకూడా ఒక రకంగా యిది యీ భూమియొక్క ప్రత్యేక లక్షణంగా తోచింది నాకు. ప్రకృతి సౌందర్యారాధనతోపాటే భయానక మైన సాహసయాత్రకూడ పెనవేసుకునివుండడం. వాటిని కలుపుతూ వ్యాపారదృష్టి. ఆఫ్రికాలో యూరోపియను పరిస్థితి క్రూరమృగాల కాపలా దారు పనితో పోల్చవచ్చు. ఆఫ్రికను, యూరోపియను వేటగాళ్ల బారి నుంచి వన్యమృగాలను రక్షించడం యీ అధికారుల కెంత పనో, అలాగే ఆఫ్రికనుల వ్యవసాయాన్ని యీ వన్యమృగాలనుంచి రక్షించడం కూడ అంతే పని. యీ రెండూకూడా ఎదురు తిరిగే విధులే. ప్రభుత్వం తన శక్తివంచనలేకుండా యంత్ర వ్యవసాయానికి సహాయపడుతూంది. ఇందు కోసం ట్రాక్టర్లతో, కాల్వలద్వారా విషంద్వారా ప్రకృతిలోవున్న ప్రాచీనపు సహజత్వం రూపుమాపుతోంది. ఏనుగులు హిప్పోలు రైనోలు తమ శరీర బలంతో బరువుతో ఒక్కరాత్రిలో నెలలతరబడి కష్టింపగా వచ్చిన భూ ఫలితాలని సమూలంగా నాశనం చేయకలవు. వీటి పోటీ ద్విముఖ-పోటీ. గేమ్ వార్డెను లీవిధంగా అర్ధంలేని స్థితిలో వుంటారు. యీ పరిస్థితి మరీ విషాదకరం. యీ వ్యక్తులకి వన్యమృగాలంటే ఆపేక్ష వున్నా, దాని అర్ధం తెలియని, అంతుపట్టని వాస్తవికతలో నమ్మకంవున్నా మరీ యిబ్బంది.

యీ వాస్తవికత, వీటి శక్తి అన్న వాటిని నిర్వచించడమే కష్టం. వేటలో ఉత్సాహంవున్నవారికి ధనం యిస్తుందని చెప్పలేం. అలాగే యీ జంతువులు మూగగా, అచేతనంగా పట్నాలలో జూలలో పడివుండడంకూడ చూడలేం. యీ రెండు దృక్పథాలూకూడ ఆఫ్రికను ప్రకృతికి దూరమే. ఈ ప్రకృతి అనుభూతి మాటల్లో చెప్పడం కష్టం. ఈ దక్షిణాన ఆకా శంలో మెరిసే నక్షత్రాల గుంపులను ఐన్‌స్టిన్ పుస్తకం చదువుతూ గుర్తించ కలమా? ఇది అర్థమయేలా చెప్పాలంటే ఉదాహరణ చెప్పాలి. కొన్ని సంవత్సరాల క్రిందట ఒక పశ్చిమదేశపు జూలో ఒక జిరాఫీని చూడడం సంభవించింది. దాన్నిచూస్తే ఏదో పెద్ద ఆవు కర్రకాళ్లమీద నిలబడ్డట్టు

అనిపించింది ; అసహజంగా పెరిగిపోయిన మెడ, చిన్నతల, గుర్రపు పెద వులు, దీర్ఘమైన రెప్పలక్రింద మనుషుల కన్నుల్లాంటి కళ్ళు. వీటన్నిటికీ పైగా గుండుల్లాంటి రెండు కొమ్ములు-నడిచే చెట్టుమీద చిరుకొమ్మల్లాగ తోచాయి. ఇది చూస్తూ మధ్యకాలపు అరబు కవులు తమ హృదయేశ్వరు లను పెద్దఆవు నడిచే చెట్టులని ఎలా వర్ణించారో అనిపించిన సంగతి నా కింకా బాగా జ్ఞాపకం. హాస్యాస్పదంగా తోచింది, ఇదంతా చాలా సంవత్స రాల క్రిందటి మాట.

ఈనాడు ఆ మాటలు, వూహాలు జ్ఞాపకంవచ్చాయి. సవన్నా భూమి లోనుంచి . కళ్ళు మిరుమిట్లుకొల్పే లాంటి లేత ఆకుపచ్చ, మట్టిరంగులు కలిపిన యీ నేలమీదనుంచి స్నేహితునితో కలిపి వెడుతున్నాను. గొడుగు చెట్లు దాటాం, లేత ఆకుపచ్చ అకేసియా తోటలు దాటాం ; యివి నిటా రుగా నిలబడి దూరాన్నున్న నీలి సరస్సుకు తెరకట్టినట్టు వున్నాయి. వీటన్నిటికీ పైన గుత్తులుగుత్తులుగా మేఘాలు వేలకొద్దీ .... వెల్గులీను తున్నాయి. ఆఫ్రికను ఆకాశాని కెక్కడా అంతులేదుకదా !

హఠాత్తుగా, నాకో మెడ కనిపించింది. దాని కదలిక మనిషిని జ్ఞప్తికి తెచ్చింది. ఏదో కుతూహలంతో ఆ గొడుగుచెట్టు పక్కగా వచ్చింది, మచ్చల మెడతో. అదిచూస్తే అనుకోకుండా ఏదో చెట్టువంగి ప్రశ్న అడుగుతున్నట్టు అనిపించింది. నా స్నేహితునితో నెమ్మదిగా అన్నా. కారు ఆపాడు. మేం ఆ జిరాఫీ ముందుగా వున్నాం. దాన్ని కిస్వహిలిలో, యితర బంటు భాషలలో ట్విగ అంటారు,

గిట్టలు కల్గి యిది చాలా పెద్ద జంతువు. జూలో చూసినట్టే వుంది కాని యిది దగ్గిరగా రాగానే దీని కర్రకాళ్ళలా తోచిన కాళ్ళు త్వరగా లేడి కాళ్ళలాగ కదిలాయి. అది ఆగి ముందుకి వంగి మాకేసి చూసింది. పసివాళ్ళు ఆశ్చర్యంతో రెప్పవాల్చకుండా చూస్తున్నట్టు తోచింది ; అలా అని పూర్తిగ అలాగా లేదు. ఏదో అర్థంకాని పెద్దల ప్రపంచంలోకి చూస్తున్నట్టుకూడ వుంది.

ఓ క్షణం జరిగింది. ఆకళ్ళు మళ్లీ ఆకాళ్ళు త్వరితగతిని కదిలాయి. చిన్నచిన్న దుముకులతో మెడవూపుతో ముందుకి సాగిపోయింది. అప్పుడే.

దూరంగావున్న అకేసియాతోట సమీపించింది. అక్కణ్ణుంచి అది చిన్నది గానే కనిపించింది. లేడిలాగా సన్నగా నాజూకుగా. కాదుకాదు. అప్పుడే వయస్సుకివస్తున్న కన్నెపిల్లలాగా ...ముందుకి హడావిడిగా పరిగెత్తిపోతూ, చక్కని కళ్లతో వెనక్కి తిరిగి చూసే కన్నెపడుచులాగా యిదికూడా. సగం ఆలోకానికి, సగం యీలోకానికి చెందిన జంతువా అనిపించింది ట్విగ! యీ బంటూ పేరు ఎంత చక్కగా సరిపడింది దీనికి. చెట్టులాంటి జంతువు. చిరుకొమ్మలవంటి కొమ్ములు. అప్పటికిగాని నాకు మధ్యయుగాల కవుల వర్ణనలోని అసలు భావం స్ఫురించలేదు. ఆప్రేమగీతికలు, వారి వర్ణనలు హాస్యాస్పదంగా కాక, హాయిగా తోచాయి.

నా మానసిక నేత్రంతో నేనూహించుకున్న ఆఫ్రికా యిది. వెల్గుతో ప్రభవించే యీ సీమలోని మనుష్యుల కళ్లలోకూడ కొత్త వెల్గు కని పిస్తుంది. వీరి కండ్లలో కాంతి వేయిరెట్లుగా కన్పిస్తుంది-ఆ నల్లని శరీరా లకు తలక్రిందులుగా: ఇది చూస్తేనే-ఆత్మలోని వెల్గు శరీరంలోని చీకటిని దీపిస్తూంది అనిపిస్తుంది.

ఆఫ్రికాలోని యూరోపియనులలోని ద్వంద్వ యుద్ధం ఏమిటంటే తమ పూర్వీకులు దేనినైతే రూపుమాపాలని తాపత్రయపడ్డారో దాన్నే వారు ప్రేమించడం మొదలుపెడుతున్నారు. ఇప్పటికీ దీని ధోరణిని వెనక్కి మళ్ళించడం సాధ్యంకాని పనే. ఇప్పుడిలా ఆలోచించీ ప్రయో జనంలేదు. ఇది మిడాశాపం ఆధునిక రూపం ధరించింది అనుకోవచ్చు. నా కీ ట్విగాను చూడగనే కన్పించినదృశ్యమే యీ నా బంటు స్నేహితు నికికూడ ఒకానొకప్పుడు కన్పించివుంటుంది. అక్కడ మొదలెట్టి యీ నాడు విషసర్పాలను పట్టేదాకా వచ్చింది. అతను యిండియాలో వున్న ప్పుడే యిక్కడికంటె చక్కని లాభదాయకమైన ఉద్యోగం సంపాదించి వుండవచ్చు. కాని ఆఫ్రికాలో పనిచేయడానికి నిర్ణయించుకున్న అతని నిశ్చయానికి ...కారణం ప్రకృతే అయివుండాలి. దేవుని దివ్యదృష్టికి పరిమితం యివ్వని-యీ ఆఫ్రికా. ఇది దేవుని అనంతమైన తోట. ఆ రోజులలో యిదో స్వర్గధామంగా తోచేది. పాము రాకముందటి స్వర్గం. (సతాన్ రాని క్రిందట-స్వర్గంలాగ) ఆనాటి ఆ యువకుడైన సాహసికుడు

యీనా డిలా యివి ఉత్తమమైన జూలలాగ తన జీవితకాలంలోనే రూపాంతరం దాలుస్తాయని తలపోసివుండడు. అతనే ఒక పాముల వేటకానిగా తయారై తన భరణానికి డాలర్లు జతచేసుకుంటున్నాడు.

ఆఫ్రికాలోని యూరోపియను లందరిలోనూ యీ రకపు డోలాయమానమైన చిత్తప్రవృత్తి కనిపిస్తుంది. తాము కోరిచేసేదానికీ, ప్రభుత్వం ఆదేశించేదానికీ పోటీ. ఇలా అనడంతో-గేమ్ వార్డెను లందరూ ఆదర్శవాదులనిగాని, వ్యాపారదృష్టికలవారనిగాని కాదు నేను అనడం. అలా కానే కాదు. వేట ఏర్పాటుచేసే కాంట్రాక్టరు వుంటాడు. నీరు డేరాలు, ఆహారపదార్థాలు, పనివాళ్ళు, తమ స్వంత అనుభవం-అన్నీ సరఫరా చేస్తారు. దానికి మొత్తంగా కొంత సొమ్ము తీసుకుంటారు. ఎనభై, నూరు పౌనుల నుంచి ఎంతేనా ఎక్కువ తీసుకుంటారు. కాని వేటాడడానికి ప్రభుత్వపు లైసెన్సులు మాత్రం కాదు. వచ్చేవారు ముఖ్యంగా అమెరికనులు, ప్రమాదంలోంచి, వేటాడడంలోంచి. అలా సంపాదించే ట్రాఫీలలోంచి ఉత్తేజం వుత్సాహం పొందుతూవుంటారు. వన్యమృగరక్షణా, వేటలమధ్యవచ్చే చిక్కులు విడగొట్టినప్పుడు ఎక్కువగా అందరూ మొగ్గేది శుద్ధ ఆదర్శవాదంకోసంమటుకు కాదు. యాదాలాపంగా రైలులో కలిసిన ఒక యువకుడు మాట్లాడుతూ ఓసారి నాతో ఎందుకు, ఎలా రెండు నిప్పుకోడి గుడ్లని వార్డెనుల కళ్ళు కప్పి సంపాదించాడో చెప్పాడు. చిన్నికుర్రాడుగావుండగా తాను పగులకొట్టిన రెండు గుడ్లని భర్తీచేయడానికని తీసుకువెళ్ళాడు. అదీ తన ముసలితండ్రి టాంగ్‌నియికాకు తిరిగి వస్తున్నాడని, దాన్ని స్వతహాగనే అర్థం చేసుకోవచ్చు. కాని యీ కథ ముక్కూ ముఖం తెలియని నాకు చెప్పాడంటే, యీలాంటి దొంగతనం అతినీచం అని యూరోపియనులు చెప్పేది పూర్తిగా ఒప్పుకోలేకపోవచ్చు మనం.

ప్రపంచం మొత్తంమీద వివిధ తరహాల వ్యక్తులున్నట్టే ఆఫ్రికాలో కూడ యూరోపియనులలో చాలా తరహాల వ్యక్తులున్నారు. శాస్త్రజ్ఞులు ఒప్పుకోకపోయినా వీరిలో 'మంచి' వారు, 'మధ్యరకం'వారు వున్నారని చెప్పుకోవచ్చు. వీరందరిలోనూ ఆఫ్రికావల్ల ఆకర్షింపబడివచ్చిన యూరోపియనులుకూడా వున్నారు. దీని అందం, వైశాల్యం, స్వేచ్ఛ. దీనిలో

మనుష్యులు వారి నాగరికతవల్ల ఆకర్షింపబడివచ్చినవారు లేకపోలేదు. ఇంకో రకం వున్నారు. వీరు సంఖ్యాదృష్ట్యా ఎక్కువమందే. తమదేశపు ఘనత చాటడానికి, తమ ఐశ్వర్యం పెంపొందింపచేసుకుందును, తమ అధికారం దాహం తీర్చుకుందుకు (అది తమ దేశంలో తీరే అవకాశంలేదు కనుక) వచ్చినవారుకూడ వీరే.

ఈ ద్వంద్వ ప్రవృత్తి కారణంగా అటు "మంచి" వాళ్ళు "మధ్యమికుల" తప్పటడుగులకు ఫలితాల ననుభవించవలసివచ్చింది. దీనికి తోడుగా ఆఫ్రికను జాతీయవాదులైన యువకులే మధ్యమికుల మాటలకిచ్చిన విలువ మంచివారి మాటలకు యివ్వకపోవడంకూడా జరుగుతూంది. జాతీయ ఉద్యానవనాలు, వన్యమృగరక్షణ ప్రదేశాలు, తెగల రిజర్వులు ఒక పద్ధతిన సంప్రదాయకమైన మత, సాంస్కృతిక విషయాలను పరిశీలించడం, సాంఘిక సంస్థలను తరచి చూడడం, ఆఫ్రికను విలువలను గుర్తించే ప్రయత్నంచేయాలన్న ఉద్దేశాలను ఒకరకం విదేశీయులు పెంపొందచేశారు. ఇంకొక రకంవారు ఎంత త్వరగా వీలైతే అంతత్వరగా డబ్బు చేసుకోవాలి. దేశం మొత్తంమీద ఏమైతేనేం అన్న ధోరణి ప్రదర్శించిన వాళ్ళు. దీన్ని చూస్తూంటే, ఆఫ్రికాలో ఏదైతే వారిని ఆకర్షించిందో దాన్నే యూరోపియనులు నాశనంచేయ చూచారా అనిపించకమానదు. ఇలా వినాశనానికే వారొచ్చినది. వీరికి ఆఫ్రికన్ ప్రకృతితోను, ఆఫ్రికను నాగరికతతోను యిదే సంబంధం వుంది.

ఈ ప్రకృతిలోని అచల సదృశ పరిణామాన్ని కదలించిన యింకొక ఉదాహరణ చూద్దాం. మనిషికీ మనిషికీ మధ్యగా నిలచిన విషమ సమస్యలను పూర్తిగా అవగాహనచేసుకొందుకిది పనికొస్తుంది.

విక్టోరియా సరస్సులోని మొసళ్ళు చేపలమీద బ్రతుకుతాయని ప్రతీతి. ఈ సరస్సులోని చేపలు చాలా విలువైనవి. ఎండుచేపలు డబ్బాలకెత్తించే పరిశ్రమ కిది పునాది కావచ్చు. ఇది ఎవరేనా పురోభివృద్ధి ప్రణాళికలు వేయకల మనుష్యులు చేయగల పని. ఇందుకని యీ సరస్సులోని మొసళ్ళమీద దాడి ప్రారంభించారు. ఇది వన్యమృగరక్షణకని చూపే నైతికసూత్రాలకు విరుద్ధంగానే జరిగింది. కాని యీ మొసళ్ళని పూర్తిగా

నాశనంచేయడం పూర్తి అయాక, యీ చెరువులో చేపలు ఎక్కువ అవుతా యన్న అంచనా తలక్రిందులై చేపలు తగ్గిపోవడం మొదలుపెట్టాయి. ఇది జరిగేదాకా అందరూ తెలుసుకోలేని ఒక విషయం తేలింది: యీ మొసళ్ళు యీ తినే చేపలమీదకాక విషతుల్యమైన యింకో రకం చేపలుతిని బ్రతికేవనీ. యీ మొసళ్లను సమూలంగా నాశనంచేయడంతో, మంచిచేపలను తినేస్తూ విషపు రకానివి అభివృద్ధి కావడం జరిగింది.

ఆఫ్రికను సౌందర్యానికి యూరోపియనులు చాలా విలువయిస్తారు. అయితేనేం, వారి శక్తివంచనలేకుండా దాన్ని రూపుమాపాలని చూస్తారు. ప్రయత్నిస్తారు. దయాదాక్షిణ్యాలులేకుండా అడవులను రూపుమాపడం ద్వారా, ఏదో మంచి జరుగుతుందన్న నమ్మకంతో యీ ప్రత్యేకత కల్గిన దేశాన్ని దృష్టిలో పెట్టుకోకుండా చర్యలు తీసుకోవడంద్వారా - యివి జరిగాయి. ఉదాహరణకి-ఆరోగ్యసేవాకార్యక్రమాలు పెంచి శిశుమరణాల సంఖ్య తగ్గించడం న్యాయమే, కాని యీ దీవెనలు మారువేషంలో శాపాలుగా తయారయాయి. ఆరోగ్యసమ్మతం, అర్థవంతం అయిన సంతాన నిరోధక చర్యల ద్వారా జనాభా పెంపుదల నాపకుండా ఎన్నిచేసి ఏం ప్రయోజనం ?. .ఇలాగే నిరర్థకము,నిరుపయోగము అయిన ఉద్దేశ్యాలను అమలులోకి తెచ్చి ఆఫ్రికాలో అమలులోకి తేవడం-మధ్యయుగాలనాటి ఆలోచనలను, ఆదర్శాలను యీ నాటి యూరపులో అమెరికాలో రష్యాలో అమలుపరచాలని చూసినట్టే వుంటుంది.

కిటికీలు లేని యీ మట్టిగుడిసె గుమ్మంలో కూర్చుని యిది రాస్తూంటే అవతల కుర్రవాళ్ళు రంగులరాట్నం ఆడుతున్నారు. కిస్వహిలిలో వీళ్ళు పాడుతూన్న పాట కిలాగా అర్థం చెప్పుకోవచ్చు.

ఒకటీ రెండు మూడు.

ఆఫ్రికను పిల్లలం మేము.

ఆఫ్రికను మొత్తంమీద ఒక్కటి - నీగ్రోలతో సహా....అంటే ఆఫ్రికను రక్తసంబంధం కల్గినవారు-బ్రెజిల్, యు.ఎస్.ఏ., వెస్ట్ యిండీస్ లో వున్నవారంతా ఒక్కరమే అన్న అనుభవం చాలా కొత్తది. ఈ చిన్ని

పిల్లలు పెరిగి పెద్దవారయేసరికి యిది పాతదయిపోతుంది, తప్పదు. ఆఫ్రికను మొత్తం అన్న భావన యూరోపియనుల వ్యతిరేకి, విదేశ వ్యతిరేకి అని చెప్పుకో అక్కరలేదు. ఎన్నోసార్లు ఆఫ్రికను పిల్లలు యూరోపియను, ఇండియను పిల్లలతో చాలా సంతోషంగా ఆడుకోవడం చూశాను నేను. వారికి పై జాతులిద్దరూ విదేశీయులే, రంగునుబట్టి. నేను కెన్యాలో యూరోపియను స్నేహితుల యింట్లో వున్నప్పుడు వారింట్లో పనిచేసే కికుయు పనిమనిషి ప్రతి ఆదివారంనాడూ తన యజమాని రెండు సంవత్సరాల పిల్లకి ఓ పావు పౌను పిప్పరమెంట్లు తెస్తుంది. ఇంటావిడ నెమ్మదిగా యీ కర్చెందుకని కోప్పడ్డా లెక్కచెయ్యదు. ఈ పనికత్తెకీ యిద్దరు పిల్లలున్నారు. ఇది సాధారణంగా జరిగేదే కాని పెద్ద ప్రత్యేకత వున్న సంఘటనకాదు. సహజంగానే ఆఫ్రికనులు తమ జాతికాని జాతివారిపట్ల స్నేహపూర్వకంగానే ప్రవర్తిస్తారు. దీనికి దృష్టాంతం కావలిస్తే రెండవ ప్రపంచ యుద్ధంలో తీరాన్న ఆరబులు, ఉగాండలో బిటిష్‌వారు, లేకుంటే పశ్చిమాఫ్రికనులు స్వేచ్ఛా ఫ్రెంచివారిపట్ల నిలచిన తీరు తీసుకోవచ్చు.

కాని, యిదే విదేశీయులనుంచి అప్పటికీ యిప్పటికీ ఎటువంటి ఆదరణ లభిస్తుంది యీ ఆఫ్రికనులకు?

ఏదో ఒక పద్ధతి పెట్టుకొని చెప్పాలంటే విషయాలను సులభతరంగా చేసుకోక తప్పదు. అలా చేసి చెప్పుకొనేపక్షంలో యూరోపియను దృక్పథం మూడు రకాలుగా వుంటూవుంటుంది. 1 ఆఫ్రికను అన్నది రూపులేకుండా చేయాలన్న ప్రయత్నం, 2 బానిసలు చేసుకోవడం, 3 ఆఫ్రికను విలువలు సమూలంగా నాశనంచేసి వీరి సంస్కృతిని రూపుమాపడం.

ఉత్తర అమెరికాలో, పసిఫిక్ ద్వీపాలలో ఆస్ట్రేలియాలో ముఖ్యంగా టాస్మానియాలో జరిగిన భౌతికంగా వీరిని రూపుమాపాలన్న ప్రయత్నం యిక్కడ ఆఫ్రికాలో అంతగా విజయం సాధించలేదు. కొందరు బుష్‌మెన్, హాటెన్‌టాట్స్, దక్షిణ బంటూలు కొందరు మాత్రమే బోయర్సు వచ్చిపడ్డప్పుడు అమెరికన్ ఆస్ట్రేలియన్ ఆటవికుల గతిని పట్టిపోయారు. ఇతోపియాకు ముసులోనీ దాడి వచ్చినప్పుడు ఆఖరుసారిగా యీ భౌతిక వినాశనానికి ప్రయత్నం జరిగింది. కాని స్వతహాగా

పట్టువిడవని తత్వంకల ఇతోపియనులు లక్షలకొద్ది చంపివేయబడ్డా-యింకా మిగిలిపోయారు. స్వీడెన్, అమెరికా, బ్రిటన్, ఫ్రెంచివారు సహాయాని కిచ్చిన సహాయంకూడా వీరికి తోడ్పడింది. పోర్చుగీస్, బెల్జియన్ ప్రాంతాలలో యీ సమూల వినాశన కార్యక్రమం అంత గట్టిగా జరుప బడలేదు ...జనాభా మొత్తంమీద దారుణహింసాకాండ జరుపబడ్డా మాతృ హంశ తెగలకు చెందిన వ్యవసాయపు పనివారు ఏ రకం యుద్ధ లక్షణా లేనా లేకుండా పీడింపబడ్డారు. బెల్జియను కాంగోలో కాని సమూల వినాశనం కాలేదది.

ఇక రెండవది-బానిసలుగా తయారుచేసుకోవడం అన్నది చాలాచోట్ల కొన్ని సమయాలలో ఎక్కువగా అమలులోనున్నది. దీనివల్లనే యీనాడు కోట్లకొద్ది ఆఫ్రికను వంశీయులు అమెరికను, ఇంగ్లీషు, ఫ్రెంచి నాగరికత నలవరచుకొని వీటినే మాతృభాషగా చేసుకున్నారు. పశ్చిమ ఆఫ్రికాలోవి యూరోపియనుల బానిస వ్యాపారం దీనికి దోహదం యిచ్చినా ఆ ప్రాం తాన్ని మార్చలేకపోయింది. కనీసం తూర్పుతీరాన్ని అరబులు మార్చి నంత కూడా మార్చలేకపోయింది. ఈనాడు బ్రిటిష్‌వారి మానవత్వం ధర్మమా అని, రహస్యంగాకూడ యిటువంటి బానిస వ్యాపారం ఏ తీరం మీదా జరగడంలేదు. కాని దీని స్థానే, మేలి ముసుగు ధరించిన యింకో రకపు బానిస వ్యాపారం దక్షిణాఫ్రికాలో యీనాడు జరుగుతూంది. దీనికి ఒక రూపురేఖలు దిద్దినదే అపార్థియిడ్ పోలసీ. నియంతృత్వ అధికారం తీవ్రంగా ఆలోచించి జాతుల విభేదసూత్రాలు రూపొందించింది. పేరుగాంచిన "నురెంబర్గ్ చట్టాలు"కూడ వీటి ముందు అధునికమైనవిగానే తోస్తాయి. "ఆఫ్రికనుని అతనికి తగిన స్థానంలోవుంచు" అన్నదే దీని పునాది. అప్పుడే అవసరం అయినప్పుడు యూరోపియనులకి పనికి వస్తారు వీళ్ళు. వీరిని యీ రకంగా దూరంగావుంచి తర్ఫీదు నివ్వాలి.

చవుకగా ఆఫ్రికను కూలీలను లాభానికి అరువివ్వడం అనే వ్యాపారం కూడా వుంది. అలాగే మొజాంబిక్, అంగోలాలలో వెట్టి చాకిరీ పద్ధతులు కూడా వున్నాయి. పోర్చుగీసువా రా ప్రాంతాలు తమవే అన్న వంక పెడతారు. ఈ వంకనే కొందరు పోర్చుగీసులు-వారి ననుసరిస్తూ వారి

జాతీయతను అలవరచుకున్నట్టయితే అక్కడ స్థలం లభిస్తూంది. బెల్జియను కాంగోలో ఆర్థిక తెగలు కొన్ని సృష్టింపబడ్డాయి. దీనిమూలంగా బెల్జియను క్రింది తరగతులు పెద్దపెట్టున తరలిపోవలసిన అవస్థ ఏర్పడింది. త్వరిత గతిని వస్తున్న మార్పు లెన్నో వూహించలేని మార్పులకు దారితీయవచ్చు. కానైతే యిలాంటి పద్ధతి యితర దేశాలలో విపరీతాలు తెచ్చింది. ఉదాహరణగా ఉత్తరమెరికాలోని ఫ్రెంచి, యిటాలియను ప్రాంతాలు చూడవచ్చు. ఇటువంటి పద్ధతిని సహారాకుదక్షిణంగా బ్రిటిష్ ఫ్రెంచివారు కాని అమలులోకి తేలేదు. కాని కెన్యాలోని "వైట్ హైలాండ్స్"లో, కేంద్ర టాంగన్యికాలో-ముఖ్యంగా దక్షిణ రొడిషియాలో యీ పని జరిపించారు. ఈ రెండు పెద్ద దేశాలూ ప్రత్యక్షంగా యిలాంటి బానిసత్వం పోలసీ కూడదని ఓ నూరు సంవత్సరాలుగా అంటూనే వున్నారు.

సంస్కృతిని, నాగరికతను పూర్తిగా మార్చాలన్నది మూడవది. ఆఫ్రికానుంచి ఆఫ్రికను తత్వాన్ని వైదొలగించాలన్న ఆశయం యీ ప్రాంతాలలో కేంద్రాన్ని ఏర్పరచుకొనివుంది. ఇక్కడే యూరోపియనులు యీ అందాన్ని చూసి ఆకర్షితులయ్యారన్నదానికి సాక్ష్యంకూడ వుంది. కాని యీ ఆకర్షణ అభిమానం అడవిని కాచిన వెన్నెలలా నిరుపయోగం. ఈ ప్రేమ, ద్వేషం అన్నది తన ఉనికివల్ల ఏదైతే రక్షించాలని చూస్తోందో దాన్నే నాశనం చేస్తూంది. ఇదే ఆఫ్రికాలోని ముఖ్య సమస్య యీనాడు. ఎందుకంటే, బానిసలుగా చేయాలన్న ప్రయత్నం, భౌతికంగా రూపుమాపాలన్న ప్రయత్నం విఫలంకాక తప్పదు. ఖండాంతరమైన దృక్పథ ప్రాబల్యంవల్ల యీనాడు యిలాంటివి కొనసాగవు.

సాంస్కృతికంగా,నాగరిక సంప్రదాయాల దృష్ట్యా ఆఫ్రికను తత్వం రూపుమాపడం అన్నది వేరువిషయం. దీనికి యిటు జాతీయవాదం, అటు కమ్యూనిజం కూడ మద్దతు నిస్తాయి. ఫ్రాంసూ, బ్రిటనుకూడా ధ్యేయాలు వేరుగా యిదే పద్ధతిని దోహదం చేస్తున్నాయి. పోర్చుగీసులు తమలో కలియడానికి వచ్చినవారిపట్ల ప్రదర్శించే దృక్పథాన్ని పోలి వుంటుంది ఫ్రెంచివారి ధోరణి. పారిస్‌లో ఎందరో ఆఫ్రికను డెప్యూటీలు ఉత్సాహంగా రాజకీయాలలో పాల్గొంటున్నారు. బ్రిటిష్ ధోరణిలో ఆర్థిక

విభేదాలు ఎక్కువ ప్రాముఖ్యం వహిస్తూ, స్వపరిపాలన కనువుగా విద్యాబోధన మొదలైన హంగులుంటాయి. ఒక్క రొడిషియాలో తప్పించి వీరి జాతివిచక్షణ తెల్లవారి ప్రత్యేకత అన్నవి ప్రాచీనమైన ఉద్దేశాలుగా లెక్కింపబడుతున్నాయి యీ నాడు. కాని వలసరాజ్యాలు వెల్గుతున్న రోజులలో యిక్కడికి తీసుకువచ్చిన దొర రైతులకూ, యిండియను కూలీలకూ బాధ్యులుగా వుండవలసిన అగత్యం ఏర్పడింది. వివిధ జాతుల మధ్య సామరస్యం పెంపొందించకపోతే-స్వపరిపాలన అన్నది కుదరని విషయం. అందుకే ఇండియాలోలా 'విభజించి పాలించ'న్నది ఆఫ్రికాలో ఆర్థికంగాను యితరత్రాను కూడ చాలా విషాదకర పరిణామాలకు దారి తీస్తుంది. యూరోపియను సెటిల్‌మెంట్సు అక్కడక్కడ వుండినా సంఖ్యాబలంలోకూడా ఎక్కువ కాదు. అలాగే గుమస్తాలుగా వ్యాపారస్తులుగా ఇండియనులు విడిగా వుంటారు. వీరు కలిసి ప్రభుత్వం స్థాపిస్తారా? ప్రత్యేకించిన రాజ్యాలా?

ఈరోజున ఎన్నో రకాల మానవ సంస్కృతులు పెనవేసుకుని ఆఫ్రికను సంస్కృతిలో కలిసివున్నాయి. ఈనాడు వీటిని వేటికవిగా విడదీసి పేర్చడం చేయలేని పని. అలాంటప్పుడు యింకోదారేది?

విభిన్న జాతులమధ్య సామరస్యం పండించడం-విక్టోరియా సరస్సులో మొసలీ-పెద్దచేపా చిన్నచేపా కథలాగ జరగవచ్చు. దీన్ని సామరస్యం అనలేం కదా? దీనిలో ఒక సిద్ధిని సంపాదించినా, ఒక్కసారిగా అధికారం తెచ్చిన విదేశీ పరిపాలకులు వెళ్ళిపోయాక ఏం జరుగుతుంది?

ఇంకోటికూడ వుంది. వాస్తవమైన సమరసత్వం: అదే వ్యక్తిగతంగా స్వచ్ఛందంగా నాగరికతలు సహకరించడం అన్నది. దానికి సహృదయంతో అర్థంచేసుకోవడం, ఊహించుకోవడం, తనను మించిన యితరులను ప్రేమించకల్గడంవంటి మానవ లక్షణాలు పునాదిగావుంటాయి. ఇతరులతో స్నేహసౌహార్ద్రాలతో మెలగిననాడు యితరుల సంస్కృతి పట్లకూడ ఆ సౌహార్ద్రం వుంటుంది.

నిజానికిది సరైన క్రిష్టియను తత్వం. ఇదే ఇస్లామ్ చెప్పేది కూడ. ఆఫ్రికనులలో చాలామంది యీనాడు అటు క్రిష్టియనులో యిటు ముస్లిములో కదా! కాని యీ మార్పు సాంస్కృతిక విలువలను పెంపొందించేదిగా జరుగలేదు. ఆఫ్రికనుల విలువలు రూపుమాపి, మతం యిచ్చిన వారి విలువలు నయానో భయానో గుర్తింపచేయడమే ధ్యేయంగా యీ మతం మార్పులు జరిగాయి.

ఆఫ్రికను అన్నదల్లా—దుస్తులు, నగలు, నాట్యాలు, సంగీతం, పెళ్ళిళ్ళ తతంగం, కుటుంబపు పద్ధతులు, రాజకీయపు అలవాట్లు, మత తతంగాలు, వైద్య చిట్కాలు—అన్నీకూడ క్రిష్టియనువీ కాదు, అటు ఇస్లామునీ కాదు అని ఖండించిపారేశారు. ఇవన్నీ మతం పుచ్చుకున్న వాడు వదిలితీరవలసినవి. ఇంగ్లండులో చదువు ముగించుకుని వచ్చిన ఒక ఆఫ్రికను విద్యార్థి నాతోపాటే 'నగోమ' నృత్యాన్ని తిలకించి, దాని అందం, లయ వాటి కలయికలను తలచుకొని ఆశ్చర్యపోయాడు. ఇది ఆధునిక 'రుంభా' నృత్యరీతుల్లో ఒకటి కాదు; పూర్వంలో యువకులను మతంలోకి దించే తతంగం సందర్భంలో చేసే నృత్య రీతి. ఇది గంభీరంగాను సభ్యతతోను వుంటుంది. నెమ్మదిగా ప్రారంభమైన డోళ్ళలయ ప్రాచీనమైన వృక్షాల శిఖరాగ్రాలను దాటుకుని దాటుకుని నక్షత్రాలదాకా ప్రవహించడం నేను విన్నాను. జేగంటల ధ్వనిలా తోచే యీ ధ్వని అందం చెప్పలేం మనం. ఈ ధ్వనిలో ఒక రకం రాజరికం వుంది. నదీజలాలమీద ప్రవహించే పండు వెన్నెల కిరణాలలాగ యిది యీ ప్రపంచానికి చెందినది కాదేమో అనిపిస్తుంది.

ఫ్రెంచి బ్రిటిష్ ప్రభుత్వాలను యీ దృష్టితో సరిపోల్చడం న్యాయం కాదు. ఇలాంటి దృక్పథం కొన్ని చర్చి సంఘాలే వదిలివేస్తున్నాయి. దశాబ్దాలనుంచే ఇంగ్లాండులో, పారిస్‌లో ఆఫ్రికను కళల ప్రదర్శనలు జరుగుతున్నాయి. కాని జాతిలోనుంచి పెండ్లిచేసుకోవడం మూలాన్న వెలివేయడం, జాతి విచక్షణ పాటించడం అన్నవి భూతకాలానివిగా మారిపోతున్నాయి. కాని ఆఫ్రికనులు స్వపరిపాలనకి అర్హులవునా కాదా అన్నదానికి నిదర్శన పూర్తిగా ఫ్రెంచో, బ్రిటిషో పద్ధతి విలువలకి,

నాగరికతకి వారు మారరా అన్నదిగానే సామాన్య పరిపాలకులకి తోస్తుంది. ఇంకా అక్కడక్కడ నల్లని చర్మాలతో గుబురుజుట్టుతో ఫ్రెంచి, బ్రిటిషు పౌరులు రూపం దాల్చారా అన్న ఆశ కన్పిస్తూనే వుంది.

ఆఫ్రికను లీ తెరను చూడకలిగారు. అందుకే కొందరు పూర్తిగా ఆఫ్రికను విలువలు,నాగరికతలు నాశనం అయితే తప్పించి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభ్యం కావని తలపోస్తున్నారు. అందుకే యీ నాశనంకోసం విక్టోరియను కాలపు మిషనరీలలాగా వీరు తీవ్ర కృషిచేస్తున్నారు.

వారి ఆత్రానికి ఓంప్రథమంగా బలిఅయినది—నాజూకై, ప్రాణంతో స్పందించే స్త్రీహృదయంకల్గిన ఆఫ్రికను సంస్కృతి. నిజానికి ఆఫ్రికను స్త్రీల స్థానం పూర్వంలో మాతృహంశ తెగల సంప్రదాయాలతో పటిష్ఠంగా వున్నది. ఈనాడు దిగజారిపోతూంది నెమ్మదిమీద. పితృహంశ తెగల అలవాట్లూ ప్రాబల్యాలూ వీటిలోకి చొప్పించడంవల్ల నే అస లీ మాతృహంశ తెగల వలయం పశ్చిమ ఆఫ్రికాలో ఘన నైగిరియా బెల్జియన్ కాంగో ఉత్తర రొడీషియానుంచి తిన్నగా టాంగన్యికాదాకా ఏకఛత్రంగా వుండేది.... తమ జాతీయ నాగరికతను సంస్కృతిని సంరక్షించుకొనే బదులు యీ యువకులైన ఆఫ్రికనులు 'యూరోపియను రూపాంతర' కార్యక్రమం చాలా నెమ్మదిగా చేస్తున్నారంటూ ఆ పరిపాలకవర్గాన్ని హెచ్చరిస్తూంటారు.

నేను నెవలలోవుండగానే అక్కడి ఆఫ్రికను నేషనల్ ఆర్గనైజేషను నాయకుడు జూలియస్ నైరెరె ఒక పెద్ద సభ ఏర్పాటుచేశాడు. "1918 లో జర్మనులనుంచి తమదేశాన్ని చేతులలోకి తీసుకున్న బ్రిటిష్‌వారు యీ దేశానికి ఏంచేశారు" అంటూ ప్రశ్నించాడు ఆ సభలో.

"మీలో ఎందరు ప్రాథమిక విద్యనైనా పూర్తిచేశారు?" అంటే ఓ డజనుకు మించిన చేతులు పైకిలేచాయి.

"మీలో ఎందరు మాధ్యమిక పాఠశాలలను దాటారు?" అంటే ..... తక్కువ చేతులు పైకిలేచాయి.

"మీలో ఎందరు మకరెరెలోని లండన్ యూనివర్శిటీ కాలేజికి వెళ్లారు?" అంటే ఒక్క చేయికూడ పైకి లేవలేదు. (ఈ కాలేజి బ్రిటిష్‌వారు ఉగండాలో స్థాపించారు) .... "ఇదిగో చూడండి మరి. టాంగన్యికాకు స్వపరిపాలన యిప్పట్లో అవసరంలేదంటున్నారు. అది నిజమే మరి. కాని విదేశ పరిపాలన సాగినంత కాలం ఇది జరిగే పని కాదు. ప్రయత్నంచేసి ప్రయోగంచేయడం ద్వారానే దాన్ని మనం పని చేయించకలం; చివరికి స్వంతం చేసుకోగలం" .

ఇదంతా వినడానికి బాగానే వుంటుంది. ప్రయోగం అంటే ఆఫ్రికను విలువలలో యింకా మిగిలివున్న వాటిని కూడా తుడిచి పెట్టేయడం. ఒకసారి నాతో చెప్పారు. నేటివ్ అధికారి పక్కజిల్లాలో - మాతృహంశ లక్షణాలను—తీసివేయడం ప్రధమ కర్తవ్యంగానూ, కౌన్సిల్ సమావేశాలకి పిలుపుగా డోలు వాయించడం నిషేధించడం రెండవ కర్తవ్యంగానూ భావించాడట. తొలి కర్తవ్యం ద్వారా స్త్రీల ప్రతిపత్తి తగ్గించుతాడు. రెండవ కర్తవ్య నిర్వహణ ద్వారా-మొత్తం కులాని కొక క్రమశిక్షణ చిహ్నంగా మిగిలినదాన్ని తీసివేసి బ్రిటిష్ పరిపాలకుల ఆఫీసు పనిగా దాన్ని రూపొందిస్తాడు. కాని యీ అత్రుతకల యువకుల కీ మాతృహంశ లక్షణాలూ డోళ్ళ మోతా కూడా భావ ప్రేరితంగా, సంప్రదాయికంగా వుండి వెనుకబడిన తత్వానికి చిహ్నాలుగా తోస్తాయి. అందుకే యివి పోయి తీరాలి అని అంటారు.

విక్టోరియా సరస్సు కధ తిరిగి జ్ఞాపకానికి వస్తుంది. దానికంటె ప్రాచీనంగా యిటువంటి అర్ధరాహిత్యానికి కౌటిల్యుని అర్థశాస్త్రం రుజువులు చూపుతుంది. యీ గ్రంథంలో "కల్లోలం .... మత్స్యన్యాయ .. " అంటాడు. ఆరోజుల్లో కూడా "చేపసామెత" వాడుకలోనే వుంది. బల వంతుడు బలహీనుణ్ని మింగేస్తాడు—ఆ బలహీనుని కింకో దండధరుని సహాయం లేకపోతే - ఇంకోలా చెప్పాలంటే .. పరాయి ప్రభుత్వంలాంటి మొసలిని తీసివేస్తే, విద్రోహకరం అయిన విషపు చేపలు విజృంభించి, దోహదకారులైన చిన్ని చేపలను నిలవనీయవని చెప్పుకోవచ్చు. దురా

క్రమణ తత్వం కల జాతీయవాదులు కూడా స్వజాతీయ నాగరికతకు, నాణ్యతకు గొడ్డలి పెట్టుగా తయారౌతారు. ఇదంతా విషాదకరమైన పాతకథే.

ఐతే, మానవ విలువల పద్ధతులు వారు పెంపొందింప చేసే నాగరికతలు కూడా మొసళ్ళనీ, చేపలనీ పాలించే చట్టాల ద్వారానే పాలింప బడాలా? అలా పాలింప బడుతున్నాయా?

కళ్ళను కప్పే యీ ఆఫ్రికను వెల్లు ఆశ్చర్యంతో చూస్తూవుంటే మన మనస్సుని ఏదో త్వరితంగాను, సూక్ష్మంగాను దాటి పోతుంది. మాటలలో వర్ణించలేనిది, కదలికలో అనంతమైన పొందు కల్గినది అది-ట్వీగా! జిరాఫీ.

అది మచ్చలు కల్గిన పెద్ద గోవుకాదు. కర్రకాళ్ళ కొంగకాదు. నడిచే ప్రశ్నించే చెట్టుకాదు. గుఱ్ఱం తల దాల్చిన మనిషి తల కాదు. కొమ్మలున్న చెట్టుకాదు - వీనిలో ఏ ఒక్కటీ కాదు. కాని వీటన్నిటి సముదాయం కాదని అనలేం మనం. సన్నని లావణ్యపూరితం అయిన ఒక జీవి యిది. దీనిలో పొందిక, అందం - వీటన్నిటి పొందికనూ చక్కని ఆ కళ్ళలో నిలుప కల్గుతూంది.

యీ అద్భుతాన్ని స్వర్గం సృష్టించిందా? ప్రకృతా? మానవ నాగరికతకు రూపముదిద్దే వారు యీ ప్రాణిలో మార్పులను తెచ్చి అర్థవంతమైన పొందికతో పునఃసృష్టి చేయకలరా?—

# 9. నీతిగల
# మంగవాడు

విక్టోరియా సరస్సు పశ్చిమ తీరంగా తిరిగి నేను ప్రయాణం చేస్తున్నాను. నాకు ముందు వందయేళ్ళ క్రిందట స్పెకె తరువాత స్టాన్లీ నైలునదీ ప్రారంభం కనిపెట్టాలని ప్రయాణంచేసి చివరికి 'న్యాంజా' యీ పెద్ద సరస్సుని కనిపెట్టారు. ప్రయాణీకులకోసం పడవలు సముద్ర మట్టానికి నాలుగువేల అడుగుల ఎత్తున నడుస్తాయి. అంటే అతి ఉష్ణ కాలంలో కూడా వాతావరణం భరింప శక్యంగానే వుంటుంది. (అంటే డిసెంబరు, ఏప్రెల్ల మధ్య) ఇక్కడ ఒక వారంరోజులపాటు యీ నీలి అద్దంలాంటి నీటి మట్టంమీద జల్సాగా ప్రయాణంచేసి రావచ్చు. దీని సైజు దరిదాపు ఐర్లాండు దేశం అంత వుంటుంది. ఒక తీరంనుంచి యింకో తీరం చూడలేం మనం. కాని దారివెంట అనేక ద్వీపాలను దాటుకుంటూ, (ఏజియన్, ఏడ్రియాటిక్ సముద్ర ద్వీపాలలాగా వుంటాయివి) పక్కల వెంబడి వున్న పార్కులని చూసుకుంటూ పోవచ్చు. వీటిని చూస్తూవుంటే యూరోపియను ప్రయాణీకులకు తమ స్వదేశాలు — అవి స్కాట్లండు, స్వీడెన్, స్విట్జర్లాండు, ఆస్ట్రియా, ఇటలీ ఏదైనా కావచ్చు-అవి జ్ఞాపకానికి వస్తూ వుంటాయి. వీటన్నిటి మధ్య ఎప్పుడేనా ఒక హిప్పొపొటమస్ కనబడవచ్చు . చిన్నతనంలో మనం చదివిన బొమ్మల పుస్తకంలో ఆఫ్రికా జ్ఞాపకానికి రాక మానదు!

ఎర్ర ఫెజ్టోపీ, తెల్లని కంజులు ధరించిన ఆఫ్రికను కుర్రవాళ్ళు పడవలలోనే భోజనాలు వడ్డిస్తారు. చక్కని బిల్లలు; పరిశుభ్రంగా

వుంటాయి. నావికుడుగా పనిచేసిన ఒక ఉద్యోగి తన యుద్ధకాలపు జ్ఞాపకాలను నార్వే, బ్రిటన్, బర్మాలలో యుద్ధాన్ని గురించి చెప్తూ "మీకూ ప్రాక్ దేశాలు తెలుసా?'' అడిగాడు. అక్కణ్ణుంచి మా సంభాషణ చాలా రక్తి కట్టింది. టైగర్ హిల్ నుంచి కనబడే డార్జిలింగు సుందర దృశ్యాలు, అస్సామ్ గురించి మాట్లాడాము; కాంచన్ జంగ్‌ను గురించి అక్కణ్ణుంచి దక్షిణాది దేవాలయాలు, అక్కడ పూర్వంలో దేవదాసీలు చేసే భరతనాట్యం. యిప్పు డీ కళ ఢిల్లీలోని దౌత్య కార్యాలయాల్లోనే జరుగుతూంది. లేకుంటే న్యూయార్కు, మాస్కోలలోని ప్రఖ్యాతిగాంచిన సభలలో జరుగుతూంది.

ఇదంతా చెప్తూ తన స్వంత భావనలను పైకి కనబడనీయ లేదాయన. అయినా యుద్ధాన్నిగురించి ముగిస్తూ "అదంతా మనకి నచ్చినట్టు నటించాలి. వయస్సులో చిన్నగా వున్నట్టయితే యిది తప్పదు ... తప్పని సరేమో కూడా ...ఎక్కడో ఒక యిల్లంటూ పెట్టుకుని నాగరికంగా బ్రతకాలంటే ఇది తప్పదు" అన్నాడు.

జకోబ తొలుదొల్త నన్నెంతో ఆకర్షించింది. అక్కడ నా ప్రయాణం ఆపి చూడాలనుకొన్నాను. ఆ వూరుచూస్తే నాకెంతో ఆనందం కల్గింది. నా పరిశోధన కుపయోగ పడేలా - ఆధునిక పోకడలు, సమకాలిక ఆఫ్రికను స్త్రీలలో ఎటువంటి మార్పులు తెచ్చాయన్నది యిక్కడ బాగా తెలుసుకో కలిగాను. నే నిక్కడికి వచ్చీ రాగానే జకోబలోని 'మాతృహంశ' తత్వాలను గురించి విన్నాను. కాని అప్పట్లో అంతగా ఆకర్షింపబడలేదు. "స్వేచ్ఛా స్వాతంత్ర్యాలందుకుని ఆఫ్రికను మహిళలు విదేశాలు వెళ్ళి డబ్బు సంపాదించుకొచ్చి యిక్కడ భూవసతి కొని వ్యక్తిత్వం నిలబెట్టుకుంటున్నారు" యీ చిన్ని విషయాని కొక కథ జత అయింది. విక్టోరియా సరస్సు పశ్చిమతీరం నుండి న్యాసాలోని కొందరు ఆడపిల్లలు స్వంత జిల్లా వదలివెళ్ళి ధనం సంపాదించాలని అనుకున్నారు. అక్కడి యువకులు వీరిలా వెళ్ళకుండా ఆపాలని అక్కడ సరస్సుపై వున్న పడవలలో పికెటింగు సాగించారట. కాని ఆ పిల్లలు తమ దగ్గిరవున్న ధనాన్నంతా పోగుచేసి ఒక విమానం అద్దెకు తీసుకుని

బకుబనుంచి సముద్ర తీరానున్న ఓ పెద్ద పట్నానికి వచ్చి వాలేరట. కెన్యా లోని వైట్ హైలాండ్సులోని ముఖ్య పట్టణాలలో ఒకటయిన నకురులో నా కీ కథంతా తెలిసింది. నా కిది చెప్పినది ఒక మెడికల్ ఆఫీసరుగా పనిచేస్తూన్న ఆంగ్ల యువతి. తన కారులో నన్ను సుఖరోగాల ఆస్ప త్రికి తీసుకు వెళ్ళిందామె. అది మునిసిపల్ ఆస్పత్రికి జేర్చివుంది. అక్కడి సిస్టరు స్విస్ వనిత నర్సుగా ఒక ఆఫ్రికను యువతి వుంది. అక్కడ తమ రోగులకు కొందరికి నన్ను పరిచయంచేశారు. స్వచ్ఛందంగా రోగ నివారణ పొందడానికని వచ్చినవారే వారంతా.

కీచు కంఠంతో నా ప్రశ్న లన్నిటినీ కికుయు, కిస్వహిలి, లుహాయల లోకి యీ ఆఫ్రికను నర్సు తర్జుమా చేస్తూండేది. ఆ ప్రశ్నల తర్జుమాలో ఆ గొంతు స్వరం ఏమాత్రం తగ్గలేదు. పాస్ సంపాదించడమే పెద్ద సమస్యగా వున్నట్టుంది యిక్కడి ఆడపిల్లలకి. కెన్యాలో ఆఫ్రికను స్త్రీలకీ పురుషులకీ ప్రత్యేకించిన పాస్ చట్టాలు వున్నాయి. ఎప్పుడూ కూడా అందరికీ జ్ఞాపకం చేస్తూ మావ్‌మావ్ ప్రమాద పరిస్థితి వుందంటారు. యీ వనితలు క్రింది అధికారులకు లంచంపెట్టి యీ పాసులు సంపా దించారా అనుకున్నాను. వీరిలో అందమైన అమ్మాయి అలాకాదని మాట్లాడ్డం ప్రారంభించింది. ఏదో కొంతడబ్బు జాగ్రత్త చేసుకుంది. ఇంటికి తిరిగివచ్చి అరటి, కాఫి, వేరుసెనగలు పండే భూమిని కొనుక్కో వాలని ఉద్దేశ్యం. ఆ పని తనే చేసుకోవాలని, ఆమె మాట్లాడుతూంటే ఏదో పల్లెటూరివారి కుండే ధైర్యం కనిపించింది. పొడుగైన యీ స్త్రీ లందరిలోనూ యీ తత్వం గోచరిస్తుంది. వీరు చక్కటి అద్దకంచేసిన శాలువలు కప్పుకొంటారు. వీరిలో కొందరికి బుగ్గలమీదా, గెడ్డంమీదా పచ్చబొట్టు గుర్తులు వున్నాయి వీరిలో ఏ ఒక్కరూ నిస్సహాయులైన బానిసలుగా తోచలేదు. వీరిని భారత దేశంలోని మహిళలతో పోల్చి చూడకుండా వుండలేక పోయాను. అక్కడి స్త్రీలు సంఘ సేవకు వస్తు వులుగా వున్నారనడం అతిశయోక్తికాదు. ఎంత తేడా? అక్కడ సగం నీరసించి నోరులేని భారతీయ శిశువులు . . ధన లోభులకు బలి అయినవారు మగవారు కూడని పనిలో నిమగ్నులైనవారు ... ఇక్కడ యీ పల్లెటి

వాసులు, సరదాగా మాట్లాడితే హాయిగా నవ్వేకలవారు. వీరు తమ భవిష్యత్తులో రైతులుగా నిలదొక్కుకోవాలని చూడడం తగిన నిర్ణయంగా తోచింది నాకు. "మిమ్మల్ని చూస్తే యిదివరలో యిక్కడికి వచ్చిన యింకో డెలిగేషన్‌వారు జ్ఞాపకానికి వస్తున్నారు. వారిక్కడికి వచ్చినా యీ రోగులను గురించి ఎక్కువగా తెలుసుకోలేక పోయారు. అయితే వీరు చాలా బాగున్నారు-రంగు రంగుల దుస్తులతో అని అనుకున్నారు. మేమూ వారిని అనవసరపు వివరాలిచ్చి విసిగించలేదు. వారు మగవారు, అందులోనూ సీతిమంతులు కూడా" అంది వారిలో ఒకామె.

స్కాట్ సిస్టర్ కాలర్ సద్దుకుని "నందినుంచి వచ్చిన యువతులు ఆయాలుగా తయారౌతారు, కొందరు నర్సులుగా తర్ఫీదు పొందుతారు కూడా. చాలా కష్టపడి పనిచేస్తారు. నమ్మదగినవారు. వ-జిబ, వ-హాయ వారుకూడా చాలా సరదాగా వుంటూ వుంటారు. వాళ్ళు తిరిగి వెళ్లి పోవాలని కోరడం సబబే. వారి దేశం ఆఫ్రికా కంతటికీ అందమైన భాగం" అంది.

కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ఆధునికమైన ఒక శక్తిగా పనిచేసి సాంఘిక సమన్వయాని కెక్కువగా కృషిచేస్తూన్నది. తూర్పు ఆఫ్రికా మొత్తంమీద దీని కృషి ప్రస్ఫుటంగా కనపడుతుంది. నేను ఎక్కడికి వెళ్ళినా-కెన్యాలో, ఉగండాలో, మకొండె పీఠభూమిలో, ఉలుగురు కొండలలో-యీ డెవలప్‌మెంటు పని కనబడుతూ వచ్చింది. ఇది ఇరిగేషన్ సమస్యల పరిష్కారంలోనూ, నేల బీడు పడిపోకుండా చరియలపై అంచెల వారీ వ్యవసాయం ఎందుకు ప్రారంభించాలో రైతులకు బోధ పరుస్తూ కనబడుతూనే వుంది. చదువు సంధ్యలకు అవకాశం కలగ్గానే, ఆఫ్రికను లందరూ చాలా ఆత్రంగా కొత్తవిషయాలు తెలుసుకుందుకు, నేర్చుకుందుకు ప్రయత్నిస్తారు. చదువుకోవాలన్న యీ కోరిక ఒక ఆవేశంగా మారుతూంది. ఇదొకొక్కప్పుడు సోషల్ డెవలప్ మెంట్ శాఖవారి పనికి అంతరాయంగా కూడా పరిణమిస్తూ వుంటుంది. ఇతర ఖండాలలో యిటువంటి సంస్థలను సంఘాలను గురించి తెలిసిన ఒక యూరోపియను అధికారి టాంగన్యికాకాలో చెప్పాడు: "ఆఫ్రికను స్త్రీలూ

మన క్లబ్బులకి నేర్చుకుందామని వస్తారేగాని సరదాకోసం కాదు. ప్రతీదీ నేర్చుకోవాలని-చదువను రాయను, లెక్కలనుంచి రాజకీయాలదాకా, ఆర్థిక శాస్త్రంనుంచి మానవ పరిణామశాస్త్రందాకా అన్నీ నేర్చుకోవాలని-చూస్తారు. పిల్లలకి బట్టలుకుట్టడం, అల్లిక, వంట నేర్చుకుందామన్నట్టే. యిదెంత మూర్ఖంగా తయారుచేస్తుందంటే యీ ఎండవేడిలో వారి పిల్లలకి దళసరి ఉలుబట్టలు తొడిగి వుంచుతారు. మనం మన పిల్లలని దిగంబరంగా వదిలి పెడతాం-యీ వాతావరణంలో" అంది.

క్లబ్బులను గురించి మాట్లాడుతూ, వాటి సమస్యలను గురించి చెప్పిం దామె.

"యూరపులో ఎలాగైతే అంతా జరుగుతూందో అంతా అలాగే నేర్చుకుని అమలులోకి తేవాలని తలపోస్తారు. ఇది కాస్త తెలియగానే యింటికి వెళ్ళిపోతారు. ఇక క్లబ్బు ఉన్నసంగతే మరిచిపోతారు. అది వారి స్వంతంకాదుకదా. వారి సంప్రదాయంలో ఒకటైన దేదో మనం గుర్తింప లేకుండా వున్నాం. అదేమిటో నాకు బోధపడ్డంలేదు. తెగ అధికారికున్న పలువురు భార్యలలో వున్న పాటి సామరస్యం యిక్కడ ఆఫ్రికను స్త్రీలకోసం మనం స్థాపిస్తూన్న క్లబ్బులలో వుండడంలేదు." నేర్చుకోవాలని ఆఫ్రికనులు, అదేమిటో సరిగా అర్థం చేసుకోలేక తగిన వాతావరణం సృష్టింపలేక సతమతమయే యూరోపియనులు — ఇదీ అసలు సమస్య. మన భావన అంత చచ్చుపడిపోయాయా? లేక మన వూహ అంత స్వేచ్ఛగా వుండలేవా? మనం ప్రతిదాన్నీ ఒక్క కోణంలో నుంచే చూస్తామా? దాని కింకో కోణం వుందన్నదే గుర్తించమా?

బకొబలో బ్రిటిష్ కమ్యూనిటీ అధికారులతో కలసి మెలసి వుండ డంతో యిక్కడ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొందిన స్త్రీల వారి సమస్యలు-వ్యభిచారం మొదలైన విషయాలపై చర్చలు వచ్చాయి. వ్యభిచారం అన్నది సాంఘిక చీడపురుగుగా గత ఐదువేల సంవత్సరాలనుంచి మన మధ్య వుంటూనేవుంది. గత ఏభై సంవత్సరాలుగానే యిది ఆఫ్రికాలో సమస్యగా తయారైంది. నాగరికతతో కలయికగా యిది కనపడి, సామ రస్యజీవితం గడపాలని తాపత్రయపడే మానవాళి విషయంలో ఎన్నో

ముఖ్యమైన సమస్యలు రేకెత్తిస్తూంది. ఎదుటి విషయాన్ని సరిగా చూడా లన్న తాపత్రయంలో మనం నినాదాలను పట్టించుకోకూడదు. అవి కుడికాని ఎడమకానీ, తెలుపుగాని నలుపుగాని - మన దృక్పథాన్ని కుంటు పరచ కూడదు. యూరపు, ఆసియాలనుంచి వలసవచ్చినవారు తూర్పు ఆఫ్రికా లోకి రాగానే తమ జీవిత విధానాలను అమలులోకి తెచ్చారు. పారిశ్రా మిక వాదంతోపాటు ఎన్నో ఒత్తిడులు, కష్టాలు తెచ్చిపెట్టారు స్థానిక జనులకు. వీరు ఎదురుచూడని విధంగా తమ జీవిత విధానాలను మార్చుకో వలసిన స్థితి ఏర్పడింది.

యీ పితృహంశ వర్గాలు ప్రబలిన స్థలంలో ఒక హాయతెగ వనితను ఉదాహరణగా తీసుకోనవచ్చు. వీరిని పక్కన వున్న రు అండా-ఉరుండిలోని వటుసి వనితలతో, ఉగండాలోని అంకోలేలోని స్త్రీలతో, పోల్చవచ్చును. కెన్యాలో కికుయు వనితలవలె వీరు వ్యవసాయంలో కష్టమైన పనినంతా చేస్తారు. రాత్రీ పగలూ అనకుండా చేయవలసిన పని యిది. దీనివల్ల వచ్చే ఫలితంకూడా అంత ఆశాజనకంగా వుండదు. కాఫీ, అరటితోటలు తప్పించి వేరుసెనగ అంతగా ధరలేదు. ఆడది ఎంత శ్రమించినా యీ ధర తెచ్చే పంటల ఫలితం యింటి మగవాని హక్కు. ఇక్కడ స్త్రీలకి వారసత్వంలేదు. తల్లి తరపునుంచిగాని, తండ్రి తరపు నుంచిగాని ఏమీరాదు, సరికదా తెగపేరు వుండదు, ఆస్తి హక్కులేదు, యిక సరదా జీవితమే వుండదు. మగవారు చాలా బద్ధకస్తులు. ఉద యాన్నే సైకిలుమీద వెడుతూకూడా ఆనప బుర్రలో పోసుకుని కల్లు పట్టుకుపోతారు. అసలే స్త్రీలసంఖ్య హెచ్చు. అలాంటిది ఏకపత్నీ వ్రతం మిషనరీలు నిర్ణయించడంతో మరీ అధ్వాన్నం అయింది. కాని హాయతెగలలోని వనితలు యింట్లో పనిమనుషులుగానూ, నర్సులుగానూ బాగా పనిచేస్తారు. అందుకే బ్రతికిపోతున్నారు.

రెండవ ప్రపంచయుద్ధం తరువాత యూరోపియను కుటుంబాలతో వుంటూ ధనార్జన చేసుకునే వనితలసంఖ్య అధికం కా సాగింది. ఒకసారి ఉద్యోగంపోతే అనేక దారులు వారిముందు కనబడతాయి. ఎవరితోనో వెళ్ళి ఉండవచ్చు. అది ఒక మగవాడైనా కావచ్చు. ఇప్పుడు ఎక్కు

వగా ఆఫ్రికను పురుషులుకూడా తమ స్వస్థలాలను వదలి పనులు చేసు కొంటున్నారు. "వ్యభిచారి"(వెలయాలు)అన్న పదం యిక్కడ సరిపోదు: ఎదుటి వ్యక్తిని ఎక్కువసార్లు మారుస్తూవచ్చినా యీ పదం వాడలేం. విటులకోసం వెదుక్కోడంగా వీరు తయారుకారు. కాని వీరిని ''స్వంతం'' చేసుకున్న మగవారు యితరులకి అద్దెకిస్తూ వుండడంకూడా యిక్కడ కొత్తకాదు. దీనితో భారత దేశంలోని దేవదాసీల పరిస్థితిని పోల్చిచూస్తే అవి సంఘసేవా పరాయణతగానైనా తోస్తుంది. యీ దేవదాసీలు తామున్న దేవాలయాలను పరిశుభ్రపరచి పువ్వులతో అలంకరించేవారు. సంగీతం, నాట్యం, వాద్యాలు నేర్పించేవారు వీరికి. వీరిలో కొందరు చక్కని సంప్రదాయ సిద్ధమైన నాట్యానికి, మత కథలకి నిలయాలు. వీరు, వీరి పిల్లలూకూడా ఒక స్థానంకల్గి, సంఘంలో గౌరవంగా బ్రతికే అవ కాశం కల్గి వుండేవారు. అంతేకాక గుడివారు వీరికి ముసలితనం గడవ డానికి ఆధారం చూపేవారు. వీరి సంఖ్య విపరీతంగా పెరగకుండా చూసేవారు. అంతేకాదు, వీరికి ఇతర పురుషుల సాంగత్యం చాలాతక్కువ.

ఈ సమస్యను భారతదేశం ఎలా పరిష్కరించిందో జాగ్రత్తగా పరిశీలించడం ఆఫ్రికనులకు చాలా ముఖ్యం. అక్కడి జనం మిస్ మేయో తత్వంగల యూరోపియనులూ, అమెరికనులూ 'దేవాలయాలలో వెలయాలు' అన్నట్టు మాట్లాడడంతో-చాలా బాధపడ్డారు. అవినీతి పరు లని ముద్ర తీసుకోడం ఎవరికీ నచ్చదు. కాని యీ మాటకు ఎదురు తిరగడం మంచిని రక్షించడం కాదు; చెడ్డవారిని సంస్కరించడం కాదు. అది పూర్తిగా నిషేధించడం. అదీ జరగాలి. 'దేవాలయంలో వ్యభిచార' మన్న పదం హిందూ మతానికి వ్యతిరేకంగా ఉపయోగించడంతో - యిది త్వరితగతిని పోవాలన్న పట్టుదల ఏర్పడుతుంది. బ్రిటిషువారు వెళ్ళి పోవ డానికి ముందే యిది జరిగింది. ఆనాటి సంస్కర్తలకు-గాంధీ తత్వంతో అహింసా, ఆత్మ ప్రక్షాళనం మొదలైన వాటిపై ఎక్కువగా కృషి చేయా లనీ, అప్పుడే వృత్తిని వ్యాపారంగా చేయిస్తున్న పురుషులలో పరివర్తన అవకాశం కల్గుతుందనీ తోచలేదు. దీనికి బదులు వీరు న్యాయశాస్త్ర చట్టాలను స్త్రీలమీద ప్రయోగించారు. దీనితో ప్రప్రథమ వృత్తులలో

ఒకసైన దీని చరిత్ర చర్విత చర్వణం అయింది; దీన్ని చట్టరీత్యా నిషేధించడంతో వ్యాపారదృష్టి ఎక్కువయింది. నైతిక మూర్ఖులు తలెత్తారు. వ్యక్తిగతంగా వెలయాలు నేరస్థురా అన్నట్టు పోలీసు కేసు పెట్టాలని నిర్ణయాలు చేశారు. మహిళాసంఘ సేవకులుకూడ యిలాంటి ఉపయోగంలేని పద్ధతిని అమలులోకి తేవాలని చూశారు. కాని భారత రాజ్యాంగం దీనికి వ్యతిరిక్తంగావుంది. స్వీడెన్ యితర ఖండాంతర దేశాలలో యిలాంటి సమస్య లెలా పరిష్కరించారు అన్నది గమనిస్తే తెలుస్తుంది. వ్యభిచారం నేరంగా నెంచి పోలీసుబలగం ఉపయోగిస్తే దీని చెడు ఎక్కువ అవుతుందే కాని తగ్గదు. దీనితో పోల్చిచూస్తే దేవదాసీల పద్ధతే నయం అనిపించేదిగా తయారైంది; న్యాయ చట్టాల మూలంగా వ్యభిచారులూ, భోగం పడుచులూ రహస్య వ్యాపారంలోకి దిగి, తిన్నగా తైనాతీల చేతులలోకి, మానవ శరీరాల వ్యాపారంలో సిద్ధులైనవారి హయాంలోకి వెళ్ళి పడుతున్నారు.

ఇండియను, యూరోపియను పరిస్థితితో పోల్చి చూస్తే ఆఫ్రికను వెలయాలు బానిసగా తోచదు-కొందరి కిది ఆశ్చర్యంగా తోచవచ్చు; ఎందుకంటే ఆఫ్రికా అంటేనే బానిసత్వంగా అర్థం చెప్పుకుంటారు వీరు. 'ఉమలయ' అన్న బంటుపదం నిజానికి "విముక్తి నందిన" అని అర్థం చెప్పుకోవచ్చు. 'మలయ'కి కిస్వహిలిలో ధన సంపాదనద్వారా బ్రతికే కన్నెపిల్ల అని అర్థం. యీ పని ఉంపుడుకత్తెగా వుండి, దాసీగావుండి, నర్సుగా వుండికూడా చేయవచ్చు. ఇతర వృత్తులైన-టైపిస్టు, గుమస్తా, కౌట్లో సేల్స్‌గరల్ కావచ్చు. గవర్నమెంటు ఉద్యోగి, కమ్యూనిటీ డెవలప్‌మెంటు అధికారి, డాక్టరు ఎవరేనా కావచ్చు. 'మలయ' అన్న పదానికి వెలయాలుగా అర్థం చెప్పేది సహృదయులుగాని యూరోపియనులు కొందరూ, ఆఫ్రికను పురుషులు కొందరూ మాత్రమే.

స్వతంత్ర జీవితం సాగించే హాయతెగల వనితల విషయానికి వద్దాం. పై వూళ్లకుపోయి డబ్బు సంపాదించుకువచ్చి యిక్కడ యింటి దగ్గిర ఆస్తి సంపాదించుకుంటారు-స్వంతంగా. ఈ హక్కు నిజంగా గమనింప తగ్గది. వీరిలో చాలా తక్కువమంది యిదివరలో యిలాంటి

హక్కు లనుభవించారు. ఏదో-నిలోహ మెటిక్ తెగల రా కుమా ర్తెల కిలాంటి అవకాశం కల్గిందేమో-వారినుంచే దేవత మాట్లాడుతూందని నమ్మిక వుండేది కనుక. యిలా కొత్తగా ఏర్పడిన భూవసతికల వనితలు తరువాత జీవితంలో భూమి లేకపోయినా డబ్బువున్న, పరిశ్రమించే తమకు నచ్చిన మగవాడిని చేపట్టడం జరిగింది. ఇలాగా పై వూరుకి వెళ్ళడం, ధనం ఆర్జించడం అన్నది నాగరిక లక్షణం అయింది. హయస్త్రీలు నర్సులుగా ఆయాలుగా పనికత్తెలుగా పేరు తెచ్చుకోవడమే కాకుండా చాలా సరదా అయిన తత్వం కలవారుగాకూడా రాణించారు. వీరి యీ ఘనత మావ్ మావ్ ల వాడిలో మునిగివున్న కెన్యాలోవున్న నాకుకూడా వినిపించింది. కాని జాతీయ భావనకల హయ యువకులు యీ కీర్తిని యింకోలా చూస్తారు. దీనిలో అబద్ధంకాని. అసత్యంకాని లేదు. దేవదాసీలను వెలయాలుగా సంబోధించినప్పుడు ముప్ఫయిలలో భారత దేశంలో శాసన కర్తల కిలాంటి దృష్టేకదా వుండేది ?

చరిత్ర ఏదోవిధంగా చర్విత చర్వణం అవుతుంది. నిగ్రహం చూపాలని బోధించడం, కార్మికుల పరిస్థితులు బాగు చేయాలని తల పోయడం, పెళ్లయిన స్త్రీలకి ఉన్నత ప్రతిపత్తి, కుటుంబపు చిరాస్తులలో భాగం ? లేకుంటే వధువు ధరలోని ఆదాయం వధువుకే చెందేలా చూడా లనడం. ఇస్లాము చట్టాలిలాగా వధువుకేగాని వధువు తండ్రికని నిర్దే శింపవు... యిలాంటి వాటిలో ఏ ఒక్కటీకాదు. యీ యువకుల్లో సరికొత్త ఊహకి ప్రాణం పోసినవి. కొన్ని తెగలవారిలో ప్రభుత్వపు మద్దతుతో యిలాంటి విభజన ప్రారంభించారు. కాని తరువాత దీని ఫలితాలు, వాడుకలో లోపాలను చూపి తీసివేశారు.

బుహయలోని పరిస్థితి యింకోలావుంది. విక్టోరియా సరస్సు పశ్చిమ తీరంలో బకొబనుంచి యీ స్టాఫికాలోని ఏ రైలుదారికైనా, పట్ట ణానికైనా పడవలే ఆధారం. అలాంటి వాటిమీద ఒకదానిమీద నేనూ వచ్చాను. బకొబ రేవులో దిగగానే ఒకరిద్దరు ఆఫ్రికను కన్యలను చూడడం తటస్థించింది. అందంగా బట్టలు వేసుకునివున్న వారి నున్నని, గుండ్రని బుజాలమీదనుంచి తోలుసంచులు వేళ్లాడుతూ వున్నాయి, అక్కడ

రేవులో అందరూ వారిని ఆప్యాయంగా పల్కరిస్తున్నారు. ఎవరూ అసహ్యించుకున్నట్టు కనబడదు.

నేను విన్నకథ నిజమో కాదో తేల్చుకోలేదు కాని, ప్రస్తుతం టౌనులోవున్న ఒక స్త్రీ కొన్ని సంవత్సరాల క్రిందట హార్బరు అధికారులతో ఎలా దెబ్బలాడి గెలిచిందో కొత్తగా విన్నాను. నిలో-హెమిటిక్ తెగలకు చెందిన ఒక స్థానిక నాయకుని కూతురామె. వివాహం జయప్రదం కాలేదు. ఉన్న ఒక్క కొడుకునీ చదివించాలని కోరింది. అందుకని దగ్గిరవున్న రైల్వేస్టేషనుకి వెళ్లడానికి, అక్కడనుంచి ఏదైనా పెద్ద సిటీకి పోవాలని ఆమె నిశ్చయించుకుంది. అందుకని పడవ ఎక్కడానికి ప్రయత్నించింది. చాలామంది అడ్డుతగిలి ఎక్కనివ్వలేదు. పోలీసుల సహాయం కోరింది కాని చిక్కలేదు. అందుచేత వెనక్కి వెళ్లిపోయి స్థానిక అధికారులతో మొరపెట్టుకుంది - ప్రజాస్వామ్య దేశంలోనున్న తనకి యిష్టంవచ్చిన చోటికి వెళ్లేహక్కు వున్నదనీ, దాన్ని స్వేచ్ఛా పౌరునిగా తనకిచ్చి రక్షించవలసినదనీ కోరింది. ఇంకా ఎంతోమంది స్త్రీలు ఆమెతోసహా నిలచారు. దీనితో పికెటింగు ఆగిపోవలసి వచ్చింది.

యీ కథా నాయకురాలిని కలుసుకోడానికి ముందే యీ తెగలోని మగవారితో చాలా మాట్లాడ్డం సంభవించింది. గవర్నమెంటు అధికారం కల నేటివ్ అథారిటీ కౌన్సిల్‌వారి కోర్టు చూడ్డానికి వెళ్లాను. ఓ కొండ శిఖరాన వున్న యీ కోర్టు దగ్గిరనుంచి చూస్తే చాలా చక్కని దృశ్యం కనబడుతుంది. చుట్టూ పచ్చని లోయలు - అక్కడక్కడ స్థానికంగా వుండే, బకొలైట్ రాతిబండలు - అంతా అందంగా వుంటుంది. యీ రాళ్లని చూస్తూంటే సరస్సు గట్లవెంబ పెద్ద శరీరాలుకల పిల్లలు గులకరాళ్లలా తోస్తున్న యిళ్లతో ఒకరకం ఆట ఆడుతున్నారా అని తోస్తుంది. వీటికి వెనుకగా విక్టోరియాన్యసా నీలి అద్దంలా గోచరిస్తూంది, యూరప్ మొత్తంమీద అన్ని సరస్సులనీ ఏకంచేస్తే వచ్చేటంత పెద్దదీ సుందరమైనదీ యీ సరస్సు.

ఇంత సుందర దృశ్యం కనబడేలావున్న ఒక గదిలో పెద్దవాడైన ఒక ఆఫ్రికను అధికారి కూర్చుని వున్నాడు. పికెటింగు గురించి నేనడి

గిన ప్రశ్నలన్నిటికీ సమాధానం చెప్పడానికి సిద్ధంగా వున్నా రాయన. "బానవును అమీ యువకులు నయానో భయానో వారి నిక్కడ వుంచాలని-కాని తరవాత-పెళ్లిచేస్తారా? మిషనరీలు ఇద్దరు భార్యలకు ఒప్పుకోరే; కాఫీ తోటలవారి సంఘంలాగా సహకార పద్ధతి దేనో సృష్టిస్తారా?... అయితే భూమి ఏది? మనుషు లేరి? ధనం ఏది? ఎవరు యిష్టం లేనివాళ్ల చేత పని చేయిస్తారు? వీరిలో ప్రతి ఒక్కరికీ స్వంత భూమి కావాలంటారు. యింకా స్త్రీలకు పాస్‌చట్టాలు కావాలంటారు, ఇది కాస్తా వస్తే జాతి విచక్షణా ఉలికి చిన్న సందు యిచ్చినట్టే అవుతుంది, మన యువకులు తహతహలాడేది యిందుకేనా? గత ఒకటి రెండు శతాబ్దాల క్రిందట మా దేశం చవిచూసిన బానిసతత్వవ్యాపారాల లాంటి వాటికి మళ్లీ చోటివ్వటమా?" కాసేపు పూర్వపు బానిసత్వం గురించి చర్చించాం. తరవాత మళ్లీ ప్రస్తుత సమస్యకు వచ్చాం: "మేమే కారణం యిలాంటి స్థితికి అని చెప్పుకోవాలి. ముఖ్యంగా మా మగవాళ్ళు. స్త్రీల నెందు కిలా చూస్తారు వీళ్లు? ఇక్కడ యింతకంటె మంచి యిల్లు ప్రాప్తిస్తే మన ఆడవారు పైవూరు పోవాలనే అనుకోరు కదా?''

సుదీర్ఘమైన కుంజు ధరించిన యీ స్థానిక అధికారి చాలా బాధపడ్డట్టు కనిపించాడు. కాని నన్ను సాగనంపే సమయానికి తిరిగి కోలుకుని చక్కగా నవ్వాడు. నాకు తోడుగా యింకో యువకుడైన అధికారిని పంపాడు. వెళ్లి 'మలయ'ను చూడాలని - ఆవిడే పై కథానాయిక - స్థానిక నాయకుని కుమార్తె.

వాతావరణం ప్రశాంతం అయింది. టౌనులో ఆమెను కలుసుకున్నాం. అందంగా బలిష్ఠంగావున్న ఆవిడ యింకా వయస్సులో వున్నది కాదు. మాతోపాటు జీపులో కూడావచ్చి తన పొలం చూపెట్టింది. మొదట జీపులోని వెనక బెంచీలమీద కూర్చుందామన్నట్టు అనుకుంది. కాని వచ్చి ముందుసీటులో నా పక్క కూర్చోమని ఆహ్వానించగానే వచ్చి కూర్చుంది. టౌను దాటగానే ఓ కొట్టుదగ్గిర కారు ఆపింది. అక్కడ అరటిపండ్లు, అగ్గిపెట్టెలు, సిగరెట్లు, బీర్ అమ్ముతారు. కొట్టు చిన్నది అయినా పరిశుభ్రంగావుంది. మాకు తాగడానికి పానీయాలు యిచ్చింది.

పొలానికి సాగిపోడానికి ముందుగా....అక్కడ తిన్నని దారివెంట వెడితే వుంది-చక్కని యిల్లు-ఐదు గదులు-వంటగది, పడకగది వెనకవున్నాయి. నేలమీద చక్కగా గడ్డి పరచివుంది. వాటి సువాసన నాకు ఆస్ట్రియాను జ్ఞాపకానికి తెచ్చింది. గోడలమీద ఎలిజబెత్ రాణి, డ్యూక్ ఆఫ్ ఎడిన్ బరో, సెయింట్ ఆంథోని, చక్కని ప్రకృతిదృశ్యం ఒకటి - వేలాడు తున్నాయి. "కెన్యా శిఖరం కిలిమంజారో శిఖరంలాగా లేదూ?'' అంటూ సరదాగా అడిగింది ఆమె.

చక్కని పడకగది చూపింది. అందంగా దోమతెరతో వుంది మంచం. తరవాత పొలం చూపడానికి తీసుకు వెళ్లింది. ఎరువుకోసం చక్కగా గోతులు తవ్వివున్నాయి. ఎండిన అరటిఆకులూ చెత్తా వాటిని కప్పివుంచాయి. కాఫీమొక్కలు చక్కగా వున్నాయి - ఎక్కువ కాయలు కాసేలాగా వంగి వున్నాయి. మిలిటరీ బూట్సు ధరించిన ఓ పెద్దమనిషిని పరిచయంచేస్తూ 'స్నేహితుడూ జీవిత భాగస్వామీ' అంటూ పరిచయం చేసింది. కొడుకు చదువు పూర్తి అయినది కనుక స్వస్థలానికి తిరిగి వచ్చి యీయనతో నివాసం ఏర్పరచుకొంది. ఆ కుర్రవానికి కెన్యాలో గుమాస్తా వుద్యోగం దొరికింది. అక్కడే చదువుకున్న ఒక కికుయు వనితని పెండ్లి చేసుకోవాలని చూస్తున్నాడట.

"ఈ రకంగా చూస్తే పాపం వాడికి మీతెగ భార్య లభించదు. ఏ హాయా కన్య అలా కెన్యా వెళ్లిపోవాలని చూస్తుంది? అక్కడ ఆఫ్రికనులకి పాస్ చట్టాలూ అవీ వున్నాయి. అవునా?'' అని అడిగింది.

అవునంటూ కూర్చుని కబుర్లలో పడ్డాం మేం. కమ్యూనిటీ డెవలప్‌మెంటువారి మహిళా క్లబ్బులను గురించి మాట్లాడితే - "అవునవును, నాకు తెలుసు అవి. అక్కడ 'మలయ'తో స్నేహంగా వుందరు. అదీ కాక, నాకేం నేర్పిస్తాయి అవి-నాకు రాయనూ చదవనూకూడావచ్చు." అందామె. నా నోట్ పుస్తకంలో సంతకం పెట్టించుకున్నాను. ఇంగ్లీషులో రాసింది. ఆమె స్నేహితుడు దూర దూరంగా వుంటూనే గౌరవ పూర్వకంగా ప్రవర్తిస్తున్నాడు. నాతోకూడా వచ్చిన అధికారి మాట్లాడుతూ, ఆ రోజుల్లో-చాలా సంవత్సరాల క్రిందట జరిగిన పికెటింగు ఏదో తప్పయి

పోయిందనీ, యీామె చాలా గౌరవనీయురాలనీ చెప్పాడు. అంటూనే వ్యభిచారులుగా స్థానిక వనితలు తయారుకాకుండా జాగ్రత్త పడడం న్యాయమే, అది అలా అప్పట్లో ఆపేసి వుండకూడదన్నాడు. అతని మాటల తరువాత నిశ్శబ్దంగావుంటే—ఆవేశంతో చెప్పసాగాడు: "మీ తెగ పట్ల అనవసరంగా అసభ్యంగా ఎవరేనా ఎందుకు మాట్లాడాలి? మా స్త్రీల కెందుకు పాస్‌చట్టాలు వర్తించకూడదు? అవేవుంటే వీరిని పై వూళ్లపోయి వ్యభిచారులుగా తయారుకాకుండా చూడగల్గే హక్కు వుండేదికదా! అవకాశాలు వుండేవికదా? ఇప్పుడు కెన్యాలోవున్న అందరు ఆఫ్రికనులకీ పాస్ చట్టాలు వర్తిస్తాయి. పురుషులకుకూడా. అలాంటప్పుడు వివాహితులుగాని కన్యల కెందుకివి వర్తించకూడదు? వారు స్త్రీలుకదా! ఉట్టి స్త్రీలు! అబలలు!'' ఇంత చెప్పాక ఉత్తేజితుడై, చాలా చక్కగా చెప్పడం ప్రారంభించాడు. పెదవులు బిగించి మాట్లాడే యీ పద్ధతి నాకూ అలవాటు అయిపోయింది. మా స్నేహితురాలివైపు చూపుతూ ''యీామెకేసు చాలా విభిన్నమైన దనుకోండి; యీావిడ విషయంలో చాలా తప్పే జరిగిందనాలి" అన్నాడు. దీన్ని ఆవిడ ఖండించలేదు. పక్కవాళ్లింటికి వెళ్లి చూసివద్దాం రమ్మని నన్ను ఆహ్వానించింది. ఆ యిల్లు పెద్దదిగా వుంది. అరబిక్ ఫాషనుగా వెల్లవేశారు. ఇక్కడ నేలమీద చక్కగా గడ్డిపరిచి వుంది. కాని గోడమీది బొమ్మలు మటుకు అరబ్ సంప్రదాయాన్ని చూపే అచ్చుబొమ్మలు. ఈ యింటి యిల్లాలు ముస్లిమ్ వనిత. కొంచెం లావెక్కుతున్నట్టు కనిపించినా, చాలా చురుకుగా చలాకీగా వుంది. దారెస్సలామ్ నుంచి కొత్తగా వచ్చేసింది. ఇక్కడకంటె అక్కడ చాలా జల్సా జీవితం గడిపినదే. చక్కని అరబ్ లిపి రాస్తుంది. ఈ యిద్దరూ చాలా స్నేహితులవలె తోచారు. పై ప్రదేశాలలో తమ తెగల గౌరవాన్ని కాపాడాలని పోరాడిన మగవారి దృష్టిలో ఏమోకాని, ఈ యిద్దరూ గత జీవితాన్ని మరిచి, ఆఫ్రికను వాతావరణంలో యిమిడి పోయారు; ఏకాంతంగా వుంటూ, సంఘాలూ, రాజకీయాలూ, క్లబ్బులూ అంటే విముఖత కలిగివున్నారు. వీ టన్నిటినీ ఆఫ్రికను స్త్రీలకు స్థాపించాలని ప్రస్తుతం బ్రిటిష్ ప్రభుత్వం ఉబలాట పడుతూంది!

ఈ నాటి యీ యువకులు మంత్రులై ప్రభుత్వాలు స్థాపించేపక్షంలో యిటువంటి స్త్రీల పరిస్థితిని వూహించకలరా? స్వాతంత్ర్యం వచ్చిన టాంగన్యికాలో వీరి స్థితి ఎలా వుంటుంది? ఈ రోజు ఘన, గినియా, లైబీరియా, మొరోకో, సూడన్, టునిసియా, ఇథోపియా, యీజిప్టులవలె టాంగన్యికా కూడా తయారైననాడు వీరి పరిస్థితి ఏమిటి? అప్పుడు స్త్రీలకు కూడా పాస్ చట్టాలు వస్తాయా?

అది సామాన్య స్త్రీలకే అయినా ఒక సమస్యకు దారి తీయక తప్పదు.

వైజ్ఞానిక అభివృద్ధివరకూ, ఎప్పటి కప్పుడు కొత్తగా వస్తున్న వాటిని, పాత పద్ధతులను కాదని అమలులో పెట్టడం జరుగుతూంది. ఎద్దు బళ్లూ, రైళ్లూ కూడా చొరలేని ప్రదేశాల కీనాడు మోటారులూ, ఏరోప్లేనులూ వెడుతున్నాయి. యూరపులోకూడా వందలాది సంవత్సరాల ఉనికివున్న ఆస్పత్రులలోనే లేని ఎక్సురే పరికరా లీనాడు ఆఫ్రికాలో కొత్తగా స్థాపింపబడుతున్న ప్రతి ఆస్పత్రిలోనూ వుంటున్నాయి. అయినా కూడా సూత్రప్రాయంగా ఏ లోపంలేని యిలాంటివి ఒకొక్కప్పుడు అనుకోని ఫలితాలని యిస్తాయి. కదలని గాజు పలకలు చలి ప్రదేశాలలోనూ, ఉష్ణ ప్రదేశాలలోనూ కూడా ఉపయోగిస్తాయి వాటికి తోడుగా వుండవలసిన అన్ని హంగులూ వుంటే-వేడి తగ్గించే పద్ధతులు, వెచ్చబరిచే పద్ధతులు మొదలైనవి - ఎయిర్ కండిషనింగులేని ఒక రోడ్డువార హోటలులో యిలాంటి అద్దాల ఉపయోగం ఏమిటి? పనిచేయని ఆ సామానులన్నీ ఎందుకు రైళ్లలో? ఇలాంటి అర్థం పర్థం లేని వాటిని అనవసరమైన చోట్ల అతికించడం లాంటివి మినహాయిస్తే వైజ్ఞానికాభివృద్ధి పూర్తిగా యంత్ర పరికరాల వైపునకే మొగ్గి వూరుకుంటూందనాలి. కొందరు సాంఘిక ప్రణాళికలు వేసేవారు, యిలాంటి వాటిని దాటి మానవ సంబంధ బాంధవ్యాలలో ఎన్నో చిక్కు సమస్యలు తలెత్తి వున్నాయన్నది గుర్తిస్తున్నారు.

అత్యాధునికమైనవి, అడ్డురానివి ఎలాగైతే నిత్య జీవితంలో ఉపయోగానికి తేవాలని చూస్తున్నారో అలాంటివే సంఘపు కట్టుబాట్లలో

కూడా ఎందుకు తేకూడదని ప్రశ్నించవచ్చు. స్వీడెన్‌వంటి ఎన్నో దేశాలలో యీ వ్యభిచారంవంటివి నిర్మూలించడానికి అనేక రకాల ప్రయోగాలు చేయడం జరిగింది. వెలయాళ్ళు నేరస్థులని ఎంచి, పోలీసు బలగంతో వారిని వేటాడే పాతపద్ధతి సర్వత్రా ఒదిలివేయబడింది. ఇలాంటి పద్ధతి ఆస్త్రీలని ఇద్దరి పాలిట వదలివేస్తూంది: ఇటు న్యాయస్థానాలు; అటు తార్పుడుగాళ్లు. తొలి ప్రపంచయుద్ధం తరువాత, వ్యక్తిగత స్వాతంత్ర్యం విద్యా బోధనావకాశాలు, గౌరవనీయంగా బ్రతికేమార్గం చూపే ప్రణాళికలు తయారు చేయబడ్డాయి. ఈ ప్రయోగంవల్ల మానవత్వంతో కూడిన ప్రవర్తన కక్ష తీర్చుకునే తత్వంకంటె ఎక్కువ విజయవంతంగా కొనసాగవచ్చని తేల్చింది. దీనితో వీరి సంఖ్య తగ్గింది. వారి ఆర్థిక ప్రతిపత్తి పెరిగింది. దీనితో వారి కేదో ఒకరకం జీవనాధారం దొరుకుతుందన్న నమ్మకం చిక్కింది. యిటువంటి ఆశాజనకమైన ఫలితాలు ఉత్తర యూరోపులో కనిపిస్తాయి.

ఆఫ్రికను సంఘం యిటువంటి పద్ధతుల కింకా బాగా లొంగివచ్చే తత్వం కలది. ఎందుకంటే యిక్కడి ప్రజల మెదడులో రాగద్వేషాలు పూర్తిగా విషపు వేళ్ళని నాటుకోలేదు. వ్యభిచారులను పాపులుగా చూడాలని తోచదు వారికి. పాపికంటే సాంఘిక పరిస్థితులకు బానిసగా చెప్పుకోవా లటువంటి ప్రాణిని. ఇలాంటి దురభిమానాలు లేకపోవడంవల్ల వీరి పరిస్థితిని అవగాహన చేసుకోవడం సులభం అవుతుంది. దీనికి కారణం-సాంఘిక విషమ పరిస్థితి, శ్రామికఫలం దక్కకపోవడం, ఆర్థిక పరిస్థితులు-రాబడి పోబడి. 'అక్కరకూ సరఫరాకూ' వీరు దాసులయారు. పారిశ్రామిక కేంద్రాలుండి, పెద్ద పట్టణాలుండి, ఏకాకులుగావున్న మగవారు వుండి, వా రెక్కువగా సంపాదిస్తూ వుండి, అందమైన ఆడువారి సంఖ్య తక్కువగావుంటే....వ్యభిచారం అన్నది ఉండి తీరుతుంది. దీనికి చక్కని కావ్య నామధేయం యిచ్చినా (గ్రీసు, ఇండియా, జపానులలోలాగా) అందంగా వుండని యీనాటి పాశ్చాత్యు లిచ్చేపేరు యిచ్చినా — విడాకులకీ వివాహాలకీ శ్రావ్యమైన అర్థం వచ్చేలాంటి పదంవాడినా (కమ్యూనిస్టు దేశాలలోలాగా)-ఫలితం ఒకటే అవుతూంది.

భేషజాలులేని ఆఫ్రికనుకి 'మలయ' చెడ్డదికాదు: నేరస్థురాలు కాదు. బహిష్కృత అసలేకాదు. మారిన పరిస్థితుల కనువుగా మారవలసి వచ్చినప్పుడు ఏర్పడ్డ ఒక ప్రత్యేక వ్యక్తి. దీనికి కారణం ఆఫ్రికనులు కానివారితో చెలిమి. ఇతర దేశాలలో ఫలితాలను యిచ్చిన పద్ధతులను ఆఫ్రికాలో చాలా చక్కగా అవలంబించ వచ్చు. కాని, యితరులవల్ల నైతికమైన ఒత్తిడి తెప్పించి, పూర్తిగా విజ్ఞానవంతులు కాని ఆఫ్రికనుల చేత యీ పరిస్థితి అసలురూపు తెలుసుకోలేకుండా చేస్తున్నారు. దానితో మానవత్వం లోపించిన సంకుచిత పద్ధతులను, యూరోపు ఏవైతే యీనాడు వదలివేయాలని చూస్తోందో వాటిని, అమలులోకి తేవాలని చూస్తున్నారు.

అక్షరాస్యత నెరుగని ఆఫ్రికను సంఘాలనుంచి ప్రత్యేకమైన రాజకీయపు వ్యవస్థలను ఘనతతో సృజింప కల్గిన ఆఫ్రికను మేధావులు దీనికీ సరియైన ఒక పరిష్కార మార్గం కనిపెడతారేమో ? .. బ్రతికివుండి కొత్తను సృష్టించాలన్న ఆఫ్రికను ఆత్మబలం ...తన స్వంత పద్ధతులలో రూపం దిద్దుకొందుకు అవకాశం వుంది. అది ఫలవంతం కావడానికీ అవకాశం వుంది. ముఖ్యంగా మాతృహంశ లక్షణాలద్వారా-వ్యక్తిత్వాలను చక్కగా పొందికగా రూపొందించి జాతి నాగరికతలో వ్యక్తినీ, కుటుంబాన్నీ కలిపే శక్తి వుంది. దీనికి ఆడా మగా భేదంలేదు....

# 10. మాన్యతకు స్థానము

పరస్పుప్రయాణం చేసి నేను కంపల చేరగానే ప్రొఫెసర్ సదాల్ నన్ను మకరెరె కాలేజీకి తీసుకు వెళ్లారు. అక్కడ గత సంవత్సరంలో నేను ఏ భాగంలో వున్నానో యిప్పుడూ ఆ భాగమే వచ్చింది నాకు. శుభ్రంగా వున్న రెండు గదులూ, దానికి చేరివున్న వంటగదీ బాగున్నాయి. వేడినీటి స్నానమూ, తరువాత చల్లని నీరూ ఎంతో హాయిగా తోచాయి. అతి ప్రశాంతంగా వున్న పరిశోధనశాలా, నిశ్శబ్దంగా వుండే లైబ్రరీ అన్నీ నాకు నచ్చినవే. అన్నీ యిదివరలోలాగే వున్నాయి. కాని నా కేదో మార్పు కనబడింది.

ఇదివరలో యిక్కడ ఆగినప్పుడు ఇండియాలో స్త్రీల హక్కుల మీద ఉపన్యసించడం జరిగింది. అక్కడి ఆఫ్రికను విద్యార్థి నొకామె ఎన్నో ప్రశ్నలు వేసింది. ఇప్పు డామె టీచరుగా వుంది. నేను తిరిగి వచ్చినప్పుడు తన సహాధ్యాయినితో సహా నన్నూ భోజనానికి ఆహ్వానించింది. ఆమె యిల్లు అంతా పాశ్చాత్య పద్ధతిని అవసరానికి అనుకూలంగా వుంది. ఇంట్లో వున్న కప్పులూ సాసర్ల దగ్గిరనుంచి మా సంభాషణలోని సరుకుదాకా అన్నీ అలాగే వున్నాయి. కాని ఇంట్లో పని చేసే అమ్మాయిని మటుకు తెగకు చెందిన దానిగా పరిచయం చేసిం దామె.

సాయంత్రం తిరిగి నా వసతికి వెళ్ళి, ఆకాశంలో లేచిన సదరన్ క్రాసును చూపినప్పుడు జ్ఞాపకానికి వచ్చింది నేనింకా ఆఫ్రికాలోనే వున్నానని. ఉలుగురు కనుమల ఆఫ్రికాలో, మకొండె పీఠభూమి గల ఆఫ్రికాలోనే వున్నాననుకున్నాను. మకరెరెలో మారినది యూనివర్శిటీ కాదు; నేను దాన్ని చూసిన పద్ధతి. ఒక సంవత్సరం పాటు అసలు ఆఫ్రికాను దగ్గిరనుంచి చూసిన మీదట ఏర్పడిన నా దృష్టి మార్పు అది.

సూర్యోదయ సమయంలో యిదివరలో లాగే దట్టమైన పొగ మంచులు పీల్చుకుంటూ, పక్షులు రకరకాల చప్పుళ్ళు చేస్తూనే వున్నాయి. కాని యివి గుబురులను గురించి, అడవులను గురించి, పచ్చని అరటి తోటలను గురించి మాట్లాడడంలేదు. వీటిని చూస్తే ఆఫ్రికాకంటె నా కెక్కువ కాలంగా తెలిసిన దేన్నో గురించి చెప్తున్నాయి. వియన్నాలోని షోన్‌బ్రున్‌జూను జ్ఞప్తికి తెస్తూంది. చిన్నతనంలో నా చెల్లెలితోటీ, దాయీలతోటీ అక్కడ ఉదయంపూట నడిచేవాణ్ణి. అక్కడ పక్షుల గూటి దగ్గిర నిలబడి, ఎలాగేనా పక్షిశాస్త్రం చదువుతాననీ, దూరదూర దేశాలని— పర్షియా, ఇండియా, 'చీకటి ఖండం'లాంటి దేశాలని చూస్తాననీ కలలు కనేవాణ్ణి. ఆ దూరపు చిన్నతనంలో నా సరదా అంతా ప్రకృతి, జంతువులు, ముఖ్యంగా పక్షులమీద కేంద్రీకృతం అయి వుండేది. అప్పటికే నాకు దూర తీర దేశాల ప్రజలంటే ఆకర్షణ ఏర్పడింది. తరువాత అదే నా వృత్తిగా మారింది. పట్నాలలో యిస్త్రీబట్టలు కట్టుకొని అందరూ ఒకలాగే వుండే వారికంటె, ఆస్ట్రియను కొండలలో రంగు రంగుల దుస్తులు ధరించే రైతులు ఎంతో అందంగా కనిపించేవారు నాకు.

అనుకున్న దానికి తల్లక్రిందులుగా, మకరెరెలో నాకు కనువిప్పు కల్గింది. దరిదాపు ఎనభై జాతులనుండి వచ్చిన వందలాది ఆఫ్రికను విద్యార్థులలో, చాలామంది భారతీయులలోకూడా....కొంచెమైనా అందమైనవని అనుకోతగ్గవి ఇంగ్లీషు ప్రొఫెసర్ల దుస్తులే. మగవారు బుష్‌కోటులూ, స్త్రీలు రంగు స్కర్టులూ, చేతులులేని చిన్ని జాకెట్లూ. ఇంకా కొందరు భారతీయ యువతులు రంగు చోళీలూ (ఫ్రెంచివారి బికినీలలాగ), వాటికి

తగ్గట్టు జుట్టు కత్తిరింపులూ-యివే కన్పించాయి. దీన్ని వివరించడానికో అన్నట్లు ఒక ప్రొఫెసరుగారి భార్య చెప్పింది :

''దూరంలో ఎవరేనా పొట్టి లాగులు తొడుక్కు కనపడితే ఆ కన పడేది యూరోపియన్ అని నిర్ధారించుకోవచ్చు. కాని విక్టోరియా కాలపు సూటులో ఎవరేనా కన్పిస్తే అది ఆఫ్రికనో, యిండియనో అయి వుండాలి.''

ఉత్తర అమెరికాలోనూ, యూరోపియను స్కూళ్లలోనూ తగిన దుస్తులన్న వాటిని యిక్కడ విద్యార్థులు తామై కోరి ధరిస్తారు. ప్రత్యే కించి వస్త్రధారణ విషయంలో నిబంధనలు లేక పోయినాసరే, ఇటువంటి బట్టలు కొనడానికి, జాగ్రత్త చేయడానికికూడా ఖరీదు ఎక్కువ, తొడు క్కుందుకు కష్టం-అని తెలిసీ ఎందుకు ధరిస్తారన్నది విద్యార్థులతో ఒక సారి చర్చించాను. ఎందుకింత వస్త్రధారణ పిచ్చి?

"మీరనేది యూరోపియనులను గురించా? ...వారి కేం? హాయిగా తేలికగా బట్టలు వేసుకుని తిరుగుతారు. ఎంతో గౌరవం వెనుకనున్న వంజంగు కదా వారు. మేం ప్రస్తుతం నాగరికులమని చెప్పాలి. చిన్న పిల్లలం కాము మేం-యిప్పుడు-చిన్న లాగులు తొడుక్కోడానికి. వయ స్సులో తాతే అయినా యిప్పటికీ ఆఫ్రికను పనివాణ్ని బోయ్, పిల్లవాడా అనే పిలుస్తారు. యింకా మేం చిన్న పిల్లలం అని కాబోలు. అందుకే అర్థవంతంగా ఆలోచించలేం అనుకుంటారు. మాతోటి శాస్త్రజ్ఞుడు-లెవి బ్రుల్ రాసినది చదవండి "లమెంటలె ప్రిమిటివ్'' (మానసికంగా అనాగ రికులు.)"

1922 లో స్థాపించిన యీ కాలేజి ముప్ఫయి ఏడేళ్ళు గడిచాక యిప్పుడు సంవత్సరానికి 250 మంది స్త్రీ పురుషులు ఉత్తీర్ణులై వెడు తున్నారు. వీరు అంతాకలసి భవిష్యత్తులో తప్పక ప్రముఖ పాత్ర వహిస్తారు. ఉగండా, టాంగన్యికా, కెన్యా, జాంజిబార్, న్యాసాలాండ్, ఉత్తర రొడీషియా, సొమాలియా, సూడాన్ మొదలైన ప్రదేశాలనుంచి విద్యార్థులు వస్తూ వుంటారు. బోధనా పద్ధతి వికాస కార్యక్రమాలు

కూడా ఉన్నత శ్రేణికి చెంది వున్నాయి. లైబ్రరీ రీడింగు రూములో అధునాతన విషయాలమీద వచ్చే అనేక రకాల పత్రికలు వున్నాయి. వర్ణ భేదం వున్న జాడలు కానరావు. ఆఫ్రికను విద్యార్థులూ యూరోపియను ఉపాధ్యాయులూ కలసి మెలసి వుంటారు. విశాలమైన వసతి గృహాలలో నీరితోపాటు 'తెల్ల' విద్యార్థులుకూడా వుండడం కద్దు.

అయినా కూడా పైకి ప్రస్ఫుటంగా తెలియని ఏదో ఒక పక్షపాతం మకరెరెలో కూడ వుందేమో అనిపిస్తుంది. ఇది రంగుకు సంబంధించినది కాదు. క్రైస్తవేతరు లన్న విషయమూకాదు. కాని ఒక భావన వుంది: ఆ భావనే గన్థర్‌చేత యిలా అనిపించిందేమో: "విద్యార్థులు, రోమను కేతలికులు, ప్రొటస్టెంట్లు, ముస్లింలు ఎవరేనా కావచ్చు కాని పాగన్స్‌కు మటుకు ప్రవేశార్హత లేదు" నేను విచారించిన మీదట యీ స్టేట్‌మెంటు తప్పని తేలింది.

కాలేజీ ప్రాంతంలోనే ఓ చిన్న మసీదు వుంది. జాంజిబారునుంచి వచ్చిన ఓ చక్కని తలుపు మన భారతదేశంలో దక్షిణాది గృహాలకు వుండే కర్రతలుపు—లతలు చెక్కినది—దానికి వుంది. కాని దూరంగా వున్న యీ మసీదు ముఖ్య కట్టడాని కిటూ అటూ వున్న రోమను కేతలిక్, ఆంగ్లికను చర్చిలతో పోల్చి చూడలేము. టాంగన్యికా, జాంజిబార్ నుంచి వచ్చే ముస్లిము విద్యార్థులు-యిప్పుడు కొందరు విద్యార్థినులు కూడా వున్నారు—వారి మసీదును చిన్నచూపు చూస్తున్నందుకు బాధ పడవచ్చు. అయినా అక్కడ ప్రార్థనలు జరుపుకొంటూనే వుంటారు. కాని, ఆఫ్రికను పద్ధతిలో పూజ చేసుకుందుకు, ఓ ఆలయమో, చెట్టో అక్కడ వుంటుందంటే వూహకి కూడా అందని విషయం. కాని దీనికి కొంచెం దూరంలోనే లోయ దాటితే అవతలిపక్క కొండమీద కంపాలా మ్యూజియమ్ వుంది. అక్కడినుంచి మృదుమధురంగా జైలోఫోన్‌మీద నగొమ సంగీతం వినబడుతూ వుంటుంది. అక్కడి అధికారి సంప్రదాయాన్ని తెలుసుకుని, పాశ్చాత్య సంగీతపు నిపుణతను జోడించి యీ సంగీతం సాగిస్తాడు.



మసీదు ద్వారం (దక్షిణాది కర్ర చెక్కడపు పోకడలు గమనించవచ్చు)

మరి యీ ఆఫ్రికను మతాలను పాగన్స్ అని అంటారు. అలా కోపించడానికి కారణం ఏమిటి? విదేశీయమైనవన్నీ యింత త్వరగా రూపం దిద్దుకుంటున్నాయే! విద్యా సంస్థలలో యింకా కాలూని నిలచింది హిందూమతం: స్వాతంత్ర్యానికి పూర్వమే మిషనరీలు హిందువులని కూడ పాగన్స్ అన్నా, ఒక హిందూ యూనివర్శిటీ పెరిగి పెద్దదయింది.

నిజానికి ఆఫ్రికను సంప్రదాయ సంస్కృతులలో ఆంతరంగికమైన అసభ్యత లేదు. అక్షరాస్యత లేని పూర్వపువన్నీ ఒక్క లొసుగు తప్పించి. మూడువేల సంవత్సరాల అక్షరాస్యమైన సంప్రదాయపుదన్ను వుంది హిందువులకి, ఇదే బలవత్తరమైన గాంభీర్యాన్ని ఉత్తమ సంస్కృతి అనిపించుకోక పోయినా, నాగరిక సంస్కృతుల కున్న లక్షణములన్నీ వున్నాయి. హిందూ మతపు ఔన్నతికి భావ పటాటోపమే లేదు. అసలు హిందూ సంస్కృతి, హిందూమతపు ఘనత-అక్షరాస్యత మీదా, తదితర ఆయుధాలమీదా ఆధారపడలేదు. తిరువన్నామలైలోని రమణ మహర్షి చిన్నప్పుడే స్కూలునుంచి పారిపోయి వచ్చాడు. యీ నాటి పరీక్షామానంలో చూస్తే బెంగాలులోని రామకృష్ణ పరమహంస అంత విద్యావంతుడే కాదు, అయితే నేం-వారిద్దరూ కూడ గాంధీ కంటె, భావే, టాగూర్, నెహ్రూల కంటె భారతీయు లనిపించుకుంటారు. యీ సందర్భంలో పారసీకాని, ఒక వడ్రంగి కాని, యింకే విజ్ఞానవంతుడూ కాదు- మేధా సంపన్నులైన జూయిష్ ప్రజల మన్ననలను బడసిన వ్యక్తి. ఒంటెలు తోలుకొనే ఒక ఆరబ్ దేశంలోని అందరి కంటె మిన్నగా గుర్తించి ఆరాధింప బడిన సమయాలున్నాయి.

అక్షరాస్యులూ, సాంకేతిక నిపుణులూ నిరక్షరాస్యులను కిరాతులుగా గణన చేయడం శుద్ధ డాంబికమే. ఆఫ్రికాలో-ముఖ్యంగా మకరెరెలో కూడా యీ లాంటిది కనిపిస్తుంది. సాంప్రదాయికము అయినదాన్ని నాగరికత న్యూనతగా తలపోస్తారు. ఎందుచేత?- చదవడానికి రాయడానికి దాని కాధారం లేకపోవడంచేత; శీతల దేశాల కవసరం అయిన పూర్తి వస్త్ర ధారణ లేకుండ పోవడం చేత. ఇది మానవ పరిణామ శాస్త్రదృష్టి లోపించడం వలన ఏర్పడిన చిక్కు. యీ శాస్త్రజ్ఞులు-యీ నాగరికత కెరగాని జనుల దగ్గర కూడ విలువలున్నాయని, యివి నిజమైనవి, ఎదుటి వారి వత్తిడి వల్ల ఏర్పడినవి కావని నాగరికత బానిసలు కావని నమ్ముతారు. యీ ప్రజలలో ఒక తరహా ఆనందం. సంతోషం వుంది. ఇదే కనుక భూభాగం నుండి తొలగిపోతే-భూమికే లోటుగాని వారికి కాదు. అయితేనేం, ఇది

తెలిసీ కూడా, ఒక్కడుగు ముందుకేసి వాటిని ప్రోత్సహింపము; మన భాషలోకి అనువదించము.

టాంగన్యికా, తదితర ప్రాంతములకంటె వస్త్రధారణ విషయంలో ఉగండా పూర్తిగా పాశ్చాత్య పోకడల నవలంబించింది. సహృదయులు, కాని దూర దృష్టిలేని పాదరీలు సదుద్దేశంతో గౌనులాంటి దాన్ని అమలులో పెట్టారు. దాన్నే "మదర్ హబ్బర్డ్" "గోమజీ" "బోర్డింగ్" అని పిలుస్తూ వుంటారు. కన్యల వక్షోజాలూ బుజాలూ కప్పేలా ఒక జాకెట్టు సృష్టించారు. ఎందువల్లో యివి అసభ్యంగా తోచాయి వీరికి; ఇంకా ఒక భారతీయుని సహాయంతో దీనిలోమార్పులు తెచ్చి,గౌనూ జాకెట్టూ చుట్టూ కుచ్చెళ్లు వుండేలా ఒకే దుస్తుల జతను తయారు చేశారు. పిరుదులూ గట్రా జాగ్రత్తగా కప్పాలన్న భావనే దీని ముఖ్యోద్దేశం. ఇది నిజంగా మూర్ఖత్వం. కొందరు యుగండా యౌవనులు దీన్ని గ్రహించే యిలాంటి దుస్తులు వదిలేస్తున్నారు. నే చెప్పిన యిది ఓ ఉదాహరణ మాత్రమే. ఇలాంటివి కొల్లలుగా జరిగాయి.

ఉగండాలో నైలునదీ వూబి ప్రాంతాల తీరానవున్న ఒక పల్లెలో ఒక రోజు ఐదుగురం కూర్చున్నాం. చుట్టూ వున్న అరటి తోటల నుంచి ఆకుపచ్చని వేడి ఆవరించుకుంటూ వుంది. మేం వరండాలో కూర్చుని వచ్చి పడుతున్న యీగల గుంపుని అవతలకి నెట్టే ప్రయత్నంలో వున్నాం. అవి ఎండలో మాడి చస్తాయనీ, మేం నీడలో కూర్చోవచ్చుననీ ఆశ. మాతోవున్న సిలోన్ శాస్త్రజ్ఞుడు నాతో ఏకీభవించాడు. ఇక్కడ ఎండ యింకా తీవ్రంగా వున్నాకూడా యిక్కడి యీగలబాధా, తేమబాధా ఇండియాలోనూ సిలోనులోనూ కంటె అధికతరం అని ఒప్పుకున్నాడు.

మా కాతిథ్యం యిచ్చిన గంబలోలా ఛీఫ్ లైమ్‌జూస్ యిచ్చాడు చిన్న పింగాణీ కప్పుల్లో. తీక్షణం అయిన అతని ముఖంమీదనుంచి చెమట ధారలుకట్టి ప్రవహించి మెడమీదినుంచి చొక్కా మెడలోకి యింకిపోతూంది. యీ చొక్కాపైన కంజు ధరించాడు. యీ కంజూ పొడుగాటి కోటు. ఒంటెలు తోలుకొనే అరబు వర్తకులు ఎడారుల్లో యిసుక

తుఫానులనుంచి రక్షించు కుందుకూ, గాలి బాగా పోసుకొందుకూ అనువుగా వుంటుందని యీ ఒక్కటీ ధరిస్తారు. కాని మా అతిథి మటుకు యీ కోటుకు పైన బిగువుగా జాకెట్టూ, కాళ్లకి వూలు మేజోళ్లూ, నల్ల బూట్లూ ధరించాడు, దీనితో మూడు పొరల దుస్తులు ధరించాడన్నమాట.

ఇతనితో కూడా యితని మేనకోడలు వుంది. నడుం మీద అరటి గెల అన్చుకుని మృదువైన మునివేళ్లతో మా కా అరటి పళ్లు అందించింది; ఆమె ముఖం ఎంతో మృదువుగా అందంగా వుంది. ఇలాంటి బొమ్మే చూసి ఆనందించాను నేను-హోటల్లో. ఆ బొమ్మలో అమ్మాయి స్నానం చేస్తూంది. అందంగా ఉన్న ఆ శరీరం మీద నీటి చుక్కలు ముత్యాల్లా మెరుస్తున్నాయి. నా ఎదుట ఉన్న అమ్మాయి కూడ అదేతెగకు చెందినది. కాని గడ్డితో నేసిన పావడా కట్టుకోలేదు. బిగువైన సూటు ధరించింది. ఆ నీలపు చారల సూటు ఆమె అవయవాల సొంపును యినుమడింప చేసినా, పైన ధరించిన బిగువైన జాకెట్టు మూలంగా పెదవుల దళసరీ ముఖపు గుండ్రనా యినుమడించి లావుగా పొట్టిగా తెలుస్తుంది మెడ; జోళ్లులేని ఆమె పాదాల నడక చక్కగా వూగిస లాడింది; నాగరికంగా దుస్తులు ధరించిన మేనమామ ప్రక్క ఆమె ఎంతో 'చల్లగా' 'హాయిగా' తోచింది; కాని, నేను బొమ్మలో చూచిన అమ్మాయితో పోల్చి చూస్తే మటుకు పోలిక శూన్యం అయింది.

నీడలు సుదీర్ఘం కాసాగాయి; ఎండ వేడిమీ తగ్గింది. హాయిగా కాలక్షేపం చేయకలమని తలపోసే అదనులో ఒక కారువచ్చి ఆగింది. మా చుట్టూ నిశ్శబ్దం ఆవరించింది. నా స్నేహితుని లాగే బట్టలు వేసుకుని ఒక వ్యక్తి దిగాడు ఆ కారులోనుంచి. మొదట అతన్ని, తరువాత మమ్మలనీ తీక్షణంగా చూశాడు. "ఆఁ అంతా-వా-జుంగు! పెద్దలు!" అప్పుడే తొలిసారిగా ఆఫ్రికాకు వచ్చిన కేంబ్రిడ్జి విద్యార్థిని చూపిస్తూ "నా పుట్టుకకు కారకుడు!" అంటూ ఓ క్షణం మౌనం వహించి "అంతా ఉత్తములైన క్రైస్తవులనే తలుస్తాను? నా పెద్దకు, సోదరునకు విషాద వార్త అందించాలని వచ్చాను....మీ తండ్రి కాలంచేశాడు!" అంటూ అత

నికి చెప్పాడు. ఇదంతా తాగిన కల్లు ప్రభావంగా తోచింది. ఎంతో నేర్పుతో నటించాడు.

మా ఛీఫ్ ఎంతో హుందాగా నిలబడి తల వంచాడు; తిరిగి కూర్చున్నాడు. అతను ఆ మధ్యాన్నానికంతా మా మధ్య కూర్చోడం యిదే. నా కెంతో బాధ అనిపించింది. మాలోవున్న ఆఫ్రికను టీచరు నాచెవిలో చెప్పాడు-ముసలివాడైన యితని తండ్రి ఉదారుడు; అంతా గౌరవించారు. యీ వార్త చాలా రోజులుగా ఎదురు చూచినదే; యిప్పుడు వచ్చిన యీతడు డాక్టరు; నేటివ్‌రకం. యితని తల్లి తొలి యూరోపియనుల దగ్గిర పనిచేసింది. యితని పనీ బాగానేవుంది - యీ తాగుడు బాధతప్ప. మేం మరునాడు వెళ్ళి దహన కార్యక్రమంలో పాల్గొనాలని నిశ్చయించుకున్నాం. "అక్కడ సాంప్రదాయికం అయిన ఆఫ్రికను దుస్తులూ అవీ చూడవచ్చు. ఒక్క అరటి ఆకుల దుస్తులేకాదు; బెరడు చెక్కినవి కూడా!" అని చెప్పాడు.

ఎత్తు ప్రదేశంమీద వున్న యీ గృహ ప్రాంతంలో అరటి తోటలు గాని, ఏవిధమైన చెట్టు చేమలుగాని లేవు. ఉదయకాలపు ఎండవేడి ఏదెన్సులో జూలై మాసపు వేడిని గుర్తుకు తెస్తుంది; చుట్టుపక్కల పది మైళ్ల దూరంలో నివసించే అందరూ ఎడతెరిపి లేకుండా రా సాగారు. ఎండకు వేడెక్కిన నేలమీద కూర్చుని శ్రాద్ధకర్మలు ఎదురు చూడసాగారు. ప్రముఖులైన కొందరికీ, మాలాంటి సఫారీలకీ ప్రత్యేకించి కర్ర కుర్చీలు వేశారు అకులతో కట్టిన నీడక్రింద. ఇలాంటి కుర్చీ లీనాడు ఆఫ్రికను రైతు లిళ్లలో మామూలైపోయాయి. క్రితం రోజులాగే మా స్నేహితుడు లైమ్‌జూసూ, అరటిపళ్లూ మాకు అందించాడు.

యీ పల్లెటూరి దహన క్రియలు - వ్యక్తిగతమైన మనోభావాలను ప్రదర్శించేకంటె పల్లెటీయుల ఐక్యతను నిదర్శించి చూపుతాయి. యిక్కడ కూడా అంతే; ఏ మనమరాలో, కూతురో పిల్లలతో వచ్చినప్పుడు తప్ప. చనిపోయిన వ్యక్తికోసం వీరి ఏడుపు గమ్మత్తుగా ఓ లయబద్ధంగా సాగింది; సంప్రదాయకమైన ఒక సౌందర్యం-జీవితంలో ఎదుర్కోక తప్పని ఓ నిత్య సత్యాన్ని నిరూపిస్తూంది-అదే మృత్యువు.

వచ్చేవారు అలా వస్తూనే వున్నారు. ఇరవయ్యో శతాబ్దపు మధ్య కాలంలో ఆ తూర్పు ఆఫ్రికాలోని రైతులు; దృఢకాయులు. మనకి ఐర్లండుకీ పోలెండుకీ మధ్యగాని, నార్వేకీ టర్కీకీ మధ్యగాని యిలాంటి గుంపులే కన్పిస్తాయి; కాని వీరి శరీరపు రంగు ముదురు; ఆడ మగల జుట్టు ఒకే బిరుసుగా వంకీలు తిరిగివున్నా, కొంచెం తేడా కన్పిస్తుంది జాగ్రత్తగా చూస్తే. కాని, యిట్టే అలవాటు అయిపోతాయి యీ శారీరకమైన తేడాలు. వాటికంటె నాకు విపరీతంగా తోచినదీ, ఓ పట్టాన అలవాటు పడలేక పోయినదీ వస్త్రధారణే.

ఇది మాటల్లో చెప్పడం కష్టం. ఉత్తర యూరోపులోని వస్త్ర ప్రదర్శనను యీ ఉష్ణదేశంలో వూహించడం ఎలాగ? గంట తరువాత గంట గడుస్తూంది. వేడి నేలమీద వచ్చే పోయేవారి చెమట ప్రవహిస్తూంది. అక్కడ చూసిన వాటిల్లో ఒకటీ రెండూ ఉదాహరణగా చూపకలను. పూర్తిగా చెప్పడం నా తరంకాదు. ఓ కుర్రాడు వచ్చాడు. స్త్రీలు ధరించే కోటు వేసుకున్నాడు. మెడదగ్గిర చుట్టూ బొచ్చుతో కుట్టిన చర్మపు కాలరు వుంది. పాత బట్టలవ్యాపారి దీన్ని రిపేరు చేసే ప్రయత్నంకూడా చేయలేదు. ఈ విపరీతపు దుస్తులకు పైన ముఖం చిన్నదిగా అయిపోయి, విశాలమైన టోపీలో దాక్కుంది. ఇదే వయస్సులో వున్న యింకోడు, సైనికుల బూట్లూ నీలి వూలుపాంటూ ధరించాడు. ఇతన్ని చూస్తేనే కాళ్లు దురదలుపుట్టాయి! లేత పసుపురంగు వూలుచొక్కా చెమట కారుతున్న శరీరంపై తొడిగేశాడు. సైజు పెద్దది కావడంచేత అతని ఛాతీ పైకి కన్పిస్తూనే వుంది. దానిమీద గళ్లచొక్కా ధరించాడు. బాగా చిరిగిపోయిన ఆ చొక్కాకు వీపులేదు, మోచేతుల్లేవు. అంతా ఓ సాలెగూడులాగ వుంది. యిలాంటి సాలెగూడు షర్టులు ఆఫ్రికాలో చాలా ప్రచారంలో వున్నాయి. 'లోపలేమీ లేకుండా ధరిస్తే శరీరం చూపి సిగ్గుపడవలసిన విషయం' అన్న విక్టోరియను అభిప్రాయాలకీ, కొంచెం చల్లని గాలి కావాలన్న మానవ తహతహకీ కూడా మధ్యవర్తులుగా వుంటూంటాయి యీ షర్టులు. యీ షర్టుల్లో చాలా రకాలున్నాయి. అవసరానికి మించిన వేగం ప్రదర్శిస్తే యివి ఏముక్క కాముక్కగా విడిపోయే అవ

కాళంలేదు. అసలు ఆ గళ్ల చొక్కా దగ్గరకు వద్దాం. దీనికితోడు శ్రోత్రియమైన టోపీ ఒకటి ధరించాడు. వకీలు నిజానికింకా తమ సాంఘిక ప్రతిపత్తికి తగినంతగా వస్త్రధారణ చేస్తారు. మా స్నేహితుడు గంబలోలా ఛీఫ్‌ధరించిన దాని కంటె ఎక్కువగా ఒక పిల్కాగుడ్డో కండువానో ధరిస్తారు.

ఇలాంటి ఖండాంతర వస్త్రధారణల కలగలుపు ఆఫ్రికా అంతటా చూస్తాము. పాతగుడ్డలవ్యాపారుల కిది పెన్నిధి. మగవారి దుస్తులకంటె అనాగరికతలో ఆడువారివేం తీసిపోవు. ఉగండాలో వనితలు చాలమంది 'గోమాజి' ధరిస్తారు, బుజాలు నగ్నంగా కనబడకుండా మడతలు మడతలుగా గుడ్డ వుంటుంది. ఎడంభుజంమీదికి రెండు పెద్ద బొత్తాలు. యిక ఒక్క బుగ్గలరంగు తరవాయి నాగరికత పూర్తి కావడానికి. రంగులద్దిన జేబు రుమాలులాగ తోస్తుంది వీళ్ళని చూస్తేనే! ఆ ముదురు మోటు జుట్టు అక్కడి తీవ్ర ఉష్ణతకి రక్షణగా వుపయోగిస్తుంది. దానిమీద యీ రంగుల రుమ్మాలు కడతారు-సభ్యతకోసం.

ఇలా 'గోమాజి' ధరించిన స్త్రీలు పురుషులలాగా దొంతరలుగా దుస్తులు ధరించరని తలుస్తారేమో! అదేంలేదు. ముఖ్యంగా ఉత్సవసమయాలలో మధ్యాహ్నం వేళ ఏ పలుచటి చొక్కాకూడ భరించలేమనిపించే వేళల్లో-దళసరీ, ముదురూ, అద్దకం బట్ట గోమాజిపైన బిగువుగా ధరిస్తారు. పూర్వంలో బెరడుతోచేసిన దుస్తులుగా యీ ఒక్క పేలికనే ధరించేవారు. అందంగా లేత మట్టిరంగులో వుండే యీ బట్ట యీనాడు అనాగరికం-చెండిగా లెక్కింప బడుతూంది. ఓ మారుమూల పల్లెనుంచి వచ్చిన ఒకే ఒక కన్నెపడుచు యీ బెరడుబట్టని ధరించింది, సంప్రదాయికమైన పద్ధతిలో. అక్కడ చేరిన వాళ్ళ మధ్య, పిశాచాలనడుమ దేవకన్యలా, రాజకుమారిలాగా తోచింది ఆమె.

యీలోపునే ఆ కర్మలకు ముఖ్యఘట్టం వచ్చినట్టుంది. చనిపోయిన అతని ఏడుగురు భార్యలూ శవంచుట్టూ ఓ లయబద్ధంగా తిరుగుతూ, కీచుకంఠాలతో ఏదో పాడుతున్నారు. అలా వారి విచారం తెలియచేస్తున్నారు.

యీ దుఃఖ ప్రదర్శనలో విషాదకరమైన ఏదో అందంవుంది, సంప్రదాయి కమైన వస్త్రధారణలోలాగే. ఈ సమయానికి తన కారులో ప్రొటెస్టెంటు మతగురువు వచ్చాడు. నల్లసూటు ధరించిన ఆఫ్రికన్ యితడు. తవ్విన సమాధిదాకా నడిచివచ్చేసరికి అతని కాలరుకాస్తా మెత్తపడిపోయింది! ఇక్కడో యిబ్బంది వచ్చింది. తవ్విన చోటు శవపేటిక పెట్టడానికి సరి పోదు. యిప్పుడేం చెయ్యాలి? తవ్విన వాళ్ళు ధైర్యంచెప్పారు. ఇంకో గంటా రెండు గంటల్లో వైకింగ్ ఛీఫ్‌ను పాతే తెప్ప కూడా పట్టేటంత పెద్ద గొయ్యి తవ్వగలం అన్నారు. దానితో మాకింకా వేచివుండి ఆలో చించడానికి వ్యవధి చిక్కింది....

యూరోపియను పద్ధతి వస్త్రధారణ యిలా అపసవ్యంగా పరిణమిం చడాన్ని చూసింది, నే ఒక్కణ్ణే కాదు. ఆధునిక ఆంగ్లనవలలన్నీ ఎన్నో విధాలుగా యీ ఆఫ్రికాలో వ్యంగ్య చిత్రాలను వర్ణించుతాయి. యూరోపియ నులను అనుకరించి తమని తామెలా కించపరచుకుంటున్నారో తెలుస్తుంది- ముఖ్యంగా దుస్తుల విషయంలో. ఇదేమిటి? వేళాకోళమా, అంత కంటె ఎక్కువ దేదైనానా? యీ నాగరికతా వికటత్వానికి కారకులెవ్వరు? యిది నిజానికి ఒక నాగరికతకే చావుదెబ్బకదా?

యీ విషయమై నేను కొందరు యూరోపియనులతో చర్చించాను. వీరిలో ఆశావాదులు యిదో గడిచిపోయే పిచ్చి అని నమ్ముతారు. కాని యీ 'గడచిపోయేది' అనడానికి ఒక్క ఆధారంకూడ చూపెట్టలేరు. ఇంకొందరు అపహాస్యత ప్రదర్శిస్తే, మరికొందరు యీ వ్యంగ్యాన్ని ఆనందిస్తున్నట్టు కనిపించారు.

మనుష్యుల ఆత్మలో - అర్థం పర్థంలేని రంగుల పొందిక అనవ సరపు టాందోళన కల్గించవచ్చు. శరీరానికి గాలి లేకుండా చేస్తే మనిషి కొన్ని సమయాల్లో చనిపోవచ్చు కూడా. ఇది మనకి తెలుసు. కాని యిదే ఒక జాతికి, ఒకదేశానికి ఏంచేయకలదో మనం ఊహించలేము. ఇదే పద్ధతిని గత మూడు తరాలుగా ఒక జాతికి, దేశానికి అందిస్తుంటే ఏమవు తుందో మనకి తెలియదు. లేక తెలుసా?

నాగరిక దేశాలలోకి సభ్యులుగా రావాలని కోరుకొనే వారికి, యిలా మాయపూతలతో బ్రతికితే తప్ప దారి లేదని నమ్మే స్త్రీ పురుషులలో ఒక నిశ్చలత్వాన్ని మనం ఎదురు చూడ కలమా? అసంభవం. కాని యీ ఉన్న పరిస్థితికి కారకులెవ్వరు?

"జాతీయులే! యీ అర్థంలేని దంతా ఎవరు చెయ్యమని అఘోరిస్తున్నారు వీరిని, మేంకాదే'' అని తక్షణం సమాధానం చెప్తారు అక్కడి తెల్ల జాతులవారు; అక్కడ ఆఫ్రికా భూమిపై నిలదొక్కుకోవాలని తాపత్రయ పడేవారు. పూర్వపు రోజుల్లో వీళ్ళంటేనే మాకెంతో యిష్టం. వారి స్థానం తెలుసుకుని వుండే వారు. అక్కడే వుంచేవాళ్ళం కూడా. నిజాయితీగా, కష్టించి పనిచేసేవాళ్లుగా వుండేవాళ్ళు. వారి సంప్రదాయికమైన దుస్తులకి, ఆచారాలకి, అలవాట్లకి కట్టుబడి వున్నంత కాలం ఎంతో సంతోషంగా వుండేవాళ్ళు. కాని యిప్పుడో? యూరోపియనులలా నటిస్తూ పరుల భార్యలనిగిల్లుతూ, స్వాతంత్ర్యాన్ని గురించి మాట్లాడుతారు! దానికంతా కారణం పైవాళ్ళ జోక్యమే. మిషనరీలు, ప్రభుత్వ నిబంధనలు,వీటన్నిటికి పైన యిప్పుడు శ్రామిక పార్టీ నాయకులు. "కాని మేం ఏంచేయకలం!'' అంటారు ప్రభుత్వోద్యోగులు. ఇది పరిణామపథం! అభ్యుదయ మార్గం! కాలమానాన్ని వెనక్కి నెట్టలేరు కదా! మనంధరించేబట్టలు కొన్ని సమయాలలో విసుగేసినా, మనని వాటిలో చూస్తారు వీరు. వీటిని పాతగుడ్డల వర్తకులదగ్గిర నుంచి, యిండియను వ్యాపారుల దగ్గరనుంచి సులభంగా కొనుక్కోవచ్చు. వాళ్ళకి అడ్డు చెప్పడానికి మనం ఎవరం? అందుకు ప్రయత్నిస్తే నరకం చూడాలికదా!

ఇలాంటి అసహాయత నిజమని తోచదు.

భూసారం పాడయే పద్ధతుల్లో దున్నడానికి బదులు నాగళ్ళు పెట్టినట్టి యీ పద్ధతిలో కూడా ఏదో ఒక పనిచేయాలికదా! శస్త్రాస్త్రాలు, వ్యాపారదృష్ట్యా అడవుల పెంపకం వాటి వినాశానికి దారితీస్తే, క్రూర మృగాలకి రక్షణ ఏర్పాట్లు, జాతీయ పార్కులు సృష్టించడం లేదా! అర్థం అవసరంలేకుండ ప్రజలు కొకైన్ వాడడం మొదలు పెట్టితే, హిరోన్

యితర విషపూరిత ఔషధులు వాడుతే - "అది విజ్ఞాన శాస్త్రపురోభివృద్ధి" అని సమాధానం చెప్పుకోవడంలేదే! "వాళ్ళని వాళ్లే హతమార్చుకో దలుచు కుంటే, కానీయి, మనమేం చేయగలం?' అని వూరుకోవడం లేదే!

అయినా ఉష్ణదేశాలలోని దుస్తుల ధారణ యీనాడు విపరీతాలు పోయినా కొందరు బాహాటంగా సంతృప్తిని వెలిపుచ్చుతున్నారు. ఒక స్కాండినేవియన్ యింజినీరు యింట్లో ఆఫ్రికాను గురించిన చక్కని పుస్తకం ఒక్కటి చూశాము. ఆతనిచుట్టం ఒకడు దాన్ని ప్రచురించాడు. ముఖచిత్రంగా ఆఫ్రికను దుస్తులలోఉన్న ఒక ఆఫ్రికను కన్నెకను వేశారు. ఎంతో వాస్తవికంగా నాజూకుగా నాగరికంగా తోచిందది. మాలో ఒకరు దాన్ని చూసి—

"ఇదంతా యిప్పుడు పోయింది. అన్నారు. "అదంతామంచికే జరిగింది" అన్నాడు, ఆప్రాంతంలో ప్రాముఖ్యం వహించిన ఒక యూరో పియను. నిజానికి తాను మిషనరీకాదు, వలసవాడూ గాదు. 'కాదుకాదు, నిజానికిది విచారింపతగ్గది, ఆర్థిక, ఆరోగ్య, నాగరికతల దృష్ట్యా యిది విచారకరమైనది; దేశంమొత్తంమీద యిది మనకీ వారికీ కూడా విచారకర మైనది అన్నాడొక అధికారి. కాని మనం పొట్టిలాగులకి, చిన్న చొక్కా లకి అలవాటుపడితే, వాగ సూట్లూ జాకెట్లూ అలవాటు చేసుకుంటున్నారు, అదీ ధరించిన కంజూలకి క్రిందామీదాను! ఇదే అభ్యుదయం అని వాళ్ళు తలపోస్తున్నారు. అదే అభివృద్ధిగా భావిస్తున్నారు. అదే మాన్యతకు స్థానంగా యెంచుతున్నారు. వీరికి నేర్పాలని మేము నగ్నంగా-పోవాలా? మా గవర్నరులు మస్సాయి ఛీఫ్స్‌లాగ వస్త్రధారణ చేయాలా?"

ఇలా ప్రశ్నించితే దీనికి వొకే సమాధానం వుంది గాని యింకా మధ్యేమార్గాన్ని అమలులోకి తేడానికి అవకాశం వుందేమో—

"రోములో రోమనులా ప్రవర్తించు" అన్న యింగ్లీషునానుడి అప్పుడప్పుడు అమల్లులో కూడ వుంది. తొలిస్వాతంత్ర్య సమరం అనబడే సిపాయిల తిరుగుబాటు దాకా, మొగలు ప్రభువులదగ్గిర మన బ్రిటిషువారు మొగలు దుస్తులు ధరించారు. ఆ తరువాతనే యీ ఉష్ణదేశాలలో కూడ

యూరోపియను పద్ధతి వస్త్రధారణ అమలులోకి వచ్చింది, అవసరం అయింది. రెండవ ప్రపంచయుద్ధ అనంతరం సైనికులు, ఆఫీసర్లు, ఇంజనీర్లు, శ్రామికులు, అందరూ తీవ్రమైన ఎండల్లో చొక్కాలు వదిలేసేవారు. మలయాలోని బ్రిటిషువారికి సరాంగ్ కూడా నిషిద్ధంగాదు. ఇదేనా మాఘమ్ వర్ణనలను నమ్మకల్గితే. మిషనరీలలో, అధికారవర్గాలలో, ఓపట్టాన ఆచారాలు వదులుకో లేని శ్వేతజాతి నివాసులలో - యీ తెల్లవారి బట్టలు గర్వకారణంగా మిగిలాయి, ఇదిలా వున్నంతకాలం ఉష్ణదేశాలలో యూరోపియనుల వునికిచాలు - ఆఫికనుల సాంస్కృతిక పునరావాసం కుంటుపడడానికి. ఇది నిరాశావాదిదృక్పథంగా తోచవచ్చు కాని, అనుకోని పరిణామాలకు అనువైన కాలంలో జీవిస్తున్నాము. యీ చిన్నగోళంలో ఎవరి గొడవ వారిదన్న దానికి స్థానంలేదు. యీ సమస్యలను గురించి నేను ఆలోచిస్తూనే వున్నాను. సూర్యుడు అస్తమించాడు. చల్లబడింది. కొద్ది సేపటిలో చీకటి కూడా ఆవరించు కుంటుంది. కాని సమాధి తవ్వేవాళ్ళు కూడా బద్ధకించలేదు. ఏమాత్రం కిష్టంలేకుండా శవపేటిక పట్టే అంత పెద్ద గోతిని తవ్వారు. పూర్తిగా చీకటి ఆవరించుకొనే లోపలే తుది క్రియలు కూడా పూర్తి అయాయి. అన్నీ ముగిశాయి. మేమూ మా కాంప్ వైపు నడిచాం, హాయిగా భోజనం చేదామన్న దృష్టితో.

కాని, నా సిలోన్ స్నేహితుడు చిరునవ్వు ముఖంతో వెనక్కి పిలిచాడు. అప్పుడే పూడుస్తున్న సమాధివైపు చూపెట్టాడు. దగ్గరే యీ మరణవార్త కొని తెచ్చిన నేటివ్ డాక్టర్ నిలబడి వున్నాడు, ఏదో త్వరిత గతిని చేస్తున్నాడు. ఏమిటది?

మొదట, లయబద్ధంగా కదలుతున్న అతని చేతులు చేస్తున్న పనేమిటో నాకు తెలియలేదు. వస్తూన్న నవ్వు నాపుకొంటూ నాస్నేహితుడు చెప్పాడు అప్పటికి నాకే కనిపించింది. ఆ చేతులు పాత ఫ్లిట్ పంపుగా పనిచేస్తున్నాయి. యింకా మూయబడని సమాధిని పరిశుద్ధం చేయడానికి గాబోలు!

క్రిమిహారిణా మృత జీవికి బహూకరణ? ఎందుకు కాగూడదు? మన దృష్టికి అర్థరహితంగా తోచవచ్చు గాని అంత అర్థం లేనిది కాదు; ఇదంత ప్రమాదకరమైనదికాదు. నే నా సాయింత్రం చూపిన దానికంటె యీ అనుకరణ విపరీతమైనదికాదు; ప్రమాదం లేనిది.

నాగరికతను అలవరచుకొందామని ఆత్రుతపడేవారు తమ పెద్దలను చూసి, అతిరాస్యులైన సంఘ ప్రజలను చూసి - నాగరికత, అభ్యుదయం, నాజూకు నేర్చుకో చూస్తే - వారిని అవహేళన చేయడం సభ్యమైన వ్యంగ్యంకాదు. ఇది ఫ్లిట్ పంపు ధారిని వేళాకోళం చేద్దామన్న ఉద్దేశంతో కాదు చెప్త, అంతకంటె తీక్షణమైన వాటిని తెలియడానికి. శీతలదేశ వస్త్ర ధారణని యీ ఉష్ణదేశాలకి ఎవరు దిగుమతిచేశారు? ఇవే గౌరవానికి చిహ్నాలని ఎవరు చెప్పారు? ఎవరలాచెప్పి ప్రపంచంలోని చాలాభాగపు శరీర శీతోష్ణస్థితినే మార్చేశారే - లిన్‌టన్ చెప్పినట్టు.

యీ "శీతలదేశపు దండులు" సులభమైనా దానికి సమాధానాన్ని ఊహింపలేరు. ఉత్తరార్ధ గోళంలోని ఉత్తరభాగంలో, దక్షిణపు దక్షిణ భాగంలోనూ యీ శీతలవాసులు కొత్తపద్ధతిని అమలులోకి తెచ్చారు. ఫలితమే యీ విపరీతం. అవసరానికీ ఆశయానికీ మధ్య అగాధం. యీ కొత్త దృక్పథాన్ని తొలుదొల్త యూరోపియను మతగురువులూ (శరీరపు పాపపంకిలత అని వాపోయేవారు!), తరువాత పాశ్చాత్యనాగరికతా నియంతలూ - యీ తెల్లవాని బరువును అంటకట్టారు.

తొలి రోజులలో యీ పద్ధతిని ప్రవేశపెట్టడం అంతతేలిక కాలేదు. కాని తరువాత కూడా ఎంతో ఎదురించి నిరసనచూపిన మహాత్మాగాంధి, వినోబాభావే, ఎందరో ఆఫ్రికను జాతీయవాదులు,-జొమొకెన్యాటా డాక్టర్ నుమా మొదలైనవారు సంప్రదాయమూ సులభమూ అయిన వస్త్రధారణ కోసం పోరు సాగించారు. కాని వీరి శ్రమఫలితం ఏ కొద్ది పాటి మేధావంతులకో అందింది. రాజకీయవాదులు ఆదర్శవాదులు అందుకొన్నారు. కాని ప్రజానీకం మటుకు తెలుసుకోలేదు. పరువు ప్రతిష్ఠలన్న బలమైన పదాలను యీ వస్త్రధారణకి మిషనరీలు బలంగా అంటగట్టారు. అది

ఎంత బలంగా నాటుకుందంటే యీనాటికీ, భూగోళంమీద ఉష్ణ ప్రాంతా లలో కూడ యిది నిలచివుంది.

యీ బరువు చిహ్నాకు పడే శ్రమా చేసే కర్చు కూడా చాలా ఎక్కువ. దీనికి అవసరంలేదు. సంప్రదాయంకాదు. ఆరోగ్య దృష్ట్యా నష్టదాయకం. అందవికారం కూడా యిది. యిది యూరోపియనులు కాని వారిని వ్యంగ్య చిత్రాలుగా చేస్తూంది, చౌక బారుగా తయారుచేస్తూంది. శారీరక విభేదాల ద్వారానే కాకేషియనులను, యితర ఆఫ్రికనులను గుర్తు పట్టవచ్చు. కాని తమ శరీరపు పోకడలకి అనువుగాని వస్త్ర ధారణతో యీ ఆఫ్రికనులు తమ లక్షణాలనే కోల్పోతున్నారు.

మకొండె పీరభూమిలో నే చేసిన పల్లె పరిశోధనలద్వారా తేలిన దేమిటంటే - సాధారణ రైతు ఆదాయంలో దరిదాపు నూటికి డెబ్బయి అయిదువంతులు దుస్తులకోసం అని కర్చు అవుతూంది. కాని, ఎండు చేపలద్వారా లభించే మాంసకృత్తులకు, నూనెద్వారా లభించే పోషక పదార్థా లకి డబ్బు మిగలకుండా పోతూంది. ఏప్రెల్ - జూన్ మాసాలలో చలిని ఎదుర్కోడానికి ఎంతో అవసరం అయిన తోలు, బొచ్చు కంబళ్ళకి అసలే డబ్బు వుండదు. అందుకే రెండు మూడు తరాలక్రిందట మకొండెలు శరీరాన్ని ఎండవేళ దుస్తులతో కప్పుకోకుండా వున్నా, చలిలో దుప్ప ట్లతో కప్పుకొని హాయిగా ఆనందంగా వుండే వారని తోస్తుంది.

ఈ మార్పే అభివృద్ధి అని అనలేం. అసలు అభివృద్ధి అభ్యుదయం అన్న పదానికి నిజమైన అర్థం కుంటువడిపోయింది.

కాని యీ ఉష్ణదేశాలలో యూరోపియనులు వస్త్ర ధారణ తెచ్చిన అవక తవకలు యింకావున్నాయి. సాధారణంగా "ఉన్నవారికి","లేనివారికి" మధ్య దూరం ఏర్పడింది. ఉన్నవాళ్లు తొలుత యూరోపియనులవి అనుక రించారు. వస్త్రధారణలో ఉష్ణ దేశాలలో పీధిలో నడవడానికి కూడ యిబ్బంది, యీ పద్ధతి. లేనివాళ్లు కూడ నిత్యావసరమైనవి వదులుకున్నా పీటిని అనుసరించండం విధిగా ఎంచారు. మంచిపీటికి కూడా కరువైనవారు యీ పద్ధతి అవలంబించడంతో యిబ్బందే. తమశరీరాలని పరిశుద్ధంగా

వుంచుకొనే అవకాశంలేదు. అలాంటిది యీ దుస్తులని అవసరం అయి నన్నిసార్లు మార్చడానికి అవకాశం ఎక్కడిది?

ఉష్ణదేశాలలో ఆరోగ్యంగా హాయిగా బ్రతకవచ్చు. ముఖ్యంగా నల్లని చర్మం కలవారు. కాని యీ అనవసరమైన దుస్తుల మోతతో పై స్వేచ్ఛా జీవితం దూరం అయిపోతూంది. చెమటతో తడిపి ముద్ద అయిన దుస్తులతో హాయిగా తిరగడం కష్టమే. దీనిఫలితమే: లేనివాళ్లలో అసం తృప్తి, అశాంతి, వారి ఆశయాలను అందుకోలేరు. దానితో సంప్రదాయిక నాగరికతను పక్కకు నెట్టడం, కొత్త నాగరికతను అభాసు చేయడం జరుగుతూంది.

ఇది మానవ నిర్మితమైనది, ఆయుధాల పోటీలాగ. పారిశ్రామిక వాడలలోని ఎక్కువ జనాభాలాగ, నశించిపోయే ఆటవిక సంపదలాగా. దానితోవచ్చే కష్ట నష్టాలలాగ ప్రాంతీయ మృత్యువులాగ ఇది మానవ నిర్మితమైన సందిగ్ధావస్థ. యీ అనారోగ్యాలు ప్రపంచపు దేశాలవీ, జనాభావీ ఆవరిస్తున్న అవనులో, వీటిని గుర్తించి ధైర్యంగా ఎదురించాలన్నది సమకాలికులకు చాలామందికి తోచనిదే. యీ శీతల దేశపు దుస్తులబాధ ఉష్ణదేశపు వాసులకు శాపంలాగా దాపురించింది. నిజానికిది భూభాగంలోని యితర వాసుల కంత లెక్కలోనిదేకాదు. కాని విషాదకరమైన సంగతి ఏమిటంటే యివి పట్టుకొని ప్రాకులాడే వారికే యిదెందువల్లో తెలియదు. మన ఆధునిక నాగరికత ముఖాన వెలువరించిన యీ రణాలవల్ల బాధపడే వారిలో ఆఫ్రికనులు అతి ముఖ్యులు. వీరిదే ఖండాలలో కెల్లా ఉష్ణమైన ఖండం!

# 11. శరీరం అంటే భయం ఆత్మ అంటే భయం

దుస్తులు, వస్త్రధారణ వంటి అసందర్భపు విషయాలు చాలా తక్కువవిగా చిన్న చిరునవ్వుతో తోసిపారేస్తారు. కాని యీ సుదూరపు రోజులలోని 'అతిగా బట్టలు కట్టుకోవడం' ఒక ప్రత్యేకత వహిస్తుంది. ప్రపంచపు పోకడలు జీర్ణించు కోవడంలో యీ విషయాన్ని మించిన దిది వరలో లేదు. తొలిరోజులలో ధనికులు, తరువాత మధ్య తరగతివారు యిప్పుడు కూలీలూ వ్యవసాయదారులూ కూడా యూరోపియనుల పద్ధతిని పూర్తిగా కప్పుకొనే దుస్తులు ధరిస్తున్నారు. కుట్టిన బట్టలు ధరిస్తున్నారు. సాంస్కృతికమైన మార్పులు, అలవాట్లలోనూ, పద్ధతులలోనూ మార్పులూ సాధారణమైన విషయమే. కాని కొన్ని వందలమిలియన్ల జనాభా మొత్తం పద్ధతులు మార్చుకోవడం అన్నది ఆశ్చర్య కరమైన విషయం. అదీ విదేశంనుంచి వచ్చిన తక్కువ సంఖ్యాకుల పద్ధతికి అధికజనాభా మారడం అన్నది - చరిత్ర కందిన నాగరికతలలో లేనివిషయం.

ఇక్కడ పెట్టుబడిదారీ పరిశ్రమలు, దారం బట్టా కుట్టుపని పరిశ్రమలు, పత్తి పండించే వ్యవసాయం తలెత్తాయి. యీ విషయ ప్రసక్తే తేరు. మనం తెచ్చినా సన్నగా నవ్వుతూ మాట మళ్లించేస్తారు. అదేదో చాలా చిన్న విషయం అన్నట్లు. యీ చిన్ననవ్వు 'ఎవరు బట్టలను గురించి మాట్లాడుతారు? మేం సీరియస్ మనుష్యులంకామా?' అని అడుగుతున్నట్లు వుంటుంది. యీ ప్రశ్నలకు వారి విముఖత చూస్తే యీ

శతాబ్దపు తొలిరోజులలో లైంగిక శాస్త్రప్రసక్తి సభ్య సంఘంలో ఎంత తక్కువగా ఎంచబడేదో జ్ఞప్తికి తెస్తుంది. వాటి పోలికలు తేవడానికి రెండు వేర్వేరు కారణాలు కన్పిస్తాయి. ఒకటి: జంతుతత్వం కల శరీరం మూలం గానే జీవితాన్ని మనం అనుభవిస్తామన్న విషయాన్నుంచి తప్పించుకోవాలన్న మానవనైజం. యీ విషయప్రసక్తి వస్తే వేళాకోళంగా నవ్వి పారేయడమో, లేదంటే కోపంవచ్చి చర్చకుదిగడమో జరుగుతుంది. ఇలా వాదనకి దిగే వారికి సహితం అంతరాంతరాలలో యీ విషయం సత్య దూరం కాదని తెలియకపోదు. రెండవది: యీ విముఖత చివరికి శరీరం అన్నదాని ఉనికిని గురించిన ప్రస్తావనకే సాంతం అందించడం జరుగుతుంది. అనవసరపు దుస్తుల విసర్జన, యింకో రంగులోవున్న శరీరం, యింకో రంగుగల రోమాలు అన్నీ మానవశరీరపు చిహ్నాలే అయినా, అనవసరంగా మానవ జీవితపు పునాది అయిన విషయాలను జ్ఞప్తికి తెస్తాయి. అందుకే బట్టలను గురించీ, వీటి ప్రారంభవిషయాలను గురించీ మాట్లాడి వాదించదలచు కున్నప్పుడు, వేళాకోళానికి తలఒగ్గి ధైర్యంగా వుండగలగాలి.

అక్షరాస్యులయినా అంతకు పూర్వమైనా కూడ దేశీయమైన నాగరికతలో దుస్తుల ధారణలో శరీరం కన్పించితే అది ఎబ్బెట్టు అయింది. అలాగే యూరోపియనులకి ఇతరమైన వస్త్రధారణా పద్ధతులు కూడా. దీనికి కారణం శరీరం అంటే సిగ్గు, తమది మోటు సంస్కృతి అన్న నమ్మకమూను.

ఈస్టాఫ్రికాలో మిషను సంస్థలు చాలా శక్తివంతమైన సంస్థలు. అటు ప్రభుత్వంతోటీ, యిటు తెలివైన పరిపాలనా దక్షులతోటీ కూడ వీరికి అప్పుడప్పుడు తేడాలు వస్తూవుంటాయి. అందుకే, నేను అప్పుడప్పుడు పేర్కొన్న మిషను విషయాలన్నీ పొగడ్తలే అనీ, అందరూ ఒప్పుకున్నవే అనీ అనుకోకూడదు. నేరాపినదానికి అపార్థం యిచ్చి, నే నా సంస్థలకు చెందని వాణ్ణి కనుక అలా రాశానని ఏ పత్రికయేనా అనవచ్చు. అది నన్ను అపార్థం చేసుకోవడమే అవుతుంది.

నేను విముఖత చూపినదల్లా ఒక విషయమే. మతైకంగా పునాది లేకపోయినా, ఒక్క క్రైస్తవమిషనరీలే తమమతంద్వారా యీ ఆటవిక జాతి వారికి ఉన్నతమైన నాగరికతలు అందించకలమని తలపోయడం. క్రైస్తవ దేవాలయాలూ మిషనరీలూ కలిపి చూపిన దారే దైవానికి దగ్గర దారి అనీ, ఆఫ్రికనులకు ఉన్నతవిలువలూ ఆదర్శాలూ లేవుకనుక, యూరోపియను నాగరికతను, నమ్మకాలను మక్కీకిమక్కీ దిగుమతిచేసి యీ "నల్లని దేహాలమీద" వారి పద్ధతి దుస్తులను తొడిగి, వీరి "నల్లటి ఆత్మలలో" వారి ఆచారాలను నింపితీరాలన్నది మటుకు సాంఘిక దృష్ట్యా మానవ పరిణామశాస్త్ర పరిశోధన సాగించే నాబోటి వారెవరూ ఒప్పుకోరు. దీనికి సువిశాలమైన క్రైస్తవమతానికి ఆలా చెప్పాలంటే అసలు ఏ మతానికీ పోలికేలేదు.

అంత మాత్రాన మిషనరీలుచేసిన పనిని కాదనడంలేదు. ఆస్పత్రులు, స్కూళ్ళు కట్టించారు. ఎంతో ఉత్సాహంతో వృత్తిపనులకు ఆధారం కల్పించారు, నేర్పించారు, అతిధైర్యవంతులు లివింగ్‌స్టోన్ వంటి ఘనులు బానిసత్వానికి ఎదురుతిరిగి పోరాడారు. కాని పశ్చిమ కేంద్ర ఆఫ్రికాలలో యూయస్ ప్రభుత్వం తరఫున ఏంత్రపోలజీపని నాల్గు సంవత్సరాలపాటు సాగించిన W. R. బాస్కం (Bascam) అన్నారు: "అక్షరాస్యులైన చాలామంది ఆఫ్రికనులు - మిషనరీవారు చేసిన మంచి పనిని కాదనముగాని, వారి ఉనికి యిక్కడ అనవసరం అని అభిప్రాయ పడుతారు. యూరోపియనులు తమ మాతృదేశాలలోనే పరిష్కరించుకో లేని విద్యా విషయాలు కొన్ని వున్నాయి. ఆధునిక విద్యావ్యాప్తి యూరోపు లోనూ, తదితర ప్రాంతాలలోనూ కూడ సంఘంలో సరిపడని వ్యక్తులను, అసంతృప్తులను రూపొందిస్తూంది.

అసలు సాంకేతికసహాయంలో గాని, యూరోపియను మిషనరీల దృక్పథంలో కాని కావలసినది ఒకటివుంది. అదే అభ్యుదయాన్ని విస్తృతం చేయాలన్న కాంక్షలో ఎటువంటి స్వార్థపర దృక్పథం లేకుండా చూడటం.

చక్కగా అమర్చబడిన స్కూలుగదితో నాకు పరిచయం అయ్[redacted] ఒక మిషనుస్కూలు చూడబోయి నప్పుడు గది గోడలనిండా [redacted]

జోకరు బొమ్మలు, వివిధ ప్రవక్తల బొమ్మలూ, ఏటమిక్ పవర్‌ప్లాంట్ చిత్రమూ, తూర్పాఫ్రికా కనుగొన్న చరిత్రా అమర్చివున్నాయి. యూరోపియను దృష్ట్యా యిది కనుగొనడమే కావచ్చు. కాని ఆఫ్రికను పిల్లలకి ఎవరూ పూర్వీకులే లేనట్టూ, చివరికి పోర్చుగీసు సాహసులుకొందరు కనుగొనేదాకా వారికి ఉనికే లేనట్టూ తెలియచెప్పడం ఒకవిధంగా కేంద్రీకృతమైన స్వార్థమే అనిపించుకుంటుంది. చరిత్రతోపాటు వేసిన బొమ్మలలో పూర్వపు వాస్కోడిగామా గంభీరంగా ధరించిన దుస్తులూ, అతని కూడా అక్కడికి వెళ్లిన ఫాదరీ అప్పీవున్నాయి. వారి కెదురుగా యీ కనుకొనబడిన జాతీయులు నగ్నంగా దూర దూరంగా చిత్రింపబడ్డారు. చిత్రకారు డెంతో కష్టపడి వారికి చక్కని ఆకృతులిచ్చాడు. కాని వారి కళ్ళలో భయం, ఆటవికత్వం మూర్తీభవించింది. అధునాతన నాగరికతా ప్రతినిధిముందు భయంతో నిలబడ్డారు ఆటవికులు.

క్లాసుగదిలో చిత్రీకరింపబడిన ఘనులందరూ యూరోపియనులు. చర్చిఫాదరీలు, మత ప్రవక్తలు, మహానాయకులనదగ్గవారు యుద్ధవీరులు - వారందరినీ పిల్లలు వూహించుకుని ఆలోచించుకోవచ్చును. ఆఫ్రికను నీగ్రోయిడ్ తెగల శరీరకతత్వం కల బొమ్మలే లేకపోవడం ఆఫ్రికను యువత దృష్టిని మళ్ళించడానికి కాదా? దినదినం పెరుగుతున్న ఆఫ్రికను తరాలలో నమ్మకం ధైర్యం ఎలాగ పెంపొందుతుంది? వారిశరీరాలు, సిగ్గుని, ఆటవికతత్వాన్ని మటుకే తెలియచేయడానికి ఉపయోగిస్తూంటే!

యూరోపియనుల ప్రతి నడవడి—అది బొమ్మలద్వారా కానివ్వండి, అనుభవంలో కానివ్వండి—కూడా ఆఫ్రికను మనస్సుమీద, నగ్నత అన్నది ఆటవికతత్వం అని తెలియచెప్పేదిగా వుంటుంది. యూరోపియను పద్ధతి వస్త్రధారణ అన్నది నాగరిక చిహ్నం. నీతికి నిదర్శన అన్నట్టు వుంటుంది, కాని గ్రీసు, యీజిప్టు, భారతదేశం యింకా ప్రపంచంలో అనేక యితరదేశాలలో ప్రాచీన సంప్రదాయాలలో నగ్నత, అర్ధ నగ్నత్వమూ మామూలుగానే పరిగణింప బడేది. మతగురువులూ, ప్రచారకులూ సాధారణ యూరోపియనుల కంటె ఎక్కువగా దుస్తులు ధరిస్తారు. అలాగే

సంఘంలో ఘనత, గౌరవం ఎంత ఎక్కువఅయితే అంత ఎక్కువ బట్టలు ధరించడం అన్నది నీతిగా లెక్కించ బడుతుంది. తోటకి నీళ్ళు పోయడానికి చొక్కాలేకుండ రాడు, యజమాని. తోటపని చేయడానికి వస్తూ ఆఫ్రికన్ తోటమాలి కూడ తన నాగరికత చాటడానికని చొక్కా వేసుకునే వస్తాడు. అందుకే చెమటతో తడిసిన చొక్కాలతో నాగరికత పేరన యిద్దరూ బాధపడతారు.

యీ దినదినం పెరిగిపోతున్న నాగరికతా వ్యామోహం పోట్-లాచ్ విందుపోటీలో పకిటుల్ ఆస్తులు పోగొట్టుకొన్నట్లుగానే అసలు విలువలు వేలంవేసుకు పోతున్నాయి.

"సాధారణమైన ఒక హుందాతనానికీ, సభ్యతకీ దారి" అని సామాన్యంగా అందరూ సమాధానం చెప్పుకోవచ్చు, కాని యీ స్వతస్సిద్ధమైన ఆలోచన అనంతుడు బుద్ధుని కలుసుకొన్నప్పుడు లేదే! అలెగ్జాండరు పైతగొరస్‌ని, అర్జునుడు కృష్ణుణ్ణి, పైలటస్ క్రీస్తుని కలుసుకున్నప్పుడు లేదే, నెకరైలూ ఊలుకోట్లూ అమెనోఫిస్ IV మీదా, అశోకునిమీదా యీ స్వభావసిద్ధమైన గుణం కప్పలేదే, కంజీవరంలోని పార్వతికి, పాలస్‌అధినికి జాకెట్లు బ్రాసియిర్సు తొడగలేదే! చిన్న అంగవస్త్రం, బుజంమీద ఓ చిన్నదుప్పటి మాత్రమే కప్పిందేం - మహమ్మదు ప్రవక్త మీద యీనాటికీ హాజీ యాత్రికులు యీ కుట్టని దుస్తులనే కట్టుకువస్తారే?- అందుకే సహజమైన సభ్యత పేరట వేడిదేశాలలో అర్ధనగ్నత అసభ్యమైనదన్న వాదన నిలబడదు. మరింకేమిటి - ప్రపంచం మొత్తంమీద ఉష్ణదేశాలసముదాయంలో యీ యూరోపియను పద్ధతులని తీసుకువచ్చినది? యీ తెల్లవారిబరువుని రంగు మనుషుల భుజాలకి ఎవరువెత్తారు? అమెరికా నుండి దక్షిణానికి పోయే ప్రయాణికులు యూరోపియను ఓడరేవులలో చూసే వికృతమైన ప్రభుత్వాధారమైన నీతిని కళ్లారా చూడ్డమే మనకు సమాధానం అవుతుంది.

అజూరెస్ కాని యింకేదైనా పోర్చుగీసు, స్పానిష్ హార్బరులోకి తమ ఓడ వెళ్ళిందంటే - బీచిలోకి వెళ్ళి యీదాలన్నా, త్రాగాలన్నా కొన్ని రూల్సువున్నాయి. కావలసినంత తాగొచ్చు, కాని యీదాలంటే వారి

దుస్తులు కొన్ని ప్రత్యేకనిబంధనలకు సరిపడి వుండాలి. మగవారు తమ గుండెలని కప్పేలా ఒక బట్టధరించాలి. ఆ బట్ట కొసలు రెండు భుజాల మీదుగానూ వుండాలి. అజురస్‌లోని మగవారు చిన్నమట్టలాగూ ధరించి, బనీనులాంటి చొక్కా వేసుకొని, యీ బట్టని మెడకు కట్టుకుంటారు. చూడడానికిదో పెద్ద స్టైలాగ వుంటుంది. ఈవిధంగా, రూల్సునీ దిక్కరించడం లేదు; కావలసినరీతిన బట్టలూ ధరిస్తున్నారు వీరు। అజురస్‌లో యీదే ప్రతిమగవాడూ యీ స్టైతోటే యీదుతాడు. ఇక ఆడవారు రెండుముక్కల బేతింగుడ్రస్సు వేసుకోవడం నిషిద్ధం. అది వారినడుము చుట్టు పైకి కనిపించేలా చేస్తుంది. మరి చోళీ, చీరా కట్టుకునే భారతవనిత సభ్యంగా బట్టలు ధరించినట్లు లెక్కకాదో—ఎందుకంటే ముఖ్యంగా యీ భాగమే కన్పడుతుంది కదా। యీ బీచిలో నైతిక కొలబద్దలప్రకారం, మొగల్ పద్ధతిని బట్టలు కట్టుకున్నా కావలసినంతగా ధరించలేదనే తేలుతుందేమో।

పోర్చుగలు, స్పెయిన్ మొదలైన దేశాలలో చర్చివారే ప్రజాజీవితపు పద్ధతులని రూపొందించారు. చర్చికివెళ్లే స్త్రీలు ధరించవలసిన పద్ధతులు ప్రత్యేకింప బడ్డాయి. టోపీలుధరించాలి; చేతులుపొడుగుగా ధరించాలి. ధరించిన గౌను ఒక నిర్ణయించబడ్డ పొడుగు కలిగివుండాలి. కేతలికు దేశాలలో యింతటి వికృత పద్ధతులను ప్రవేశపెట్టి శరీరం అంటే భయం ప్రవేశపెట్టడం జరిగింది. శరీరం అంటే అసహ్యంఅన్నది ఒక మతంగా యూరోపులో అనారోగ్యకరం అయితే, ఉష్ణప్రదేశాలలో ప్రమాదకరంగా తయారవుతుంది. చరిత్ర నెంత కాదన్నా, ఉష్ణదేశాల సంస్కృతు లెంత సంస్కృతులు కావన్నా, కాక, ఆఫ్రికాలో ఆరబు కుంజు, ఇండియాలో షెర్వాణీ జాతీయ దుస్తులని అన్నాకూడ విదేశీయులు వచ్చి లొంగతీసుకునేవరకు కూడ ఉష్ణదేశాలలో అర్ధనగ్నత అసభ్యంగా పరిగణింపబడలేదన్న నిజాన్ని తుడిచివేయలేరు. యీ శరీరం అంటే భయంఅన్నది ఉన్నన్నాళ్లూ యింకా విషపూరితం అయినదొకటి మెల్లిగా పెరుగుతుంది. అదే సంప్రదాయమైన సంస్కృతి అంటే భయం, అదే ఆత్మ అంటేనే భయం. యీభయాలు అంటు రోగాలవంటివి. చివరికి యీ భయంతో విపరీతమైన తప్పటడుగులు వేయిస్తాయి. శక్తివంతమైన

వాటిని నిషేధింపచేస్తాయి. అవిలేవని నమ్మిక కలుగచేస్తాయి. యీ తప్పులు నిర్మలంగా సాగుతున్నచోట అల్లకల్లోలం పుట్టిస్తాయి. ఒకానొకప్పుడు చక్కని సంస్కృతి పెంపొందిన చోట సర్వనాశనానికి దారి తీస్తాయి. స్వేచ్ఛా ప్రాణులైన స్త్రీ పురుషులను భయాలకి బానిసలుగా చేస్తాయి. దక్షిణ భారతదేశంలో ఒక ఆస్పత్రిలో ఎక్సరే తీయించుకొందుకు వెళ్ళిన ఒక యూరోపియను వనిత తన అనుభవాన్ని యిలా చెప్పింది. బొత్తాలువున్న తన జాకెట్టుని తీసివేయపోతుంటె కొంచెం ఆగమన్నారట; ఓ పదిహేను నిముషాలు గడిచాక కొన్నిగజాల బట్టను తెచ్చి యిచ్చారట రొమ్ముచుట్టూ చుట్టుకొమ్మని. అప్పుడే ఎక్సరే పరికరాలముందు సభ్యతగా వుంటుందని। ఇది 1959 లో జరిగింది. అందులోను మొదటి ప్రపంచ యుద్ధానంతరం వరకూ స్త్రీలు వక్షోజాలమీద ఏవిధమైన వస్త్రాన్నీ ధరించని కేరళదేశంలో జరిగింది. ఇక్కడ కొంతకాలం క్రితంవరకూ, విదేశీయమైన జాకెట్టుని గాని చోళీనిగాని ధరిస్తే పుణ్యస్థలాలలోకి రానిచ్చేవారుకాదు. నేను రెండవ ప్రపంచయుద్ధానంతరం, మాతృహక్కు తెగల పరిశీలన కని కేరళకు వచ్చాను. అప్పుడు సగర్వంగా ఒక ప్రొటెస్టెంటు మిషనరీ చెప్పాడు: క్రిస్టియను ప్రోద్బలంవల్ల పాపభూయిష్ఠమైన స్త్రీల నగ్నత అన్నదాన్ని తొలగించడం జరిగిందని. అక్కడే ఈ నైతికోన్నతి ఫలితాలు చూడవచ్చు. ఇదివరలో ధైర్యంగా జాకెట్లు లేకుండా దేవాలయాలకీ, చెఱువులకీ వెళ్ళే వారు. కాని యిప్పుడు అసభ్యంగా పురుషులు ప్రవర్తించడమే కాకుండ అసహ్యంగా మాట్లాడుతున్నారు. మగవారి అనాగరిక ప్రవర్తనకి స్త్రీలు బాధపడతారు. ఇది యూరోపియను స్త్రీలకి వింతైన పరిస్థితి ఏర్పరుస్తుంది, దక్షిణాది పరదాను, గోషాను కాదనుకున్నా వీరు తమదేశంలో హాయినిచ్చే బట్టలు సామాన్యంగా ధరించే వారు. యీదేశంలో అలా వుండటానికి యిబ్బందిపడతారు. హాయిగా రివరియాలో చిన్నబికినిధరించే నాకు తెలిసిన ఒక ఫ్రెంచియువతి మన బీచిలో దశసరి ఒక్క ముక్కగవుండే స్నానపు వుడుపు ధరిస్తుంది. అలాగే అమెరికను, పాశ్చాత్యదేశాల స్త్రీలు (విజ్ఞానవంతులు కూడ।) దక్షిణభారతంలో వాడుకుందుకని ప్రత్యేకించిన దుస్తులు తెచ్చుకుంటారు. ఇది తెల్లవనితల కొక కొత్త బరువు। నిశ్చింతగా, యీ శకమైన అపసవ్యపు విషయాలన్నీ యీ అనారోగ్యకరమైన భావనలోనే

వేళ్లూని వున్నాయి అవి చెప్పవచ్చు. శరీరం అనారోగ్యకరమైన నైతిక వాతావరణానికి నాంది అన్నదే ఆ విషయం.

'యూరోపియను పద్ధతి వస్త్రధారణ అన్నది ఎక్కువగా అనర్థాన్ని చేసే పాశ్చాత్యపోకడ అన్నా, అదొక్కటే కాదు అనికూడ చెప్పుకోవాలి.

తొలుదొల్త వచ్చిన రోము మిషనరీలు గలియ, జర్మనియ, ఐర్ మొదలైన యూరోపియను దేశాలలో చాలా విశాలహృదయం కనుపరచారు. క్రీస్తుమతానికి పూర్వంవున్న ఆచారాలు, తతంగాలు, జానపదగాథలూ అన్నీ అన్వయించుకున్నారు. అవే యీనాటికీ కొన్ని నిలచి ఉన్నాయి. రంగురంగుల యీస్టరుగుడ్లు, క్రిస్టమస్‌కి దీపాలు వెల్గించడం, మాతకు ప్రార్థనలు జరపడం, యివన్నీ కూడ యీ నాటికీ వున్నాయి. క్రైస్తవ మత సూత్రులు చదివి, మతాని కనుకూలించినంతవరకు పాగను ఆచారాలు అలవాట్లు నిలచివుండేలా చేయడంలో అపహాస్యం ఏమీ కనబడలేదు. రోమునుంచి సెంట్రల్, ఉత్తర యూరపు యావత్తూ విస్తరించుకుంది. యీ ఏషియానుంచి వచ్చిన మతం. కాని యీ విజ్ఞానయుగంలో, అభ్యుదయ యుగంలో నాగరికత విజృంభించటం అంటే బలములేని సంస్కృతులను తలదన్నడంగా, చౌకబారు విషయాలతో అడుగంట చేయడంగా తయారవుతూంది. ప్రాణంలేని, ఉట్టి మతంపేరుకు దీన్ని జతచేయడం కూడ జరుగుతూంది. ఒక్కసారి కనక జాతీయమైన విలువలు అణగ దొక్కితేచాలు, కావలసిన ఉత్తేజితాలు లేక కళలు అడుగంటుతాయి. నాగరికతలన్నవి నదుల లాంటివి. అవి ప్రవహించేదారిలో జీవనగంగను తీసుకపోయి ఫలప్రదంచేస్తూ సాగుతాయి. లేదా ఉధృతమైన వరదలు తెచ్చి, సర్వస్వాన్నీ తుడిచిపెట్టుకుంటూ ముందుకు పోతాయి. యీవిధమైన సర్వనాశనం జరిపిన యూరోపియను ప్రవాహం – ఆఫ్రికను శిల్పంలో చూడవచ్చు. యీ కళలో తూర్పు ఆఫ్రికా అంత ఎక్కువ కృషి జరుప లేదు. పశ్చిమతీరంలో డహోమె, నైగిరియా, ఘన, గినియ మొదలైనవి ఇంకానయం. అయితేనేం, వమవిహ యువకులలో ఎంతో చక్కని కర్ర చెక్కడం పని అభివృద్ధి అయివుంది. వీరు పోర్చుగీసు యీస్టాఫ్రికా లోని మునంబిక్‌లోని వమకొండె వారికి సన్నిహితులే.

చిన్న బొమ్మలు శక్తివంతంగా వుంటాయి. వీరి కృత్రిమముఖాలు, సంప్రదాయ సిద్ధమైన పనిముట్లు బలంగానూ, అందంగానూ కూడ వుంటాయి. వీరికి ప్రత్యేకపద్ధతివుంది. వీటి ముఖాలు పశ్చిమ ఆఫ్రికను కంచులవలె జాతీయత ఉట్టిపడుతూ వుండకపోయినా, తీక్షణతను కల్గి వుంటాయి. చిన్నతనంలో మంచి తీవ్రమైన శిక్షణ యిచ్చిన లక్షణాలు కన్పిస్తాయి.



మవిహా కళాఖండం: సంప్రదాయ పద్ధతిని చెక్కిన కర్రబొమ్మ.

శరీరానికి తగ్గట్టు కాక తల పెద్దదిగా వుంటుంది. నుదురుమీద బొప్పిలాగా వుంటుంది. పూర్వంలో జుట్టు చాలా పొట్టిగా వుంచుకొనేవారని తెలుపుతూంది. కృత్రిమ ముఖాలు భయంకరంగానూ గంభీరంగానూ వుంటాయి. నేనొక ముఖంచూశాను. అది ఇంగ్లీషువానికి కార్టూను చిత్రంలాగవుంది.

పొడుగుపాటి మీసాలు. ఎర్రని నారతో చేశారు. మనంజవనోలో అసలు మవిహా విగ్రహం ఒకదాన్ని సంపాదించకలిగాను. అందుకెంతో అదృష్ట వంతుణ్ణి అనుకున్నాను. మూడు షిల్లింగులకి కొన్నాను.


చేతికర్ర పైభాగం

పోర్చుగీసు తూర్పు ఆఫ్రికాలోని మిషనరీపాదరీలు యీ మవిహాకళను పల్లెపరిశ్రమలాగా పెంపొందించారు. శిలువలు, మేరీ విగ్రహాలు, పుస్తకాల అరలు, జంతువులు, చేతికర్రలు మొదలైనవి చేయడానికి ఉపయోగపడేది యీ పరిశ్రమ. వీటిలో అన్నీ అంత పొడుగావుండేవికావు. నిజానికి అలాంటి ఒకచేతి కర్ర అంటే నాకెంతో ఇష్టం కల్గింది. దాన్ని సాయింత్రంపూట నడిచేటప్పుడు ఉపయోగిస్తూవుంటాను. నున్నటి గుణుపులూ, చక్కని మవిహాతలా నిమరడానికెంతో మృదువుగావుంటాయి. కాని నిజమైన మవిహా కళా లక్షణాలు పూర్తిగా దాల్లోలేవు.

నృత్యంలోనూ లయలోనూ ఆఫ్రికనుకళ ఎక్కువగా రాణించింది. ఈ రెండూ కూడ మతైక తతంగాలనుండి పుట్టినవే. బహుశా పూర్వంలో ఈ నృత్యం ఇంకా శక్తివంతంగా వుండేదనుకుంటాను. క్రిష్టియను మతంపుచ్చుకున్న వారికి యీనృత్యాలు, ఆటలు మొదలైనవన్నీ నిషిద్ధాలయాయి. ఇదే మిషనరీలు తమ మాతృదేశంలో వుండే అక్కడ జానపద నృత్యాలని, సంగీతాన్ని నిషేధించేవారే కాదు.

మిషనువారూ, మిషనుస్కూళ్లూ కూడ ఆఫ్రికనులను లయబద్ధమైన నృత్యంలోనూ, సంగీతంలోనూ వున్న ఆనందాన్ని అణచివేయలేక పోయారు. కాని స్కూళ్లలో ఆఫ్రికను పిల్లలకు నేర్పే నగామ లయలు పూర్వపు అసలు నృత్యానికి ఏదో దూరపు సంబంధం మాత్రమేకల్గి వుంటాయి. అసలునృత్యం ఎంతో అందంగా హుందాగావుంటుంది, కాని పిల్లలు యూరోపియను మిలిటరీ మార్చిలు చేస్తారు. మబిల్ ఆయిల్ టిన్నులు వాయిస్తూ తమ జాతివారి మీదనే అసహ్యా

కరంగా నినాదాలు వర్ణిస్తారు. యింకొక చర్చికి సంబంధించిన వారని కాకుంటే ముస్లిము మతావలంబకులని, పోర్చుగీసులు కనుగొన్న ఆటవిక పాగన్స్ వారనీ అరుస్తారు.

అసలు క్రైస్తవం కాదు, అది అందరికీ బోధించేపద్ధతి. తరతరాల కష్టాలను ఆఫ్రికనులకు యింకా యితరదేశాలకూ కలుగచేస్తూంది. దీనికీ కొన్ని అతీతం అయినవి వున్నాయన్న ఒక్కవిషయమే సంతోషాన్ని కల్గిస్తూంది.

మద్రాసులో నావిద్యార్థులకు మానవ పరిణామశాస్త్రం మీద న్యూగినియానుంచి వచ్చిన ఒక ప్రొటస్టెంటు మిషనరీ ఉపన్యసించారు. తన మిషను సంప్రదాయికమైన వస్త్రధరిణా పద్ధతినే క్రైస్తవ మతంపుచ్చుకున్న వాళ్ళు ధరించవచ్చునని ప్రోత్సహిస్తుందన్నారు. 1958 లో నేను కెన్యా వదలినప్పుడు గిరియామాలు, గడ్డి పావడానే ధరించుతున్నారు, ఆడవారూ మగవారూ కూడా అదే డ్రస్సుధరించి ఆదివారం చర్చికి వస్తారని ఆయన అన్నారు.

నేను ముంబస వదలివచ్చిన రోజున ఆఫ్రికను స్కూలుపిల్లలు బోనుముందు, పోస్టాఫీసులో, బహిరంగ తోటలలో పరుగులు పెట్టడం చూశాను. పారాలకీ పారాలకీ మధ్య ఇది వ్యాయామం వారికి; హాయిగా చొక్కాలు లేకుండా పరుగుపెడుతున్నారు. వీరిలో ఏదో ఆఫ్రికనుతత్వం కన్పిస్తుంది. అలాగే ఆఫ్రికన్ స్కూలు పిల్లలు వుండాలని తలపోశాను నేను. ఎవరేనా కూడ కోరేవి అంతే. బలంగా, సంతోషంగా, వారికి వారేగా; నాకెందుకో ఆశ్చర్యమే వేసింది. అక్కడ అడిగిచూశాను. ఆస్కూలు ప్రిన్సిపాలు పశ్చిమదేశాలనుంచి వచ్చినవాడని, అతని ఆధునిక దృక్పథాన్ని అందరూ విమర్శిస్తూ వుంటారనీ తెలిసింది. దురదృష్టవశాత్తూ యీ విద్యా వేత్తను వ్యక్తిగతంగా కలుసుకోలేక పోయాము. అందుకే ఇతని దూరదృష్టి అనామకంగా వుండవలసి వచ్చింది. యింకో గంటలో ప్రయాణానికి సిద్ధంగావున్న ఓడని నేను త్వరగా చేరుకోవలసివుంది.

# 12. ఆఫ్రికను సమన్వయం

'కరంజ' నౌక నన్ను ఆఫ్రికాకు చేర్చింది. అదే నన్ను ఆఫ్రికా నుండి తీసుకుపోతూంది.

ఆధునిక పారిశ్రామిక సృష్టిలోని ఏ ఇతర వస్తువులకీ లేని వ్యక్తిత్వం వుంది ఓడలకి. 1937 లో నేనున్న కేబిన్‌కి పక్క కేబిన్‌లోనే నేను వున్నాను. అవే వరండాలు. అదే భోజనాలగది. అదే ఓడపైభాగం. నేనక్కడే ఎండకి కాగేవాణ్ణి. ఉదయపు వ్యాయామం చేస్తూండే వాడిని. ఇదంతా చూస్తే ఎంతో అలవాటుపడి పోయిన నత్తగుల్ల యింటిలో తిరుగుతున్నట్లు తోచింది.

కెన్యా, సోమాలియా తీరాలు, ఆఫ్రికాకొమ్ముదాటి దక్షిణదిశగా బయలుదేరి, కుడిపక్కగావున్న సొకొత్రా ద్వీపాన్ని వదిలి, తిన్నగా గార్డఫి అగ్రమును చేరి యింకా దక్షిణంగాసాగి అరేబియాతీరం మీదుగా కరాచీ, బొంబాయి చేరాలని మాప్లాను. ఇదే దారిని గురించి మకొండె పీఠభూమిలోని నా డేరాలో పడుకొని కలలుకన్నాను. నా క్రిందనున్న గులకరాళ్లూ, యిసుకా, సముద్రమట్టానికి పోయిన, తమ గత చరిత్రలను చెప్తూన్నట్టు, ఎవరికీ తెలియని లెక్కలేని సముద్రయానాలు సాగించిన పూర్వపు వాసులని గురించి మాట్లాడుతున్నట్లు అన్పించేది. వీరు పశ్చిమ ఇండియా, పాకిస్తాన్, పర్షియను అఖాతం, దక్షిణ అరేబియా ఈ తూర్పు ఆఫ్రికాలమధ్య ఎన్ని ప్రయాణాలు చేశారో!

గార్డఫి అగ్రపుతీరం ఇంకా కంటికి అనుతూనేవుంది. అడ్డులేని, అంతులేని దాని ఆకర్షణ నుండి విడివడటం ఇష్టంలేక, దూరంలో ఆకాశపుటంచున కన్పిస్తున్న తీరంకేసి గంటలతరబడి కనుమూయక చూస్తూ కూర్చున్నాను. పశ్చిమంలో ఆఫ్రికా ఖండం పక్కకే చూస్తూ కూర్చున్నాను - తూర్పున కొత్త విషయం యింకొకటి కానవచ్చేదాకా, అదే చిన్నద్వీపం సకొత్ర, ఇంకా ఆఫ్రికా ప్రాంతమే - దరిదాపు ఆసియా ఖండం అనికూడ అనవచ్చు. ప్రకృతి సిద్ధమైన పొలిమేర. భౌగోళిక శాస్త్రరీత్యా ఆఫ్రికాకు అదే తుది. అదే నా ఆఫ్రికను అనుభవానికి కూడ తుది. పల్చటి ఉల్లిపొరవంటి పొగమంచు ద్వీపంలోని గొడ్డు రాళ్ళమీద పరచుకొని వుంది. వెల్గులీనుతూ విరుచుకపడే సముద్ర కెరటాల మధ్య దీన్ని చూస్తే అస్థిపంజరపు అవయవాల్లాగా తోచింది.

మానవజీవితంలో నిర్దుష్టమైన క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోతాయి. అవిగడుస్తూన్నప్పుడు వాటిసంగతి తెలియనే తెలియదు. దూరంలో కన్పిస్తూన్న ప్రాణంలేని ఆ తెల్లని ఆకృతివంక ఏకారణం లేకుండానే అలా చూస్తూ వుండిపోయాను.

దాదాపు ఏడవశతాబ్ది నుండికూడ జనాభాకల్గిన యితర తూర్పాఫ్రికను ద్వీపాలకూ, యీ చిన్న ద్వీపానికీ సంబంధంలేదు మిగిలిన ద్వీపాలు సముద్రయానంచేసే అరబుల నివాసంగావుండేవి. అలాగని యీ ద్వీపం ఇటు అరేబియాకీ పూర్తిగా చెందదు. ఈ రెండింటికీ మధ్యనుండి, ఇదివరలో యిజిప్టియను ఫొనిషియనులు గ్రీకులు అనుకొనే గూఢమైన "ఓఫిర్" అనుకోవచ్చు దీన్ని. ప్రస్తుతం దీనిలో అరబ్బులు నివసిస్తున్నారు. అందరూ వారు సంప్రదాయులైన ఆరబ్బులు కాదంటారు. కాని ఎవరో మాత్రం చెప్పరు. ఒక బ్రిటిషువీరుడు మటుకు యీ ద్వీపంలో నివసిస్తు న్నాడు. 'దాస్' అనే అరబుపడవల్లో ముంబసాకి వారు వచ్చేటప్పుడు, వివరణ పత్రంగా చిన్న కాగితంముక్క తెస్తారు. వారిభాష అరబుభాష కాదు. ఇలాగే ఎన్నో అర్థంకాని ప్రశ్నలు, చిక్కు ప్రశ్నలు యీ ద్వీపం లోపలా బయటా కూడ వ్యాపించి నిగూఢతని అధికంచేసి సకొత్ర ద్వీపం నన్ను అనుకోకుండా ఆకర్షించింది.

అలాగ్గానే, సకొౖట్రాద్వీపం మాయమైంది - తెల్లని నురుగతెరలలో కదలాడే అద్దంలాంటి సముద్రంమీద ఓ దృశ్యంలాగ కనబడి మాయమైంది !

క్రిందికిదిగి చదువుకొనే గదిలోకివెళ్ళి సచిత్ర లండన్‌న్యూసు పాతపత్రికలు తిరగవేయడం ప్రారంభించాను. బహరెనీ ద్వీపంలో యీ మధ్యనే కనుగొనబడిన పురావస్తు తవ్వకాలను గురించిన రిపోర్టు చదువుతున్నాను. ఇక్కడ ఇండస్, సుమేరియన్ నాగరికతలకు సంబంధించిన విషయాలు బయటబడ్డాయి. ఇలాంటి విషయాలు తెలుసుకోవడంతో, పూర్వంలో వున్న వ్యాపార సంబంధాలు ఇండియా, దక్షిణ అరేబియా, తూర్పు ఆఫ్రికాలమధ్య ఎలాంటివో తిరిగిసృష్టించుకొని తెలుసుకొనే అవకాశమేనా కల్గుతుంది. నేనిదివరలో మొహంజదారో, హరప్ప విషయాలలో ఇలాగే సృష్టించుకొని మాతృ హక్కుసంఘాల చిహ్నాలు అరేబియా సముద్రపు మూడు తీరాలలోనూ వున్నాయని కలిపాను.

ఐదువేల సంవత్సరాలు గడిచాయి. అత్యధిక సంఖ్యల్లో ఆసియనులు - పాకిస్తానీయులు, భారతీయులు - సముద్రానికి పశ్చిమ దిశగా యీస్టాఫ్రికాలో-దక్షిణాఫ్రికాను వదిలేస్తే-(400,000 ఆసియనులుఉన్నారు). దీనికి ప్రత్యేకతవుంది; ముందు చక్కని అవకాశాలువున్నాయి, దక్షిణాఫ్రికా యూరోపుతో పూర్తిగా రాజకీయపు బంధాలు తెంచుకొని స్వాతంత్ర్యం పొందిన రోజున దాని ప్రజానీకంలో చాలామందికి దెబ్బే. తెల్లవారు కాని వారందరినీ శాశ్వతంగా తెల్లపౌరుల కింద్రుగా పరాధీనులుగా వుండేలా చేసే పరిస్థితి ఏర్పడవచ్చు. ఇక సుదూర భవిష్యత్తులో కానవచ్చే కాంతిరేఖ - ఆఫ్రికాలోని చాలా రాష్ట్రాలు స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడమే.

ఈక్రింది పట్టిక నాల్గుజాతుల జనాభా విస్తరణను గురించిన వివరాలు చూపుతుంది. తూర్పు ఆఫ్రికాలోని నాల్గు రాజ్యాలలో యీ సంఖ్యలు తీసుకోబడ్డాయి. టాంగన్యికాలో 1957, జాంజిబార్‌లో 1958, 1958 మధ్యలో కెన్యాకూ ఉగండాకూ అంచనా వేయబడ్డాయి.

| దేశం | ఆఫ్రికనులు | ఆసియనులు | అరబ్బులు | యూరోపియనులు | మొత్తం జనాభా |
| --- | --- | --- | --- | --- | --- |
| కెన్యా | 6080000 | 165000 | 35500 | 64700 | 6351000 |
| జాంజిబార్ | 2[illegible]8815 | 18334 | 46989 | [illegible]07 | 299111 |
| ఉగండా | 5619300 | 56600 | 2000 | 9000 | 5688900 |
| టాంగన్యికా | 8662684 | 76536 | 19088 | 20534 | 8785613 |

అన్ని జనాభాగుంపులూ త్వరితగతిని ఎక్కువ అవుతున్నాయి. ముఖ్యంగా, వలసరాకలు తగ్గకుండా వుండడంలో యూరోపియను, ఆసియన్ జనాభాలు ఎక్కువగా పెరుగుతున్నాయి. ఉదాహరణకి చూస్తే, ఉగండా ప్రాంతంలో వ్యవసాయపు కేంద్రాలు ఎక్కువగా లేకపోయినా, అక్కడి యూరోపియను జనాభా మూడురెట్లూ, ఆసియను జనాభా రెండు రెట్లుగానూ పెరిగింది గత పదకొండు సంవత్సరాలలోను. స్వతంత్రం వచ్చాక, ఆఫ్రికనేతరులకూ, ముఖ్యంగా ఆసియనులకూ దారి ఏది? జాతీయ వాదులు ఎక్కడున్నా 'విదేశీయులు ఇళ్ళకు తరలండి!' అన్న ధోరణినే చూపెడతారు. కాని అనుభవంవల్ల తెలుస్తూన్న విషయం ఏమిటంటే- స్వాతంత్ర్యం వచ్చాకనే కోలనీలలో తక్కువమంది కంటె ఎక్కువ మంది విదేశీయులకే ఎక్కువ ఉద్యోగాలు దొరికాయి. కాని ఆఫ్రికాలో పరిస్థితి విషమంగా తయారవడానికి కారణం ఉత్తేజింపబడిన మానసిక వ్యవస్థలు - వర్ణభేదం, అక్కడక్కడ ప్రత్యేకింపబడిన ప్రముఖమైన శ్వేత కేంద్రాలు, దినదినం విపరీతంగా మారుతున్న దక్షిణాఫ్రికా పరిస్థితి. అన్నీ కూడ కారణాలే. ఇవి సగం రాజకీయమైనవి. వీటితో యీ గ్రంథానికి సంబంధంలేదు. కాని సాంస్కృతికదృష్ట్యా తూర్పు ఆఫ్రికాలోని ఆసియనుల పరిస్థితిని గమనింప వలసిన అవసరం ఎంతైనా వుంది.

ఇదివరలో చెప్పినట్లుగా, ఆసియనులలో చాలామంది ముంబన నుండి విక్టోరియాసరస్సుకు రైలు మార్గం కట్టడం ప్రారంభించినప్పుడు బ్రిటిషువారితో పాటు 1901 లో వచ్చారు. అలాగే కెన్యాలో స్థావరం ఏర్పరచు కొందుకు వచ్చారు. సర్వసాధారణమైన రోజుకూలీలుగా, చిల్లర వర్తకులుగా, గుత్తవ్యాపారులుగా, గుమాస్తాలుగా, చిన్న ఆఫీసర్లుగా నెమ్మదిగా ఆసియనుజనాభా ఆర్థికంగా అభివృద్ధి చెంది పెరిగింది. వీరి ప్రాముఖ్యం నిర్లక్ష్యం చేయడానికి లేదు: అలాగే వీరి వింతపరిస్థితి కూడ పూర్తిగా అర్థంచేసుకోవాలి. ప్రస్తుతంలో మటుకు బలంగా నిలదొక్కుకున్న ఆసియనుమధ్య తరగతి ప్రబలివుంది. పెద్ద ఆర్థికవిషయాలలో నేర్పుతో పనిచేయడానికీ, సాంకేతిక నైపుణ్యం సంపాదించడానికీ ఆఫ్రికనులకి యింకా వ్యవధి కావాలి. అంతదాకా ఆసియనులదే పైచేయి. కాని ఆఫ్రికను

మధ్యతరగతి పైకివచ్చేరోజు వచ్చితీరుతుంది. సర్వసాధారణంగా యీస్టాఫ్రికను భారతీయులు వ్యాపారస్థులు. ధనార్జనే ధ్యాస. కొత్తజీవితం సృష్టించుకుందాం అన్న ఆత్రంలేదు వీరికి. ఈ పాతకాలపు దృక్పధం పూర్వంలో అక్షరాస్యులుకాని ఆఫ్రికనులకీ వీరికీ మధ్య గోడలు బలపరచింది. ముఖ్యంగా వ్యవసాయకాధారమైన చోట, కూలీజనంవున్న చోట వ్యాపారస్థులు అందులోను వడ్డీకివస్తువులు యిచ్చే పరిస్థితిలో చిన్నపేచీలు తలెత్తక మానవు. ఈ విషమస్థితి సౌమ్యమైన పరిష్కార మార్గానికి దారి యివ్వదు కాని, యీ దృశ్యానికి రెండోపక్క కూడ వుంది. ఇది ఆహ్లాదకరమైనది. ఆనంద కరమైనది కూడ.

ఆర్థికంగా అదృష్టవంతులు కాగానే, ఆసియనుల రెండు మూడు తరాలవారికి తమ మాతృదేశపు సంస్కృతితో సంబంధం పెంచుకోవాలనీ, తమసంస్కారాన్ని పొందాలనీ వాంఛ పెరగసాగింది. ప్రయాణసౌకర్యాలు పెరగడంతో సెలవుమీద మాతృదేశం వెళ్ళిరావడం అన్నది సులభం అయింది, ఆసియను జాతిలో కొంచెంమందికి. ఇది కొద్దిమందికేలభించిన అవకాశం అయినా, మిగిలిన వర్గంమీద దాని ప్రభావముద్రపడక తప్పదు కదా! అందుకే యాదాలాపంగా ఏర్పడే యీ రాకపోకలు అంత తేలికగా తోసి పారవేయలేం. యీ మాతృదేశయాత్ర కుటుంబ విషయాలకోసం వ్యాపారంకోసం కాని ఆశ్రమాలు మొదలైన సంప్రదాయసిద్ధమైన ఉత్తేజాన్ని కలిగించేవాటి దర్శనానికి కాదు. ఇదేవిధంగా ఆఫ్రికను ఆసియనులు తమ మాతృదేశంవచ్చినా తమకు లాభమేంలేదని, తమకులేనిది ఏంలేనందున మాతృదేశం తమకిచ్చేదేం లేదన్న నమ్మకంకూడ వుంది. దీనికికారణం వీరి దైనందిన జీవితప్రమాణం మాతృదేశంలో కంటె ఉన్నతంగా వుండడమే, కాని సాంస్కృతికమైన విషయాలు ఎక్కువగా పట్టించుకునే వారికి - రోజుకిరోజు పునాదిలేని తమ సాంస్కృతిక జీవితం ఆఫ్రికాలో సాగుతూన్న సమన్వయ తరంగాలలో తాముూ కలిసిపోవడానికి అవకాశం యివ్వదని గమనిస్తూనే వున్నారు. ఆఫ్రికను సమన్వయం; ఇదే సమన్వయకు మూలం, ప్రాతిపదిక, ప్రాణం.

ఇదివరలో ఎప్పుడూ కనరాని విధంగా ఆఫ్రికాలో విదేశవస్తువులు, ఉద్దేశాలు కోకొల్లలుగావచ్చి పడుతున్నాయి. ఇది పొత్తులేని, అన్వయము లేని ఆయుధాగారం లాగవుంది ప్రస్తుతం. ఏక్షణంలోనైనా అల్లకల్లోలంగా మారవచ్చు. సమన్వయం అన్నది కూడ త్వరలోనే వస్తూవుంది కాని యీ మిళితం అన్నది రెండు పక్కలనుండి జరగాలి.

ఆఫ్రికానుండి నిన్నటి సాంకేతికావళిని అది విదేశీయమని తుడిచి పెట్టేయాలని తలపోయడం ఎంత అవివేకం అంటే - పాశ్చాత్య సంగీతం నుండి ఆఫ్రికనులు గతఅర్ధశతాబ్దిలోను అందించిన మహిమాన్వితమైన భాగాలని తుడిచి వేయాలనుకోవడం అంతటి అవివేకమైన తలంపు. సమకాలిక పాశ్చాత్యులలో కొందరు యీ విషయంలో ఎలా అభిప్రాయ పడుతున్నారో గమనించడం అవసరం. ఉత్తమ అంతస్తు నుండీ, ఆఖరుకు, మూఢనమ్మకాలు కల మతైక సంఘాలలోకూడ స్పష్టమవుతున్న మార్పులు కన్పిస్తున్నాయి. 1959 ఏప్రిలు 19 నాడు మిస్టర్ ఎమ్. డి. బర్ బోన్ బుసెట్ పారిస్‌లోని సెర్సిల్ సెయింట్ జీన్ బాప్టిస్ట్(Cercle Saint Jean Baptiste)లో ఉపన్యసిస్తూ రేపటి ప్రపంచానికి సంస్కృతి అన్నది ఎంత ముఖ్యమో, ఎంత ప్రముఖ పాత్ర వహిస్తుందో చెప్తూ ఆధునిక సాంకేతిక శాస్త్రం విభిన్న సంస్కృతుల మేళవింపునకు దోహదమిస్తూనే ప్రత్యేక సంస్కృతులను గురించి సవివరంగా తెలుసుకొనే అవకాశాన్ని ఇస్తూందనీ, అలాగ అన్నీకలిపి సహజీవనానికి నాంది పల్కుతాయనీ చెప్తూ, సాంకేతిక పరిజ్ఞానం అన్నది బలిష్ఠమైన దానికి బలాన్నీ, బలహీనులకి యింకా బలహీనతనీ సమకూరుస్తుందని చెప్పారు. ఇది సరిచేయాలంటే, దీని బారినుండి తప్పించుకోవాలంటే - సాంస్కృతిక సమన్వయ మొక్కటే దారి. దినదినాభివృద్ధి చెందుతున్న యాంత్రికయుగపు నాశనకారి లక్ష్యాలను నాశనం చేయాలంటే సాంస్కృతిక సమన్వయ మొక్కటే దారి, పాశ్చాత్యులకి లేని సంపన్న లక్షణాలు యితర సంస్కృతులలో వున్నాయనీ, అవి సర్వమానవజాతికే ఉపయోగ పడగలవనీ అన్నారాయన. ఆయన ముఖ్యంగా ఆఫ్రికాను - సహారాను దక్షిణాదిని చూపుతూ (చీకటి ఆఫ్రికా) " ఇది పూర్తిగా విస్మరింపబడింది. దీనికృషి యితోధికంగా మన

దేశానికీ ఉపయోగ పడేదే కాని, ప్రకృతితోటి సంబంధం వదలుకోవడం పుణ్యమన్నదాన్ని గుర్తించలేకపోడమే మన లక్షణంగా కన్పిస్తూంది. 'అంతరాంతరాలలో మిశ్రితం' కావలసినవి సాంస్కృతిక విలువలు. యీ సమన్వయం ఆత్మకు స్వేచ్ఛ నిచ్చి మరీ జరగాలి. ఈ స్వేచ్ఛను క్రైస్తవమతంద్వారా పరిరక్షించుకో వచ్చునని ఆయన నమ్మకం. అందులోనూ ముఖ్యంగా రోమన్ కేతలిక చర్చి దీన్ని సాధించకలదని యీయన విశ్వసించారు. ఇది కొందరు ఒప్పుకోక పోయినా - మూఢంగా మత విషయాలను నమ్మే వారిలో కొందరు యిలా కులమతాలగొడవ లేకుండా సంస్కృతుల భేదం గుర్తించకుండా మాట్లాడడం అన్నది గుర్తింప తగ్గది.

ఆఫ్రికాలోని ఆసియనులకీ ఆఫ్రికనులకీ కూడ పై విధంగా ఏర్పడుతున్న మార్పు ఆవశ్యకమే. ఇంకా యూరోపియను ఆదర్శాలలో మునిగి తేలే సంస్కృతి, విద్యాభ్యాసం కలవారికి యిది ఎంతైనా అవసరం. యూరోపియను మేధావంతులు యీ ప్రపంచ సంస్కృతి అన్న లక్ష్యాన్ని యింకా పూర్తిగా అవగాహన చేసుకోలేకుండా వున్నారు. కొందరు, కనీసం విలువలలో సమన్వయమైనా గుర్తించవచ్చునని యితర సంస్కృతులను గమనిస్తున్నారు.

పూర్తిగా ఆఫ్రికనుపద్ధతి నవజీవనం ప్రతిపాదింప బడినాక, యీ సమన్వయ పరిణామం పూర్తి అయాక, సాంస్కృతిక కేంద్రంగా భారత దేశపు స్థానం ఎటువంటిది ?

భారత సంస్కృతి పుట్టి పుష్టిగా పెరుగుతూన్న మూలాధారాలన్నీ కూడ ఆఫ్రికను జీవనప్రవాహపు ఉత్కృష్ట సృష్టికి పోలికలు కలిగినవే.

ప్రకృతి ఆరాధన పెరిగి పెద్ద పవుతూన్న వృక్షాల ఛాయలలో విదితమవుతుంది. బాలబాలికలను శీలవంతులుగాచేసి మతైకతతంగాలన్నీ భగవదాత్మక నిదర్శనగా నిలుస్తున్నాయి. మాంత్రికమైన వాద్యాలూ నాట్యాలూ - యివన్నీ కూడా ఆఫ్రికను ఆసియను సంస్కృతులలో

అందరికీ కనబడే పోలికలే. ఆఫ్రికను మతైక నాట్యాలూ, సంగీతమూ, భారతదేశంలోని కళాసంప్రదాయాలతో ఎన్నో పోలికలు కలిగివుంటాయి.

ఇవి తెలియచెప్ప కలిగిన పోలికలు, సంబంధాలు ఆఫ్రికను వస్త్ర ధారణ అర్ధనగ్నత అన్న ఛాందసానికి దూరం. సంప్రదాయికమైన భారతీయవస్త్రధారణకూ దీనికీ యూరోపియను దుస్తులకంటె కూడా ఎక్కువ పోలికలువున్నాయి. యీ రెండిటినీ కూడ కాలక్రమాన యూరోపియను పద్ధతులు తలతన్నాయి. మహాత్ముడు వినోభాభావే మొదలైన ప్రముఖులు యీ సంప్రదాయమైన వస్త్రధారణ ఆధునిక పరిస్థితులకు అన్వయించుకో వచ్చునని నిరూపించారుకూడ. ఈ రకమైన ముళ్ళ కంచెల వంటి ఆఫ్రికను సమస్యలకు యీ రకమైన పరిష్కార మార్గాలను సూచించుకోవచ్చు యీ పుస్తకంలోనే వీటిని అక్కడక్కడ పేర్కొనడం జరిగింది.

దక్షిణాదిని శ్రీమతి రుక్మిణీదేవి ఆధ్వర్యాన శక్తి పుంజుకొన్నట్లు గానే, సంప్రదాయ సంగీతం, నాట్యం ఆఫ్రికాలో కూడ తిరిగి తలఎత్తాలి. ఇది ఎంతోకాలం క్రిందట జరగవలసింది. ఆఫ్రికను శిల్పాలూ, చిత్రాలూ లండన్‌లో, పారిస్‌లో, న్యూయార్కులో కళాకారు లందరి ఆదరాభి మానాలని చూరగొంటున్నాయి. కాని ఆఫ్రికాలో మటుకు ఆఫ్రికను చిత్రకారులు యూరోపియను చిత్రకళననుసరిస్తూ బొమ్మలు వేస్తారు. శిలువలూ, మేరీ మాతలూ, సెయింటుల చిత్రాలనే సృష్టిస్తున్నారుగాని, ఆఫ్రికను శైలిలో, స్త్రీ పురుషులను చిత్రించటంలేదు.

యీ సందర్భంలో వింతగా తోచే యీ విషయం చెప్పక తప్పదు. ఇండో - ఆసియను ఆశ్రమ విధానాన్ని ఆఫ్రికనులూ, ఆసియనులూ కాకుండ, యూరోపియను మిషనరీలు దూరప్రాంతాలలో వున్న తమ మిషను కేంద్రాలలో నెలకొల్పారు.

ఆసియానుండి హిందూ, బౌద్ధమేధా వంతులని ఆఫ్రికాకు పంపి, మత లక్ష్యాలను, అంతరాత్మ ప్రబోధలను గుర్తింపచేసి భారతీయ పద్ధతిలో పరిష్కారమార్గాలని తెలియచెప్పడం జరిగితే బాగుండేది. కవీసం.

భారతీయులకీ ఆఫ్రికనులకీ యీ విషయంలో ఎంతో సంబంధం వుంది. యూరోపులో వలెకాక, పాపపంకిలమైన శరీరంలో పుణ్యమూర్తి వుందన్నది గుర్తిస్తారు.

ఈ విషయంలో ఆఫ్రికనులు భారతీయులకి సన్నిహితులే. జీవితపు లోటుపాట్లని తపస్సుద్వారా తెలుసుకొని సాధించవచ్చు కాని పాశ్చాత్యుల ఆలోచన ఆవరణ ప్రయోగాత్మకమైన ఫలితాలమీద ఆధారపడి వుంటుంది. దక్షిణ ఆసియనులు కూడ ఇస్లామ్ వ్యాప్తివల్ల లభించిన అవకాశాలని పాశ్చాత్యపుటాలోచనలను జీర్ణించుకున్న ఆరబ్బుల రాకతో జారవిడిచారు. నిజానికి, యూరోపియను ఆధిపత్యం, కులవర్గతత్వం కలిసి తూర్పు అఫ్రికాలోని ఆసియను ముస్లిములు ఒక ప్రత్యేక కులంలాగ పెంపొందారు. దక్షిణ ఆసియాలో ధనికులూ, వ్యాపారులూ, ఆధిక్యంకల వారూ అయినా అల్పసంఖ్యాకులైన వీరిలా వుండడం ఎంత ప్రమాదకరమో దూరదృష్టికల్గిన కీ. శే. ఆగాఖాన్ వంటి మతపెద్దలు గుర్తించారు. ఆఫ్రో - ఆసియను - ఇస్లాము సంస్కృతి పెంపొందుతుందన్న ఆశతో కీ॥ శే॥ ఆగాఖాన్ ఆఫ్రికనుల కొరకు పనిచేసిన విద్యాసంస్థలకీ దాన సంస్థలకీ పోనుకుపోనుగా విరాళం యిచ్చి పోషించారు.

ఖండాంతర ఆఫ్రికను సమన్వయమన్నది నిర్దుష్టంగా రూపొందుతుందన్నది - అనేక దృక్పథాలలో, చేష్టలలో విదితం అవుతూంది. ఇలా జరిగేటప్పుడు అపస్వరాలుకొన్ని పల్కక తప్పదు గూడ. వీటికి ఉదాహరణగా చూస్తే — తూర్పు ఆఫ్రికాలోని ఇస్లామువనితలు తమ చీరలను, పైజామా కుర్తాలను వదిలి యూరోపియను పద్ధతి వస్త్రధారణని ప్రారంభించారు. యిది కొత్తగా రూపందిద్దుకుంటున్న సమన్వయ కార్యక్రమానికి చిహ్నం. ఆఫ్రికాలో కుట్టినబట్టలు కట్టుకోవడం అన్నది భారతదేశంలో కంటె అంత ప్రాచీనం అయిన అలవాటు కాదు.

కాని యిలాంటి అపస్వరాలు భవిష్యత్తు విషయంలో అనవసరమైన ఆందోళన రేకెత్తించ నక్కరలేదు. నిజమే. తనకేలేని దాన్ని ఎవడూ యితరులకి యివ్వలేడు కదా! భరతపాకిస్తాను వారు సాంస్కృతికంగా పక్షవాతపు వాత పడినట్లుగా వున్నారు. శరీరం ఆత్మలంటే భయంపెట్టు

కాని సమస్యల పరిష్కారంచేసుకోలేనివారు ఆఫ్రికాలోని వారికి నమూనాల వంటి వాటి నెలా అందించ కలరు? ప్రస్తుతం ఆఫ్రికాలో కావలసినది స్థానికవిలువలను అణచివేసే మాటాచేతల సహాయంకాదు. అక్కడ కావలసినది సమన్వయం. దాన్ని ఎవరి సంస్కృతిలో వారు తమ స్థానం కనుకొన్ననాడు అదే జరిగి తీరుతుంది.

ఇదే చింతనకు భారతదేశంలో గమ్యంగోచరించ లేదంటే ఎంత నిజమో, చరిత్రాత్మకంగా ఒక భారతీయుడే దీని అంతు కనుగొందుకు నాంది పల్కాడనీ, తనదేశానికి స్వాతంత్ర్యం తెచ్చాడనీ, యీ దేశమే యూరోపియను నిరంకుశత్వం క్రింద వున్న పెద్ద దేశాలలో ఒకటనీ తెలుసుకోవడం కూడ నిజమే అవుతుంది.

నేకోరుకున్నదేశం భారతదేశంలో దిగి మద్రాసుకు ప్రయాణం కట్టి నా ఉపాధ్యాయిక వృత్తిని స్వీకరించ కుండానే కొద్దిరోజుల విశ్రాంతి తీసుకున్నాను బొంబాయిలో. రాజభవనంవంటి ప్రశాంత స్థలంలో అరేబియను సముద్రము టంచునవున్న యిక్కడ ఎంతో హాయి అనిపించింది.

ప్రతిమధ్యాహ్నం చల్లని సముద్రపుగాలి నన్ను మంత్రించి వరండాలోకి నడిపించేది. ఆక్షణంలో నా బల్లని, కాగితాలని, నోట్సుని అన్నీ మరచి, పొంగి పొరలే ఆ తరంగాలకేసి చూస్తూ వుండేవాణ్ణి. సువిశాలంగా పరచుకొనివున్న ఆ వెల్గు తెరపై పశ్చిమదిశగా అలా చూస్తూవుంటే - కొద్దిరోజులక్రిందటే, ఆఫ్రికా కొమ్ముకేసీ, గార్డఫి శిఖరంకేసీ చూడడం చివరకి సకొత్రద్వీపం ఆఫ్రికాలో ఓ సంవత్సరపు నాపనికి, నా జీవితానికీ భరతవాక్యం పల్కడం జ్ఞప్తికి వచ్చింది. ఇప్పటిదాకా నా జీవితంలో ఎప్పుడూ తూర్పుదిశవైపే చూసేనేను ఏదో తెలియనిభవిష్యత్తు కోరుకుంటూన్నట్లు భారతదేశానికి వచ్చికూడ పశ్చిమానికే చూస్తున్నాను నేను. ఎందుకు, ఏవిధంగా యీ పశ్చిమం నన్ను ఆకర్షించి లాంగదీసుకుంటూందో చెప్పలేను.

నేను పుట్టినదేశం పశ్చిమమనీకాదు; రాజకీయమైన ఆశచేతాకాదు పశ్చిమాన్నికి ఆకర్షింపబడడం. ఒకరోజు ముగిసి సూర్యాస్తమయం కోసమూ రాబోయేరాత్రి కోసమూకాదు అలా చూడడం.

మాటలకందని ఏవో వెల్గులు నన్ను ముంచెత్తి ఆకర్షించాయి. ఆ వెల్గుతున్కల సందోహంతోపాటు సూర్యుడు జీవితంలోకి చొచ్చుకు వస్తాడు. ప్రవహిస్తున్న బంగారంలాగా తోస్తాడు. ఈ బంగారపు కాంతులు తరంగాల శ్వేత శిఖరాగ్రాలమీద మెరుస్తూ కదలు తున్నాయి—లోతు తెలియని నీలిలోతులను దాచుకున్న సముద్రం మీద కురుస్తున్నాయి.

అక్కడే ఆఫ్రికా ఖండంవుంది. అది కాంతి పుంజంనాకు. 'ట్విగ' ఖండం. కళ్లలో ప్రశ్నలుంచుకుని నిశ్శబ్దంగా చూసే జిరాఫీ కారు చీకట్ల రోజులని దాటింది. భయంకరమైనవి, అవమానకరమైనవి రోజులు గడిచిపోయాయి. ఆఫ్రికా తన భవిష్యత్తుని మరచిపోలేదు.

ఆఫ్రికాఖండం యీ గ్రహంమీదకాలూనిన మానవునిగాథమీద పాత కాలపు వెల్గులకి తోడుగా కొత్త కిరణాన్ని ప్రసరిస్తుంది।

